# వీక్షణం

రాజకీయార్థిక, సామాజిక మాసపత్రిక

సంపుటి : 12 సంచిక : 2 హైదరాబాద్ 151 ఫిబ్రవరి 2014 పేజీలు : 68 రు. 15

* మన్మోహన్ దళారీ చిలకపలుకులు
* ఆమ్ ఆద్మీ పార్టీ తీరుతెన్నులు
* గుజరాత్ దారిలో ముజఫర్‌నగర్ నరమేధం
* తిరుపతిని అయోధ్యగా మారుస్తారా?
* నేటి ఉత్తరాంధ్ర సమస్యలు
* ప్రజలపై రాచకొండ ఫైరింగ్ రేంజ్
* వార్సా వాతావరణ సదస్సు 2013

# వీక్షణం దగ్గర అమ్మకానికి ఉన్న పుస్తకాలు

## ఆర్థిక వ్యవస్థ – సామ్రాజ్యవాదం

| | | |
|---|---|---|
| ఒక దళారీ పశ్చాత్తాపం | జాన్ పెర్కిన్స్ | రు. 50 |
| కుట్రాజకీయం | స్టీఫెన్ కింజర్ | 40 |
| అభివృద్ధిని ఇలా చూద్దాం | ముదునూరి భారతి | 80 |
| కొత్తచూపు | ఆర్.ఎస్. రావు | 120 |
| ఊరి దారి | ఎన్. వేణుగోపాల్ | 60 |
| రాబందు వాలిన నేల | ఎన్. వేణుగోపాల్ | 180 |
| వ్యవసాయం – ప్రపంచీకరణ | కె.ఆర్. చౌదరి | 100 |
| సామాజిక విద్య – ఒకమిథ్య ప్రజా ఎజెండా లేని | ఎ. నర్సింహారెడ్డి | 100 |
| పార్లమెంటరీ రాజకీయాలు | ఎ. నర్సింహారెడ్డి | 40 |
| ఒక ప్రేతాత్మక కథ | అరుంధతీ రాయ్ | 25 |
| సమాధిలోకి సామ్రాజ్యవాదం | డి. పాపారావు | 200 |

## తెలంగాణ

| | | |
|---|---|---|
| లేచినిలిచిన తెలంగాణ | ఎన్. వేణుగోపాల్ | 120 |
| తిరగబడ్డ తెలంగాణ | ఇనుకొండ తిరుమలి | 100 |
| తెలంగాణ రాజకీయాలు | దాగ్మార్ బెర్న్‌స్టార్ఫ్, హ్యూగ్ గ్రే | 80 |
| కొత్త వంతెన | కె. శ్రీనివాస్ | 120 |

## శాస్త్రవిజ్ఞానం

| | | |
|---|---|---|
| విశ్వాంతరాళం | కొడవటిగంటి రోహిణీప్రసాద్ | 90 |
| మానవ పరిణామం | కొడవటిగంటి రోహిణీప్రసాద్ | 90 |
| జీవకణాలూ నాడీకణాలూ | కొడవటిగంటి రోహిణీప్రసాద్ | 80 |
| ప్రకృతీ – పర్యావరణం | కొడవటిగంటి రోహిణీప్రసాద్ | 90 |
| అణువుల శక్తి | కొడవటిగంటి రోహిణీప్రసాద్ | 100 |
| జీవశాస్త్ర విజ్ఞానం – సమాజం | కొడవటిగంటి రోహిణీప్రసాద్ | 100 |
| మనుషులు చేసిన దేవుళ్లు | కొడవటిగంటి రోహిణీప్రసాద్ | 100 |
| విజ్ఞాన శాస్త్రం మనిషి విస్తరణ | జెడి బెర్నాల్ | 80 |

## కులం–మతం

| | | |
|---|---|---|
| శూద్రవర్ణం ఎలా పుట్టింది | ఆర్.ఎస్. శర్మ | 80 |
| కులం వర్గం | బొజ్జా తారకం | 30 |
| ఎస్సి, ఎస్టి నిధులు, విధిలింపు - మళ్లింపు | బొజ్జా తారకం | 40 |
| ఎస్సి, ఎస్టిలపై అత్యాచారాలు | బొజ్జా తారకం | 50 |
| ఖైర్లాంజి | ఆనంద్ తేల్‌తుంబ్డే | 100 |
| గులాంగిరి | జోతిబా పూలే | 40 |
| కుల నిర్మూలన | అంబేద్కర్ | 30 |
| రాముని కృష్ణుని రహస్యాలు | అంబేద్కర్ | 20 |
| దళితులు – రాజ్యం | అంబేద్కర్ | 25 |
| శూద్రులు – ఆర్యులు | అంబేద్కర్ | 8 |
| ఆధునిక భారతదేశంలో అంటరానితనం | అంబేద్కర్ | 25 |
| దాస్య విముక్తి కోసం | అంబేద్కర్ | 15 |
| భారతదేశం ప్రజాస్వామ్యం | అంబేద్కర్ | 12 |
| ఆంగ్లేయపాలకులు – అంటరానివాళ్లు | అంబేద్కర్ | 20 |
| రాష్ట్రాలు – మైనారిటీలు | అంబేద్కర్ | 40 |
| రాముని కృష్ణుని రహస్యాలు | అంబేద్కర్ | 20 |
| మతతత్వంపై బాలగోపాల్ | కె. బాలగోపాల్ | 150 |
| దేవుని రాజకీయతత్వం | కంచె ఐలయ్య | 70 |
| నేను హిందూవు నెట్లయిత? | కంచె ఐలయ్య | 80 |

## సాహిత్య విమర్శ – వ్యాసాలు

| | | |
|---|---|---|
| గురజాడ దేశభక్తి | ఎన్. వేణుగోపాల్ | 20 |
| మహోదయం | కె.వి.ఆర్. | 200 |
| పరామర్శ | నల్లూరి రుక్మిణి | 80 |
| సాహిత్యంపై బాలగోపాల్ | కె. బాలగోపాల్ | 150 |
| విరసం సాహిత్య విమర్శ | విరసం ప్రచురణ | 150 |
| కెవిఆర్ సాహిత్య వ్యాసాలు–1 | శారదాంబ స్మారక కమిటీ | 300 |
| అలిశెట్టి ప్రభాకర్ కవిత | అలిశెట్టి మిత్రులు | 150 |
| సాహిత్య సమాలోచన | కృష్ణాబాయి | 300 |
| సందిగ్ధ సందర్భం | సి.వి. సుబ్బారావు | 40 |

## చరిత్ర–జీవిత చరిత్ర

| | | |
|---|---|---|
| భారత చరిత్ర పరిచయ వ్యాసాలు | డి.డి. కొశాంబి | 40 |
| ప్రాచీన భారత దేశ చరిత్ర | కె. బాలగోపాల్ | 50 |
| చరిత్రలో ఏం జరిగింది? | గార్డన్ చైల్డ్ | రు. 80 |
| తరతరాల భారతదేశ చరిత్ర | రొమిల్లా థాపర్ | 80 |
| ఆధునిక భారతదేశ చరిత్ర | బిపిన్ చంద్ర | 100 |
| బాబాసాహెబ్ అంబేద్కర్ | బి. విజయభారతి | 70 |
| కన్నబీరన్ | వ్యాస సంకలనం | 50 |
| చేగువేరా | కాత్యాయని | 80 |
| ఒక సెక్స్ వర్కర్ ఆత్మ కథ | నళినీ జమీలా | 50 |
| పరాయి పాలనను ఎదిరించిన ఝాన్సీ | మహాశ్వేతాదేవి | 150 |
| నిర్జన వారధి | కొండపల్లి కోటేశ్వరమ్మ | 100 |
| ఇంట్లో ప్రేమ్‌చంద్ | శివరాణీ దేవి | 120 |
| పరిచయాలు | ఎన్. వేణుగోపాల్ | 50 |
| నా ప్రజాజీవితం | పెండ్యాల రాఘవరావు | 50 |
| ఆర్.ఎస్.రావు స్మృతిలో | వ్యాస సంకలనం | 50 |
| ఛత్రపతి సాహూ మహరాజ్ | కాత్యాయని | 40 |
| టాల్‌స్టాయ్ పరిచయ వ్యాసాలు | యన్.వి.ఎస్. నాగభూషణాచార్యులు | 30 |

## విప్లవోద్యమం

| | | |
|---|---|---|
| పోలీసులు అరెస్ట్ చేస్తే | బొజ్జా తారకం | 30 |
| భారత్‌పై అరుణతార | యాన్ మిర్డాల్ | 100 |
| జంగల్‌నామా | సత్నామ్ | 100 |
| జనహృదయం జనార్దన్ | సూరపనేని మోహనరావు | 60 |
| కోటి జ్ఞాపకాలు | విరసం ప్రచురణ | 50 |

## తత్వశాస్త్రం

| | | |
|---|---|---|
| మార్క్సిస్ట్ సాహిత్య విమర్శ | డా. శ్రీనివాస్ | 100 |
| మార్క్సిస్ట్ తత్వశాస్త్రం | న్యూవిస్టా పబ్లికేషన్స్ | 80 |
| మార్క్సిజం–లెనినిజం–మావోయిజం | న్యూవిస్టా పబ్లికేషన్స్ | 100 |

లెఫ్టిస్ట్ స్టడీ సర్కిల్ ప్రచురణలు అన్నీ

## కథ – నవల

| | | |
|---|---|---|
| గంగానమ్మ | విజయ | 15 |
| ఏడుతరాలు | అలెక్స్ హేలీ | 80 |
| కథలగూడు | దేవులపల్లి కృష్ణమూర్తి | 60 |
| పథేర్ పాంచాలి | బిభూతిభూషన్ బంధోపాధ్యాయ | 100 |
| వనవాసి | బిభూతిభూషన్ బంధోపాధ్యాయ | 100 |
| చంద్రగిరి శిఖరం | బిభూతిభూషన్ బంధోపాధ్యాయ | 50 |
| అపరాజితుడు | బిభూతిభూషన్ బంధోపాధ్యాయ | 100 |
| నేల నాగలి – మూడెద్దులు | బొజ్జా తారకం | 25 |
| పంచతంత్రం | బొజ్జాతారకం | 100 |
| ఇస్మత్ చుగ్తాయి కథలు | ఇస్మత్ చుగాయి | 100 |
| పంచమం | చిలుకూరి దేవపుత్ర | 100 |
| అజేయుడు | అలెగ్జాండర్ డ్యూమా | 160 |
| ఘంటారావం | విక్టర్ హ్యూగో | 100 |
| స్పార్టకస్ | హోవార్డ్ ఫాస్ట్ | 80 |
| రేపటి కల | రిచర్డ్ రైట్ | 50 |

| | | |
|---|---|---|
| **Fifty Years of Andhra Pradesh** | **(1956-2006)** | 300 |
| **Towards Understanding Semi Feudal - Semi Colonial Society** | R.S. Rao | 300 |
| **In search of Method** | Mudunuri Bharathi | 200 |
| **Individual Sub-groups, Groups and Freedom** | Mudunuri Bharathi | 75 |
| **Crisis and Development in Marxian Framework** | Mudunuri Bharathi | 80 |
| **Methodoly of Social Enquiry** | Mudunuri Bharathi | 150 |
| **On Education** | Mudunuri Bharathi, R.S. Rao | 100 |
| **Understanding Maoists** | N. Venugopal | 300 |

**వీక్షణం,** మైత్రీ రెసిడెన్సీ, 3-6-394, స్ట్రీట్ నెం. 3,
హిమాయత్‌నగర్, హైదరాబాద్ - 500 029.
ఫోన్ : 040-66843495
Email: veekshanam2003@gmail.com, www.veekshanam.wordpress.com

151

ISSN 2231-6892

# వీక్షణం

రాజకీయార్థిక, సామాజిక మాసపత్రిక

ఫిబ్రవరి 2014
సంపుటి : 12
సంచిక : 2

| వ్యవస్థాపక సంపాదకులు: | సంపాదకులు: | కరస్పాండెంట్ / సర్క్యులేషన్ మేనేజర్: | కంపోజింగ్: | సబ్ ఎడిటర్ : | ఆఫీస్ అసిస్టెంట్ : |
|---|---|---|---|---|---|
| వి. హనుమంతరావు | ఎన్. వేణుగోపాల్ | వై. రామచంద్రం | సి. రాజశేఖర్ | ఎ. మల్లేశ్ | ఎస్. వెంకటేష్ |


## లోపలి పేజీల్లో...



### అసహజ మరణాల సూచి జిల్లాల కరస్పాండెంట్లు

ఆదిలాబాద్ – సి.ఎచ్. శ్రీమన్నారాయణ మూర్తి; హైదరాబాద్ – డి. విజయభాస్కర్; కరీంనగర్ – ద్యామర రేణుక; ఖమ్మం – సి.ఎచ్. గిరిజ; మెదక్ – ఎన్. భగవాన్‌రెడ్డి; మహబూబ్‌నగర్ – మహమ్మద్ ఇక్బాల్; నిజామాబాద్ – ఎం. నర్సయ్య; రంగారెడ్డి – వి. శంకరయ్య; వరంగల్ – ఎ.కుమార్; అనంతపూర్ – కె. నాగేశ్వరాచారి; చిత్తూరు – పలమనేరు బాలాజి; కర్నూలు – జి.వి. సుధాకర్ రెడ్డి; నెల్లూరు – బాలగురువయ్య; విజయనగరం – డి. సుధాకర్; విశాఖపట్నం – పి.వి. రమణ; శ్రీకాకుళం – ఆర్. శ్రీలత




ప్రింటర్స్
**డక్కన్ ప్రెస్ / చరితా ఇంప్రెషన్స్**
ఆజామాబాద్, హైదరాబాద్
ఫోన్ : 040 - 27678411

డిస్ట్రిబ్యూటర్స్
**ఆనంద్ ఏజన్సీస్**
హైదరాబాద్
ఫోన్ : 98484 28516
92468 26191

'వీక్షణం' పేరిట ఎం.ఓ.లు, చెక్కులు, డి.డి లు పంపాల్సిన చిరునామా

**వీక్షణం**
మైత్రీ రెసిడెన్సీ, 3-6-394,
స్ట్రీట్ నెం. 3, హిమాయత్‌నగర్,
హైదరాబాద్ - 500 029.
ఫాక్స్, ఫోన్ : 040-66843495

Email : veekshanam2003@gmail.com
www.veekshanam.wordpress.com


### వీక్షణం చందా వివరాలు

| | సంస్థలకు / లైబ్రరీలకు | వ్యక్తులకు | విద్యార్థులకు |
|---|---|---|---|
| విడి ప్రతి | రు. 15 | రు. 15 | రు. 15 |
| సంవత్సరం | రు. 180 | రు. 150 | రు. 120 |
| మూడు సంవత్సరాలు | రు. 500 | రు. 400 | రు. 350 |
| ఐదు సంవత్సరాలు | రు. 800 | రు. 650 | – |
| పది సంవత్సరాలు | రు. 1500 | రు. 1300 | – |

వీక్షణం అకౌంట్ నెంబర్ – **013911011002175**
ఆంధ్రాబ్యాంక్, గగన్‌మహల్ బ్రాంచ్, హైదరాబాద్
ఇతర బ్యాంకులలో వేసేవారు **ANDB 000/0139** నెంబర్ రాసి వేయవచ్చు.

**విశాఖపట్నం పోర్ట్ అండ్ డాక్ ఎంప్లాయీస్ అసోసియేషన్ వ్యవస్థాపక ప్రధాన కార్యదర్శి అబ్దుల్ రహమాన్ స్మృతిలో అబ్దుల్ రహమాన్ మెమోరియల్ కమిటీ కన్వీనర్ పి.వి. రమణ వీక్షణం చేస్తున్న కృషికి సహకారంగా రు. 25,000 విరాళం ఇచ్చారు. వారికి కృతజ్ఞతలు. – సం**

**తో**లేటి జగన్మోహన్‌రావు రాసిన పుస్తకంపై రంగనాయకమ్మ సమీక్షా వ్యాస పరంపర చూశాను. ఆ పుస్తకం కూడ చదివే అవకాశం దొరికింది. ఈ సమీక్షా వ్యాసం క్లుప్తమైన సమీక్షగా ఉన్నా సరిపోయేది. లేదా రష్యా, చైనాలలో సోషలిస్ట్ సమాజాలు అంతరించినప్పటికీ ప్రస్తుత ప్రపంచంలో సోషలిజానికి ఎలా మళ్లాలనే విషయం మీద విడిగా వ్యాసమైనా బాగుండేది. ఈ రెండిటినీ కలగలపడం వల్ల అసలు విషయం మీద తగినంత వెలుగు ప్రసరించలేదు. సమాజాలు భూస్వామ్య, పెట్టుబడిదారీ దశ నుంచి సోషలిస్ట్ సమాజాలుగా పరిణామం చెందే క్రమాన్ని అర్థం చేసుకోవడానికి ఉపయోగపడే పనిముట్టు మార్క్సిజం. ఈ సందర్భంలో ఫిడెల్ కాస్ట్రో నాయకత్వంలోని క్యూబా సమాజం ఇంకా సోషలిస్ట్ సమాజంగానే ఉన్నదని, దాని మీద తగినంత సమాచారం అందుబాటులో లేదని కూడ గుర్తుంచు కోవలసి ఉంది. సామాజిక పరివర్తన లేదా మార్పు జరిగే ఏ సమాజంలోనైనా ఆ మార్పు, పరివర్తన జరుగుతున్న యుగంలోనే కాలక్రమంలో ఒక కొత్త తరం పుట్టుకొస్తుంది. అంతకు ముందరి తరాలు అనుభవించిన కష్టాలు, కడగండ్లు ఈ కొత్త తరానికి తెలియవు. సోషలిస్ట్ సమాజాన్ని సుస్థిరంగా ఉంచే లేదా దాన్ని కమ్యూనిస్ట్ సమాజంగా పరివర్తన చెందించే సమస్యంతా ఈ 'సోషలిస్ట్ మానవున్ని' నిర్మించడంలోనే ఉంది. సామాజిక పునర్నిర్మాణం చెప్పినంత తేలిక కాదు. అలాగే రష్యా, చైనా సమాజాల పతనం శూన్యంలో జరగలేదు. ఇవాళ మొత్తం ప్రపంచం ఉన్న నిర్దిష్ట సామాజిక, రాజకీయ వాతావరణంలో జరిగింది. ఇక్కడే సోషలిజం ఒక దేశంలో విజయవంతమవుతుందా, మొత్తం ప్రపంచమంతా ఒకేసారి సోషలిజం రాగలుగుతుందా అనే ప్రశ్న తలెత్తుతుంది. అందువల్లనే కమ్యూనిస్ట్ ఇంటర్నేషనల్ అనే భావన తలెత్తింది. అయితే ప్రపంచంలో విడివిడి సమాజాల అనుభవాల వల్ల ఎక్కడికక్కడ పీడితులు ఆయుధాలతో గానీ, ఆయుధాలు లేకుండా గానీ తమ పీడకుల మీద పోరాడుతారు. మరొక చోట సోషలిస్ట్ సమాజాల నిర్మాణ క్రమంలో వైఫల్యాలు జరిగాయా, తప్పులు జరిగాయా అనే దానితో ఈ పోరాటాలకు సంబంధం లేదు. ప్రపంచీకరణ, ప్రైవేటీకరణ సాగుతున్న ఈ యుగంలో సోషలిస్ట్ ఆలోచనా విధానపు మొత్తం పరిణామ క్రమానికి ఒక కొత్త కుదుపు ఇవ్వవలసి ఉంది. ఒక న్యాయమైన సమసమాజాన్ని నిర్మించాలనే మానవ జాతి ఆలోచనకు కొత్త ప్రేరణ ఇవ్వవలసి ఉంది. ఆ సందర్భంలో మార్క్స్, లెనిన్, మావోల వంటి మౌలికమైన, ప్రభావశీలమైన ఆలోచనాపరులతో సమానమైన ఆలోచనలు అవసరమవుతాయి. అప్పటి వరకూ మనం జగన్మోహన్‌రావు వంటి అరకొర ఆదర్శవంతులతోనూ, లేదా రంగనాయకమ్మ వంటి, నా వంటి పడకకుర్చీ రచయితలతోనూ సంతృప్తి పడవలసిందే. మార్క్సియన్ సోషలిస్టులకు, ఊహాజనిత సోషలిస్టులకు మధ్య ప్రధానమైన తేడా ఏమంటే మార్క్సియన్ సోషలిస్టులు సోషలిస్ట్ సమాజానికి ఒక మార్గదర్శక సూత్రాలను, తయారు చేసిపెట్టిన ప్రణాళికను రూపొందించలేదు. ప్రజల నుంచి నేర్చుకుని, ప్రజలకు నేర్పే క్రమంలోనే అది ఎంత విసుగెత్తించేదీ, కష్టభరితమైనదీ అయినా సరే సోషలిస్ట్ సమాజ నిర్మాణ మార్గం రూపొందుతుంది. ప్రపంచ పెట్టుబడి ఇవాళ అన్ని దేశాల మధ్య సంఘటితమవుతోంది. మరొకవైపు ప్రపంచ శ్రామికవర్గం ఎక్కడికక్కడ ముక్కలవుతోంది. ప్రపంచ వ్యాప్తంగా విప్లవాలు సాధించడానికి ఊహించిన ఏ సంస్థలోనూ ఏకం కావడం లేదు. రాజ్యాల, దేశాల సంస్థలూ, భౌగోళిక రాజకీయాల ఒతిళ్లూ సమాజాలను శకలాలుగా మారుస్తున్నాయి. ఇదంతా ఉత్పత్తి శక్తుల అభివృద్ధి పూర్తి సామర్థ్యానికి అభివృద్ధి అయినప్పటికీ ప్రపంచ విప్లవ పరిస్థితికి అనువుగా రూపొందక పోవడం జరుగుతోంది. చిన్నపాటి అణ్వాయుధ ఘర్షణలు విశ్వవ్యాపిత కల్లోలంగా పరిణమించగలవనే భయంతో సైనిక, పారిశ్రామిక సామ్రాజ్యం నానాటికీ బలపడుతోంది. అయినా భారతదేశంలోనూ, నేపాల్‌లోనూ ఇతర ఆగ్నేయాసియా దేశాలలోనూ జరుగుతున్నట్టుగా 'వసంత మేఘగర్జన'లు అంతిమంగా మావోయిస్టు 'విప్లవాలు'గా సంఘటితమవుతున్నాయి. ఇంగ్లండ్‌లో కూడా ఒక మావోయిస్టు కమ్యూనిస్టు పార్టీ ఏర్పడిందనే వార్త నాకు ఎంతో సంతోషాన్నిస్తుంది. 'ఒక కొండంత సిద్ధాంతం కన్నా ఒక ఇసుక రేణువంత ఆచరణ మిన్న' అని లెనిన్ ఎప్పుడో అన్నాడు. 'తత్వవేత్తలందరూ ఇప్పటివరకు ప్రపంచాన్ని వ్యాఖ్యానించారు. కావలసిందల్లా దాన్ని మార్చడం' అని మార్క్స్ అన్నాడు. సోషలిజం ముంగిట్లో ఉన్నా లేకపోయినా మన బాధ్యత ఆ మార్పు దిశగా అడుగులు వేయడమే.

**కెఎంవిజి కృష్ణమూర్తి,** కాకినాడ

**వీ**క్షణం జనవరి సంచికలో అరణ్య రాసిన వ్యాసంలో కొత్త రాష్ట్రాల్లో ఏర్పడబోయే పాలకులకు హెచ్చరిక చేయడంలో ప్రయోజనం లేదు. ఇప్పటికే కొన్ని లక్షల పత్రికా సంపాదకీయాలు ఏదో ఒక విషయంలో అటువంటి హెచ్చరికలు చేశాయి. ఇప్పుడు మళ్లీ అలా రాయడం, జరిగిన పెళ్లికి మేళం లాంటిది. విప్లవ శక్తులు తక్షణ డిమాండ్ దాటి ముందుకు చూడాలి. స్థానిక అధికారం ద్వారా అభివృద్ధి వంటి భావాలు కాకతీయులకు అంతకు ముందు సమాజానికి సరిపోతుందేమో గాని ప్రపంచీకరణ అనేది అన్ని రంగాల్లో జరుగుతున్న సందర్భానికి సరిపోదు. అటువంటి భావజాలంతో పోరాటం చేయకుండా ఉద్యమం, విప్లవకారుల నాయకత్వం నడవదు. ప్రపంచీకరణ రూపాలైన విచ్చలవిడి మైనింగ్, రహదారులు, ఓపెన్ కాస్ట్ విధానం, ప్రైవేటీకరణ, సబ్సిడీల కోత, సేవారంగం నుండి ప్రభుత్వం తప్పుకోవడం వంటి వాటి మీద పోరాటం వైపు ఉద్యమాన్ని నడపగలిగే ఆచరణ గురించి చర్చ జరిగితే మంచిది.

**– నరేంద్రమోహన్,** ఆస్ట్రేలియా

**వీ**క్షణంలో 'మేం మళ్లీవస్తాం' పుస్తకంపై రంగనాయకమ్మ రాసిన సమీక్ష వ్యాసానికి స్పందనగా రష్యా, చైనాల్లో సోషలిజం ఎందుకు పోయిందో ఎవ్వరూ చెప్పలేకపోయారు. నేను చెపుతాను – అంటూ ప్రకటించి రచయిత, చివరికి చెప్పిందేమిటి? సోషలిజం పోవలసిందే, పెట్టుబడిదారీ విధానం రావలసిందే – అనా? అవి రెండూ ఇటూ అటూ తిరుగుతూ ఉంటాయి – అని చెప్తూ, అదా అభివృద్ధి చెప్పడం? తను చెప్పింది పొరపాటుగా ఉంటే, 'నాది పొరపాటే' అనాలి. లేదా, 'నాదే రైటు' అని, అది ఎలా రైటో మళ్లీ చెప్పాలి. పాఠకులు ఎదురుచూసేది దీని కోసమే. రచయిత, తన పుస్తకంలో 'చర్చించండి' అన్నారు. పాఠకులు దేని మీద చర్చించాలి? సోషలిజం ఎందుకు పోయిందో తేలిందా ఇప్పుడు? – ఈ ప్రశ్నలకు జవాబులు దొరికితేనే అది చర్చ అవుతుంది.

**జెయుబివి ప్రసాద్,** ఇమెయిల్ మీద

**వీ**క్షణం జనవరి సంచికలో రాయలసీమ సమస్యలపై భాస్కర్, కుమార్‌లు రాసిన వ్యాసాలు విశ్లేషణాత్మకంగా, ఎడ్యుకేటివ్‌గా ఉన్నాయి. భాస్కర్ వ్యాసంలో ఒక టి.ఎం.సి. కి ఎన్ని ఎకరాలు పారుదల అనే విషయంలో కొంత అస్పష్టత కనిపిస్తోంది. అది సవరిస్తే బాగుంటుంది. మిగిలిన వ్యాసం అంతా బాగుంది. రాయలసీమ సమస్యల పరిష్కారానికి స్థానిక రాజకీయ నాయకులే అడ్డు అని బాగా చెప్పారు. వారిని తోసి రాజని ఉద్యమించడం ప్రస్తుత పరిస్థితుల్లో ఒక్క విద్యార్థి లోకానికే సాధ్యం. ఆ దిశగా ప్రయత్నాలు జరిగితే బాగుంటుంది. కుమార్ పెట్టిన డిమాండ్లు సమంజసంగా ఉన్నాయి. దోపిడీకి అలవాటుపడ్డ పాలక వర్గాలకు ప్రజల నిజమైన సంక్షేమం పట్ల కనీస దృష్టి కూడా ఉండదు. బలమైన ఉద్యమాలు జరిగి ప్రభుత్వాలను కదిలించగలిగితే తప్ప, ఇందులో కొన్ని డిమాండ్లయినా నెరవేరే ఆశ, అవకాశం లేదు.

రానీ క్రాసిల్స్ ఆత్మ విమర్శనా వ్యాసం బాగుంది. ఆయన వ్యాసం చదివితే భవిష్యత్తులో విప్లవ కారులు ఎలాంటి తప్పులు చేయకుండా ఎలా జాగ్రత్తగా ఉండాలో తెలుస్తుంది. 'అటు విప్లవ సైనికులైనా, ఇటు రాజకీయ కార్యకర్తలైనా ఆర్థిక విషయాలను చాలా ఎక్కువగా నిపుణులకు వదిలేస్తారు. అర్థశాస్త్ర అధ్యయనాన్ని నిర్లక్ష్యం చేస్తారు' అంటూ అర్థశాస్త్ర అధ్యయనం ఎంత తప్పనిసరో

*(మిగతా 63వ పేజీలో...)*

# చట్టసభల స్వభావాన్ని తేటతెల్లం చేసిన చర్చ

వీక్షణం

వంద సంవత్సరాల కింద రష్యాలో అమలవుతుండిన పార్లమెంటరీ సంప్రదాయాన్ని ఉద్దేశించి చట్టసభ అంటే పందులదొడ్డి అనీ, వదరుబోతుల రంగస్థలం అనీ లెనిన్ అన్నాడు. భారత పార్లమెంటరీ సంప్రదాయం ఆ వర్ణన స్థాయికి కూడ ఎదగలేదని ఇవాళ ఆంధ్రప్రదేశ్ శాసనసభ చూపుతున్నది. ఈ దేశంలో పార్లమెంటరీ ప్రజాస్వామిక సంప్రదాయాల మీద, చట్టసభల మీద, ప్రజాప్రతినిధులుగా గుర్తింపు పొందుతున్నవారి ప్రవర్తన మీద ఇంకా నమ్మకమూ గౌరవమూ ఉన్న అమాయకులెవరైనా ఉంటే వారి కళ్లు తెరిపించడానికి ఆంధ్రప్రదేశ్ శాసనసభ ఇటీవలి పనితీరును పాఠ్యాంశంగా పెట్టాలి. మరీ ముఖ్యంగా ఆంధ్రప్రదేశ్ పునర్వ్యవస్థీకరణ బిల్లు 2013 అందిన నాటినుంచి ఇది రాస్తున్నంతవరకూ ఏడువారాలుగా శాసనసభ లోపలా బయటా జరుగుతున్న విషయాలు మన సమాజంలో పార్లమెంటరీ సంప్రదాయాల బోలుతనాన్ని, దివాళాకోరుతనాన్ని ఎత్తిచూపుతున్నాయి. (ఇది మీరు చదివే సమయానికి ఆ చర్చ కూడ అయిపోతుంది).

రాజ్యాంగం ప్రకారం దేశంలో కొత్త రాష్ట్రాల ఏర్పాటు, పాత రాష్ట్రాల విభజన, రాష్ట్రాల సరిహద్దుల మార్పు కేంద్ర ప్రభుత్వ పరిధిలోని అంశాలు. రాజ్యాంగంలో ఈ అంశాలను నిర్దేశించే అధికరణం 3 మీద రాజ్యాంగ నిర్ణయ సభలో లోతైన చర్చ జరిగింది. ఎప్పుడైనా ఒక రాష్ట్రం నుంచి విడదీసి తమకు ఒక ప్రత్యేక రాష్ట్రం ఏర్పాటు చేయాలని కోరేవారు తక్కువ సంఖ్యలోనే ఉంటారు గనుక, ఆ ఆకాంక్షమీద నిర్ణయం ప్రకటించే అధికారాన్ని రాష్ట్ర శాసనసభకు ఇస్తే అది మైనారిటీ మీద మెజారిటీ నిరంకుశత్వాన్ని రుద్దడమే అవుతుందని వాదన వచ్చింది. అందువల్ల కొత్త రాష్ట్రాల ఏర్పాటు అవకాశాన్ని కేంద్ర ప్రభుత్వానికి ఇవ్వడం జరిగింది. అలా అధికారాన్ని పూర్తిగా కేంద్ర ప్రభుత్వం చేతిలో పెట్టడం నిరంకుశత్వానికి దారితీస్తుందేమో అనే సందేహంతోనే, ఆ పని రాష్ట్రపతి అనుమతితో మాత్రమే జరగాలని షరతు కూడ చేర్చారు. సమాఖ్య స్ఫూర్తితో సంబంధిత రాష్ట్ర శాసనసభ అభిప్రాయాలు తెలుసుకోవాలనే నిబంధన కూడ చేర్చారు. అధికరణం 3ను వ్యాఖ్యానిస్తూ, ఇటువంటి నిర్ణయంలో సంబంధిత రాష్ట్ర శాసనసభ అభిప్రాయాలు తెలుసుకోవాలనీ, కాని అవి నిర్ణయాత్మకమైనవి కాజాలవనీ సుప్రీంకోర్టు చెప్పింది.

రాజ్యాంగ, చట్టపరమైన స్థితి అది కాగా, తెలంగాణ ప్రత్యేక రాష్ట్ర సాధన కోసం జరిగిన సుదీర్ఘ ఉద్యమం గురించి, కనీసం గత రెండు ఎన్నికలలో అన్ని రాజకీయపక్షాలూ తెలంగాణ రాష్ట్ర ఏర్పాటు పట్ల తమ అనుకూలతను తమ ఎన్నికల ప్రణాళికలలో చేర్చడం గురించి, 2009 డిసెంబర్ 9 తర్వాత కేంద్ర ప్రభుత్వం రాష్ట్రంలోని అన్ని రాజకీయ పక్షాలతో కనీసం మూడు సార్లు అఖిలపక్ష సమావేశాలు ఏర్పాటు చేసి అభిప్రాయాలు సేకరించడం గురించి చెప్పనక్కరలేదు. ఈ రాజ్యాంగ, చట్ట, రాజకీయ నేపథ్యంలో తెలంగాణ రాష్ట్ర ఏర్పాటు గురించి జరిగే ప్రయత్నాలు సాఫీగా సాగిపోవాలి. కాని ఒక్కొక్క రాజకీయ పక్షమూ, ప్రతి రాజకీయ పక్షంలోని కొందరు నాయకులూ ఆ ప్రయత్నాల్ని అడ్డుకుంటున్న తీరు చూస్తే ఆశ్చర్యం కాదు, అసహ్యం కలుగుతున్నది.

అధికరణం 3 ప్రకారం ఆంధ్రప్రదేశ్ రాష్ట్రాన్ని విభజించి, తెలంగాణ రాష్ట్రాన్ని ఏర్పాటు చేయడానికి అవసరమైన బిల్లును కేంద్ర ప్రభుత్వం తయారుచేసి రాష్ట్రపతికి పంపించింది. రాష్ట్రపతి అభిప్రాయ సేకరణ కోసం ఆరు వారాల వ్యవధి ఇచ్చి ఆంధ్రప్రదేశ్ శాసనసభకు డిసెంబర్ 12న పంపారు. అప్పటికి ఆంధ్రప్రదేశ్ శాసనసభ సమావేశాలు జరుగుతున్నాయి. ఈ బిల్లు ప్రాధాన్యత దృష్ట్యా మిగిలిన విషయాలు పక్కన పెట్టి అయినా శాసనసభ ఆ బిల్లుమీద చర్చ ప్రారంభిస్తే ఆరు వారాలలో సభ్యులందరికీ తమ తమ అభిప్రాయాలు చెప్పుకునే అవకాశం కలిగేది. కాని అన్ని రాజకీయపక్షాల వారూ విపరీతంగా సమయం వృధా చేసి, యథావిధిగా సెలవులు తీసుకుని, రెండు వారాలు మాత్రం ఉందనగా చర్చ ప్రారంభించారు. ఆ తర్వాత కూడ ఒకవైపు అనవసర విషయాల మీద సమయం వృధా చేశారు, మరొకవైపు మరింత గడువు కావాలని కోరి, మరొక వారం సంపాదించుకున్నారు. బిల్లులో ఏముంది, బిల్లులో ఉన్న విషయాలను ప్రజా ప్రయోజనాల రీత్యా ఎలా సవరించవలసి ఉంది, బిల్లులో ఏమి తొలగించవలసి ఉంది, బిల్లులో అదనంగా ఏమి చేర్చవలసి ఉంది వంటి కీలకమైన, అవసరమైన విషయాలను సభ అసలు ఎత్తుకోనే లేదు. ఎవరైనా ఒకరిద్దరు సభ్యులు మాట్లాడినా అవి ప్రధానాంశాలు కాలేదు. ప్రసంగంలో భాగంగా అన్న ఒక మాట, చరిత్ర, శాసనసభ చర్చా పద్ధతులు వంటి వాటిమీద అనవసరమైన వివాదాలు, దూషణ ప్రతిదూషణలు, సభ్యులు పోడియం దగ్గరికి, వెల్‌లోకి వెళ్లి నిరసనలు ప్రకటించడం ఇష్టారాజ్యంగా జరుగుతున్నాయి. అసలు విషయాలు వదిలిపెట్టి, ఆంధ్రప్రదేశ్ చరిత్ర గురించి, అభివృద్ధి గురించి, ఏ ప్రాంతానికి ఎంత అభివృద్ధి దక్కిందనే దాని గురించి పచ్చి అబద్ధాలు, అర్ధసత్యాలు, వక్రీకరణలు, అసందర్భపు ఉటంకింపులు సభాసమయంలో అత్యధిక భాగాన్ని మింగి వేస్తున్నాయి. ఏడు వారాల, నలభై తొమ్మిది రోజుల గడువులో సభ వాస్తవంగా వాడుకున్నది రెండు వారాలకూ, పది రోజులకూ, ఎక్కువలో ఎక్కువ అరవై డెబ్బై గంటలకూ మించదు. ఆ సమయంలో కూడ బిల్లు మీద అభిప్రాయాలుగా చెప్పదగినవి అందరు మాట్లాడినవీ కలిపినా ఆరు గంటలకు మించవు. బిల్లు ఇప్పుడు ఉన్న స్థితిలోనే పార్లమెంటు ఆమోదం పొందితే, ఇటు తెలంగాణ ప్రజలకు గాని, అటు మిగిలిన ఆంధ్రప్రదేశ్ ప్రజలకు గాని జరగబోయే నష్టం ఏమిటో, బిల్లులో ఏ నిబంధనలను ఎలా మార్చి ప్రవేశపెట్టవలసి ఉందో చెప్పడానికి ప్రయత్నించిన వారు అతి కొద్ది మంది. ఇదీ మన దేశంలో పార్లమెంటరీ ప్రజాస్వామ్యం అమలవుతున్న తీరు. చట్టసభలకు ప్రజాస్వామికంగా ఎన్నికయ్యామని చెప్పుకునే ప్రజాప్రతినిధులకు చర్చా సంప్రదాయం మీద, ప్రజాస్వామ్యం మీద ఎంత మాత్రం గౌరవం లేదనడానికి చిహ్నం ఇది.

ఆంధ్రప్రదేశ్ పునర్వ్యవస్థీకరణ బిల్లు 2013 ఇప్పుడున్న స్థితిలో ఇటు తెలంగాణ ప్రజల ఆకాంక్షలనూ తీర్చే విధంగా లేదు, అటు కోస్తా, రాయలసీమ ప్రజల ఆకాంక్షలకూ అనుగుణంగా లేదు. రాజకీయ నాయకులలకు, కాంట్రాక్టర్లకు, సంపన్నులకు లాభసాటిగా ఉంది. దివాళాకోరు రాజకీయ నాయకత్వాలను పక్కనపెట్టి రెండు రాష్ట్రాల తెలుగు ప్రజలూ ఈ బిల్లు చట్టంగా మారిన తర్వాత రాబోయే దుష్ఫలితాల మీద పోరాటాన్ని కొనసాగించవలసి ఉంది.

వీ

# రాజకీయ పార్టీలకు ఎన్నికల భయమైనా లేదా?

గతంలో ఎంత ప్రజావ్యతిరేకమైన రాజకీయ పార్టీలైనా నాలుగు సంవత్సరాల పాటు ఎన్ని దుర్మార్గమైన చర్యలు తీసుకున్నా, చివరి సంవత్సరంలో, అంటే ఎన్నికల సంవత్సరంలో ప్రజానుకూలంగా ఉన్నట్టు నటించేవి. హఠాత్తుగా ప్రజానుకూల విధానాలను, ప్రజాకర్షక పథకాలనూ ప్రకటించేవి, ప్రజావ్యతిరేక విధానాలను తాత్కాలికంగా పక్కన పెట్టేవి. ఎన్నికల తరుణంలో ప్రజలను దూరం చేసుకోగూడదనే భయమైనా ఉండేది. కాని అదంతా గత చరిత్ర అయిపోయినట్టుంది. ఎన్నికల ముందురోజు కూడ అధికారపార్టీలు నిస్సిగ్గుగా ప్రజావ్యతిరేక నిర్ణయాలు ప్రకటిస్తూ, అమలు చేస్తూ ఉండగా, ప్రజావ్యతిరేకతలో తామేమీ తక్కువ తినలేదన్నట్టు ప్రతిపక్ష పార్టీలు ప్రవర్తిస్తున్నాయి. అంటే పార్లమెంటరీ రాజకీయ చట్రంలో అన్ని రాజకీయ పక్షాలకూ ఎన్నికలలో కూడ ప్రజల అవసరం లేకుండా పోయిందన్నమాట. ప్రజలకు కూడ ఎన్నికల మీద, ఎన్నికల ఫలితాల మీద భ్రమలు పెట్టుకోవలసిన అవసరం తీరిపో తున్నదన్న మాట. ఎన్నికలలో వ్యక్తమయ్యేది నిజమైన ప్రజాభిమతం కాదనీ, ప్రజలకూ ఎన్నికలకూ సంబంధం ఎప్పుడో తెగిపోయిందనీ విశ్లేషణ నిజమని తేలుతున్నదన్నమాట. ఎన్నికలలో ఎవరు గెలిచి ఎవరు ఓడినా తమకు ఒరిగేదేమీ లేదని, తమ ఓటమి తప్పదనీ ప్రజలు భావిస్తున్నారు. ఎన్నికలలో వోట్లు వేయడం తాత్కాలిక, స్థానిక, ప్రజాస్వామి కేతర, పాలనేతర, విధానేతర కారణాల రీత్యా జరుగుతున్నది గాని నిజంగా తాము తమ ప్రతినిధులను ఎన్నుకుంటున్నామనీ, వారు తమకు అనుకూల విధానాలను రూపొందించి అమలు చేస్తారనీ, తమ బతుకులను బాగుచేస్తారనీ ప్రజలు విశ్వసించడం లేదు. వోటింగ్ శాతం పెరుగు తున్నట్టు కనబడుతూనే, ప్రజావ్యతిరేకులు, లంచగొండులు, నేరస్తులు అంతకంతకూ ఎక్కువగా 'ప్రజాప్రతినిధులు'గా ఎన్నిక కావడానికి కారణం ఇదే. ప్రస్తుత ఉదాహరణే తీసుకుంటే, 2014 ఏప్రిల్ – మేలలో ఎన్నికలు జరగవలసి ఉండగా అధికార కాంగ్రెస్ 2013 రెండో అర్ధభాగం నుంచీ ప్రజా వ్యతిరేక విధానాలను తగ్గించి, ప్రజాకర్షక విధానాలను పెంచుతూ ఉంటుందని ఎవరైనా ఆశిస్తారు. ప్రధాన ప్రతిపక్ష భారతీయ జనతా పార్టీ తాను అధికారంలో ఉన్న రాష్ట్రాలలో ఆ పని చేస్తుందని, కేంద్రంలో అధికారంలోకి వస్తే ఆ పని చేస్తానని వాగ్దానం చేస్తుందనీ ఆశిస్తారు. కాని ఇవాళ దేశంలో అమలవుతున్న ప్రపంచీకరణ, నూతన ఆర్థిక విధానాలు, హిందూ మతోన్మాదం, ప్రజాజీవన విధ్వంసం, ప్రజా ఉద్యమాల అణచివేత వంటి ఏ ఒక్క రంగం తీసుకున్నా అటు అధికార పక్షమూ, ఇటు ప్రతిపక్షమూ కూడ వాటిని అమలు చేయబోమని మాటవరసకైనా చెప్పడం లేదు. సరిగ్గా నాలుగు రాష్ట్రాలలో ఎన్నికల వైఫల్యం చవిచూసిన రోజునే కాంగ్రెస్ నాయకత్వంలోని కేంద్ర ప్రభుత్వం పెట్రోల్ ఉత్పత్తుల ధరలు పెంచిందంటే, ప్రజా ఆగ్రహం పట్ల భయం కూడ లేని స్థితికి చేరుకుందన్నమాట. అధికార, ప్రతిపక్షాల ప్రజావ్యతిరేకత ఇలా పెరిగిపోతుండగా, ప్రజలను కొత్తగా భ్రమల్లో ముంచి, ఈ వ్యవస్థను, ఈ అవ్యవస్థను ఇలాగే కొనసాగించడానికి ఆమ్ ఆద్మీ పార్టీ వంటి కొత్త అతుకులు, మాట్లు, సంస్కరణలు రంగం మీదికి వస్తున్నాయి. అధికార పార్టీల చిరునామాలు మారినందువల్ల తమ జీవితాలు మారబోవని, వ్యవస్థను మార్చడమే పరిష్కారమని ప్రజలు గుర్తించేదాకా, నిజమైన ప్రజాశక్తులు ప్రజలచేత ఆ నిజాన్ని గుర్తింపజేసి, సంఘటితం చేసేదాకా ఈ బీభత్స, జుగుప్సాకర, హాస్యాస్పద నాటకాలు సాగుతూనే ఉంటాయి. వీ

# థాయిలాండ్, దక్షిణ సుడాన్‌లలో జనవిధ్వంసం

ఇటు ఆగ్నేయాన థాయిలాండ్, అటు పశ్చిమాన దక్షిణ సుడాన్ అనే చిన్న దేశాలలో జరుగుతున్న హింస, కల్లోలాలు, ప్రజాందోళనలు మూడో ప్రపంచ దేశాలన్నీ ఎదుర్కొంటున్న సంక్షోభానికి, ఈ దేశాలలో నిజంగా జరగవలసిన వ్యవస్థా పరివర్తనకు నిదర్శనంగా ఉన్నాయి. ఏడు కోట్ల జనాభా గల థాయిలాండ్ ఒక రాజ్యాంగబద్ధ రాజరికం. సంపూర్ణ రాజరికం నుంచి రాజ్యాంగబద్ధ రాజరికానికి మారిన 1932 నుంచి గడిచిన ఎనిమిది దశాబ్దాలలో ఎన్నో సైనిక కుట్రలు, ఎన్నికలు జరిగాయి, పదిహేడు రాజ్యాంగాలు అమలులోకి వచ్చాయి. చరిత్రలో ఎన్నడూ వలసగా మారని థాయిలాండ్ ఆగ్నేయాసియాలో అటూ ఇటూ బ్రిటన్, ఫ్రాన్స్ వలస రాజ్యాల మధ్య అడకత్తెరలో పోకచెక్కలా నలిగిపోయింది. రాజరికాన్ని వదులుకోని భూస్వామ్య, అర్ధభూస్వామ్య పునాది ఒకవైపు, అంటుకట్టిన పాశ్చాత్య ఉపరితల ప్రవేశం మరొకవైపు ఉండగా దేశం లోకి పార్లమెంటరీ ఎన్నికల విధానం వచ్చింది గాని అక్రమాలే ఆ ఎన్నికలను శాసిస్తూ వచ్చాయి. అధికారవర్గాల ముఠా తగాదాలు దేశాన్ని అల్లకల్లోలం చేశాయి. అధికార, ప్రతిపక్ష రాజకీయ నాయకుల మీద, చివరికి ప్రధాన మంత్రుల మీద అవినీతి, దౌర్జన్య ఆరోపణలు వెల్లువెత్తాయి. న్యాయస్థానాలు ప్రధానమంత్రులను కూడ దోషులుగా ప్రకటించాయి. ఈ నేపథ్యంలో గత మూడు సంవత్సరాలుగా మాజీ ప్రధాని థక్షిన్ షినావాత్ర, ఆయన సోదరి ప్రస్తుత ప్రధాని యింగ్లక్ షినావాత్ర, వారిని సమర్థించే 'రెడ్ షర్ట్స్' అల్లరి మూకలు ఒకపక్క, మాజీ ప్రధాని అభిషిత్ వెజ్జజీవ, మాజీ ఉపప్రధాని సుథేప్ థౌగ్సుబెన్, కొన్ని ప్రతిపక్షాలు మరొకపక్క రోజూ వీధిపోరాటాలు చేస్తున్నాయి. ఇదివరకు ఎన్నోసార్లు అధికారాన్ని హస్తగతం చేసుకున్న సైన్యం మరొకసారి అవకాశం కోసం ఎదురుచూస్తోంది. మరొకసారి బూటకపు ఎన్నికలను నిర్వహించడానికి అధికారపక్షం ప్రయత్నిస్తుండగా, ఎన్నికలను బహిష్కరించడానికి ప్రతిపక్షాలు ప్రయత్నిస్తున్నాయి. కాల్పులలో, విధ్వంసంలో ప్రజలు పిట్టలలాగ రాలిపోతుంటే సామ్రాజ్యవాద ప్రభుత్వాలు ఈ శవదహనంలో పేలాలు ఏరుకోవడానికి ప్రయత్నిస్తున్నాయి. భూస్వామ్యాన్ని, రాచరికాన్ని, సైనికపాలనను, సామ్రాజ్యవాదాన్ని తోసివేసి నిజమైన ప్రజా ప్రత్యామ్నాయాన్ని సాధించుకోవాలనే థాయి ప్రజల స్వప్నం ఇవాళ్టికివాళ నిజమయ్యే అవకాశం మాత్రం లేదు. అధికార మార్పిళ్లు ఎన్ని జరిగినా ప్రయోజనం లేదని, వ్యవస్థ మార్పు తప్ప గత్యంతరం లేదని ప్రపంచంలోని అణగారిన ప్రజలందరికీ థాయిలాండ్ పాఠం నేర్పుతున్నది. ఇదే సమయంలో రక్తసిక్త, హంతక, తెగపోరాట వాస్తవికతతో దక్షిణ సుడాన్ సంస్కరణవాదం వల్ల ప్రయోజనం లేదని మరొక నిదర్శనం చూపుతున్నది. సుడాన్ నుంచి విడిపోవడానికి దశాబ్దాల పోరాటం చేసి, ప్రజాభిప్రాయ సేకరణలో 98.8 శాతం సమ్మతి పొంది, 2011 జూలైలో ఏర్పడిన కోటి మంది కూడ లేని, సమృద్ధిగా చమురు దొరికే చిన్నారి ఈశాన్య ఆఫ్రికా దేశం దక్షిణ సుడాన్. తెగల మధ్య విభేదాలతో, కొన్ని తెగలు అక్రమాధికారాన్ని చేపట్టాయని, తమ న్యాయమైన వాటా తమకు దక్కలేదని మరికొన్ని తెగలు చేస్తున్న సాయుధ పోరాటాలతో చిన్నాభిన్నమవుతున్నది. అధికార మార్పిడి దానికదే ప్రజానుకూలం కాదని, ప్రజల ప్రయోజనాలు పరిరక్షించే వ్యవస్థ ఏర్పడేదాకా జనజీవితంలో కల్లోలం తప్పదని ఈ హింసాత్మక పరిణామాలు రుజువు చేస్తున్నాయి. వీ



❖ **తెగిపడ్డ ఆ చెయ్యి** – కారుమంచి దళితుల ధిక్కార చరిత్ర – సి.ఎస్. సాగర్ – సిపిఐ (ఎంఎల్) – న్యూడెమోక్రసీ ప్రచురణ – 110 పేజీలు, 1/8 డెమీ, రు. 100



❖ **ఎల్ఐసి – మంద్రస్థాయి యుద్ధం–** ప్రతిఘాతుక విప్లవ అత్యున్నత వ్యూహం – రాజకీయ, సైనిక విశ్లేషణ – అనువాదం: రివేరా– విప్లవ రచయితల సంఘం – 183 పేజీలు, 1/8 డెమీ, రు. 100, ప్రతులకు: దిశ పుస్తక కేంద్రం; సహచర బుక్‌మార్క్; నవోదయ బుక్‌హౌస్



❖ **విద్యార్థి సంఘ నిర్మాణం – పని పద్ధతులు** – పిడిఎస్‌యు రాష్ట్ర కార్యవర్గం ప్రచురణలు – 160 పేజీలు, 1/8 డెమీ, రు. 75,

పై రెండు పుస్తకాల ప్రతులకు : ఇ.నెం. 2-1-716, (బి-6, ఎఫ్-4), ఎస్‌వి స్కూల్ ఎదురుగా, ఒ.యు. మెయిన్ రోడ్, విద్యానగర్, హైదరాబాద్ – 500044. ఫోన్: 040 27668471; అన్ని ప్రముఖ పుస్తక కేంద్రాల్లో



❖ **సామాజికం** – వ్యాస సంపుటి – వి. చెంచయ్య – విరసం నెల్లూరు యూనిట్ ప్రచురణ – 79 పేజీలు, 1/8 డెమీ, రు. 30, ప్రతులకు: వి. చెంచయ్య, సాహితీ నిలయం, 10-40-15 ఎ/1, జనతాపేట నార్త్, కావలి – 524204, నెల్లూరు జిల్లా; ఫోన్ : 08626-242277; సెల్ : 94406 38035



❖ **నలుపు, తెలుపు, కొన్ని రంగులు** – ప్రసిద్ధ కన్నడ రచయిత్రుల కథలు – రంగనాథ రామచంద్ర రావు – లక్ష్మీ ప్రచురణలు – 136 పేజీలు, 1/8 డెమీ, రు. 120, ప్రతులకు : వి. లక్ష్మీకుమారి, 1-11-163/1, నాల్గవ అంతస్తు, ఫ్లాట్ నెం. 402, స్టీఫెన్స్ కాటేజ్, శ్యామ్‌లాల్ బిల్డింగ్, బేగంపేట్, హైదరాబాద్-500016



❖ **కాలం తెచ్చిన మార్పు** – పల్లె నుండి విశాల విశ్వం దాక – బి.ఎస్. రాములు కథల సంపుటి – విశాల సాహిత్య అకాడమీ ప్రచురణ – 208 పేజీలు, 1/8 డెమీ, రు. 100, లైబ్రరీ కాపీ రు. 120, ప్రతులకు: విశాల సాహిత్య అకాడమీ, 201, సులేఖ గోల్డెన్ టవర్స్, 2-2-186/53/5, రామక్రిష్ణానగర్, బాగ్ అంబర్‌పేట్, హైదరాబాద్-500013; ఫోన్: 83319 66987, 90595 50998



❖ **కళింగసీమ ప్రజా సమస్యలు – పోరాటాలు–3** – విశాఖపట్నంలో ఏజెన్సీ ప్రాంతంలో ఆదివాసుల సమస్యలు – వంశధార ప్రచురణ – 20 పేజీలు, 1/8 డెమీ, రు. 10,



❖ **1969 తెలంగాణ ఉద్యమం – ప్రజాకవి కాళోజీ కవిత్వం** – నానీ ప్రచురణలు – 69 పేజీలు, 1/8 డెమీ, రు. 100, ప్రతులకు : శ్రీమతి కె. విజయ, 2-7-1261/1, రాజగృహం, విజయపాల్ కాలనీ, హనుమకొండ, వరంగల్ – 506370; ఫోన్: 0870 – 2456001



❖ **కళింగసీమ ప్రజా సమస్యలు – పోరాటాలు–4** – కొవ్వాడలో విధ్వంసకర అణువిద్యుత్ కేంద్రాన్ని విరమించుకునే వరకు పోరాడుదాం! – వంశధార ప్రచురణ – 28 పేజీలు, 1/8 డెమీ, రు. 10,

పై రెండు ప్రతులకు : ఎ. అన్నపూర్ణ, 15 ఎల్ఐజి, హౌసింగ్ బోర్డ్ కాలనీ, విశాఖపట్నం – 530 022; సెల్:99637 89486



❖ **ఒంద్రుమట్టి** – ఓ తీర గ్రామం – యాభై ఏళ్ల కథ – నవల – నల్లూరి రుక్మిణి – విప్లవ రచయితల సంఘం – 384 పేజీలు, 1/8 డెమీ, రు. 170, ప్రతులకు: నల్లూరి రుక్మిణి, సి-132, ఎస్‌విఎన్ కాలనీ, గుంటూరు – 522 006; సెల్: 99891 33401



❖ **విభజన రేఖలు** – రాయలసీమ కథలు – సాహితీ మిత్రులు – 52 పేజీలు, 1/8 డెమీ, రు. 20, ప్రతులకు : జి. వెంకటకృష్ణ, డోర్ నెం. 87-1287-1, సోమిశెట్టి నగర్, కర్నూలు – 518002; సెల్: 89850 34894



❖ **తెలంగాణ తోవలు** – సాంస్కృతిక, సాహిత్య వ్యాసాలు – సంపాదకుడు: కాసుల ప్రతాపరెడ్డి – తెలంగాణ సాంస్కృతిక వేదిక ప్రచురణ – 111 పేజీలు, 1/8 డెమీ, రు. 60, ప్రతులకు: కాసుల ప్రతాపరెడ్డి, జి-1, డ్రీమ్ హోమ్స్, శాలివాహన నగర్, దిల్‌సుఖ్‌నగర్, హైదరాబాద్; సెల్: 98489 56375



❖ **జలగ** – డా. అప్పాల చక్రధారి – నిర్మల్ కల్చరల్ ట్రస్ట్ – 99 పేజీలు, 1/8 డెమీ, రు.60, ప్రతులకు : శక్తి మెడికల్ హాల్, తిరుమల థియేటర్ ఎదురుగా, నిర్మల్-504 106; సెల్: 94416 29693, 99899 79988; email : drchakradhari@yahoo.com



❖ **కథా తెలంగాణం** – వ్యాసాలు – డా. బివిఎన్ స్వామి – అడుగుజాడలు పబ్లికేషన్స్ – 116 పేజీలు, 1/8 డెమీ, రు. 75, ప్రతులకు: అడుగు జాడలు పబ్లికేషన్స్, ఫ్లాట్ నెం. 302, వైష్ణవీ నెస్ట్, తిరుమల మ్యూజిక్ సెంటర్ వెనుక, మూసారాంబాగ్, దిల్‌సుఖ్‌నగర్, హైదరాబాద్-500036; అన్ని ప్రముఖ పుస్తక కేంద్రాల్లో

## రైలు ప్రమాదంలో 26 మంది మృతి

అనంతపురం జిల్లా కొత్తచెరువు రైల్వేస్టేషన్ దగ్గరలో డిసెంబర్ 28న నాందెడ్ ఎక్స్‌ప్రెస్ రైలులో అగ్ని ప్రమాదం జరిగింది. ఈ ప్రమాదంలో 26 మంది చనిపోగా, 13 మంది తీవ్రంగా గాయపడ్డారు. ఈ ప్రమాదానికి షార్ట్‌సర్క్యూటే కారణమని విచారణ అధికారులు తెలిపారు.

## తెలంగాణ బిల్లుపై చర్చ

డిసెంబర్‌లో వాయిదా పడ్డ శీతాకాల అసెంబ్లీ సమావేశాలు తిరిగి జనవరి 3 నుంచి ప్రారంభమైనాయి. ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర పునఃవ్యవస్థీకరణ ముసాయిదా బిల్లు- 2013పై జనవరి 8న చర్చ ప్రారంభమైంది. ఈ బిల్లుపై చర్చను స్పీకర్ నాదేండ్ల మనోహర్‌రావు సలహా మేరకు తెలుగు భాషా, సాంస్కృతికశాఖ మంత్రి వట్టి వసంతకుమార్ ప్రారంభించారు. బిల్లుపై అన్ని పార్టీల నేతలు మాట్లాడుతున్నారు. బిల్లు గడువు జనవరి 23తో ముగియడంతో బిల్లు గడువును పెంచాలని సిఎం కిరణ్‌కుమార్‌రెడ్డి రాష్ట్రపతి ప్రణబ్‌ముఖర్జీకి లేఖ రాశారు. సిఎం విజ్ఞప్తి మేరకు గడువును జనవరి 30 వరకు పొడిగించారు.

## మహాజన సోషలిస్టు పార్టీ ఆవిర్భావం

సామాజిక న్యాయమే లక్ష్యంగా ఎంఆర్‌పిఎస్ వ్యవస్థాపక అధ్యక్షులు మందకృష్ణ మాదిగ నేతృత్వంలో 'మహాజన సోషలిస్ట్ పార్టీ'ని జనవరి 5న ప్రకటించారు. ఆర్థిక, రాజకీయ, సామాజిక లక్ష్యాలను సాధించడం తమ లక్ష్యమని ప్రకటించారు. సమాజంలో దోపిడికి, అసమానత్వానికి, అణచివేతకు, నిర్లక్ష్యానికి గురవుతున్న వారి అభివృద్ధికి తమ పార్టీ కృషి చేస్తుందని తెలిపారు.

## మావోయిస్టు నేత ఉసెండి లొంగుబాటు

మావోయిస్టు పార్టీ దండకారణ్య స్పెషల్ జోన్ కమిటీ అధికార ప్రతినిధిగా ఉన్న గుమ్మడివెల్లి వెంకట కృష్ణ ప్రసాద్ అలియాస్ గుడ్సా ఉసెండి, తన సహచరి రాజీతో జనవరి 7న రాష్ట్ర డిజిపి ముందు లొంగిపోయారు. ఆయనది వరంగల్ జిల్లా, దేవరుప్పుల మండలం, కడివెండి గ్రామం. ఆయన 1985లో పీపుల్స్‌వార్ పార్టీలో పనిచేస్తూ అజ్ఞాతంలోకి వెళ్లారు.

## విరసం 24వ రాష్ట్ర మహాసభలు

విప్లవ రచయితల సంఘం (విరసం) రాష్ట్ర మహాసభలను కాళోజీ శతజయంతి సందర్భంగా వరంగల్‌లోని అంబేద్కర్ భవన్‌లో జనవరి 11, 12 తేదీలలో నిర్వహించారు. ఈ సభలకు ఆహ్వాన సంఘం అధ్యక్షుడుగా నాగిళ్ల రామాశాస్త్రీ అధ్యక్షతన, పౌరహక్కుల సంఘం నేత ఎం.టి. ఖాన్ మహాసభల్ని ప్రారంభించారు. వక్తలు మాట్లాడుతూ ప్రభుత్వం గ్రీన్‌హంట్ పేరుతో దండకారణ్యంపై యుద్ధం ప్రకటించిందనీ, దీన్ని వ్యతిరేకిస్తూ రెండు సంవత్సరాల కాలం పాటు సాంస్కృతిక రంగంలో విరసం కృషి చేస్తోందన్నారు. ఈ సభలో బాసగూడ ఘటనపై నాటక ప్రదర్శన చేశారు. ఈ సభలో 'ఆంక్షలు లేని తెలంగాణ ప్రకటించాలనీ, గ్రీన్‌హంట్‌ను నిలిపి వేయాలనీ పెట్టుబడిదారుల చేతుల్లోని భూములను పేదలకు పంచాలనీ' తీర్మానాలు చేశారు. విరసం నూతన కార్యదర్శిగా వరలక్ష్మిని ఎన్నుకున్నారు. కార్యవర్గ సభ్యులుగా పది మంది ఎన్నికయ్యారు.

## గిరిజన హక్కులను ఉల్లంఘించొద్దు

ప్రజల ఆమోదం లేకుండా క్షిపణి ప్రయోగ కేంద్రం, ఫైరింగ్ రేంజ్ కేంద్రాలు ఏర్పాటు చేయొద్దని మానవ హక్కుల వేదిక డిమాండ్ చేసింది. నల్గొండ జిల్లా సంస్థాన్ నారాయణపురం మండలంలోని రాచకొండ ప్రాంతాన్ని సందర్శించారు. అటవీ హక్కుల చట్టం ప్రకారం గిరిజనులకు భూ పట్టాలు ఇవ్వాలని మానవ హక్కుల వేదిక ప్రభుత్వాన్ని డిమాండ్ చేసింది. బిడిఎల్ అధికారులు గిరిజనులను మోసం చేసే ప్రయత్నం చేస్తున్నారని తెలిపింది. గిరిజనుల హక్కులను ఉల్లంఘిస్తే ఊరుకోమని హెచ్చరించింది.

## ఆపరేషన్ గ్రీన్‌హంట్ వ్యతిరేక సభ

హైదరాబాదులోని బషీర్‌బాగ్ ప్రెస్ క్లబ్‌లో ఆపరేషన్ గ్రీన్‌హంట్ వ్యతిరేక పోరాట కమిటీ ఆధ్వర్యంలో జనవరి 19న 'ఆపరేషన్ గ్రీన్‌హంట్‌ను వెంటనే నిలిపివేయాలని, విధ్వంసకర అభివృద్ధిని వ్యతిరేకిద్దాం' అనే అంశం మీద బహిరంగ సభ జరిగింది. ఈ సభలో పాల్గొన్న వక్తలు ఆపరేషన్ గ్రీన్‌హంట్ పేరుతో ఆదివాసులపై జరుగుతున్న దాడులను నిలిపి వేయాలని డిమాండ్ చేశారు. అలాగే విరసం కళా బృందం బాసగూడ నాటకాన్ని ప్రదర్శించింది. ఈ సభలో ఉ.సాంబశివరావు, కెవిఎన్‌పిఎస్ అధ్యక్షుడు దుడ్డు ప్రభాకర్, సిఎంఎస్ అధ్యక్షురాలు జయమ్మ, పిఒడబ్ల్యు రాష్ట్ర అధ్యక్షురాలు సంధ్యతో పాటు అనేక మంది హాజరయ్యారు.

## పెరుమాళ్లు మృతి

నవశక్తి, జయంతి పబ్లికేషన్స్ నిర్వాహకులు ముప్వల పెరుమాళ్లు (90) జనవరి 21న విజయవాడలో చనిపోయారు. ఆయన 1924 ఆగస్టు 9న ప్రకాశం జిల్లా, దర్శి మండలం, గంగాదేవిపల్లిలో జన్మించారు. 1924 నుంచి ఆయన కమ్యూనిస్టు పార్టీలో కొనసాగుతూ కొంతకాలం అజ్ఞాత జీవితాన్ని కూడా గడిపారు. తెలుగు పుస్తక ప్రచురణరంగంలో గణనీయమైన కృషి చేశారు.

## సమైక్యాంధ్ర ధర్నా

ఆంధ్రప్రదేశ్ నాన్ గెజిటెడ్ ఆఫీసర్స్ (ఎపిఎన్‌జిఒ), సమైక్య రాష్ట్ర పరిరక్షణ వేదిక ఆధ్వర్యంలో రాష్ట్ర విభజన బిల్లు-2013ను వ్యతిరేకిస్తూ హైదరాబాద్‌లోని ఇందిరా పార్క్ వద్ద జనవరి 22న ధర్నా నిర్వహించారు. ఈ ధర్నాలో పాల్గొన్న ఎపిఎన్‌జిఒ నాయకులూ, వివిధ పార్టీల నాయకులూ, ప్రజాసంఘాల నాయకులూ రాష్ట్ర విభజన బిల్లును వ్యతిరేకిస్తూ, బిల్లును అడ్డుకోవాలని పిలుపునిచ్చారు. ఈ సభలో కాంగ్రెస్, టిడిపి, వైఎస్ఆర్‌సిపి నాయకులతో పాటు వివిధ సంఘాల నేతలు పాల్గొన్నారు.

## అక్కినేని నాగేశ్వరరావు మృతి

సినీ నటుడు అక్కినేని నాగేశ్వరరావు (90) జనవరి 21న హైదరాబాద్ లో చనిపోయారు. ఆయన గత కొంతకాలంగా క్యాన్సర్ వ్యాధితో బాధ పడ్డారు. ఆయన కృష్ణా జిల్లా గుడివాడ మండలం, వెంకట రాఘవాపురం లో1924 సెప్టెంబర్ 20న జన్మించారు. ఆయన 1944లో సినీ రంగంలోకి ప్రవేశించారు. ఆయన తొలి చిత్రం 'ధర్మపత్ని'. ఆయన 256 చిత్రాల్లో నటించారు. ఆయన తన నటనకు గుర్తింపుగా పద్మశ్రీ, పద్మభూషణ్, పద్మవిభూషణ్ పురస్కారాలు అందుకున్నారు.

## పోరు గర్జన

ఖమ్మం జిల్లా, ఇల్లెందులో సిపిఐ (ఎంఎల్) న్యూడెమోక్రసీ ఆధ్వర్యంలో జనవరి 23న 'పోరు గర్జన' సభ జరిగింది. ఈ సభకు హాజరైన వక్తలు ఆదివాసుల సమస్యలపై, ఓపెన్‌కాస్టుకు వ్యతిరేకంగా, రాష్ట్ర విభజనపై ద్వంద్వ వైఖరి అవలంబిస్తున్న పార్టీల విధానాలకు వ్యతిరేకంగా మాట్లాడారు. సభలో రాష్ట్ర న్యూడెమోక్రసీ కార్యవర్గ సభ్యులు వేములపల్లి వెంకటరామయ్య, ఢిల్లీ పార్టీ కార్యదర్శి డా. అపర్ణ, ఐఎఫ్‌టియు జాతీయ కార్యదర్శి వి.కె. పటొలిలతో పాటు పార్టీ కార్యకర్తలు, అనేక మంది హాజరయ్యారు. వీ

# సామ్రాజ్యవాద దళారీ చిలకపలుకుల మన్మోహన్

***ప్రధానిగా మన్మోహన్‌సింగ్ సామ్రాజ్యవాద, బహుళజాతి కార్పొరేట్ శక్తులకు ప్రయోజనాలు చేకూరే విధానాలే అమలు చేశారనీ, తన పదవీకాలంలో ప్రజల జీవన పరిస్థితులను అధోగతి పాలుచేశారనీ అంటున్నారు* బి. రామక్రిష్ణ**

**2014** జనవరి 3న ఢిల్లీలోని జాతీయ మీడియా కేంద్రంలో భారత ప్రధాని మన్మోహన్ సింగ్ సుదీర్ఘంగా మాట్లాడాడు. ప్రధానమంత్రిగా తొమ్మిదిన్నరేళ్లలో ఇది మూడవ పూర్తిస్థాయి విలేకరుల సమావేశం. ఇందులో 2004 నుండి నేటి వరకు నిరాటంకంగా అధికారంలో కొనసాగుతున్న యుపిఎ పాలన గురించి ప్రస్తావించాడు. ద్రవ్యోల్బణం, ధరల పెరుగుదల, ఆర్థిక వృద్ధిరేటు, స్కాంలు, అవినీతి, విదేశీ ప్రత్యక్ష పెట్టుబడులు (ఎఫ్‌డిఐ), అమెరికాతో అణు ఒప్పందం మొదలగు విషయాలపై తన అభిప్రాయాలను చెప్పాడు. పనిలో పనిగా తిరిగి అధికారంలోకి వస్తే రాహుల్ గాంధీ ప్రధానమంత్రి అవుతాడని పరోక్షంగా చెపుతూ సోనియాగాంధీకి విధేయతను ప్రకటించుకున్నాడు.

తన ప్రధానమంత్రి పదవీ కాలంలో అత్యంత సంతృప్తిని ఇచ్చిన సంఘటనగా అమెరికాతో భారత్ అణు ఒప్పందాన్ని పేర్కొన్నాడు. అంతగా సంతృప్తిని మిగిల్చిన ఈ ఒప్పందాన్ని పరిశీలిద్దాం. భారత్ – అమెరికా పౌర అణు సహకార ఒప్పందం ద్వారా భారత్‌కు అమెరికా నుండి అణు విద్యుత్ సంబంధిత సాంకేతిక, మేధోపర పరిజ్ఞానం, యంత్ర పరికరాలు, అణు ఇంధనం అందుబాటులోకి వస్తాయి. దీని ఫలితంగా దేశంలో పెరుగుతున్న విద్యుత్ అవసరాలు తీరతాయని ప్రధానితో పాటు రాహుల్‌గాంధీ ప్రకటించారు. అమెరికాలోని అణు శక్తి చట్టం (యునైటెడ్ స్టేట్స్ అటామిక్ ఎనర్జీ ఆక్ట్) లోని సెక్షన్ 123 అనేది ఇతర దేశాలతో పౌర అణు ఒప్పందాల గురించి వివరిస్తుంది. కనుక భారత్‌తో అమెరికా కుదుర్చుకున్న అణు ఒప్పందాన్ని 123 అణు ఒప్పందం అని కూడా అంటారు.

గత మూడు దశాబ్దాలకు పైగా భారత్‌పై అణు ఇంధన సంబంధిత అంశాలపై ఆంక్షలు విధించిన అమెరికా 2005 నాటికి ఎందుకు వాటిని వదులుకున్నది? అణ్వాయుధ నిరోధక ఒప్పందం (నాన్ ప్రొలిఫరేషన్ ట్రీటి, ఎన్‌పిటి) పై నేటికీ భారత్ సంతకం చేయలేదు. అయినా సరే దీన్ని సహితం పక్కకు పెట్టి లేదా బైపాస్ చేస్తూ భారత్‌తో 123 అణు ఒప్పందాన్ని కుదుర్చుకునే పరిస్థితి ఎందుకు ఏర్పడింది? ఇదేమైనా భారత్‌లో విద్యుత్ అవసరాలు తీర్చేందుకు ఉదారంగా, స్నేహపూర్వకంగా కుదిరిన ఒప్పందం అని అనుకుంటే అంతకంటే అమాయకత్వం, తెలివి తక్కువతనం మరొకటి ఉండదు. అమెరికాకు తన దేశంలోని ఆర్థిక సంక్షోభం, ఆ దేశంలోని అణు ఇంధన కార్పొరేషన్ల ఆర్థిక అవసరాలు, వ్యాపార లాభాల ప్రయోజనం దృష్ట్యా అణు ఇంధన పరిజ్ఞానం, అణు ఇంధన యంత్ర పరికరాలు అమ్ముకోవడం అవసరంగా మారింది. అందులో భాగంగానే భారత్‌తో అమెరికా ద్వైపాక్షిక సుహృద్భావ సంబంధాల పేరుతో ఫక్తు వ్యాపార సంబంధాన్ని కుదుర్చుకుంది. దీనికొరకు వాషింగ్టన్‌లో మన్మోహన్‌సింగ్ అమెరికా, అప్పటి అధ్యక్షుడు బుష్‌లిద్దరు 2005, జూలై 18న ఈ ఒప్పందంపై అంగీకారాన్ని ప్రకటించారు. ఆ రోజు నుండి తీవ్రంగా ప్రయత్నాలు చేసి చివరకు 2008, అక్టోబర్ 10న ఇరు దేశాలు ఈ ఒప్పందంపై సంతకాలు చేశాయి. అప్పటిదాకా భారత్‌పై ఆంక్షలు విధించిన ఇంటర్నేషనల్ అటామిక్ ఎనర్జీ ఏజెన్సీ (ఐఎఇఎ), అణు ఇంధన సరఫరా దేశాల సమూహం (న్యూక్లియర్ సప్లై గ్రూప్, ఎన్ఎస్‌జి) వెంట వెంటనే తమ సమ్మతిని తెలుపుతూ ఆంక్షలను సడలించాయి. చూడండి అమెరికా మహత్యం ఎటువంటిదో! ఈ ఒప్పందం ద్వారా అమెరికాకు ప్రారంభంలో వంద బిలియన్ డాలర్ల వ్యాపారం జరుగుతుంది. భవిష్యత్‌లో ఈ వ్యాపారం కొనసాగి అమెరికాకు భారత్ భారీ మొత్తంలోనే చెల్లించుకోవాల్సి ఉంటుంది.

అణు విద్యుత్ తయారీకి ఉపయోగపడుతున్న యురేనియం మన దేశంలో చాలా స్వల్ప పరిమాణంలో లభ్యమవుతుంది. ఎంతంటే ప్రపంచ యురేనియం నిల్వల్లో 1 శాతం మాత్రమే. అంటే అణు ఇంధనం కొరకు తప్పనిసరిగా విదేశాలపై ఆధారపడాల్సిందే. 1974, 1998లో అణ్వస్త్ర పరీక్షలు నిర్వహించిన క్రమంలో అమెరికాతో పాటు ఎన్ఎస్‌జి దేశాలు భారత్‌పై అణు ఆంక్షలు విధించాయి. భారత్‌కు అణు సంబంధిత పరిజ్ఞానం, ఇంధనం బయటి నుండి అందనీయకుండా కట్టడి చేశాయి. ఫలితంగా అనివార్యమై భారత్ స్వదేశీ పరిజ్ఞానాన్ని అభివృద్ధి చేసుకొని భారజల న్యూక్లియర్ రియాక్టర్లను రూపొందించింది. యురేనియం బదులుగా థోరియంను అణు ఇంధనంగా ఉపయోగించే దిశలో పరిశోధనలు జరిపి అవి విజయవంతమయ్యే దశలోకి చేరుకుంది. ప్రపంచ థోరియం నిల్వల్లో మన దేశంలో పెద్ద మొత్తంలో అంటే 25 శాతం లభ్యం అవుతుంది. అది కూడా ఆర్థికంగా వెసులుబాటయ్యేదిగా ఉంది.

భారత్ అణు ఇంధన విషయంలో స్వయం సమృద్ధిని సాధించే స్థాయికి ఎదుగుతున్న తరుణంలో అమెరికా అణు ఒప్పందం అనేది కుట్రపూరితమైనది. ఈ ఒప్పందం ద్వారా అధిక మొత్తంలో యురేనియంను అమెరికా, ఎన్ఎస్‌జి దేశాలు భారత్‌కు అందుబాటులోకి తేవడం కంటే అమ్మడం వల్ల యురేనియం ఆధారిత అణు విద్యుత్‌ను ఉత్పత్తి చేయడం జరుగుతుంది. ఫలితంగా థోరియం ఆధారిత అణు విద్యుత్‌పై పరిశోధనలకు ప్రాధాన్యత తగ్గుతుంది. పర్యవసానంగా భారత్ అణు ఇంధన స్వయం సంవృద్ధి చెత్తబుట్ట పాలవుతుంది.

123 అణు ఒప్పందం వద్దని దానిపై ముందుకెళితే మద్దతు ఉపసంహరించుకుంటామని చెప్పి మరీ 2008, జూలై 8న వామపక్షాలు ఉపసంహరించుకున్నాయి. దాంతో యుపిఎ ప్రభుత్వం పడిపోయే ప్రమాదం ఎదురైనా సరే ఈ ఒప్పందం విషయంలో పట్టుదలగా ముందుకు పోయాడు మన్మోహన్‌సింగ్. వామపక్షాల మద్దతు ఉపసంహరణ నేపథ్యంలో పార్లమెంట్‌లో విశ్వాస పరీక్షకు 2008, జూలై 10న వెళ్లాడు. కనీస మద్దతు కూడగట్టుకునేందుకు ఇతర ఎంపిలకు ఆశలు, ప్రలోభాలు ఏమి చూపారో ఏమో కాని మొత్తానికి 275-256 ఓట్లతో విశ్వాసపరీక్షలో నెగ్గుకొచ్చారు. బిజెపి పార్లమెంట్ సభ్యులు కొందరైతే తమకు డబ్బు సంచులు ముట్ట చెపుతామని ప్రలోభపెట్టే ప్రయత్నం చేశారని పార్లమెంట్ నిండు సభలోనే నోట్ల కట్టలను ప్రదర్శించారు. అప్పటి స్పీకర్ స్థానంలో ఉన్న సోమనాథ్ చటర్జీ ఇది చాలా విచారకరమైన విషయమని అన్నాడు.

అణు రియాక్టర్‌లు చాలా ప్రమాదకరమైనవి. వాటిని నెలకొల్పడంలో, కాల పరిమితి దాటిన వాటిని తొలగించడం లేదా మూసివేయడం, అందులో నిత్యం ఉత్పత్తి అయ్యే అణు వ్యర్థాలను పారేయడం, నియంత్రించడం అంతా కూడా పెద్ద మొత్తంలో ఖర్చుతో కూడుకున్నది. అదంతా ఎంతో రిస్క్‌తో కూడుకున్న పని. ఏమాత్రం అజాగ్రత్త జరిగినా, ప్రకృతి వైఫల్యాలు, లేదా శత్రువుల దాడి జరిగినా ఈ రియాక్టర్లు అణు బాంబులే అవుతాయి. భారత్ లాంటి అధిక జనాభా ఉన్న దేశానికి ఇది శ్రేయస్కరం కాదు. ప్రపంచంలో పలు చోట్ల జరిగిన అణు ప్రమాదాలు, హిరోషిమా, నాగాసాకీ పట్టణాలపై అమెరికా వేసిన అణు బాంబులు, రష్యాలోని చెర్నోబిల్ అణు ప్రమాదం, ఇటీవలి జపాన్‌లో జరిగిన ఫుకుషిమా అణు ప్రమాదాలను పరిగణనలోకి తీసుకుంటే అణు విద్యుత్ వ్యవహారం ఎంత రిస్క్‌తో కూడుకున్నదో అర్థం అవుతుంది.

అణు విద్యుత్ కాకుండా మరేతర ప్రత్యామ్నాయ మార్గాలను పరిశోధించి సాధించుకోవడంపై కృషి చేయకుండా మన్మోహన్‌సింగ్ అమెరికాతో 123 అణు ఒప్పందం కొరకు ఎందుకు అంతగా ఆరాటపడ్డాడు? పార్లమెంట్‌లో ప్రభుత్వం పడిపోయే పరిస్థితి వచ్చినా కూడా ఎందుకు అంత దృఢ చిత్తంతో వ్యవహరించాడు? అమెరికా స్వప్రయోజనాల నుద్దేశించిన ఈ ఒప్పందంపై అమెరికాకు మాటిచ్చాడు. ఆ మాటను నిలబెట్టుకునేందుకు, సామ్రాజ్యవాద శక్తి అమెరికాకు నమ్మినబంటుగా కంకణబద్ధుడై ఉన్నాడు కాబట్టి, మొత్తంగా ఎంతగా సామ్రాజ్యవాద సమ్మోహనంలో మన్మోహన్‌సింగ్ ఉన్నాడో స్పష్టం అయిపోయింది. అమెరికా అనుకూల, భారత ప్రజలకు వ్యతిరేకంగా విధానాలను ఎంతో దృఢంగా అమలు జరిపి అత్యంత సంతృప్తి పొందాడు మన్మోహన్ సింగ్.

తెలంగాణ విషయంలో పార్లమెంట్‌లో పూర్తి మద్దతు ఉన్నప్పటికీ, కాంగ్రెస్ పార్టీ మాట ఇచ్చి ఉన్నప్పటికీ, రాష్ట్రపతి ప్రసంగంలో ప్రస్తావించి ఉన్నప్పటికీ కూడా కేబినేట్ నోట్ సిద్ధం చేయడానికి దశాబ్దం కాలానికి పైగా పడుతుంది. తెలంగాణపై ప్రణబ్ ముఖర్జీ కమిటీ వేశారు. అది ముందుకు సాగలేదు. కాని 123 అణు ఒప్పందంపై 2008లో ప్రణబ్ ముఖర్జీ సంతకాలు చేసేశాడు. మన్మోహన్‌సింగ్, ప్రణబ్ ముఖర్జీ, సోనియా గాంధీలు 123 ఒప్పందంపై అమెరికాకు నమ్మిన బంట్లైనారు. తెలంగాణ విషయంలో అరవై ఏళ్లకు పైగా ప్రజాస్వామ్యయుతంగా ఉద్యమం నడుస్తున్నా, వేయికి పైగా ఆత్మహత్యలు జరిగినా చీమకుట్టినట్లుగా కూడా స్పందించరు. ఎన్నికల కోసం, అనివార్య పరిస్థితులలో, తమ రాజకీయ మనుగడ సంక్షోభంలో పడే ప్రమాదం కల్పించిన తెలంగాణ ఉద్యమ బలం ముందు చతికిలబడి తలవంచని పరిస్థితుల్లో రాష్ట్రపతి ద్వారా అసెంబ్లీకి 2013 డిసెంబర్‌లో పంపించారు. ఇప్పుడు సులభంగానే అర్థం చేసుకోవచ్చు వీరు ప్రజల పక్షమా? సామ్రాజ్యవాదుల పక్షమా?

2జి స్పెక్ట్రం, బొగ్గు గనుల కేటాయింపు (దీన్నే కోల్‌గేట్ అని కూడా అంటారు)ల కుంభకోణాల గురించి మాట్లాడుతూ, వీటి విషయంలో పారదర్శకంగా, నిజాయితీగా ఉండాలనీ, సమాన ప్రాతిపదికన వేలం ద్వారానే నిర్వహించాలనీ అన్నాడు. ప్రతిపక్షాలు కుట్రపూరితంగా నిందల పాల్జేస్తున్నాయనీ, వీరి చేతుల్లో మీడియా ఒక పరికరంగా మారిందనీ ఆక్షేపిస్తాడు. ఫలితంగా నిజాలు వెలుగులోకి రాకుండా పోతున్నాయని చెపుతాడు. అలాగని వీటి విషయంలో అక్రమాలు జరగలేదని కాదనీ, తప్పును ఒప్పుకుంటూనే వాటిని భూతద్దంలో పెట్టి పెద్దదిగా చూపిస్తున్నారనీ సమర్థించుకున్నారు. ఇంకా కొంచెం ముందుకు పోయి ఇవన్నీ యుపిఎ-1 (2004-09) కాలంలో జరిగాయనీ, వాటి గురించి ప్రజలు పట్టించుకోలేదనీ మా పనితనాన్ని మెచ్చి మళ్లీ రెండోసారి అధికారాన్ని ఇచ్చారన్నాడు.

ఈ కుంభకోణాలు యుపిఎ-1లో జరిగినప్పటికీ వెలుగులోకి వచ్చింది మాత్రం యుపిఎ-2 (2009-14) కాలంలోనే అనే విషయం కప్పిపుచ్చి అబద్ధాలు చెప్పుకొచ్చాడు. 2007లో టెలికాం మంత్రిగా ఉన్న ఎ. రాజా, 2జి స్పెక్ట్రం స్కాంకు సంబంధించి ఫిబ్రవరి 2011లో అరెస్ట్ అయ్యాడు. అలాగే కోల్‌గేట్ వ్యవహారానికి సంబంధించి కాగ్ రిపోర్ట్ మార్చ్ 2012లో వచ్చింది. ఈ రిపోర్టులో కోల్‌బ్లాక్‌ల కేటాయింపులో జరిగిన అవకతవకలను తప్పుపట్టింది. మన్మోహన్‌సింగ్ అబద్ధమే చెప్పి ఉండవచ్చుగాని ఎన్నో స్కాంలు జరుగుతున్నా, ప్రజా వ్యతిరేక విధానాన్నే అమలు చేస్తున్నప్పటికీ అవినీతి అక్రమాలకు పాల్పడుతున్న ఎన్నో పార్టీలు, వ్యక్తులు మళ్లీ మళ్లీ గెలవడం జరుగుతున్నదే కదా! ఇది భారత్‌లో ఎన్నికలు ఓ ఫార్స్ అని చెప్పకనే చెప్పడం లేదూ!

మొదట వచ్చిన వారికి మొదటి ప్రాధాన్యం (ఫస్ట్ కమ్ ఫస్ట్ సర్వీస్) ప్రకారం ప్రైవేట్ టెలికాం సంస్థలకు నామమాత్రపు ధరలతో 2జి లైసెన్సులు ఇవ్వబడ్డాయి. మార్కెట్ రేటు ఆధారంగా వేలం ద్వారా లైసెన్సులు ఇవ్వాలని టెలికాం రెగ్యులేటరీ అథారిటీ ఆఫ్ ఇండియా (టిఆర్ఎఐ) చెపుతున్న చట్టాలు చట్టుబండలయ్యాయి. దీని ద్వారా ప్రభుత్వానికి 10 లక్షల 76 వేల కోట్ల రూపాయల నష్టం వచ్చిందని కాగ్ రిపోర్టులో ఉంది. దీని గురించి సుప్రీంకోర్టులో విచారణ జరుగుతున్న నేపథ్యంలో ఎ. రాజా తన మంత్రి పదవికి 2010, నవంబర్ 10న రాజీనామా చేశాడు.

ఈ లైసెన్సుల విషయమంతా ప్రధాని మన్మోహన్‌సింగ్, ఆర్థికమంత్రి చిదంబరంలతో వ్యక్తిగతంగా కలిసి నవంబర్ 2007 నుండి నవంబర్ 2008ల మధ్యకాలంలో పలుసార్లు కలిసి చర్చించానని, వారి

అంగీకారంతోనే లైసెన్సులు ఇవ్వడం జరిగిందని ఎ. రాజా ఈ విషయంలో నియమించబడ్డ జాయింట్ పార్లమెంటరీ కమిటీ (జెపిసి)కి రాతపూర్వకంగా తెలిపాడు.

ప్రధాని మన్మోహన్, ఆర్థికశాఖ మంత్రి చిదంబరంలకు క్లీన్‌చిట్ ఇస్తూ జెపిసి తన డ్రాఫ్ట్ రిపోర్టును సమర్పించింది. ఈ రిపోర్ట్‌ను (పదహారు మంది సభ్యుల అంగీకారం, పదకొండు మంది అనంగీకారంతో కూడినది) ప్రభుత్వం ఆమోదించింది. జెపిసి రిపోర్టు ప్రధాని, ఆర్థిక మంత్రులకు క్లీన్‌చిట్ ఇవ్వడాన్ని సిపిఐ పార్లమెంట్ సభ్యుడు గురుదాస్ దాస్‌గుప్తా తీవ్రంగా వ్యతిరేకించాడు. ఈ కుంభకోణం విషయంలో సుప్రీంకోర్టులో ఏమి తేలుతుందో? యుపిఎ పాలనలో వెలుగులోకి వచ్చిన కుంభకోణాలకు బాధ్యులైన వారిపై శిక్షలుంటాయని ఎవరూ భ్రాంతికి గురికానక్కర్లేదు. ఎందుకంటే గతంలో జరిగిన ఎన్నో కుంభకోణాల్లో ఎవరికీ కఠిన శిక్షలు పడిన దాఖలాలు లేవని చరిత్ర రుజువు చేస్తోంది.

ఆర్థిక వృద్ధిరేటు స్వతంత్ర భారత చరిత్రలో ఎన్నడూ లేనంతగా రికార్డు స్థాయిలో 9 శాతానికి యుపిఎ కాలంలో చేరుకుందని గొప్పగా చెప్పుకొచ్చాడు. 2012-13 నాటికి అది 5 శాతానికి చేరుకుంది. వృద్ధి రేటు తగ్గిన మాటను అంగీకరిస్తూనే 2011-12 నాటికి 13.8 కోట్ల ప్రజలు దారిద్ర్యరేఖ దిగువ (బిపిఎల్) స్థాయి నుండి బయట పడ్డారని చెప్పాడు. అంటే 13.8 కోట్ల ప్రజలు పేదరికాన్ని అధిగమించారన్న మాట. ఓవైపు ఆర్థిక వృద్ధిరేటు తగ్గడం, మరోవైపు భారీస్థాయిలో పేదరికం తగ్గడం లాంటివి చూస్తుంటే ఈ లెక్కల్లోని మాయాజాలాన్ని అర్థం చేసుకోవచ్చు. 2008-09 నాటి అంతర్జాతీయ ఆర్థిక మాంద్యం, యూరో జోన్ సంక్షోభం వల్ల ఆర్థిక వృద్ధిరేటు మందగించిందని చెప్పాడు. అలాగే దేశీయ కారణాలుగా – మౌలిక వసతుల కల్పనలో వెనుకబాటు, పర్యావరణ అటవీ సంబంధిత కారణాల వల్ల ఎన్నో ప్రాజెక్టులకు అనుమతులు ఇవ్వడంలో అనేక ఇబ్బందులు ఎదురయ్యాయని అంటాడు. పర్యావరణం, అడవుల పరిరక్షణ గురించి తగు చర్యలు తీసుకోకపోగా, వాటి సంరక్షణా చట్టాలను గౌరవించి అమలు చేయాల్సింది పోయి అవి అభివృద్ధికి అడ్డంకిగా మారాయని అనడం ప్రధానమంత్రిగా సిగ్గుపడాల్సిన విషయం.

ద్రవ్యోల్బణం, ధరల పెరుగుదలను ఒప్పుకుంటూనే ఇది మన పరిధికి మించినదని అంటాడు. అంతర్జాతీయ సరుకుల, ఇంధన ధరలు పెరుగుతాయి. 80 శాతం పైగా ఆయిల్‌ను దిగుమతి చేసుకుంటున్నాం. ఈ ఆయిల్ ధరల్లో పెరుగుదల నిత్యావసర ధరల పెరుగుదలపై తీవ్రమైన ప్రత్యక్ష ప్రభావాన్ని చూపుతున్నాయి అని చెప్పుకొచ్చాడు. అయితే ప్రజా పంపిణీ వ్యవస్థ (పిడిఎస్) ద్వారా పంపిణీ చేసే ఆహార ధాన్యాల ధరలు 2003 నుండి పెరగలేదని, మహాత్మాగాంధీ గ్రామీణ ఉపాధి హామీ పథకం (ఎంజిఎన్ఆర్ఇజిఎస్) ద్వారా వ్యవసాయ కూలీలకు పని భద్రత కల్పించడం ద్వారా గ్రామీణ ప్రజల నిజవేతనాలు 2004 నుండి నేటి వరకు మూడు రెట్లు పెరగడం వల్ల పేదరిక స్థాయి వేగంగా తగ్గుముఖం పట్టి ద్రవ్యోల్బణాన్ని ఎదుర్కోగలిగామని ఆత్మస్తుతి చేసుకున్నాడు. దేశవ్యాప్తంగా పెరుగుతున్న రైతుల ఆత్మహత్యలను గమనిస్తే ప్రధానమంత్రి చెప్పే విషయాలు ఎంత వాస్తవమో తెలుస్తుంది.

వ్యవసాయ ఉత్పత్తుల పెరుగుదల వేగవంతమైందని చెప్పే ప్రధాని ఆహారపు ధరలు పెరగడం వల్ల ద్రవ్యోల్బణంను నియంత్రించలేక పోయామని పరస్పర వ్యతిరేక వాదనలు ముందుకు తెస్తాడు. వ్యవసాయ ఉత్పత్తులు పెరిగితే ఆ ఉత్పత్తుల (ఆహారపు) ధరలు తగ్గాలి కదా! ఆహారపు ధరలు పెరగడం వల్ల వాటిని ఉత్పత్తి చేసే వారికి లబ్ధి చేకూరిందనేది మరిచిపోవద్దని ఓ దరిద్రపుగొట్టు వాదన చేస్తాడు. ద్రవ్యోల్బణం వల్ల కొంతమందికే లాభం చేకూరిందని సంతోషపడమంటాడు. ఆహారపు ధరలు నియంత్రించాలంటే సరఫరా, మార్కెటింగ్ యంత్రాంగాన్ని మెరుగుపరుచుకోవాలని చెపుతూ ఈ పని రాష్ట్రాల పరిధిలోకి వస్తుందని చెపుతూ తను చేయగలిగిందేమీ లేదని తప్పించుకుంటాడు.

కార్పొరేట్, బహుళజాతి విత్తన సంస్థల గుత్తాధిపత్యానికి, రసాయనిక ఎరువుల, పురుగు మందుల కంపెనీలకు విచ్చలవిడిగా అనుమతులివ్వడంతో వ్యవసాయ రంగంపై వాటికి నియంత్రణ వచ్చింది. ఫలితంగా స్థానిక పంటలు, స్థానిక వ్యవసాయ పద్ధతులు, ప్రకృతికి, నేలకు హానిచేయని సహజ సిద్ధ వ్యవసాయ విధానాలు, విషతుల్యం గాని పంటలను సాగుచేసుకునే వీలులేకుండా ప్రభుత్వ విధానాలు అమలవుతాయి. ఈ విధానాలు కాదా ఆహారపు ధరలు పెరగడానికి కారణం? దేశంలోని వ్యవసాయ యూనివర్సిటీలను బలోపేతం చేసి, ఎన్నో ఏళ్ల తరాలుగా అమల్లో ఉన్న దేశీయ వ్యవసాయ పరిజ్ఞానాన్ని, విత్తనాలను మరింతగా విస్తృతపరిచి, పరిశోధించి వ్యవసాయ రంగంలో స్వయం సంవృద్ధిని, అభ్యున్నతిని సాధించే దిశలో తీవ్రమైన ప్రయత్నాలు చేయకపోవడం కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాల దగాకోరుతనాన్ని తెలుపుతుంది.

ఎన్నో సహజ వనరులున్న సుసంపన్న దేశం భారత్. ఇక్కడ రాజకీయ, ఆర్థిక వ్యవస్థలు సక్రమంగా పనిచేస్తే ఎంతో ప్రగతిని సాధించవచ్చు. అంతర్జాతీయంగా వచ్చే ఒడిదుడుకులను తట్టుకుని నిలబడగలిగే స్థాయిలో ఇక్కడ వనరులున్నాయి. సరళీకృత ఆర్థిక విధానాలు, ప్రైవేటీకరణ, ప్రపంచీకరణ (ఎల్‌పిజి)ల నేపథ్యంలో కొంతమంది, కొన్ని కార్పొరేట్ శక్తులకు, సామ్రాజ్యవాద శక్తులు సర్వాధికారాలు కట్ట బెడుతున్నందువల్ల సంక్షోభాలు వస్తున్నాయి అనే విషయాన్ని మన్మోహన్‌సింగ్ ఎక్కడా ప్రస్తావించడు. అసలు ఈ విధానాలకు పునాదులు వేసిన వారిలో ముఖ్యుడైనవాడు, ప్రపంచ బ్యాంక్ ఒకప్పటి ఉద్యోగి అయిన నేటి ప్రధాని మన్మోహన్‌సింగ్. ఇంకా వెనక్కిపోతే ఇందిరాగాంధీ కంటే ముందు నుండే పరాధీన ఆర్థిక విధానాలు అమలవుతూనే ఉన్నాయి. 1991 నుండి బహిరంగంగానే వేగవంతమవుతున్నాయి.

విదేశీ ప్రత్యక్ష పెట్టుబడుల (ఎఫ్‌డిఐ) గురించి మాట్లాడుతూ ఎఫ్‌డిఐలకు అనువైన వాతావరణాన్ని కల్పిస్తామని, దాన్ని కొనసాగిస్తామని, వీలున్న చోటల్లా మెరుగులు దిద్దుతామని చెపుతాడు. దేశంలోని వివిధ రంగాలలో ప్రైవేట్ లేదా విదేశీ పెట్టుబడులను వంద శాతం వరకు అనుమతినిచ్చే ఆర్థిక విధానాలను ఏనాడో నిర్ణయించారు. దీంతో పెట్టుబడి శక్తుల ఉత్పత్తుల ధరలపై నియంత్రణ ప్రభుత్వాలకు లేకుండా పోయింది. స్పెషల్ ఎకనామిక్ జోన్స్ (ఎస్ఇజెడ్) చట్టాలలో ఈ వెసులుబాట్లు, ఎఫ్‌డిఐలకు ఎర్రతివాచీలు పరిచే ఏర్పాటు

జరిగిపోయింది. వాటిని మరింతగా పరిపుష్టం చేస్తామని మరోసారి మన్మోహన్‌సింగ్ స్పష్టం చేశాడన్నమాట. అలా ప్రజాసంక్షేమం గాలికొదిలి ప్రైవేట్ శక్తులకు దాసోహం అంటున్నాడు.

ఓపెన్ ఎకానమీ గురించి ప్రస్తావిస్తూ – స్వేచ్ఛా ఆర్థిక వ్యవస్థ ప్రయోజనాలను గురించి నేటికి సాధారణ ప్రజల్లో సరైన అవగాహన కలుగలేదు. మార్కెట్ శక్తులను ప్రజా వ్యతిరేకమైనవిగానే ప్రజలు చూస్తున్నారు. ఓపెన్ ఎకానమీని తిరిగి రాజ్య నియంత్రణలోకి తేవాలని రాజకీయ వర్గాలు పెద్ద మొత్తంలో కోరుకుంటున్నారు. పూర్వ రాజ్య నియంత్రిత ఆర్థిక వ్యవస్థకు పోవడం అనేది సాధ్యం కాదు. అది వాంఛనీయం కాదని గ్రహించలేకపోతున్నారు. చైనా ఈ విషయాన్ని గ్రహించే ఓపెన్ ఎకానమీ కొరకు సంస్థాగత చట్రాలను అభివృద్ధి పరుస్తున్నది. అందుకే స్వేచ్ఛా వాణిజ్య, వ్యాపార, ఆర్థిక విధానాలను విమర్శించే కంటే దానిని ప్రజా సంక్షేమం కొరకు ఎలా ఉపయోగించుకోవచ్చో, మరల్చుకోవచ్చో ఆలోచిస్తే మంచిదని సూక్తులు చెపుతాడు. కొంచెమైనా నిజం చెప్పకపోతే ఎలా అనుకున్నాడో ఏమోగాని, ఓ నిజం మాత్రం చెప్పాడు. స్వేచ్ఛా ఆర్థిక ఫలాలను అధికంగా కొద్దిమంది మాత్రమే అనుభవిస్తున్నారనీ, అత్యధిక ప్రజానీకం ఈ ప్రయోజనాలకు దూరంగా ఉన్నారని చెప్పుకొస్తాడు. ఇది వెంటనే సరిదిద్దాలని చెపుతాడు. స్వేచ్ఛా ఆర్థిక విధానాల్లో భాగంగానే ఈ దిద్దుబాటు జరగాలని కాంక్షిస్తాడు.

ఆమ్ ఆద్మీ పార్టీ (ఎఎపి) ఢిల్లీ అసెంబ్లీ ఎన్నికల ఫలితాల్లో ముందు వరుసలోకి రావడంపై స్పందిస్తూ – అవినీతి నిర్మూలన నినాదంతో ఎఎపి విజయం సాధించగలిగింది. అవినీతి నిర్మూలనలో వారు సఫలం అవుతారో లేదో కాలమే నిర్ణయిస్తుందంటాడు. అవినీతిని ఎదుర్కోవడంలో భాగంగా ప్రభుత్వ పాలన, నిర్వహణలో పారదర్శకత కోసం అది ప్రజలకు జవాబుదారీతనం వహించడం కోసం ఇంతకు ముందెన్నడూ లేని విధంగా భారత ప్రభుత్వం ఎన్నో చర్యలు చేపట్టిందని వివరించాడు. ఆ చర్యల్లో భాగంగానే సమాచార హక్కు చట్టం (ఆర్‌టిఐ ఆక్ట్) తేవడం జరిగిందంటాడు. దీంతో గతంలో లేని విధంగా ప్రభుత్వ డాక్యుమెంట్‌లను పరిశీలించే అధికారం ప్రజలకు వచ్చిందని తెలుపుతాడు. ఈ చట్టం ఒక మైలురాయి వంటిదని చెపుతూ ఈ ముఖ్యమైన చట్టం తెచ్చినందుకు గాను కాంగ్రెస్ పార్టీ అధ్యక్షురాలు సోనియాగాంధీ తరతరాలకు గుర్తుండిపోతారని బీరాలు పోతాడు. ది పబ్లిక్ ప్రావిన్షియల్ బిల్, ది విజిల్ బ్లోయర్స్ బిల్, ది లోక్‌పాల్ బిల్, ది జ్యుడిషియల్ అకౌంటబిలిటీ బిల్ మొదలైనవన్నీ కూడా అవినీతిని నిర్మూలించడంలో దోహదపడతాయని గొప్పగా చెపుతాడు. అయితే ఇవన్నీ కూడా తాత్కాలిక ఉపశమనాన్ని ఇచ్చి, వాటిపై భ్రాంతిని కొంత కాలం కొనసాగించవచ్చు గాని మౌలికంగా అవినీతిని నిర్మూలించే శక్తి వీటికి లేదు. ఇదే విషయాన్ని ఎఎపి పై స్పందించిన మన్మోహన్ మాటల్లో కూడా గుర్తించవచ్చు. అవినీతిని ఎదుర్కోవడం అంత సులభమైన ప్రక్రియ కాదు. ఇది ఏ ఒక్క పార్టీయో పూర్తి చేయగల పని కాదు. పలు రాజకీయ పార్టీలు సమిష్టిగా అవినీతి భూతంపై కృషి చేయవలసి ఉందని ప్రధాని అంటాడు. అసమ సమాజంలో నుండి, వివక్షాపూరిత వ్యవస్థ నుండి, ఎల్‌పిజి వంటి దోపిడీ పూరిత ఆర్థిక విధానాల్లో నుండి అవినీతి వేళ్ళు, ఊడలు విస్తృతమవుతూ నానాటికీ బలం పుంజుకుంటున్న విషయం గుర్తుంచుకుంటే దాన్ని ఎలా ఎదుర్కోవాలో స్పష్టమవుతుంది.

మేం సంకీర్ణ ప్రభుత్వాలను నడుపలేమని అనుకున్నాం. కాని వరుసగా రెండు పర్యాయాలు విజయవంతంగా నడపగలిగామని గొప్పలు పోయాడు. నిజానికి దేశంలోని పార్లమెంటరీ పార్టీలన్నీ రాజకీయార్థిక విధానాల పట్ల, సామ్రాజ్యవాద, కార్పొరేట్ శక్తుల పట్ల మౌలికంగా విభేదించేదేమీ లేదు. కాకుంటే అధికారం కోసం నువ్వా? నేనా? అన్న దగ్గరే తప్పిస్తే. ఇదే విషయాన్ని గత ఇరవై ఏళ్లకు పైగా అధికారంలో ఏ ప్రభుత్వాలున్నా అవి అవలంబించే ఆర్థిక విధానాల్లో తేడా ఏమీ లేదని మన్మోహన్‌సింగ్ కూడా ప్రస్తావించాడు. ఇలాంటి ఆర్థిక విధానాలను రూపొందించడమనేది సరైనదే అని, దీన్ని అన్ని పార్టీలు అనుసరిస్తుండడం సంతృప్తినిచ్చే విషయం అని అంటాడు. ఎందుకంటే 1991లో తానే కదా ఈ విధానాలకు అంకురార్పణ చేసింది. రాజ్యాంగ మౌలిక సూత్రాలైన ప్రజాస్వామ్యాన్ని, సామ్యవాదాన్ని వదిలేసి జాతీయ, అంతర్జాతీయ మార్కెట్ శక్తులకు నమ్మినబంట్లుగా ఉండడంలో ఒకరితో ఒకరు పోటీ పడుతున్నారు. స్వయం సంవృద్ధి, స్వావలంబన, ప్రజల సాధికారత కొరకు కృషి చేసిందేమీ లేదు. కాని వీటికి వ్యతిరేకంగా పటిష్టమైన విధానాలు చేపడుతున్నారు. అందుకే సంకీర్ణ ప్రభుత్వాలే అయినప్పటికీ మనుగడ సాగిస్తాయి. అంతేగాని తొమ్మిదిన్నరేళ్లు యుపిఎ నిరాటంకంగా కొనసాగడానికి మన్మోహన్‌సింగ్ లేక కాంగ్రెస్ పార్టీ ఘనతేమీ లేదు. సంకీర్ణ ప్రభుత్వాలలో రాజకీయ పార్టీల మధ్య వచ్చే పొరపొచ్చాలు టీకప్పులో తుఫాన్ లాగానే ఉంటాయి. బగ్గున మండి చప్పున చల్లారే ఎండుగడ్డి మంటలాగే ఉంటాయి. నిజానికి ఆర్థిక విధానాలను ఎన్నింటినో అమలు చేయడానికి చట్టసభలు లేదా పార్లమెంట్‌లో చర్చలు, చట్టాలను ఎల్లప్పుడూ చేయవలసిన అవసరం ఉందని కూడా ప్రధాని చెపుతాడు. అంటే ఇప్పటికే అంతగా పాతుకుపోయిన రీతిలో ప్రభుత్వ యంత్రాంగం స్థిరపడిపోయిందని అనుకోవాలా? లేక పార్లమెంట్ లేదా చట్టసభల ప్రాధాన్యాన్ని తక్కువ చేయడమని అనుకోవాలా?

మీరు మంచి ఆర్థికవేత్తే గాని రాజకీయవేత్త కాలేకపోయారని ఎందరో అనడమే కాకుండా మీ స్వంతపార్టీ వారు సహితం అంటున్నారన్నప్పుడు, అదంతా ఏమో గాని నేను నా దేశానికి అత్యున్నత అంకితభావంతో, నిబద్ధతతో, సమగ్రతతో, పూర్తిస్థాయిలో కృషి చేశానని చెప్పుకున్నాడు. శాంతియుత, సుహృద్భావ, భద్రతాయుతమైన, స్నేహపూర్వకమైన, సంపద్వంతమైన భారత్‌ను నిర్మించడం కొరకు శక్తివంచన లేకుండా కృషి చేశానని సెలవిచ్చాడు. ఏనాడు నా అధికారాన్ని, నా కార్యాలయాన్ని నా మిత్రులు లేదా బంధువులకు అనుకూలంగా వాడుకోలేదని అంటాడు. నేనేం చేశానో, ఏం చేయలేదో, నా బలాలు, బలహీనతలేవో చరిత్రే చెపుతుందంటాడు. చరిత్రకారులే న్యాయమైన తీర్పు చెపుతారంటూ చరత్ర తనపై దయచూపుతుందని పేర్కొంటాడు. ఇలా అనడం అనేది మన్మోహన్‌సింగ్ సచ్ఛీలతను చెపుతుందని అనేకంటే ఇది అతని మనోభ్రాంతులైనా కావాలి, నక్క వినయమైనా కావాలి, లేదా కపట నాటకాల మోసాకారితనమైనా కావాలి.

*(రచయిత ఉపాధ్యాయులు, డిటిఎఫ్ సభ్యులు)* వీ

# ఆమ్ ఆద్మీ పార్టీ ఆచితూచి ముందడుగెయ్యాలి

*ఢిల్లీ రాష్ట్రంలో, కేంద్రంలో కాంగ్రెస్ ప్రజా వ్యతిరేక విధానాలతో ప్రజలు విసిగి వేసారి పోయారనీ, కొత్తగా అధికారంలోకి వచ్చిన ఆమ్ ఆద్మీ పార్టీ అవే పొరపాట్లు పునరావృతం కాకుండా జాగ్రత్తపడాలనీ అంటున్నారు* **వి. హనుమంతరావు**

ఆమ్ ఆద్మీ పార్టీ గెలిచింది. కటిక చీకిటి నుంచి వెలుగులోకి వచ్చినట్లయింది. గెలిచింది ఒక్క ఢిల్లీ నగరంలోనే అయినా యావత్ భారతదేశం ఎగిరి గంతేసింది. యావన్మంది ప్రజలు తామే గెలిచినంత సంతోషించారు. కాంగ్రెస్ చెంప చెళ్లుమంది. ఆ గెలుపు కూడా దేశ రాజధానిలో కావడంతో, ప్రధాని పదవికి ఉవ్విళ్లూరుతూ ఉర్రూతలూగుతున్న బిజెపిని కూడా కాదని ఆమ్ ఆద్మీ పార్టీని ప్రజలు వరించారు. కాంగ్రెసేతర పార్టీకి బీజం పడింది. అది మొక్కై, మ్రానై ఊడలు దించుతుందనడంలో సందేహం లేదు.

ఇంతకూ ఆమ్ ఆద్మీ పార్టీ అధికారంలోకి వస్తే చేసిన వాగ్దానం మంచినీరు, కరెంటు ఛార్జీల తగ్గింపు. ఇంత చిన్న వాగ్దానాలకే ప్రజలు ఓటు వేశారంటే, అంత చిన్న విషయాలకు కూడా ముఖంవాచి ఉన్నారన్న మాట. కాంగ్రెస్ తన ముఖాన్ని తీసుకొని వెళ్లి ఎక్కడో పెట్టుకోవాలి.

దేశవ్యాప్తంగా ప్రజలు స్పందించారంటే, తామే గెలిచినంతగా సంతోషించారంటే, అది కాంగ్రెస్‌కే కాదు, బిజెపికి కూడా చెంప పెట్టే. మోడీ గుర్రానికి అగర్వాల్ కళ్లెం వేశాడు. మోడీని ఆకాశానికి ఎత్తిన కార్పొరేట్ మీడియా, కార్పొరేట్ రంగానికి పగ్గాలు పడ్డాయి. అగర్వాల్ విజయం ఒక సంచలనాత్మక సంఘటన. ఈ దీపం ఆరిపోకూడదు. తన కాంతులన్నీ దేశమంతటా విరజిమ్మాలి. అసంతృప్తితో అల్లాడుతున్న కోట్లాది భారత ప్రజలు ఢిల్లీ ప్రజల బాటన నడవాలి. ఈ హవాను ఎదుర్కొనడానికి కాంగ్రెస్, బిజెపిల అమ్ములపొదులు ఖాళీ.

ఈ విజయం ఢిల్లీలో పార్లమెంట్‌లో పోలైనన్ని సీట్లకు పోటీ చేయడమా? పార్టీని ఇతర పార్టీలకు వ్యాపింపచేయడమా? ఆమ్ ఆద్మీ పార్టీ విజయాన్ని సొమ్ము చేసుకోవడానికి కొన్ని రాష్ట్ర పార్టీలలో లేని కొంతమంది వ్యక్తులు ప్రయత్నాలు ప్రారంభించినట్లు వార్తలొస్తున్నాయి. ఢిల్లీలోనే ఈ పార్టీ చేయడం ప్రారంభించిన పనులన్నింటినీ భంగం చేసే శక్తులు ఊరకనే కూర్చోవు. ఢిల్లీలో కాంగ్రెస్ ఓడిపోయి ఉండవచ్చు కానీ ఆమ్ ఆద్మీ పార్టీని లోపల నుంచి తొలిచేయడం ప్రారంభించిందా? ఏ పార్టీలోనైనా బలహీనులు ఉంటారు. మూడు ఎన్నికల్లో గెలుస్తూ వచ్చిన కాంగ్రెస్ చేతులు ముడుచుకొని కూర్చొంటుందా? బిజెపి కూడ ఆ పని చేయదా? ఆమ్ ఆద్మీ పార్టీలో కూడా అలాంటి బలహీనులను గుర్తించి, వారిని వల వేసి, వేలు, లక్షలు కుమ్మరించి ఆమ్ ఆద్మీ పార్టీని బలపడకుండా ప్రయత్నం చేయదా? కాంగ్రెస్ ఆమ్ ఆద్మీని బలపర్చాలనే నిర్ణయం తీసుకోవడంలో ఇలాంటి కుట్రాజకీయాలకు పాల్పడదా? మనది పార్లమెంటరీ ప్రజాస్వామ్యం. అధికారంలో ఉన్న పార్టీ ప్రతిపక్షాలకు అనేక కమిటీలో స్థానం ఇవ్వాలి. అలా ఇచ్చినప్పుడు వారికి అధికారులతో సంబంధాలు ఏర్పడతాయి. వారిలో బలహీనులను గుర్తించి వారి ద్వారా చట్టాల్లో లోటుపాట్లు కల్పించదా? ఢిల్లీ రాష్ట్ర ప్రభుత్వానికి కేంద్ర ప్రభుత్వానికి ప్రతి నిత్యం సంబంధాలుంటాయి.

## విఎచ్ కాలమ్

### భారతదేశం లోపలా బయటా

**1971** బంగ్లాదేశ్ యుద్ధ సమయంలో తూర్పు పాకిస్థాన్‌లో పాక్ సైన్యం అమాయక ప్రజల్ని చంపింది. స్త్రీలపై అత్యాచారాలు చేసింది. ఉద్యమకారులను చిత్రహింసలు పెట్టింది. మేధావులను ఒక క్రమపద్ధతిలో హత్య చేసింది. మన దేశంలో సల్వాజుడుం కార్యకలాపాలు అక్కడి ప్రభుత్వ ప్రత్యక్ష పరోక్ష మద్దతుతో మావోయిస్టు సానుభూతిపరులనే పేరుతో వారిపై దాడి చేసి క్రూరంగా చంపడం, వారి ఆస్తులను దోచుకుని, ఇళ్లను కాల్చి బూడిద చేయడం, స్త్రీలపై పాశవిక అత్యాచారాలు, గ్రామాలను తగులబెట్టడం జరిగింది. దాదాపు 644 గిరిజన గ్రామాలు ఖాళీ అయ్యాయి. సుమారు మూడు లక్షల మంది ఇతర ప్రాంతాలకు వలస పోయారు. సామాన్య ప్రజలకు సంబంధించినంత వరకు ఇండియా, పాకిస్థాన్ పాలకులు దొందు దొందే.

◆ ◆ ◆

మన దేశ ఆర్థిక మంత్రి చిదంబరం ఆ మధ్యన దేశ దేశాలు తిరిగి మా దేశంలో పెట్టుబడులు పెట్టండహో అంటూ బిక్షాటన చేసి వచ్చారు. ఒక్క పైసా రాలేదు. కాని చైనా ప్రభుత్వం శ్రీలంక ప్రభుత్వానికి 580 మిలియన్ డాలర్ల రుణం ఇస్తానని, ఈ సొమ్ము రహదారులు, మంచినీరు, జాతీయ బిజినెస్ స్కూలు కోసం ఖర్చు చేయాలని సూచించింది.

◆ ◆ ◆

దేశంలో ఉపాధి లభించక ఇతర దేశాలకు వెళ్లి శ్రమించి సంపాదించుకొని మన దేశంలోని వారి కుటుంబాలకు పంపుతున్న సొమ్ము 69 బిలియన్ డాలర్లు. కాని మన దేశం పెట్టుబడుల కోసం కటకటలాడుతుంటే, మన దేశ కార్పొరేట్లు ఇతర దేశాల్లో పరిశ్రమలను స్థాపించడానికి, అక్కడి పరిశ్రమలను కొనడానికి తమ నిధులను ఆ దేశాలకు తరలిస్తున్నారు. వీ

కేంద్రంలో అధికారంలో ఉన్న కాంగ్రెస్ ఈ అధికారుల ద్వారా అనేక చిక్కులు, ఇబ్బందులు కల్పించవచ్చు. ప్రధాన ప్రతిపక్షమైన బిజెపి ఉండనే ఉంది. దానికి ప్రభుత్వ కార్యాలయాల తలుపులు ఎప్పుడు తెరిచే ఉంటాయి. ఇలాంటి సవాలక్ష రాజకీయార్థిక సమస్యలను, ఇంత వరకూ ఆంధోళనల పార్టీగా ఉన్న ఆమ్ ఆద్మీ పార్టీ, పరిపాలనానుభవం లేని పార్టీ, పార్లమెంట్‌లో వీలైనన్ని సీట్లకు పోటీ చేయాలనుకోవడం, ఢిల్లీ పీఠాన్ని బలహీనపరచుకోవడమే అవుతుంది. ఇతర రాష్ట్రాల్లో ఈ విజయోత్సవాన్ని తమ ప్రయోజనాలకు వినియోగించుకోవడానికి చేసే ప్రయత్నాల్లో కేజ్రీవాల్ తమ రాష్ట్రాలకు రావాలని ఒత్తిడి తీసుకొని వస్తారు. ఇన్ని ఒత్తిళ్ల మధ్య కొన్ని పొరపాటు నిర్ణయాలు తీసుకునే అవకాశం లేకపోలేదు. ఈ ఒతిళ్లన్నీ ఆయన ఆరోగ్యాన్ని దెబ్బతీస్తున్నాయి. ఇల్లు అలకగానే పండుగ అయిపోదు.

పార్టీ నిర్మాణం బహు కష్టమైన విషయం. నగర వ్యాప్తంగా, బస్తీల వారీగా కమిటీలు ఏర్పాటు చేయాలి. ఈ కమిటీల సభ్యులను, కార్యదర్శులను ఎంపిక చేయడంలో యువకులు చొరవ చూపించవచ్చు. కాని ఉత్సాహం వేరు, నిర్మాణ కౌశలం వేరు. ప్రజలు వారి వారి సమస్యలను కమిటీ కార్యదర్శి చేతనైనంత వరకూ పరిష్కరించగలిగే సత్తా ఉండాలి. ఈ కార్యదర్శులందరికి క్లాసులు పెట్టి నిర్మాణ పద్ధతులు నేర్పాలి. ఢిల్లీ రాష్ట్ర స్థాయిలో నిర్మాణ బాధ్యతలు నిర్వర్తించడానికి వేరే కమిటీ ఉండాలి. గాలి ఇటు వీస్తుందని పార్టీలో పైకి ఎగబాటు కోసం ప్రయత్నాలు చేసే వారుంటారు. పార్టీ నిర్మాణ పద్ధతుల్లో కమ్యూనిస్టు పార్టీలు ఎంతో అనుభవం సంపాదించాయి. ఈ విషయంలో కొంత సహకారం తీసుకోవచ్చు. పార్టీ నిర్మాణం ఎంత పకడ్బందీగా ఉంటే, అంత మంది ఎక్కువ ప్రజలను పార్టీ పరిధిలోకి తీసుకుని రావచ్చు. గోతులు తీసే పార్టీని లోపల నుంచే తొలిచే వారిని కాంగ్రెస్, బిజెపి ప్రవేశపెట్టే ప్రమాదం ఉంది. పార్టీ నాయకత్వం హోషియార్‌గా ఉండాలి.

ఆమ్ ఆద్మీ పార్టీ విజయం వెనుక కొన్ని ముఖ్య పరిణామాలు ఆ పార్టీ విజయానికి తోడ్పడ్డాయనే విషయం ఆ పార్టీ గమనంలో ఉంచుకోవాలి. దేశమంతటా కాంగ్రెస్ వ్యతిరేక గాలులు వీస్తున్నాయి. ;గత రెండు సంవత్సరాల్లో పది రాష్ట్రాల్లో జరిగిన ఎన్నికల్లో కాంగ్రెస్ పార్టీ పరాజయం పాలైంది. నిర్భయ మానభంగం జరిగిన సందర్భంలలో ఢిల్లీ ప్రజలంతా వీధుల్లోనే ఉన్నారు. అప్పుడు యువతీ యువకులు జరిపిన ప్రదర్శన మూలంగా ఢిల్లీ ప్రభుత్వ పునాదులే చీలిపోయాయి. అవినీతికి వ్యతిరేకంగా అన్నా హజారే (కేజ్రీవాల్ కూడ ఈ ఉద్యమంలో పాల్గొన్నాడు) ఉద్యమం మొత్తం దేశాన్నే ఒక ఊపు ఊపేసింది. అవినీతి కేసులు ఒక్కొక్కటీ బయటపడడంతో కాంగ్రెస్ తన గొయ్యి తానే తవ్వుకొంది. అంతకు ముందు మారుతీ మోటర్ ఫ్యాక్టరీలో కార్మికుల సమ్మె మొత్తం కార్మిక లోకాన్ని ప్రభావితం చేసింది. దేశ స్వాతంత్ర్యాన్ని రిలయన్స్ సంస్థకు, విదేశాల్లో అమెరికాకు మన్మోహన్ సింగ్ పాదాక్రాంతం చేశాడు. ఇలా చిన్నా, పెద్ద సంఘటనలు, పరిణామాలు ప్రదర్శనల నేపథ్యంలో ఢిల్లీ నగర ఎన్నికలు జరిగాయన్న విషయం, వాటి ప్రభావం ఓటర్ల మీద పడి, వారిని ఆమ్ ఆద్మీ పార్టీకి అనుకూలంగా ఓటు వేయించిందనే విషయాన్ని విజయోత్సవంలో మరచిపోకూడదు. ఈ పరిణామాలకు ఆయన చేసిన రెండు ప్రధాన వాగ్దానాలు తోడై ఓట్ల వర్షం కురిపించాయని, కేవలం తన వాగ్దానాలే తనను, తన పార్టీని గెలిపించాయనే విషయాన్ని ఆయన గమనంలో ఉంచుకొని నేలవిడిచి సాము చేయరాదని గుర్తుంచుకోవాలి.

ముందు పునాదులు, తర్వాత భవన నిర్మాణం. పునాదులు సరిగ్గా లేకపోతే భవనమే కూలిపోతుంది.

*(రచయిత వీక్షణం వ్యవస్థాపక సంపాదకులు)*

వీ

# ఆమ్ ఆద్మీ పార్టీ అసలు స్వభావం

***సామాన్యుడి సంక్షేమమే ప్రధాన ధ్యేయం అంటూ ఢిల్లీలో కొత్తగా అధికారంలోకి వచ్చిన ఆమ్ ఆద్మీ పార్టీ విధానాలు పైపై పూతలేననీ, దాని వెనుక ఉన్న అసలు ఉద్దేశం బహుళజాతి, సామ్రాజ్యవాద పెట్టుబడిదారీ విధానాలేననీ అంటున్నారు* భూసారం శివన్న**

'ఆప్' అంటే రెండర్థాలున్నాయి. ఒకటి : ఒకరినే గౌరవంగా తమరు అని, రెండు : మీరు అంటే మీరంతా అని. ఆమ్ ఆద్మీ పార్టీ పేరును ఆంగ్లంలో పొడి అక్షరాలకు కుదిస్తే 'ఏఏపి (ఆప్)' అయ్యింది. అలా అది 'మీ పార్టీ' అంటే 'మీ అందరి పార్టీ'గా దేశ రాజకీయ రంగ ప్రవేశం చేసింది. ఈ ప్రయోగం ప్రజలను బాగా ఆకర్షించి, ఆకట్టుకుందనే చెప్పాలి. 'ఆమ్' అంటే కూడా రెండర్థాలున్నాయి.

ఒకటి: సామాన్య లేక సగటు అని, రెండు : మామిడి పండని. ఆమ్-ఆద్మీ పార్టీ అంటే 'సగటు-మనిషి' పార్టీ, ఓ ఏడాది క్రితం చిన్న సుడిగాలిలా మొదలై, ఇప్పుడు ప్రభంజనమై దేశమంతా వీస్తోందని టి.వి ఛానళ్లూ, పత్రికలూ, సోషల్ మీడియా నెట్‌వర్క్‌లు నిత్యం ఊదర గొడుతున్నాయి. ఇక ఈ 'ఆమ్ ఆద్మీ పార్టీ' సగటు మనిషికి తియ్యని పసందైన మామిడి పండ్లనందించగలదో లేదో ముందు ముందు ప్రజలకు తప్పక తెలియవస్తుంది.

చెత్తను ఊడ్చే 'చీపురుకట్ట' ఇప్పుడు ఆమ్ ఆద్మీ ఆయుధమైందనీ, అది మనదేశ సామాజిక వ్యవస్థలో పేరుకున్న కుళ్లునంతా ఊడ్చి పారేస్తుందనీ, సమూలంగా ప్రక్షాళన చేస్తుందనీ, ఈ దేశ యువతకు, సగటు మనిషికి సరికొత్త వెలుగునిస్తుందనీ ఉవ్వెత్తున ప్రచారం జరుగుతోంది. దీనంతటికీ కారణం ఢిల్లీ విధానసభ ఎన్నికల్లో సాంప్రదాయ పార్లమెంటరీ పార్టీల దిగ్గజాలనూ, హేమాహేమీలనూ మట్టి కరిపించి, ఈ చీపురు గుర్తు పార్టీ 28 సీట్లు గెలుచు కోవడమే! అంతేగాక, కాంగ్రెస్ తుడిచి పెట్టుకుపోయి, భాజపా 31 (1) సీట్లు గెలిచి కూడా స్పష్టమైన సంఖ్యా బలం లేక, ప్రభుత్వం ఏర్పాటు చేయలేని దుస్థితిలో దిగబడిపోయింది.

కాంగ్రెస్ పతనావస్థ నుండి ఆత్మరక్షణ కోసం 'చీపురు మార్క్' పార్టీకి లిఖిత పూర్వక మద్దతు ప్రకటించింది. తద్వారా 'ఆప్' నాయకుడైన 'అరవింద్ కేజ్రీవాల్' ఢిల్లీ ముఖ్యమంత్రిగా ప్రమాణ స్వీకారం చేయగలిగాడు. అలా, చీపురు చేతికి ఢిల్లీ అధికార పగ్గాలు చేజిక్కాయి. ఇంకొద్ది నెలల్లో రాబోయే పార్లమెంట్ ఎన్నికల్లో ఇటు కుడిచేత్తో భాజపాను, అటు ఎడమచేత్తో కాంగ్రెస్‌ను చిత్తుగా ఓడించ వచ్చనే ధీమా ఇప్పుడు 'ఆప్' కు కలిగినట్లుంది. అందుకే ఆ పార్టీ నేల పదును ఆరక ముందే విత్తులు నాటదల్చుకుంది.

ఇనుము ఎర్రగా ఉండగానే సుత్తి దెబ్బ పడాలనే ఉద్దేశ్యంతో పార్లమెంట్ ఎన్నికల రణరంగం లోనికి ఎగిరి దూకదల్చుకుంది. 'ఆప్' ఢిల్లీ ప్రాంతీయ పాలనా ఫలాల రుచి ఏమిటో ఇంకా అక్కడి ప్రజలకు తెలియకుండానే, అందివస్తున్న పార్లమెంట్ ఎన్నికల్లో పాల్గొనే అవకాశాన్ని వదలకూడదని 'ఆమ్ ఆద్మీ పార్టీ' శరవేగంతో వ్యూహ రచన చేస్తోంది. దేశ పార్లమెంట్ లాటరీ రాజకీయ నాటక చదరంగంలో ప్రవేశించిన 'ఆప్-ఉడత' పాత రాజకీయ మత్తేభాలకు దడ పుట్టిస్తున్న మాట కొట్టి పారేయలేం. అలా, ఢిల్లీ ప్రజలకు పెట్టిన 'ఆప్ టోపీ' దేశ ప్రజలందరి నెత్తికీ పెట్టాలని 'ఆప్' సాఫ్ట్‌వేర్-ఎన్‌జిఒ కార్పొరేట్ నాయకత్వం ఉరకలు వేస్తోంది.

ఒక అన్నా హజారే, ఒక కేజ్రీవాల్, ఒక యోగేంద్ర యాదవ్, ఒక ప్రశాంత్‌భూషణ్, ఇంకా కొంతమంది కార్పొరేట్ మేధావులు, ఎన్‌జిఒ నాయకులు, వాటి సిఇఒ వగైరా బృందాలు 'జనలోక్‌పాల్' బిల్లు తేవాలనే ఉద్యమానికి తెర వెనుక నుండి పరోక్ష మద్దతును, డబ్బు సంచులను అందించిన కార్పొరేట్ వ్యాపార వర్గాల, నయా ఉదారవాద చదువరుల, కార్పొరేట్ మేనేజర్ల, నయా ధనవంతుల కూటమి ఇతర ప్రత్యామ్నాయాలకు అందుబాటులో లేదని చెప్పాలి. అయితే, ఈ చీపురు కట్ట రాజకీయ వ్యూహం.. పైకి కనబడుతున్న దానికన్నా చాలా లోతైనది. దీనిని తెర వెనుక నుండి నడిపించే చాణక్యులు ఇప్పుడు ఒక్కొక్కరు బయటకు వచ్చి ఆమ్ ఆద్మీ బస్ ఎక్కుతున్నారు. బస్ ఎక్కుతున్న వీరంతా మేం ఆమ్ ఆద్మీలమే నంటున్నారు.

చీపురు కట్టకు రెండు కొసలు. ఒక కొస కట్టగా అరచేతికి అమిరేది, ఇంకొక కొస చీపురు పుల్లలుగ విచ్చుకుని ఊడ్చేది. చీపురు పుల్లలు ఆమ్ ఆద్మీలే అని వేరే చెప్పక్కర్లేదు. కాని ఊడ్చే చెయ్యి, చీపురు కట్టను ఆడించే చెయ్యి ఎవరిది అన్నది అసలు ప్రశ్న.

ప్రజలు తమకు ప్రభుత్వం ఏర్పాటు చేసేందుకు కావలసిన సీట్లు ఇవ్వలేదని, అందుచేత తాము ప్రతిపక్షంలోనే కూర్చుంటామని ముందుగా 'ఆప్' ప్రకటించింది. అలాకాక ప్రభుత్వాన్ని ఏర్పాటు చేయాలని, కాంగ్రెస్ స్నేహ హస్తం అందుకోవాలని 'ఆప్' ఏర్పాటు చేసిన 'ప్రజా దర్బార్', లక్షలాదిగా ప్రజలు పంపిన ఎస్ఎంఎస్‌లు తమను పునరాలోచింప చేశాయని, ప్రజల తీర్పును, సలహాను శిరసావహించి తాము ప్రభుత్వ ఏర్పాటుకు పూనుకున్నామని ఆప్ పార్టీ మెలికపడ్డ కాలును కూడదీసుకుంది.

ఢిల్లీ శాసనసభలో ఆమ్ ఆద్మీ పార్టీ బలనిరూపణ క్రమంలో అరవింద్ కేజ్రీవాల్, ఆమ్ ఆద్మీ అంటే ఎవరు అనే వివరణ ఇచ్చాడు. గుడిసెలో నివసించే మనిషైనా, వైభవోపేతమైన పురప్రాంతాల్లో నివసించే వారైనా స్వచ్ఛమైన, నీతివంతమైన పాలనను కోరుకునే వారెవరైనా, వారంతా ఆమ్ ఆద్మీలే, అంటే సగటు మనుషులే' అని.

శబాష్! ఇదీ అసలు సంగతి. సిసలైన కేజ్రీవాల్ ఎన్‌జిఒ మార్కు

ఆమ్ ఆద్మీ నీతి. సానబట్టి మెరుగుపెట్టిన సామ్రాజ్యవాద ప్రపంచీకరణ బూర్జువా రీతి. కొత్త కార్పొరేట్ కెమిస్ట్రీ, మిమిక్రీ.

ఇంకో విషయం. ఆమ్ ఆద్మీ పార్టీ వెనుక ఉన్న భగవత్ అనుగ్రహాన్ని కేజ్రీవాల్ చాలా వివరంగా ఢిల్లీ శాసన సభలోనూ, అంతకు ముందు రామ్ లీలా మైదానంలోనూ వర్ణించాడు. అప్పుడే రెక్కలు విచ్చుకున్న ఆమ్ ఆద్మీ పార్టీ దేశ రాజధానిలో అధికార పీఠాన్ని అధిష్టించడం అనేది భగవంతుడి మహిమ. పరమేశ్వరుడు, పితా పరమాత్మ, ఈశ్వర్, అల్లా, వాహే గురు, ఏసు ప్రభువు.. అందరి మహిమ ఇది. అవినీతితో మురికి కూపంలా తయారైన ఈ వ్యవస్థలో ఆమ్ ఆద్మీ పార్టీ పెను విప్లవాన్నే సృష్టించింది. అవినీతి సర్కార్‌ను గద్దెదించి ప్రజా పరిపాలన వస్తుందని రెండేళ్ల క్రితం ఎవరూ కనీసం ఊహించలేక పోయారు. కచ్చితంగా ఇది భగవంతుడి చమత్కారమే. అందుకే సర్వ శక్తిమంతుడైన ఆయనకు మనసారా కృతజ్ఞతలు సమర్పించుకుంటున్నా. అధికార దర్పానికి, అహంకారానికి, అవినీతికి అతీతమైన పరిపాలన అందిస్తా'.

క్లుప్తంగా ఆమ్ ఆద్మీ పార్టీ ఆలోచనా విధానం ఇది ఒకటి: భగవదేచ్ఛ ఉండబట్టే అది కూడా, అన్ని మతాల భగవంతుళ్ల దయ ఉండబట్టే ఆప్ అతి తక్కువ కాలంలోనే దేశ రాజకీయాలలో ప్రభంజనం సృష్టించ గల్గింది. ఇంకో రకంగా చెప్పాలంటే, అన్ని మతాల ఆరాధ్య దైవాలు కలసి ఆమ్ ఆద్మీ పార్టీని దేశాన్ని అవినీతి పాలన నుండి విముక్తి చేసే దూతగా నిర్ణయించి పంపించినట్టుగా అది ప్రకటించు కుంది. అలా ప్రకటించడం ద్వారా, అది, అన్ని మతాల ప్రజల ఓట్లను సంపాదించేందుకు ఒక మార్గం వేసుకుంది.

రెండు: అసమ సమాజంలోని దుర్భర వ్యత్యాసాలను పక్కకునెట్టి, అసమానతల, దోపిడీ పీడనల పునాదిపై ఏర్పడి ఉన్న సామాజిక చట్రాన్ని యథాతథంగా ఉంచి, ఆ చట్రంపై నిర్మితమై ఉన్న ఉపరితల కట్టడానికి సున్నం వేసి, ఇదిగో చూడండి, ఈ సమాజాన్ని మేము ఎంత సుందరంగా తీర్చిదిద్దామోనని చెప్పి ప్రజలను నమ్మించదల్చుకుంది. అందుకనే అది గుడిసె వాసులనూ, కడుపులో పట్టనంత తిండి, జేబులో పట్టని ధనార్జన, సకల సౌకర్యాలు కల్గి సుందర భవంతుల్లో నివసించే నగర జీవులనూ ఒకే గాటన కడుతోంది. అందరికీ స్వచ్ఛమైన పాలన అంటోంది. పూట గడవడమే కష్టంగా ఉన్న బడుగు జీవులనూ, ప్రతినెలా లక్షల్లో సంపాయించే పౌరులను ఒకే పేరుతో పిలవ దల్చుకున్నది. పులులనూ, మేకలనూ కలిపి గిలకరించి ఆమ్ ఆద్మీ తీర్థం తయారు చేసింది. దాని దృష్టిలో కార్పొరేట్ సిఇఒలు, ఎన్‌జిఒల అధిపతులూ, బడా బడా బ్యురాక్రాట్లు ఆమ్ ఆద్మీలే, సగటు మనుషులే! అంటే అది తన ఎన్‌జిఒ తీర్థాన్ని నేలబారు ప్రజలకు పంచి, ఓం నమఃశివాయ నమహా అని శఠగోపమ్ పెట్టడమే కదా!

మూడు: ప్రజల భాగస్వామ్యం పేరున చీపురుకట్ట జిమ్మిక్కులతో, జనలోక్‌పాల్ మంత్ర జపంతో ఓట్లను కొల్లగొట్టి, రాజ్యాధికారాన్ని ఎన్‌జిఒ కూటమికి ధఖలుపర్చడమే 'ఆప్' ప్రణాళిక. దేశంలో మండే నిత్యావసర వస్తువుల, ఇంధన, విద్యుత్, నీటి ధరలతో ఒకపక్క మరో పక్క లంచాల మయంగా మారిపోయిన ప్రభుత్వ సేవలు జాతి సంపదను కొల్లగొట్టే అంతులేని అవినీతి కుంభకోణాలు. వీటితో విసుగెత్తి వేసారి పోయిన అసలు సిసలు సగటు మనుషులు వ్యవస్థపై తిరుగుబాటు చేసే సూచనలు ప్రబలుతున్న సందర్భం. ప్రపంచ ప్రజలంతా పెట్టుబడి దుర్మార్గానికి, దాష్టీకానికి, ఊచకోతల యుద్ధానికి వ్యతిరేకంగా తిరుగుబాటు చేస్తున్న తరుణమిది. తత్కారణంగా ప్రజా ఉద్యమాలు ఉవ్వెత్తున ఎగిసిపడే కెరటాలై వ్యవస్థను ముంచెత్తకముందే నివారించే కొత్త పాలక ముఖాలు, శక్తులు అంతర్జాతీయ పెట్టుబడికి భారత దేశీయ దళారులకు ఇప్పుడు అత్యంత అవశ్యకం.

కొత్త తరహా రాజ్యపాలనా ఏజెంట్ యాజమాన్యం ఇప్పటి అవసరం. ఈ కొత్త తరహా యాజమాన్యం ఎంతో స్వచ్ఛమైనదిగా ప్రజలకు కనపడాలి, వారిని నమ్మించ గలగాలి. కొత్త రూపంలో ప్రజలను సమ్మోహితులను చేయగల్గాలి. కాంగ్రెస్ నాయకత్వానికి అటువంటి సమ్మోహన శక్తి మృగ్యమైపోయింది. మోడీకి అటువంటి శక్తిని ఆపాదించి జాతీయ ఆవరణంలోనికి నెట్టినా, అతను ప్రధానంగా హిందూత్వ ఏజెంట్ అని ముద్రపడి ఉండడం వల్ల అతనికి కొన్ని పరిమితులు ఉండి పోయాయి. ముఖ్యంగా దేశంలోని ముస్లిం, క్రిస్టియన్ మొదలైన అల్పసంఖ్యాక వర్గాల ప్రజలు ఈ శక్తికి ఓట్లు వెయ్యరు.

ఇటు కాంగ్రెస్, అటు బిజెపి సామ్రాజ్యవాద ఊడిగంలో ఆరితేరినప్పటికీ వారి మొఖాలు అవినీతితో, మత దురహంకారంతో మకిలి కొట్టుకు పోవడం మూలంగా ఇక వారి మొఖాలకు కొత్త తొడుగులు తొడిగినా ప్రజలందరూ నమ్మే అవకాశం లేదు. ఇంత పెద్ద మార్కెట్‌ను ససేమిరా అంతర్జాతీయ సామ్రాజ్యవాద పెట్టుబడి వదులుకునే ప్రశ్నే తలెత్తదు. నయానో, భయానో, అదిరించో, బెదిరించో, వంచించో, కాదంటే ఊచకోత కోసో ఆ శక్తులు ఇక్కడ తమ ఏజెంట్ యాజమాన్యాన్ని కొనసాగించాలి. అందుకే 'ఆప్' అనగా ఆమ్ ఆద్మీ పార్టీని వెలుగులోకి తెచ్చి అతివేగంగా దూసుకు వెళ్లే వ్యూహరచన జరుగుతోంది. ఆ వ్యూహంలో భాగంగానే విద్యా, సమాచార, సాఫ్ట్‌వేర్ రంగాల, బ్యాంకింగ్, ఎన్‌జిఒ, మీడియా, సినీమా, కళా రంగాల నుండి కొత్త మొఖాలు ముందుకొస్తున్నాయి. వీరంతా ఆప్ మార్క్ గాంధీ టోపీలు ధరిస్తున్నారు. సగటు మనిషి ముక్తి ప్రదాతలం మేమేనని సమాజాన్ని నమ్మించే పనిలో ఉన్నారు.

ఇది కేవలం లేబుళ్ల మార్పు, సీసాల మార్పు, మేకప్‌ల మార్పు. ఇదో సరికొత్త మోసకారి కూర్పు. దోపిడీ పాలక వర్గాల సరికొత్త రూపు. ఆమ్ ఆద్మీ పార్టీ అంతిమంగా చేయబోయేది, అందించబోయేది కార్పొరేట్ సంస్థలకు మణిమయ స్వర్ణాభరణాలు. ఆమ్ ఆద్మీలకు ఎంగిలి మెతుకులే. 'కార్పోరేట్లకు గాంధీ టోపీ, సగటు మనిషికి కుచ్చు టోపీ – ఈ ఆమ్ ఆద్మీ పార్టీ'. ఐతే, మీరడగవచ్చు.. మార్పుకోసం పుట్టుకొచ్చిన అవినీతి ప్రక్షాళనా ఎజెండాతో నూతనోత్సాహంతో పనిచేస్తానని వాగ్దానం చేస్తున్న 'ఆప్'కు ఓటు వేయక అవినీతి మురికికూపాలుగా మారిన పాత పార్టీలకే ఓటు వేయాల్నా? అని..

దానికి నా సమాధానం, కచ్చితంగా ఎవరికీ మీ ఓటు వెయ్యవద్దనే.. దేశ అత్యున్నత న్యాయస్థానం కలుగజేసిన 'ఎవరూ కాదు' అనే మీటను నొక్కే సదవకాశాన్ని సద్వినియోగ పరచండి అని అదీ మీరు తప్పక ఓటు వెయ్యాలనే కోరికతో ఉంటే గనుక.

అలా చేస్తే ఈ వ్యవస్థను తిరస్కరించడం కదా? అని మీరడగొచ్చు.. అవును, కచ్చితంగా ఈ వ్యవస్థ పూర్తిగా తిరస్కరించవలసిన, వదిలించు

కోవాల్సిన, విసరి కొట్టాల్సిన వ్యవస్థే కదా మరి! అన్నది నా సమాధానం. ప్రతి సంక్షోభం నుండి బయటపడడానికి పాలక వర్గాలు ఓ కొత్త వేషం ధరిస్తాయి..

ఈ దేశ ఎన్నికల రాజకీయాల్లో ఫ్యూడల్ సాంప్రదాయాలు స్వాతంత్ర పోరాటకాలం నుండీ కొనసాగుతూ వస్తున్నాయి. పాత రాజ్యాలు, జమీందారీలు పేరుకు రద్దు చేసినప్పటికీ రాజుల, జమీందార్ల వారసులు దళారీ వ్యాపారుల, పారిశ్రామికవేత్తల, కాంట్రాక్టర్ల, బొగ్గు - ఖనిజ - సారా మాఫియాల వారసులు, స్వాతంత్ర పోరాట కాలంలో నాయకత్వం వహించిన కుటుంబాల వారసులు, విశ్రాంత ఐఎఎస్, ఐపిఎస్, మిలటరీ అధికారులూ, ప్రాంతీయ గుండాలు, వారి వారసులు.. ఇటువంటి వారే చట్ట సభలకు ఎన్నికై పాలక వ్యవస్థలో పాతుకు పోయారు. స్వాతంత్ర్యానంతరం, క్రమంగా ఎన్నికలంటేనే ఓ మాఫియా వ్యవహారంగా మారిపోయిన సందర్భంలో, ఎన్నికల వ్యవస్థపై ప్రజలకు భ్రమలు తొలిగిపోతున్న తొలి దశలో ఈ తుక్కు వ్యవస్థను కాపాడడానికి మొదట కంకణం కట్టుకున్నవీ, నడుం కట్టినవీ రివిజనిస్ట్ కమ్యూనిస్ట్ పార్టీలు, ఆ వెనుక గాంధేయవాది జయప్రకాశ్ నారాయణ్.

అప్పుడు కూడా అవినీతి, ఆశ్రిత పక్షపాతం పైన పోరాడి నీతిమయ పాలనను గాంధేయ మార్గంలో సాధించి, బీటలు వారి కూలిపోయే ప్రమాదమున్న ఎన్నికల వ్యవస్థా సౌధాన్ని జెపి తెచ్చిన నకిలీ విప్లవం కాపాడింది. కొత్తగాలి వీచినట్లే కనిపించింది. దోపిడీ పునాదిని కదప కుండా వ్యవస్థా సౌధానికి రిపేర్లు చేయడమే, ప్రజలకు ఈ దుర్మార్గపు వ్యవస్థపై కొత్త ఆశలు చిగురింప జేయడమే జెపి జరిపిన కథ అంతా.. అందులో నుండి పుట్టుకొచ్చినవే ఇప్పుడు బీహార్, ఉత్తరప్రదేశ్ వగైరా రాష్ట్రాలలోని అధికార దళ్ లు, వారసత్వ దళ్ లూ..

దళిత రాజ్యాధికార నినాదంతో తెరపైకొచ్చిన, దేశ పార్లమెంటరీ రాజకీయాలలో ఓ చిరు తుఫాన్ను తెచ్చిన కాన్షీరాం, మాయావతుల ఉద్యమం జెపి ఉద్యమం వెంబడి వచ్చినదే. మనం నిశితంగా గమనిస్తే ఇటువంటి ప్రతి దశలోనూ కొత్త ముఖాలు తెరపైకి వచ్చి, కొత్త నినాదాలు, కొత్త బూజు దులుపుడు కార్యక్రమాల పట్టికలు తయారౌతాయి, పైపై ప్రజాభ్యుదయ కార్యక్రమాలు ఏవో కొన్ని జరుగుతాయి.

తిరిగి కథ మామూలే.. ఇప్పుడు కూడా ఓ అన్నా హజారే, ఒక కేజ్రీవాల్, ఓ కిరణ్ బేడీ, ఒక యోగేంద్ర యాదవ్ , ఒక శిసోడియా వంటి ఎన్జిఒ అధిపతులు, బ్యాంకింగ్ ఫైనాన్స్ రంగ నిపుణులు, సమాచార రంగ నిపుణులు, కొత్త నయా ఉదారవాద ధనిక వర్గం ఆమ్ ఆద్మీ పార్టీగా తెరపైకి వచ్చింది.

ముందుగా ఛాందసవాద గాంధేయ అన్నా హజారేను వీరు వాడుకున్నారు. దీనికి ఒక రాజకీయ ప్రవేశ ఉద్యమం కావాలి. అది ఇప్పటి వ్యవస్థను నిలబెట్టి కొనసాగించేదిగా ఉండాలి. జనలోక్పాల్ అనే ఉద్యమాన్ని అలా తెరపైకి తీసుకొచ్చారు. పైన చెప్పిన ఆధునిక ధనికులు తెర వెనుక నుండి అన్ని అండదండలు అందించారు. వీరికి తెలుసు అన్నా హజారే వంటి ఛాందసున్ని ఎంతవరకూ వాడుకోవాలో, ఏ దశలో మూలకు విసిరేయాలో. ఈ కొంగొత్త వర్గం ఎజెండాకు ఇతను పెద్ద అడ్డంకి. అందుకే ఇతన్ని వదిలించుకుని ఆమ్ ఆద్మీ పార్టీని అతివేగంగా ప్రకటించుకుంది. ఢిల్లీ ప్రాంతీయ అధికారానికి సరికొత్త వ్యూహరచన చేసింది. అలానే గెలిచింది.

పాత రాజకీయ ఎద్దు-మొద్దులకు దిమ్మ తిరిగిపోయింది. ఈ పరిణామాన్ని ఈ మొద్దులు అసలు ఊహించనే లేదు. బొట్టు మార్కు ఫ్యూడల్ ఊడల భాజపా గ్యారంటీగా ఢిల్లీ ప్రాంతీయ అధికారం చేజిక్కే అవకాశాన్ని తద్వారా ఢిల్లీ పీఠాన్ని తిరిగి అధిరోహించవచ్చనే కలలను ఆమ్ ఆద్మీ పార్టీ వమ్ము చేసింది. అందుకే ఇప్పుడు దానికి కేజ్రీవాల్ పై పీకలదాకా కసి ఉంది. ఆమ్ ఆద్మీ పార్టీ హవా ఇలానే కొనసాగే సూచనలు బలపడితే, ఈ దేశంలో మోహన్ దాస్ కరంచంద్ గాంధీకి, అమెరికాలో జాన్ ఎఫ్ కెన్నెడీకి సంభవించిన ముప్పు ఇప్పుడు కేజ్రీవాల్ కు కూడా పొంచి ఉందేమోనని అన్పించడం అసహజమేమీ కాదు.

ఇటువంటి సూడో విప్లవాలను నడిపే శక్తుల తెలివితేటలు, ఆలోచనా ఆయుధాలు ఓట్ల వ్యవస్థ పాత కాపులకే కాక వ్యవస్థను వ్యతిరేకిస్తూ ఉద్యమాలు నడుపుతున్నామనుకుంటున్న పాత మూసపోత కాపులకు కూడా అంతుపట్టనంత లోతుగా, పదునుగా ఉంటాయి.

అంతర్జాతీయ పెట్టుబడి భారతదేశంలో శరవేగంగా, ఏ అడ్డు అదుపు లేకుండా దూసుకు వెళ్లాలంటే పాతకాలపు పాత కాపుల మొద్దుబారిన ముఖాలు, ఆయుధాలు ఇప్పుడు ఆటంకంగా ఉన్నాయి. అందుకే అది కొత్త శక్తులను కొత్త రాజకీయ యాజమాన్యాన్ని తయారు చేసుకుంటోంది – అలా భారత దేశ రాజకీయ ఆరంగేట్రం చేసిందే ఆమ్ ఆద్మీ పార్టీ.

ఇప్పటివరకూ తెరవెనుక నుండి 'ఆప్'ను నడిపిస్తున్న శక్తులు ఇప్పుడు తెరపైకి వచ్చి తమ ముఖాలను ప్రదర్శిస్తున్నాయి. ముందు ముందు చీపురును ఆడించేది వీరే. చీపురు పుల్లలకు మిగిలేది ఊడ్చుడే!

ఒక వేళ ఈ కొంగొత్త రాజకీయ నాటకంలో కొంత మంది మధ్య తరగతి ప్రజలకు గిల్టు నగలు దక్కవచ్చు, కార్పొరేట్లకు మట్టుకు అసలు సిసలు మణిమయ స్వర్ణాభరణాలే దక్కుతాయి.

ఈ విషయంపై 'లెనిన్' మాటలను ఇక్కడ ఉటంకించి నా వ్యాసం ముగిస్తాను. రాజకీయాల వంచనకు, ఆత్మవంచనకు ప్రజలు అమాయకంగా బలవుతూ ఉండడం ఎప్పటి నుండో కొనసాగుతూ వస్తోంది, ఇంకా అది కొనసాగుతూనే ఉంటుంది. ఎంతవరకూ అంటే, ఈ రాజకీయాలు ప్రవచించే నీతి నియమాల మత, రాజకీయ, సామాజిక ప్రవచనాల, ప్రకటనల, వాగ్దానాల వెనుక ఏ వర్గాల స్వప్రయోజనాలు ఇమిడి ఉన్నాయో ప్రజలు విశ్లేషించుకునే అనుభవం గడించే వరకూ.

మరైతే, ఆ వర్గాల ఆధిపత్యాన్ని తుత్తునియలు చేయడానికి ఒకే ఒక మార్గముంది.. అదేమంటే, మనచుట్టూ ఉన్న సమాజంలో, తమ సామాజిక పొందికలో ప్రత్యర్థి స్థాయిలో ఉన్న ప్రజా శక్తులన్నిటినీ చైతన్యపరిచి, సమీకరించి, గొప్ప పోరాట శక్తిగా నిర్మించి పోరాటానికి సంసిద్ధ పరచడం ద్వారానే అది సాధ్య పడుతుంది.. మార్క్స్ పాదార్థిక తాత్విక చింతన ఒక్కటే శ్రామికులకు విముక్తి మార్గాన్ని, ఇంతకాలం అణచివేయబడ్డ వర్గాలకు 'ఆధ్యాత్మిక బానిసత్వం' ((స్పిరిచువల్ స్లేవరీ) నుండి బయటపడే మార్గాన్ని చూపించింది.

(లెనిన్ –1913 'ది త్రీ సోర్సెస్ అండ్ త్రీ కాంపొనెంట్ పార్ట్స్ అఫ్ మార్క్సిజం' నుండి)

*(రచయిత శ్రామిక నేస్తం పత్రిక సంపాదకులు)* వీ

# ముజఫర్‌నగర్ నరమేధం గుజరాత్ కొనసాగింపే

*మత విశ్వాసాలను, సాంప్రదాయాలను, వెనుకబాటుతనాన్ని ఆసరా చేసుకొని పాలకులు ప్రజల మధ్య విద్వేషాలను సృష్టిస్తూ విధ్వంసానికి పాల్పడుతున్నారనీ , ఈ నరమేధాన్ని ప్రగతిశీలురు అడ్డుకోవాలనీ అంటున్నారు* **పి.వి. రమణ**

ఉత్తరప్రదేశ్‌లోని ముజఫర్‌నగర్ జిల్లాలో పెద్ద గ్రామం కవాల్. ఇక్కడ జాట్ కులానికి చెందిన భూస్వామ్య కుటుంబాలు ఉత్తర భాగాన ఉంటే, దక్షిణ భాగాన ధనిక ముస్లిం కుటుంబాలు ఉంటాయి. ప్రధానంగా ఈ ప్రాంతంలో చెరకు పండిస్తారు. ఈ పొలాల్లో వ్యవసాయ కూలీలుగా పేద ముస్లింలు, దళితులు పనిచేస్తుంటారు. కొంత మంది సయానీలు, ధనిక ముస్లింలు జిల్లాలో వ్యాపారాలు సాగిస్తున్నారు. హిందూ, ముస్లిం ఐక్యతకు నిదర్శనంగా 1947లో దేశ విభజన జరిగినప్పటి నుంచి 1992లో బాబ్రీ మసీద్ విధ్వంసం వరకూ ఇక్కడ ఎటువంటి అల్లర్లూ జరగలేదనే పేరు ఉంది. 2011 జనాభా లెక్కల ప్రకారం ముజఫర్ నగర్‌తో పాటు పక్కనున్న జిల్లాలలో దాదాపు 40 శాతం ముస్లింలే ఉన్నారు.

మల్లికాపురానికి చెందిన రితు అనే జాట్ అమ్మాయి కవాల్ గుండా రోజూ కాలేజీకి వెళుతుండగా షానవాజ్ అనే ముస్లిం కుర్రాడు ఏడిపిస్తున్నాడని, ఆమె ఇద్దరు అన్నదమ్ములు గౌరవ్, సచిన్‌లు, ఆ ముస్లిం కుర్రాడిని 2013 ఆగస్టు 27న మధ్యాహ్నం 1 గంటకు తీవ్రంగా కొట్టడంతో అతను చనిపోయాడు. దానిపై ఆగ్రహించిన ఆ ప్రాంత ముస్లింలు ఆ ఇద్దరు అన్నదమ్ములను కొట్టడంతో వారు చనిపోయారు. ఆ ఇద్దరి అంత్యక్రియలు పూర్తి చేసిన వెంటనే జాట్‌లు కవాల్‌లో ముస్లిం కాలనీలలోకి ట్రాక్టర్ల మీద, మోటారు సైకిళ్ల మీద దాడి చేసి ఇళ్లను, ఇళ్లల్లో వస్తువులను ధ్వంసం చేశారు. ఆ చుట్టుపక్కల ముస్లిం షాపులన్నింటినీ, ఆ ప్రాంత మసీదును కూడా ధ్వంసం చేశారు. వారి చేతుల్లో కొడవళ్లూ, స్వంత తయారీ పిస్తోళ్లూ ఉన్నాయి. 'పాకిస్థాన్ కన్నా పొండి లేదా స్మశానానికైనా పొండి', 'హిందువుల ఐక్యత వర్ధిల్లాలి', 'ఒక ప్రాణానికి వంద ప్రాణాలు బలి తీసుకుంటాం' అని నినాదాలిస్తూ దాడులు చేశారని ఒక బాధితుడు చెప్పాడు. మా వాళ్లు జాట్ కుర్రాళ్లను చంపడం తప్పే. తప్పు చేసిన వారిని శిక్షించాలి గాని, ఈ విధంగా మొత్తంగా మాపై దాడి చేయడం ఏం న్యాయం? మేం భయంతో ఎక్కడ బతకాలనే పరిస్థితి ఏర్పడిందని కూడా వాపోయాడు.

ఆగస్టు 29న ఒక వీడియోని విరివిగా ప్రచారం చేశారు. దానిలో ముస్లింల గుంపు ఇద్దరిని కొట్టి చంపుతున్నట్లుగా రికార్డయి ఉంది. ఇది చనిపోయిన జాట్ అన్నదమ్ముల హత్యకు సంబంధించిన వీడియోగా ప్రచారం చేశారు. కాని నిజానికి అది 2 సంవత్సరాల క్రితం పాకిస్థాన్‌లో జరిగిన సంఘటనగా 'యు ట్యూబ్'లో ఉండడాన్ని పోలీసులే గుర్తించారు. ఆగస్టు 30న ముస్లిం నాయకులు ఏర్పాటు చేసిన సమావేశంలో కాంగ్రెస్ నాయకుడు సైదుజ్జమన్, సమాజ్‌వాదీ పార్టీ నాయకులు రషీద్ సిద్ధిక్‌లతో పాటు అనేక మంది రెచ్చగొట్టే ప్రసంగాలు చేశారు. ముస్లింల దాడిని ఖండిస్తూ జాతి గౌరవాన్ని, స్త్రీల గౌరవాన్ని రక్షించుకోవడానికి సెప్టెంబర్ 7న జాట్ నాయకులు మహా పంచాయితీ ఏర్పాటు చేశారు. నిషేధాజ్ఞలు అమలులో ఉన్నా జిల్లా యంత్రాంగం సమావేశానికి అనుమతి ఇచ్చింది. ఢిల్లీ, హర్యానా వంటి దూర ప్రాంతాల నుండి కూడా హాజరైన ఈ మహా పంచాయితీలో దాదాపు 1 లక్షా 50 వేల మంది పాల్గొన్నారని అంచనా. ఈ సమావేశంలో భారతీయ జనతా పార్టీకి చెందిన నాయకులు హుకుమ్‌సింగ్, సంగీత్‌సోమ్, సురేష్ రాణాలు, భారతీయ కిసాన్ యూనియన్‌కు చెందిన నాయకులు నరేష్, రాకేష్ తికాయత్‌లు, కాంగ్రెస్ నాయకులు హరేంద్రమాలిక్‌లు హాజరయ్యారు. ఈ సమావేశంలో మాట్లాడినవారు రెచ్చగొడుతూ తమ స్త్రీల గౌరవాన్ని రక్షించుకోడానికి సిద్ధపడాలని పిలుపునిచ్చారు. ఈ సమావేశానికి 'కూతుర్లు, కోడళ్ల రక్షణా సమావేశం'గా పేరు పెట్టారు. సమావేశం నుండి తిరిగి వస్తున్న జాట్‌లపై కొందరు, ముస్లిం యువకులు దాడులు చేశారు. కొంతమంది జాట్‌లు పరిగెడుతూ జారీ కెనాల్‌లో పడి చనిపోయారు. కొట్టి పడేశారని కూడా కొందరు అంటున్నారు. మహా పంచాయితీ మరునాడు నుండి అంటే సెప్టెంబర్ 8 నుండి ముస్లింలపై పెద్దఎత్తున దాడులు ప్రారంభ మయ్యాయి. ఆ గ్రామ ప్రజలు కొందరు, గొడవ అమ్మాయిని అల్లరి పెట్టడం వల్ల కాదని, మోటారు సైకిళ్ల గుద్దుకోవడం వల్ల జరిగిందని అన్నారు. జాట్ అమ్మాయికి, ముస్లిం కుర్రాడికి మధ్య ప్రేమ వ్యవహారం నడుస్తుందని దాన్ని ఆపడానికే ఈ గొడవలు జరిగాయని ఆ గ్రామంలోని మరి కొంతమంది దళితులు అన్నారు.

**రెచ్చగొట్టే ప్రచారం**

ముస్లింలలో అందమైన కుర్రాళ్లను ఎంపిక చేసి వారి ద్వారా హిందూ అమ్మాయిలను వలలో వేసుకుంటున్నారని పెద్ద ఎత్తున ప్రచారం జరిగింది. వారికి మదర్సాలలో ట్రైనింగ్ ఇస్తున్నారు. వారికి మోటారు సైకిళ్లు, మొబైల్ ఫోన్‌లు ఇచ్చి పంపిస్తున్నారు. ఈ వ్యవహారాన్ని వ్యతిరేకించిన హిందూ స్త్రీలను అల్లరి పెట్టడం, అత్యాచారం చేయడం చేస్తున్నారు. మొబైల్‌ఫోన్ షాపులన్నీ ముస్లింలే నడుపుతున్నారు' అంటూ ప్రచారం జరిగింది. గత సంవత్సరంలో 'కాప్' పంచాయితీలో స్త్రీలు మొబైల్ ఫోన్‌లు వాడడాన్ని నిషేధించారు. ఆ తీర్మానాన్నే మహా పంచాయితీలో కూడా బలపరిచారు.

'ముస్లింలు 'లవ్ జిహాద్' పేరుతో హిందూ స్త్రీలను అల్లరి చేస్తున్నారు. 27వ తేదీ కిసాన్ ఇంటర్ కాలేజి అమ్మాయిని ఇదే విధంగా అల్లరి చేశారు. దీనికి కారణం కామంతో కూడిన జిహాద్ కార్యక్రమమే. ఇదే 'కూతుర్లు, కోడళ్లను రక్షించండి' (బహు, బేటి బచావో) మహా

పంచాయితీకి కారణమయింది. హిందూ స్త్రీలను అవమానించడాన్ని ఇక ఏ మాత్రం సహించలేం. సమాజంలో, దాన్ని సరిచేయడానికే ఈ కొత్త ఉద్యమం ప్రారంభమైంది' అని విశ్వహిందూ పరిషత్ నాయకుడు అశోక్ సింఘాల్ అన్నాడు.

విశ్వహిందూపరిషత్ మీరట్ డివిజన్ జాయింట్ సెక్రటరీ, చంద్రమోహన్‌శర్మ 'మొదట అందమైన ముస్లిం యువకులను ఎంపిక చేసి వారికి సోను, రాజు లాంటి పేర్లు పెడతారు. వారికి టీషర్టులు, మొబైల్ ఫోన్‌లు ఇస్తారు. స్కూళ్లు, కాలేజీల దగ్గర హిందూ అమ్మాయిలకు వల వేస్తారు. మొదట వాళ్లు వీరికి లొంగరు. కాని పదేపదే ప్రయత్నించడం వలన లొంగిపోతారు. ఇది ప్రేమతో లొంగదీయడం. దీన్నే 'లవ్ జిహాద్' అంటున్నాం. ఆగస్టు 27న హిందూ అమ్మాయిని ముస్లిం కుర్రాడు అల్లరి పెట్టాడు. దాన్ని చూసి పౌరుషం కలిగిన ఏ అన్న ఊరుకుంటాడు' అని అన్నాడు.

సెప్టెంబర్ మొదటి వారంలో ఆర్ఎస్ఎస్ ఒక ఈ మెయిల్‌ను విరివిగా ప్రచారం చేసింది. కొన్ని నిజాలు 'ముస్లిం పురుషులు / హిందూ స్త్రీలు' అన్న శీర్షికతో దేశంలో ఉన్న 73 మంది ప్రఖ్యాత వ్యక్తుల జాబితాను ఇచ్చారు. వారిలో పాత తరం ప్రఖ్యాత సినీ దర్శకులు కె. ఆసిఫ్‌తో పాటు దర్శకుడు ముజఫర్ ఆలీ, నటులు షారుఖ్ ఖాన్, అమీర్ ఖాన్‌లతో పాటు ప్రఖ్యాత హిందుస్థానీ సంగీత విద్వాంసులు ఉస్తాద్ ఆలీ అక్బర్ ఖాన్, ఉస్తాద్ విలాయత్ ఖాన్ లాంటి మహామహులను కూడా వదలలేదు. వీరందరూ కావాలనే హిందూ స్త్రీలను పెళ్లి చేసుకున్నారని, వారి పేర్లను కూడా ఇచ్చారు. సంఘపరివార్ కార్యకర్తలు దేశంలో గ్రామ గ్రామాన తిరిగి గ్రామ పెద్దలతో సమావేశాలు ఏర్పాటు చేసి, భారతదేశాన్ని మొత్తం ముస్లిం దేశంగా మార్చడానికి కుట్ర పన్నుతున్నారని అందులో భాగంగానే ఈ విధంగా హిందూ స్త్రీలను లోబరుచుకుంటున్నారని ప్రచారం చేస్తున్నారు. కర్ణాటకలో 2009లో సీనియర్ విశ్వహిందూపరిషత్ నాయకుడు ఎంబి పురానిక్ 'ఫ్రంట్‌లైన్' పత్రికకు ఇంటర్వ్యూ ఇస్తూ 'ముస్లిం కుర్రాళ్లు ఖాళీగా ఉంటే కాలేజీలు, మాల్స్ చుట్టూ తిరుగుతుంటారు. వీళ్లు ఎక్కువగా మొబైల్ ఫోన్ల షాపుల్లో పని చేస్తుంటారు. హిందూ స్త్రీలు తమ షాపులకు రీచార్జ్ కోసం వచ్చినప్పుడు వారి ఫోన్ నంబర్లు తీసుకొని ఫోన్‌లు చేస్తూ వారిని ముగ్గులోకి లాగుతారు. ఈ విధంగా 'లవ్ జిహాద్' కార్యక్రమాన్ని నిర్వహిస్తున్నారు' అని అన్నాడు. దీన్ని బట్టి 'లవ్ జిహాద్' ప్రచారం గత నాలుగు సంవత్సరాల నుండి నిరాటంకంగా సాగుతుందని సులువుగానే అర్థమవుతుంది. సంఘపరివార్ 'లవ్ జిహాద్' ప్రచారం కర్ణాటక లాంటి దక్షిణాది రాష్ట్రాలలో కన్నా ఉత్తరప్రదేశ్ లాంటి ఉత్తరాది రాష్ట్రాలలో చాలా ప్రభావం కలుగజేస్తుందనడానికి ముజఫర్‌నగర్ పెద్ద రుజువని విశ్లేషకులు అంటున్నారు.

**మారణ కాండ**

2013 ఆగస్టులో సొరాతు గ్రామంలో ఒక ముస్లిం కుర్రాడిని కొట్టి చంపారు. దానిపై దాడిచేసిన వారిని అరెస్టు చేయడంతో, ఆ సంఘటనను వాడుకొని బిజెపి నాయకులు సంజీవ్ బలియాన్, ఉమేష్ మాలిక్‌లు ప్రజల్ని తీవ్రంగా రెచ్చగొట్టారు. దాడులు ప్రారంభానికి వారం రోజుల ముందు సరస్వతీ గ్యాన్ మందిర్‌లో చదువుతున్న 13 సంవత్సరాల షమీమ్‌ను తోటి విద్యార్థులు 'మేం నిన్ను ముక్కలు ముక్కలుగా నరకబోతున్నాం' అని బెదిరిస్తే ఫాతిమా కొడుకుని స్కూలు నుండి తీసుకువచ్చేసింది. కుత్బా గ్రామం నుండి మాస్టర్ ఖుర్షీద్ ఆలి 'నేను సమాజ్‌వాదీ పార్టీకి ఓటు వేశాను. అయినా నన్నెవరూ రక్షించలేదు. నా కుటుంబంలో 8 మందిని కోల్పోయాను. వాళ్లందరూ నా కళ్ల ముందే చంపబడ్డారు' అన్నాడు.

సెప్టెంబర్ 8న ఉదయం 9 గంటలకు కుత్బా, కుత్బి, ఇతర గ్రామాలపై దాడులు జరిగాయి. 'లోకల్ బిజెపి నాయకుడు, గ్రామ ప్రధాన్, భార్యల నాయకత్వంలో 300 మంది కొడవళ్లు, కత్తులు, గొడ్డళ్లు, తుపాకులతో దాడి చేశారు. ఇంటికి వచ్చిన బంధువులను పంపడానికి బయటకు వచ్చిన ఇర్షాత్ మొట్టమొదటగా బలైపోయాడు. అతన్ని కత్తులతో పొడిచి, తుపాకితో కాల్చి చంపారు' అని అక్బర్ చెప్పారు.

'మా ఇంటిపై దాడిచేశారు. మా అమ్మ తప్పించుకుని పారిపోయింది. ఆమెను అక్కడే కాల్చి చంపారు. నా కళ్ల ముందే ఆమె ప్రాణం పోయింది. నేను ప్రాణ భయంతో రక్షించుకోడానికి పారిపోయాను' అన్నాడు మహమద్ హుస్సేన్. కుత్బాలో 9 మంది చనిపోయారు. ఇలాంటి దాడులే లిసార్, లాక్, పుగనా, ఇతర గ్రామాలపై కూడా జరిగాయి. 'గ్రామ ప్రధాన్ ఇంట్లో పోలీసులు టీ తాగుతూ చూస్తూ కూర్చున్నారు గాని మమ్మల్ని చంపబోతున్న వారి నుండి రక్షించడానికి ప్రయత్నించ లేదు. చివరకు సైన్యం వచ్చి రక్షించింది' అని అన్నాడు అక్బర్.

రుక్సానా 12వ తరగతి చదువుతుంది. 'నా కళ్లెదుటే మా అమ్మమ్మను చంపారు. మేం పొలంలో పనిచేసుకుంటున్నాం. మా ప్రాంత మసీదును కూలగొట్టారు. మేమంతా మా ఇంటిలోకి పారిపోయాం. గుంపులు గుంపులుగా దాడిచేశారు. మేం రక్షించుకోవడానికి వారిపై ఇటుకలు విసిరాం. ఇంతలో సైన్యం వచ్చి రక్షించింది' అని చెప్పింది.

సెప్టెంబర్ 9 తెల్లవారు జామున 300 మందికి పైగా కత్తులు, లాఠీలు, తుపాకులతో కుత్బి గ్రామం నుండి పారిపోతున్న ముస్లిం ప్రజలపై దాడి చేశారు. 'మేం తర తరాలుగా జాట్‌ల నాగళ్లు, కొడవళ్లు వ్యవసాయ పనులకు పదును పెడుతున్నాం. ఈ రోజు వాళ్లు అవే కొడవళ్లు, కత్తులతో మమ్మల్ని నరకడానికి ఉపయోగించారు. మేం ఇక ఎప్పటికీ తిరిగి గ్రామాలకు వెళ్లలేం' అని యామిన్ అన్నాడు.

శిబిరాలలో ఉంటున్న వారు తమ వస్తువులను తీసుకెళ్లడానికి కక్‌డా గ్రామానికి ఇబ్రహిం, ఇలియాస్ ఇతర ముస్లింలతో వచ్చినప్పుడు ఆ గ్రామ జాట్, ఇతర హిందూ స్త్రీలు 'మిమ్మల్ని మేం వెళ్లిపోమని చెప్పలేదు. మీ అంతట మీరే వెళ్లిపోయారు. కాబట్టి మీరు గ్రామాలకు తిరిగి రాకండి' అని హెచ్చరించారు. ఇదే పరిస్థితి షామ్లీ, సిశౌలి, షాపూర్, జవులి, బహవాది, పుగునా, టోహపా లాంటి గ్రామాలన్నింటిలోనూ కొనసాగింది. గ్రామాలకు రావద్దని బెదిరించారు.

అక్టోబర్ 29న హుస్సేన్‌పుర గ్రామానికి పక్కనే ఉన్న మహమద్‌పూర్ గ్రామం నుండి వచ్చిన జాట్‌ల గుంపు దాడి చేసి అమ్రోజ్ (20), మెహర్బాన్ (21), అజ్మల్ (22) లను చంపేశారు. వారిలో అమ్రోజ్ షబ్నమ్ కొడుకు. ఆమె పెద్ద కొడుకు పర్వేజ్ టైలర్‌గా పని చేస్తున్నాడు. కుటుంబ పోషణ కొరకు అమ్రోజ్ ఢిల్లీ స్వీట్ షాప్‌లో పనిచేస్తూ ప్రతి నెలా ఇంటికి డబ్బు పంపిస్తున్నాడు. తల్లికి బాగలేదని తెలిసి చూడడానికి వచ్చి బలైపోయాడు. మెహర్బాన్ లారీ డ్రైవర్‌గా పనిచేస్తున్నాడు. కలకత్తా నుండి తల్లిదండ్రులను చూడడానికి వచ్చి బలైపోయాడు. 'వాళ్లు పాకిస్థాన్

లేదా కబ్రస్థాన్ అని నినాదాలు ఇస్తూ దాడి చేశారు. చంపడమే కాకుండా వాళ్ల కాళ్లు, చేతులు, ఇతర శరీర భాగాలను ముక్కలు ముక్కలుగా నరకాలా? అని షబ్నమ్ ఏడుస్తూ అడిగింది. హుస్సేన్‌పురా గ్రామ పెద్ద భర్త అయిన షానవాజ్ దాడి జరిగిన రోజున, బొరాన్ కలన్ పోలీస్ స్టేషన్ ఇన్‌స్పెక్టర్ ఓమ్ చౌదరికి, కనీసం 20 సార్లకు పైగా ఫోన్ చేసినా జవాబు లేదు.

ప్రభుత్వ లెక్కల ప్రకారం అల్లర్లలో 70 మంది బలైనట్లుగా చెపుతున్నారు. కాని 500 కంటే ఎక్కువ ఉండవచ్చని అక్కడి ప్రజలు అంటున్నారు. ఎందుకంటే కుటుంబాలు కుంటుంబాలుగా చంపేసి కాలవలలో పడేయడం జరిగిందని, అటువంటి కుటుంబాల వివరాలు దొరకడం లేదని అంటున్నారు.

**స్త్రీలపై అత్యాచారాలు**

ఈ అల్లర్లలో చాలా మంది స్త్రీలపై చాలా దుర్మార్గంగా అత్యాచారాలు జరిగాయి. అత్యాచారాలకు గురైన స్త్రీలు మొదట దాని గురించి చెప్పడానికి ఇష్టపడలేదు. ఏమీ జరగలేదని చెప్పారు. చివరకు నెమ్మది నెమ్మదిగా వివరాలు చెప్పారు. పోలీసు కేసు పెట్టారా అని అడిగితే లేదని ఇటువంటి వివరాలు ఎవరికీ చెప్పుకోలేమని, నలుగురికీ తెలిస్తే మరింత హీనంగా చూస్తారని అన్నారు. దిగువ ఇచ్చిన వివరాలు సేకరించిన పత్రికా విలేఖరులు స్త్రీల పేర్లను మార్చి రాశారు.

'మా ఇంటి ముందుకు కొందరు కుర్రాళ్లు గుంపుగా వచ్చి బతకాలంటే వెంటనే పారిపొండి అన్నారు. దాంతో మేం 50 మందిమి బిల్లూ ప్రధాన్ ఇంటికి రక్షణ కోసం వెళ్లాం. గ్రామ పెద్దగా ఎన్నికైన సుధీర్ కుమార్‌నే బిల్లూ ప్రధాన్‌గా పిలుస్తాం. తప్పించుకొనడానికి ఒక మార్గం గుండా వెళ్లమని ప్రధాన్ ఇచ్చిన సలహా ప్రకారం మా తాతయ్యా, మావయ్యలతో అటువైపు వెళితే అక్కడ వేచియున్న గుంపు మాపై దాడి చేసింది. మా కళ్ల ఎదుటే మా తాతయ్యా, మావయ్యను చంపేశారు. నేను, మా నాన్న, ఇతర కుటుంబ సభ్యులతో చెరకు తోటల గుండా పారిపోయి పోలీసులకు పన్నెండున్నర గంటలకు ఫోన్ చేశాం. అప్పటికి మా గ్రామంలోని చాలా మంది బలైపోయారు. రెండు రోజుల తరువాత మా అమ్మ శవం నగ్నంగా దొరికింది' అని లఖ్‌బావిడి గ్రామానికి చెందిన అబిద్‌ఖాన్ చెప్పాడు.

'మా గ్రామానికి బిల్లూ ప్రధాన్ 5 సార్లు గ్రామ పెద్దగా ఎన్నికైయ్యాడు. అతనికి ఓట్లు వేశాం. మమ్మల్ని కాపాడుతాడనే నమ్మకంతో వెళ్లాం. కాని అక్కడ మొదట నా పెద్ద కూతుర్ని నగ్నంగా చేశారు. ఆమెపై ఇద్దరు కుర్రాళ్లు ఒకరి తరువాత మరొకరు అత్యాచారం జరిపారు. తరువాత నా రెండవ కూతుర్ని లాఠీలతో శరీర అవయవాల మీద రక్తం కారేటట్లు కొట్టి ఒక మూలకు తోసేశారు. తరువాత ఇతర అమ్మాయిలపై కూడా అత్యాచారం జరిపారు. ఇదంతా చెప్తే నా 12 ఏళ్ల కూతురు సాజును ఎవరు పెళ్లి చేసుకుంటారు' అంది సబ్రా.

'నేను నా ఆరుగురు పిల్లలతో బిల్లూ ప్రధాన్ ఇంటికి వెళ్లాను. నా మూడు సంవత్సరాల పాప రెండు చేతులూ మెలి తిప్పి బయటకు విసిరేశారు. అక్కడ ఉన్న కుర్రాళ్లలో చాలా మందికి నా ఇంట్లో పాలు పట్టాను. నేను నా కూతుర్ని రక్షించుకోవడానికి పరిగెడితే నన్ను లాఠీతో కొట్టి అత్యాచారం చేశారు. తరువాత అక్కడ ఉన్న ఇతర స్త్రీలపై కూడా అత్యాచారం జరిపారు' అని షామా చెప్పింది. షామా నగ్నంగా రక్తం కారుతూ బయటకు వచ్చినా ఎవరూ సహాయపడలేదని ఆమె చెల్లెలు షాజియా చెప్పింది.

'మా ఇంటిపై దాడి చేసి నా కొడుకుని కాల్చేశారు. 'ముసల్మాన్ స్త్రీలను ఉంచుకోండి' అని నినాదాలు చేస్తూ పదునుగా ఉన్న పారతో నా చాతీపై దాడి చేశారు. అక్కడ 10 మంది కుర్రాళ్లు ఉన్మాదంలో ఉన్నారు. అక్కడ ఉన్న స్త్రీలను ఒకరి తరువాత ఒకరిని నగ్నంగా చేసి అత్యాచారం చేశారు. నగ్నంగా ఉన్న మమ్మల్ని రోడ్డుపై పరిగెత్తించారు. పోలీసులు 2 గంటల తరువాత వచ్చారు. మాకు రక్షణ కల్పించమని కోరితే హింసను ప్రేరేపిస్తున్నారని మా ఆయనను, ఇతరులను అరెస్టు చేయబోయారు. మేం మెల్లగా హైవే మీదుగా అడవులలోకి పారిపోయాం' అని లోనీ శిబిరంలో మెహనాజ్ చెప్పింది.

'ఇద్దరు నన్ను పట్టుకుని నా శరీర అవయవాల మీద లాఠీతో కొడుతూ కిందపడవేశారు. తరువాత ముగ్గురు ఒకరి తరువాత ఒకరు అత్యాచారం జరిపారు. అత్యాచారం జరుపుతుండగా బయట బాలివుడ్ సినిమా పాటలు లౌడ్ స్పీకర్లలో పెట్టారు. కొంత మంది కుర్రాళ్లు పెద్ద డ్రమ్మును వాయించారు. మసీదులో ఇద్దరు స్త్రీలను నగ్నంగా డాన్స్ చేయించారు' అని మలక్‌పురా శిబిరం నుండి 20 సంవత్సరాల రుబీనా చెప్పింది. ఆమె ఒక బుగ్గ పూర్తిగా కొరికివేయబడి ఉంది.

బిల్లూ ప్రధాన్ ఇంటికి వచ్చిన స్త్రీలలో 19 మందిపై అత్యాచారం జరిపి కొంతమందిని చంపేసినట్లు భావిస్తున్నారు. తరువాత చెరకు తోటలో ఒక స్త్రీ నగ్న శవం దొరికింది. ఇప్పటి వరకూ కేవలం 6 గ్యాంగ్ రేప్‌ల కేసులు నమోదు అయ్యాయి. అల్లర్లు జరిగిన ముజఫర్‌నగర్, షామ్లీ, భాగ్ పట్, షహరాన్‌పూర్, మీరట్ జిల్లాలలో హింసతో పాటు స్త్రీలపై అత్యాచారాలు కూడా జరిగినట్లు 'ఉత్తర ప్రదేశ్ ఉమెన్ కమిషన్' ఛైర్‌పర్సన్ జరీనా ఉస్మానీ నిర్ధారించారు. చాలా మంది స్త్రీలు వివరాలు చెప్పడానికి ఇష్టపడడం లేదని, కొంతమంది ముందుకు వస్తున్నా వారిని భయపెట్టి ఆపేస్తున్నారని చెప్పారు. స్త్రీలు ధైర్యంగా ముందుకు వచ్చి కేసులు రిజిస్టరు చేయాల్సిందిగా ఆమె ఒక ప్రకటన కూడా ఇచ్చారు.

**అధికారం కోసం రాజకీయాలు**

2014లో జరగబోయే ఎన్నికలను దృష్టిలో పెట్టుకునే ఉత్తరప్రదేశ్‌లో గత 2 సంవత్సరాల నుండి సంఘపరివార్ శక్తులు ప్రజల్ని రెచ్చగొట్టే కార్యక్రమాల ద్వారా తీవ్రంగా ప్రచారం చేస్తున్నారు. కుత్బాలో 2012 నవంబర్ 5న ఏర్పాటు చేసిన ప్రచార ర్యాలీకి అప్పటి బిజెపి అధ్యక్షుడు నితిన్ గడ్కారీతో పాటు ఇతర జాతీయ నాయకులు కూడా హాజరయ్యారంటే ఈ ప్రాంతానికి ఎంత ప్రాముఖ్యతను ఇచ్చారో అర్థమవుతుంది. 2011లో బిజెపితో ఐక్య సంఘటన కట్టిన రాష్ట్రీయ లోక్‌దళ్ పార్టీ లోక్ సభ అభ్యర్థి అనురాధా చౌదరి ఎన్నికల ప్రచారానికి నరేంద్ర మోడీ హాజరయ్యాడు. బిజెపి, సమాజ్‌వాదీద్ పార్టీలు రెండూ చేసుకున్న ఒక ఒప్పందం ప్రకారమే ఈ ఘటనలన్నీ జరుగుతున్నట్లుగా చాలా మంది అనుమానిస్తున్నారు. దీనికి ఉదాహరణగా విశ్వహిందూ పరిషత్ జరిపిన 'కోషి యాత్ర'ను జయప్రదంగా ఆపగలిగామని ప్రచారం చేసుకుంటున్న సమాజ్‌వాదీద్ పార్టీ, మారణ కాండ జరుగుతుందని తెలిసి కూడా ఎందుకు ఆపలేకపోయిందని ప్రశ్నిస్తున్నారు.

అల్లర్లలో హస్తముందని అరెస్టయిన బిజెపి ఎంఎల్ఎలు సంగీత్

సోమ్, సురేష్ రాణాలను నవంబర్ 21న ప్రధాని అభ్యర్థి నరేంద్ర మోడీ ఆధ్వర్యంలో సన్మానింపబడతారని రాష్ట్ర బిజెపి అధ్యక్షుడు లక్ష్మీకాంత్ బాజ్‌పాయ్ ప్రకటించారు. 'ఈ సన్మాన కార్యక్రమం ద్వారా ముజఫర్‌నగర్‌లో బిజెపి, గుజరాత్ లేబరేటరీ ప్రయోగానికి ప్రయత్నిస్తుందని, నరేంద్రమోడీ మొత్తం దేశాన్ని గుజరాత్ మార్గంలోకి తీసుకుపోవాలని ప్రయత్నం చేస్తున్నాడు' అని సమాజ్ వాద్ పార్టీ రాష్ట్ర జైళ్ల శాఖ మంత్రి రాజేంద్ర చౌదరి అన్నారు.

**కుల సమీకరణలు**

ఇప్పటికే వ్యాపారస్తులు, అగ్రకులాల మద్దతు కలిగి ఉన్న బిజెపి వెనకబడిన కులాల, దళితుల మద్దతు కోసం తీవ్రంగా ప్రయత్నిస్తుంది. మొన్నటి వరకూ జాట్‌లకు ప్రాతినిధ్యం వహిస్తున్న అజిత్ సింగ్ రాష్ట్రీయ లోక్‌దళ్ ప్రభావం పడిపోయింది. అసెంబ్లీ ఎన్నికల్లో కేవలం 10 సీట్లకే పరిమితం అయిపోయింది. 2011లో రాష్ట్రీయ లోక్‌దళ్ బిజెపితో ఐక్య సంఘటన కట్టినప్పుడు అంతవరకూ మద్దతు ఇస్తున్న ముస్లింలందరూ ఆ పార్టీకి దూరమైపోయారు. ఇప్పుడు ఆ పార్టీ యుపిఎ కూటమిలో చేరింది. 'జాట్, ముస్లింల ఐక్యతను నిలబెట్టిన ఘనత చౌదరి చరణ్‌సింగ్‌దేనని, ఇప్పుడు అతని కుమారుడు అజిత్‌సింగ్ పట్టు కోల్పోవడంతో జాట్‌లందరూ నెమ్మదిగా బిజెపికి దగ్గరవడం ప్రారంభించారు' అని రాజకీయ విశ్లేషకుడు సుధీర్‌పాన్వార్ అన్నారు.

సెప్టెంబర్ 4న షామ్లీలో దళితులైన వాల్మీకులకు, ముస్లింలకు ఏర్పడిన గొడవ వలన నలుగురు వాల్మీకులను పోలీసులు అరెస్టు చేశారు. ఈ సంఘటనను తమకు అనుకూలంగా మలుచుకోవడానికి బిజెపి నాయకుడు హుకుమ్ సింగ్ నాయకత్వంలో వ్యాపారస్తులందరితో బందు చేయించి, అరెస్టయిన వారిని వెంటనే విడుదల చేయాలని, ముస్లింలకు అనుకూలంగా ఉన్నాడనే నెపంతో ఆ ప్రాంత పోలీస్ సూపరింటెండెంట్ అయిన ముస్లిం అధికారిని బదిలీ చేయాలని కూడా డిమాండ్ చేశారు. దీనిపై ప్రభుత్వం సెప్టెంబర్ 10న ఆ పోలీస్ అధికారిని బదిలీ చేశారు. ఈ ఘటన తరువాత వాల్మీకులందరూ బిజెపిలోకి వస్తున్నారని లలిత్ మహేశ్వరి అన్నాడు.

'గత రెండు సంవత్సరాలుగా బిజెపి జరుపుతున్న ఆందోళనలలో అధిక భాగం ముస్లింలపై రుద్దబడిన క్రిమినల్ కేసుల విషయంలో ప్రభుత్వ వైఫల్యం మీదనే జరిగాయి' అని ఆ ప్రాంత దిన పత్రిక ఎడిటర్ అన్నారు. 'గత రెండు సంవత్సరాలలో దాదాపు 100 చిన్నా పెద్ద అల్లర్లు జరిగాయి. వీటిలో అత్యధిక శాతం ప్రజల ఆవేశాలను బిజెపి ఉపయోగించుకున్నవే. అనేక పుకార్ల ద్వారా, బల ప్రయోగం ద్వారా జరిగినవే. 2014 ఎన్నికల్లో హిందూ ఓట్లను పోగుచేసుకోవడమే వీటి ధ్యేయం' అని 'బాటిల్ గ్రౌండ్ యు.పి. పాలిటిక్స్ ఇన్ ద లాండ్ ఆఫ్ రామా' రచయిత రంజన్ పాండే అన్నారు.

**ముస్లిం దిగువ వర్గాలలో కదలిక**

ముస్లింలలో కూడా అగ్ర కులానికి చెందిన అస్రాఫ్‌లు, ఇతరులతో పాటు వెనుకబడిన కులాలు కూడా ఉన్నాయి. ముజఫర్‌నగర్ గ్రామాలలో కూడా ప్రాంతాల వారీగా ఈ విభజన ఉంది. ఈ ప్రాంతాలలో వెనుకబడిన ముస్లిం కులాలు ఈ మధ్యనే ఐక్యం కావడం కనబడుతుంది. వెనుకబడిన కులాలను పసమండా అని కూడా పిలుస్తారు. 'పసమండా క్రాంతి అభియాన్' పేరుతో 2012 నుండి వెనుకబడిన ముస్లిం కులాలను ఐక్యం చేయడం ప్రారంభించారు. 'హిందువైనా, ముస్లిమైనా దళితులు, వెనుకబడిన కులాల వారు ఒకేలాంటి వారు' అనే నినాదాన్ని ఇచ్చారు. ఉద్యమం ప్రారంభమై సెప్టెంబర్ 2013 నాటికి ఒక సంవత్సరం గడిచింది. వారు వేసిన కరపత్రంలో 'పసమండా ఉద్యమం దేశవ్యాప్తంగా కులాల మధ్య ఉన్న సంఘర్షణల వలన, హిందూ, ముస్లింల మధ్య ఏర్పడిన విభేదాలను తొలగించాలని ప్రయత్నిస్తుంది. ముస్లిం రాజకీయాలు తరచుగా ఎలక్షన్‌లలో ముస్లింలు – దళితులు, ముస్లింలు – వెనుకబడిన కులాల మధ్య ఐక్యతే లక్ష్యంగా చెపుతారు. దానికి విరుద్ధంగా పసమండా రాజకీయాలు మతానికతీతంగా హిందువులూ, ముస్లింలూ అని కాకుండా దళితులలో దళితులు, వెనకబడిన కులాలలో వెనకబడిన కులాలు ఐక్యత సాధించాలని కోరుకుంటుంది. ఈ అల్లర్లలో చనిపోయిన వారందరూ వెనుకబడిన కులాలకు చెందిన ముస్లింలేనని ప్రభుత్వ వివరాలే చెపుతున్నాయి' అని వివరించారు.

**రాష్ట్ర ప్రభుత్వ అమానుషత్వం**

అల్లర్ల కారణంగా వందలాది గ్రామాల నుండి పారిపోయి వచ్చిన 50 వేల మంది ముస్లింలు శిబిరాలలో తలదాచుకున్నట్లు ఒక అంచనా. ఈ శిబిరాల్లోనే తీవ్రమైన చలి కారణంగా 50 మంది పసిపిల్లలు చనిపోయారు. వారందరూ సరైన వైద్య సదుపాయం అందక మలేరియా, టైఫాయిడ్, కామెర్లు లాంటి వ్యాధులతో చనిపోయారు. దీనిపై రాష్ట్ర ప్రభుత్వ ప్రతిస్పందన దుర్మార్గంగా ఉంది. క్రీడాశాఖ మంత్రి నారదారాయ్ 'శిబిరాల్లో మాత్రమే చనిపోతున్నారా? మన ఇల్లలో ఎవ్వరూ చనిపోవడం లేదా? భవంతుల్లో వాల్లు చనిపోవడం లేదా?' అని ప్రశ్నించాడు. హోం శాఖ ముఖ్య కార్యదర్శి అనిల్‌గుప్తా 'కేవలం చలి వల్లనే చనిపోవడం అన్నది అసందర్భం. సైబీరియాలాంటి మంచు ప్రదేశాల్లో ప్రజలందరూ చలికి ఎప్పుడో చనిపోయి ఉండేవారు.' అని అనడం సైబీరియాలో నివసించే వాల్లు రక్షణకోసం దళసరి ఉన్ని వస్త్రాలు ధరిస్తారని, చలికి తట్టుకునే సాదనాలన్నీ వాడతారని తెలియని మూర్ఖుడి మాటల్లాగా ఉన్నాయి. అటువంటి రక్షణ ప్రభుత్వం కల్పించనందువల్లనే అసహాయ స్థితిలో గజ గజ వణికే చలికారణంగా ముజఫర్‌నగర్ పేద ముస్లిం కుటుంబాలు తమ పిల్లలని కోల్పోవలిసి వచ్చింది. ఇటువంటి అమానుష పరిస్థితి కొనసాగుతున్న సందర్భంలోనే రాష్ట్ర ప్రభుత్వం 'సాయిపాయి' అన్న ఉత్సవానికి రు. 300 కోట్లు ఖర్చుపెట్టింది. బాలీఉడ్ నుండి సల్మాన్ ఖాన్ లాంటి సినీనటులను 7 ప్రైవేట్ జెట్ విమానాలలో తీసుకువచ్చి తిరిగి వారిని ముంబైలో దిగబెట్టిదంటే ప్రజల ప్రాణాలకంటే ప్రభుత్వానికి సంబరాలే ముఖ్యమని అర్థమౌతోంది. దీంతో ముస్లింలకు అనుకూలమైన పార్టీ తమదేనని ప్రచారం చేసుకుంటున్న సమాజ్‌వాదీద్ పార్టీ నిజరూపం బయటపడింది.

డిసెంబర్ 12న మహమ్మద్ హరున్, ఇతరులు శిబిరాలలో సదుపాయాలు లేక చలికి 50 మంది పిల్లలు చనిపోయారని సుప్రీంకోర్టులో కేసు వేశారు. రాష్ట్ర ప్రభుత్వం నియమించిన మంజిత్ సింగ్ కమిటీ ప్రకారం సెప్టెంబర్ 7 నుండి డిసెంబర్ 20 వరకూ 34 మంది పసిపిల్లలు చనిపోయారని, వీరిలో సహాయ శిబిరాలలో 12

మంది, మిగతా వారు హాస్పిటళ్లలో చనిపోయారని చెప్పారు. ప్రభుత్వ లెక్కల ప్రకారమే మారణకాండలో 65 మంది చనిపోయారని, 51 వేల మంది నిరాశ్రయులైయారని తెలుస్తోంది.

శిబిరాలలో నిర్వాసితులు నెలల తరబడి ఎందుకున్నారని, సుప్రీం కోర్టు ప్రభుత్వాన్ని ప్రశ్నించినందుకు, జవాబు చెప్పడానికి వీలుకోసం రాష్ట్ర ప్రభుత్వం వెంటనే ఆగస్టు 27న, 58 శిబిరాలను బుల్డోజర్లతో తొలగించి అమానుషంగా నిర్వాసితులను తరిమేసింది. అల్లర్లు జరిగినట్లుగా ప్రభుత్వం గుర్తించిన 9 గ్రామాలకు చెందిన వారికి నష్టపరిహారంగా కుటుంబానికి 5 లక్షల రూపాయలు చెల్లించారు. నష్టపరిహారం తీసుకున్నవారు శిబిరాలలో ఉండకూడదనే సాకుతో శిబిరాలను తొలగించడమే కాకుండా ఆ ప్రాంతాలలో ఎవరూ తిరిగి టెంటులు వేయకుండా ఉండడానికి పెద్ద పెద్ద గోతులు తవ్వేశారు. 5 లక్షల పరిహారం ఇచ్చిన కుటుంబాల దగ్గర, తిరిగి వారి గ్రామాలకు రామని అఫడవిట్లు తీసుకున్నారు. వారు పరిహారం తీసుకున్నారు కాబట్టి, ప్రభుత్వ భూమిలో ఉండడానికి వీలులేదన్నారు. అలాగే గుర్తించని గ్రామాల వారు కూడా శిబిరాలలో ఉండకూడదనీ, మొత్తం మీద బాధితులు ఎవరినీ శిబిరాలలో ఉండనివ్వకుండా చేయాలని చేశారు. అనేక శిబిరాలలో ఇలానే పాశవికంగా ప్రవర్తించారు. భయంతో గ్రామాలకు తిరిగి వెళ్లలేక, ఎక్కడకు వెళ్లాలో తెలియక వేలాది మంది రోడ్ల ప్రక్కనే చిన్న చిన్న టెంట్లు వేసుకుని బిక్కు, బిక్కు మని బతుకుతున్నారు.

బాధితులంతా శిబిరాలలో ఉండగానే బయటకు తరిమేయడం వల్ల వారికి ఎటువంటి ఆహారం గాని, వైద్యం గాని అందని పరిస్థితి ఉంది. 'పట్టణ ప్రాంతాల అల్లర్లలో సాధారణంగా దాడి చేసిన వారిని గుర్తించడం కష్టం. కాని పల్లెటూళ్లలో చాలా సులువుగా తెలుస్తుంది. అందుకే చాలా మంది ముస్లింలు శిబిరాల నుండి తమ గ్రామాలకు వెళ్లలేమని చెపుతున్నారు. పైగా గ్రామాలకు తిరిగి వస్తే ముస్లింలు తమ గడ్డాలను తీసేయాలని అక్కడ డిమాండ్ చేస్తున్నారు. చాలా మంది అరెస్టు చేసిన నిందితులు వెంటనే బెయిలు మీద రావడం న్యాయ వ్యవస్థ పాక్షిక ధోరణిని తెలుపుతుంది. సెప్టెంబర్ 7న మహా పంచాయితీలో రెచ్చగొట్టే ప్రసంగం చేసిన సాధ్వీని డిసెంబర్ 2న అరెస్టు చేశారంటే పోలీసు వ్యవస్థ పాక్షికత అర్థమవుతుంది' అని హర్షమందిర్, సీమా ముస్తఫా, సుకుమార్ మురళీధరన్, కమల్, అనురాధచెనాయ్, రామ్‌మోహన్ లతో కూడిన నిజనిర్ధారణ కమిటీ పేర్కొంది.

పీపుల్స్ యూనియన్ ఫర్ డెమొక్రాటిక్ రైట్స్ (పి.యు.డి.ఆర్) సంస్థ ఆధ్వర్యంలో జరిపిన పరిశీలనలో 'అల్లర్లకు బాధితులైన వారి సంఖ్య విషయంలో ప్రభుత్వ అంచనా తప్పుదోవ పట్టించేదిగా ఉంది. గత అక్టోబర్ 4న, ప్రభుత్వం ఏర్పాటు చేసిన 'సామరస్య కమిటీ' నిరాశ్రయులైన వారి సంఖ్య 33,696 అని పేర్కొంది. అయితే డిసెంబర్‌లో సుప్రీంకోర్టులో దాఖలు చేసిన పిటిషన్ ప్రకారం ఆ సంఖ్య కేవలం 5,024 మాత్రమే. బాధితులకు న్యాయం చేయాలని డిమాండ్ చేస్తూ సుప్రీంకోర్టులో వేసిన పిటిషన్ అంచనా ప్రకారం డిసెంబర్ 6 నాటికి 27,882 మంది సహాయ శిబిరాలలో ఉన్నారు. 13 శిబిరాలు సందర్శించిన తరువాత ఈ సంఖ్య సరైనదేనని నిర్ధారణకు వచ్చాం. బాధితులు 162 గ్రామాల నుండి వచ్చామని చెప్పారు. అధికారికంగా అల్లర్లకు గురైన గ్రామాలను 9 గానే గుర్తించి 1,800 మందికి 5 లక్షల రూపాయల చొప్పున నష్టపరిహారం ఇస్తున్నట్లు ప్రభుత్వం తెలిపింది. కాని బాధిత గ్రామాలు ఇంకా చాలానే ఉన్నాయి' అని డి. మంజిత్, ఆశిష్ గుప్తా తెలిపారు.

**కొనసాగుతున్న ఫాసిస్ట్ కార్యక్రమం**

సంఘ్‌పరివార్ శక్తుల అధికారం కోసం 1990లో అయోధ్యలో, రథయాత్రతో ప్రారంభించిన ఫాసిస్టు చరిత్ర, ముంబాయి, గుజరాత్, ఒడిశా, కర్ణాటకలు దాటి నేడు ముజఫర్‌నగర్‌కు చేరుకుంది. ఆ ప్రాంత ప్రజలే కాకుండా ఇతర ప్రాంతాల నుండి కూడా వచ్చి ముజఫర్‌నగర్‌లో దాడులకు పాల్పడినట్లు తెలుస్తుంది. 'జాట్‌లు బయటి వారు వచ్చి ఈ అల్లర్లు సృష్టించారని చెప్పడానికి భయపడుతున్నారని' కాంగ్రెస్ మాజీ ఎంపి, జాట్ నాయకుడైన హరీందర్ సింగ్ మాలిక్ అన్నారు. '2014లో ఎన్నికలు లేకపోతే ఈ అల్లర్లు జరిగి ఉండేవి కావని' రాష్ట్రీయ లోక్‌దళ్ నాయకుడు సంజయ్ సింగ్ చౌహాన్ అన్నారు. గుజరాత్ మారణ కాండలో ప్రధాన పాత్ర వహించి అనేక బూటకపు ఎన్‌కౌంటర్లలో నిందితుడూ, నరేంద్రమోడీకి అనుకూలమైన అమిత్‌షాను యు.పి. ఇన్‌ఛార్జ్‌గా నియమించడం దాన్ని రుజువు చేస్తుంది.

అల్లర్లకు సంబంధించిన ఘటనలపై 437 కేసులు నమోదయ్యాయి. వీటిలో 5 వేల మంది నిందితులుగా పేర్లు రికార్డయ్యాయి. వీరు కాక 14 వేల మంది తెలియని ఇతరులు ఉన్నట్లుగా పేర్కొన్నారు. దీన్ని బట్టి అల్లర్లలో బయట ప్రాంతం వారు పాల్గొన్నట్లు రుజువవుతుంది.

'ముస్లింల చోటెక్కడో చూపించగలిగే నాయకుడు నరేంద్రమోడీ ఒక్కడే. మా స్త్రీల గౌరవాన్ని రక్షించుకోడానికి మేం ఐక్యంగా పోరాటం చేస్తాం' అని ముజఫర్‌నగర్‌లో ఒక జాట్ అన్నాడు. 'మేం కులాలను నమ్మం. జాట్‌లనీ, దళితులనీ విడిపోకుండా మేం హిందువులమంతా ఒక్కటిగా ఐక్యమవుతున్నాం'. అని భజరంగ్‌దళ్ కార్యకర్త అన్నాడు.

ఈ సందర్భంలో ఎన్నికల రాజకీయాలలో అధికారం కోసం కాంగ్రెస్, సమాజ్‌వాదీద్ పార్టీలతో పాటు ఇతర రాజకీయ పార్టీలన్నీ మతాన్ని పావుగా వాడుకోవడంలో తీసిపోలేదని మనం మర్చిపోకూడదు. దేశంలో మరిన్ని ముజఫర్‌నగర్‌లు ఫాసిజం పడగ నీడలో రాబోయే ప్రమాదం కనబడుతుంది. ప్రగతిశీల శక్తులు నిర్దిష్టమైన కార్యక్రమాలతో, మతం పేరుతో ప్రజల మధ్య హింసను ప్రేరేపించే శక్తులకు అడ్డుకట్ట వేయవలసిన అవసరం ఎంతైనా ఉంది. వీ

*(రచయిత కార్మికోద్యమ నాయకుడు)*

*ప్రపంచీకరణ దుష్ప్రభాల వల్ల వివిధ జిల్లాలో ఎంతో మంది రైతులు ఆత్మహత్యలు చేసుకొంటున్నారు. రైతులకు ఆత్మస్థైర్యం కలిగించడానికి స్థానికంగా ఉండే ఉపాధ్యాయులతో ఆత్మహత్యల నివారణ కమిటీ పెట్టి ఆత్మహత్యల నివారణకు మెదక్ జిల్లాలో కృషి చేస్తున్నాం. మీరు కూడా మీ జిల్లాల్లో ఆయా ప్రాంతాల్లోని ప్రజాస్వామికవాదులు, ముఖ్యంగా ఉపాధ్యాయులు ఇలాంటి కృషిని కొనసాగించాలి ఆశిస్తున్నాం.*

***ముత్తన్నగారి రాజేందర్ రెడ్డి, గడీల సుధాకర్ రెడ్డి***

*9908240768*

# రాచకొండలో మనుషులున్నారు జాగ్రత్త

***రాచకొండ ప్రాంతంలో ప్రాణాంతకంగా మారనున్న ఫైరింగ్ రేంజ్‌కు అనుమతి ఇవ్వడాన్ని ప్రజలు తీవ్రంగా వ్యతిరేకిస్తున్నారనీ, తమ ప్రాణాలైనా ఒడ్డి అడ్డుకునేందుకు సిద్ధపడుతున్నారనీ అంటున్నారు* కె. ప్రభాకర్**

'**మా** తాతల కాలం నుంచి మేము ఇక్కడే ఉంటున్నాం. ఈ ప్రాంతం నుంచి మమ్మల్ని వెళ్లగొట్టే ప్రయత్నం చేస్తే పోరాడి చావడానికైనా సిద్ధం, కానీ ఈ ప్రాంతాన్ని వదిలివెళ్లం' ఏడవ తరగతి చదువుతున్న పన్నెండేళ్ల పిల్లవాడి నుండి మూడు తరాలకు సాక్ష్యంగా నిలుచున్న తొంభై ఏళ్ల ముసలి వాళ్ల వరకు ఎవరిని మందలించినా ఇదే హెచ్చరిక.

ఇదే తెగువతో వాళ్లు ఆ గుట్టల్లోకి వచ్చిన బిడిఎల్ (భారత్ డైనామిక్ లిమిటెడ్) చైర్మన్‌ను, నల్లగొండ అధికారులను నిలువరించిన్రు. కర్రలు, గొడ్డళ్లతో దాడికి సిద్ధపడి, తమ వంటిమీద కిరోసిన్ పోసుకొని, వచ్చిన అధికార యంత్రాంగం మీద గుప్పి ఇక్కడి జాగల్ని మాకు కాకుండా చేస్తే మమ్మల్ని మేం తగుల పెట్టుకోవడమే కాదు, ప్రభుత్వం, బిడిఎల్ యజమాన్యం ఎవరినీ వదలం అంటూ తెగువతో పోరాడిన ఆ గిరిజన, బహుజన, దళిత, బలహీన వర్గాల ప్రజల చైతన్యం తాము బతుకుతున్న నేలను, తమ బతుకును కాపాడుకోవడం కోసం వాళ్లు చేస్తున్న ఆందోళన కదిలించింది.

హైదరాబాద్, విజయవాడ జాతీయ రహదారి 'చౌటుప్పల్' నుండి పది కిలోమీటర్ల దూరం నుండి నారాయణ్‌పూర్, చౌటుప్పల్, మర్రిగూడ, రంగరెడ్డి జిల్లా మంచాల, యాచారం మండలాలను కలుపుకొని హైదరాబాద్‌కు అతి చేరువలో చుట్టూ 3500 ఎకరాల విస్తీర్ణంలో విస్తరించిన పచ్చటి ప్రకృతి వనం రాచకొండ. దూరంగా చూస్తే కేవలం నల్లని రాళ్లతో కూడిన ఓ గుట్టల సమూహంగా కనిపించే రాచకొండ అసలు పేరు 'రాజాచలం' అని ఆ కొండల మాటున ఏ గుండెలు దాగెనో అన్న గేయంలా ఎన్ని గాయాల మయమవుతున్నమో చూస్తే తప్ప అర్థం కాదు.

తెలంగాణలో కాకతీయ రాజుల తర్వాత చెప్పుకోదగిన రాజులు రాచకొండ వెలమ ప్రభువులు. వీరినే రేచర్ల పద్మనాయక రాజులు అని కూడా పిలుస్తారు. క్రీ.శ. 1325 సింగమ నాయుడు మొదలుకొని మూడవ సింగమ నాయుడు క్రీ.శ. 1470 వరకు వీళ్ల ఏలుబడిలో ఉంది. కాకతీయ వారసత్వాన్ని పుణికిపుచ్చుకున్నారు. కాబట్టి రాచకొండ రాజులు ప్రజా సంక్షేమమే ధ్యేయంగా పాలన సాగించారు. ప్రజల ప్రధాన జీవన ఆధారం వ్యవసాయం కాబట్టి వ్యవసాయానికి సేద్యపు నీరు అవసరం కాబట్టి వీరు అనేక చెరువులు, కుంటలు, బావులను తవ్వించారు. రాచకొండకు పది కిలోమీటర్ల దూరంలో ఉన్న 'నాగసముద్రం' అనే చెరువును క్రీ.శ. 1429లో మాధవరావు భార్య నాగాంబిక కట్టించిందని ఆ చెరువు గట్టు మీదున్న శాసనంలో ఉందని చరిత్రకారులు చెపుతున్నారు.

రాచకొండ రాజులు సంగీత సాహిత్యాది కళలను విరివిగా పోషించారు. మూడవ సింగ భూపాలుడు ఆస్థానంలో బమ్మెర పోతన 'భోగిని దండకం' రచించారు. సర్వజ్ఞ సింగభూపాలుడు అనే బిరుదు ఉంది. రాచకొండ రాజుల కాలం నాటి దేవాలయాలు, అనేక శాసనాలు, దహూర్ ఖాన్ మసీదు, సర్వజ్ఞ భూపాలుడు కోట మధ్యలో నిర్మించిన రాజమందిరం, 'భోగ మంటపాలు' గుహలు చారిత్రక అవశేషాలుగా కనిపిస్తున్నాయి.

కొండ చుట్టూ ఐదారు మండలాలకు సంబంధించిన 35 తాండాల, గ్రామాల ప్రజలు సుమారు 25000 మంది గుట్టల్లో ఉత్పన్నమవుతున్న సహజ ఉత్పత్తుల్లో జీవనాన్ని కొనసాగించడం కనిపిస్తున్నది.

తియ్యని తేనె, సీతాఫలాలు, కుంకుడు కాయలు, కుందేళ్లు, నెమళ్లు, చింతకాయ, అహల్యానది జలపాతాలు ఇన్ని దాగున్నాయా అన్న విస్మయాన్ని ప్రదర్శించడం జరిగింది. ప్రకృతి వనరులతో అలరారుతున్న ఈ ప్రాంతాన్ని చుట్టూ 60 గ్రామాల ప్రజలను నిర్వాసితుల్ని చేయడం కోసం రాష్ట్ర ప్రభుత్వం, గుట్ట చుట్టూ 13400 ఎకరాల భూమిని బిడిఎల్‌కు అప్పగించడానికి, 2013 నవంబర్ 29న ఉత్తర్వు విడుదల చేసింది.

హైదరాబాద్ శామిర్‌పేటలో ఉన్న క్షిపణి ప్రయోగ కేంద్రం, నగరం గ్రేటర్ హైదరాబాద్ 'అభివృద్ధి'లో విస్తరించడం వల్ల, అక్కడి నుండి రాచకొండల్లోకి మార్చాలని, అందుకు అనువైన ప్రాంతం 'రాచకొండ' అని కేవలం 125 ఎకరాల భూమి అవసరమైన క్షిపణి ప్రయోగ కేంద్రానికి మొదటి విడతగా పదమూడు వేలకుపైగా భూమిని సేకరిస్తున్నది.

2002లోనే ఇక్కడ భూసేకరణ కోసం ప్రయత్నిస్తున్నప్పుడు ప్రజాందోళనకు వెనక్కు తగ్గిన ప్రభుత్వం రాజశేఖర్‌రెడ్డి హయాంలో అనంతపురానికి తరలి వెళ్లిందన్న ప్రచారం జరిగింది. మళ్లీ ఇప్పుడు మొత్తంగా బిడిఎల్‌కు అవసరం లేకున్నా 19,447 ఎకరాలకు గాను 13 వేల ఎకరాల్లో మొదటి దశలో సరిహద్దుల కోసం సర్వే జరుపుతున్నది. ప్రజల తిరుగుబాటు ఫలితంగా స్వయంగా 'బిడిఎల్' జనరల్ మేనేజర్ నర్సింహారెడ్డి పత్రికా ముఖంగా కేవలం 125 ఎకరాల భూమి ఫీల్డ్ ఫైరింగ్ రేంజ్‌కు సరిపోతుందని ప్రకటించడం గుర్తించాల్సిన అంశం.

గుట్ట చుట్టు పక్కల ఇంతకు ముందే రియల్ ఎస్టేట్ దందాలో వేలాది ఎకరాలు రిసార్ట్‌లు, కాలేజీలు, సెజ్‌ల పేరిట ఆక్రమణకు గురైపోయింది. రంగారెడ్డి జిల్లా ప్రజలకు ఉద్యోగాల ఆశ చూపి 400 ఎకరాల భూమిని 'బిడిఎల్' కంపెనీ కైవసం చేసుకున్నది.

ప్రభుత్వం మీకు ఉద్యోగాలిస్తామంటుంది. అవసరమైతే నష్ట పరిహారం చెల్లిస్తామంటుంది కదా ఖాళీ చేసి వెళ్లిపోవచ్చు కదా అంటే ఎవడికి కావాలి వాడి లక్షలు, మా పిల్లగాండ్లు ఎవరు పది కూడా పాస్ కాలేదు, ఎవరికి ఉద్యోగాలిస్తారు? అని నిలదీస్తున్నారు.

మేం ఏమడిగినం.. ఈ గౌర్మెంటు మీద మన్నుబోయ మేమేమన్న లోన్లు ఇయ్యమంటిమా? మాకేమన్న అభివృద్ధి చేయమంటిమా? మా బతుకు మేము బతుకుతమంటే మమ్మల్ని ఖాళీ చేసి పొమ్మంటరేంది' అంటూ తీవ్ర ప్రతిఘటనను వ్యక్తం చేస్తున్నారు.

మా పర్యావరణ కమిటీ, కడిలబాయి తాండ, ఎనుగంటి తాండ, తుంబాయి తాండ, తదితర ప్రాంతాల్ని కొంత మంది ప్రజల్ని సందర్శించి అభిప్రాయాలు సేకరిస్తున్నప్పుడు చాలా విచిత్రమైన వాళ్ల జీవితాలకు, ఆలోచనలకు దూరంగా పట్నంలో బతికే మేధావులకు అర్థం కాని 'అభివృద్ధి' వెలుగు చీకట్లో నుజ్జై పోతున్న వాళ్ల బతుకులు అర్థం చేసుకోగలిగాం.

నిజానికి వాళ్ల బతుకు వాళ్లు బతుకుతున్నప్పుడు 'మా బతుకుల్లో నిప్పులు పోయాలని చూసే వాళ్లకు మేమూ నిప్పు పెడతాం' అని అట్లా అధికారుల మీద దాడి చేయడం సరియైంది కాదు కదా అన్నప్పుడు 'ఇక్కడే పుట్టినం, ఇక్కడే బతికినం ఈ మట్టిల్నే కలిసిపోతం, మమ్మల్ని ఈ భూమికి దూరం చేయడానికి ఎవడొచ్చినా ఇక్కణ్ణే పాతర పెడతం' అని మమ్మల్ని ప్రభుత్వ మనుషులుగా, అధికారులుగా మాపై ఆవేశాన్ని వెళ్లగక్కడం న్యాయమే అనిపించింది. వీళ్లకింత ధైర్యం ఎలా వచ్చి ఉంటుంది? మీ వెనకాల ఎవరున్నారు? అని అడిగిన ప్రశ్నకు ఓ గిరిజన మహిళ చెప్పిన సమాధానం మమ్మల్ని ఆశ్చర్యానికి, ఆవేదనకు గురి చేసింది. మా వెనకాల ఎవరులేరనే ఇప్పుడు ప్రభుత్వం మా భూముల్ని గుంజుకోవాలని చూస్తుంది. ఇంతకు ముందు గిట్లనే గుంజుకుందామని వస్తే మాకు అండగా 'అన్నలు'న్నరని వెనక్కు పోయింది. ఇప్పుడు వాళ్లు లేరనే మళ్లీ ధైర్యం చేస్తున్రు. అయినా ఆ ధైర్యంతోటే ఎవడొచ్చినా ఇక్కడ అడుగు పెట్టనీయం అన్న వాళ్ల 'సాహసం' తప్పక రాచకొండను కాపాడుతుందన్న విశ్వాసం ఏర్పడింది.

నిజంగానే వాళ్లన్నట్లు ప్రభుత్వాన్ని రూపాయి అప్పు ఇవ్వమనలేదు. అభివృద్ధికోసమో కోట్లు ఇవ్వమనలేదు. రోడ్లు కూడా వేయమనలేదు. ఫ్లోరైడ్ విముక్తి నాయకులు కంచుకంట్ల సుభాష్ అన్నట్లు 'అన్నల్ని పట్టుకోవడానికి రోడ్లు వేసిన్రు' కాని వీళ్ల కోసం వేయలేదు. వీళ్ల భూములు గుంజుకోవడానికి, ఇవాళ అభివృద్ధి, పరిశ్రమలు, ఉద్యోగాలు పరిహారం పేర వాళ్ల భూములకు ఎసరు పెడుతుంది.

ఏ గుడిసె ముందుకెళ్లినా ఆ వాకిట్లో వాళ్లు ఎండబోసుకున్న అనేక రకాల ఆహార ధాన్యాలు, వడ్లు, జొన్నలు, సజ్జలు, పెసర్లు, కూరగాయలు, తేనే, కుందేళ్లు సమస్తం ఆ అటవీ ప్రాంతంలోనే లభ్యమవుతున్నవి. వాళ్లే పట్నానికి 'తేనే' తదితర సహజ ఉత్పత్తుల్ని సరఫరా చేస్తున్న సకల సంపదలున్న ప్రాంతం రాచకొండ.

చారిత్రక, సాంస్కృతిక, ప్రకృతి సంపదలున్న ఈ ప్రాంతం రేపటి తెలంగాణలో అద్భుతమైన పర్యాటక ప్రాంతంగానో, ఈ ప్రాంత నిరుద్యోగులకు ఉపయోగపడే పరిశ్రమల స్థాపనతో పాటు హైదరాబాద్ నగరానికి, నల్లగొండ, రంగారెడ్డి జిల్లాలకు పర్యావరణ ప్రకృతి కేంద్రంగా విలసిల్ల వలసి ఉంది.

అట్లాంటి అద్భుతమైన వేలాది ఎకరకాల భూముల్ని, గుట్టల్ని, సహజ వనరుల్ని, సంస్కృతిని, చరిత్రను కనుమరుగు చేయడానికి సీమాంధ్ర ప్రభుత్వం తెలంగాణ ఏర్పడబోతున్న సందర్భంలో తీవ్రంగా ప్రయత్నిస్తున్నది. పది పన్నెండేళ్ల తెలంగాణ పోరాటం తన కళ్లముందే జరుగుతున్న విధ్వంసాన్ని నిలువరించలేక పోతున్నది. హైదరాబాద్ చుట్టంతా విస్తృతంగా ఆక్రమణలు, కట్టడాలు కొనసాగుతున్నాయి. కనుకనే రాచకొండ గుట్టను కబళించే ప్రయత్నంలో భాగంగా, ఇక్కడ పెట్టదలచిన ఫీల్డ్ ఫైరింగ్ రేంజ్‌తో పాటు, పోలీసు శిక్షణ శిభిరాన్ని కూడా నెలకొల్పడం ద్వారా రేపటి తెలంగాణ పది జిల్లాల కేంద్రంగా అణచివేతకు దోహదపడే ప్రయత్నాలు కొనసాగుతున్నాయి.

విద్యావంతులుగా, బుద్ధిజీవులుగా మనం ప్రత్యక్షంగా అడ్డుకోలేక పోయినా ప్రాణాలకు తెగించి పోరాడుతున్న రాచకొండ ప్రజలకు మద్దతుగా నిలవాల్సి ఉంది. వాళ్ల బతుకు వాళ్లను బతకనీయండి. 'గిరిజన తాండాల్లో రాజ్యం గిరిజనులకే' అన్న ప్రజాస్వామిక దృక్పథంతో ఆ గుట్టలను, ప్రజలను కాపాడవలసి ఉంది. ఆ గుట్టల్లో ప్రజలున్నారన్న వాస్తవాన్ని ప్రభుత్వం గుర్తించాలి.

కాని ప్రభుత్వంలో భాగమైన వాళ్లు బహుశ ఇవాల్టి తెలంగాణ కోసం ప్రాణాలివ్వడానికి సిద్ధమని విద్యార్థుల శవాల మీద ప్రమాణాలు చేస్తూ మీసాలు మెరివేసిన అధికార పార్టీ నాయకుల అండదండలతోనే తెలంగాణ పేర చౌటుప్పల్ మండలం పీపల్ పహడ్ గ్రామం నుండి, శ్రీదేవి మైన్స్, గ్రానైట్స్ కంపెనీ రాచకొండను తొలిచేస్తున్నది. మైనింగ్ వ్యాపారంతో కొల్లగొడుతున్నది.

బహుశ రేపటి తెలంగాణలో ఈ నాయకులే ప్రభుత్వాల్లో కొనసాగితే ఈ గుట్టల్ని కాపాడడం మరింత కష్టమైన అంశమని, అందుకు ప్రజల చైతన్యం ఆ చైతన్యానికి గొంతు ఇవ్వగల తెలంగాణ పౌరసమాజం, చరిత్రకారులు, ఉద్యమకారుల సంఘటిత చైతన్యమే ఆ గుట్టలను కాపాడగలవు.

ఆ గుట్టల్ని కేవలం నల్లని రాళ్లలాగా కాకుండా రాళ్లకింద నలిగిపోయిన చరిత్ర, సంస్కృతి, ఈ మధ్య బయటపడ్డ 'శివలింగం'లా ఆ మట్టి నుండి మనుషులు ఎందుకైనా తెగించడానికి సిద్ధంగా ఉన్నారని గుర్తించి ప్రభుత్వం, బిడిఎల్ తమ ప్రతిపాదనలను ఉపసంహరించు కోవడం తప్ప మరో మార్గం లేదు.

*(రచయిత తెలంగాణ టీచర్స్ ఫెడరేషన్ కన్వీనర్)* వీ

**రచయితలకు సూచన :** తక్షణ, సమకాలీన అంశాలపై రచనలు చేసి ఆ సంచికలోనే రావాలనుకొనే రచయితలు 20వ తేదీ లోగా పంపగలిగితేనే మరుసటి నెల సంచిక కోసం పరిశీలించడం సాధ్యమవుతుంది. ఆ తరువాత వచ్చిన రచన, అంశం ఎంత ముఖ్యమైనదైనా పరిశీలించడం, ముద్రణకు సిద్ధం చేయడం అసాధ్యమవుతుంది. రచయితలు గుర్తించగలరు. – సం.

# ఉద్యమాలతోనే ఉజ్వల భవిష్యత్తు

***ఉత్తరాంధ్రను, గిరిజనులను నిర్లక్ష్యానికి గురిచేసిన పాలకులను నిలదీయాలనీ, తమ అస్తిత్వాన్ని చాటిచెప్పేలా స్థానిక తండాల్లోని, గూడాల్లోని ప్రజలు చైతన్యవంతులై ఉద్యమించాలనీ అంటున్నారు* దుప్పల రవికుమార్**

*(గత సంచికలో అచ్చయిన వ్యాసంలో సాంకేతిక పొరపాటు వల్ల మిగిలిపోయిన భాగం ఇక్కడ ప్రచురిస్తున్నాం. - సం.)*

వారికి ఎదురవుతున్న సమస్యలకు వారే సరికొత్త పరిష్కారాలు సూచించగలిగేటట్లు ప్రోత్సహించాలి.

విశాఖపట్నం ఏజెన్సీ ప్రాంతంలో బాక్సైట్ ప్రాజెక్టుల అమలు కోసం మన రాష్ట్ర ప్రభుత్వం, దాని పారిశ్రామిక భాగస్వాములతో మిలాఖతై చేస్తున్న దురాగతాలను కేవలం నిత్యచేతనలో ఉన్న పౌరసమాజమే అడ్డుకోవడం సాధ్యపడుతుంది. ఈ లోహపు వెలికితీతవల్ల ఆదివాసుల జీవనాధారంపైన. భూములపైన, అసలే నీటి ఎద్దడి ఎదుర్కొంటున్న తీర ప్రాంతాల నీటివనరులపైన పడుతున్న దుష్ప్రభావాలను గురించి, పర్యావరణ సమస్యల గురించి ఇప్పటికే ఎంతో వివరిస్తున్నా ఇంకా ప్రజలకు చేరవేయాల్సిన సమాచారం ఎంతో ఉంది. తక్షణం జరిగే పర్యావరణ నష్టమే కాక బాక్సైట్ మైనింగ్ దీర్ఘకాల పర్యావరణ విధ్వంసానికి కూడా కారణమవుతుంది. ప్రస్తుతం జరుగుతున్న ఈ తంతులో కొందరు పెద్దగా దృష్టి పెట్టని సమస్య నీటి లభ్యత. ఉదాహరణకు ఎస్. కోటలోని జిందాల్ అల్యూమినా రిఫైనరీకి రోజుకు 80 లక్షల గ్యాలన్ల నీరు అవసరమైతే, మాకవరపాలెంలోని అన్‌రాక్ రిఫైనరీకి ఒక కోటి గ్యాలన్ల నీరు అవసరమవుతోంది. ఏడాది పొడుగునా అంత నీరు ఇవ్వడానికి విశాఖపట్నంలో ఉన్న నీరేది? విశాఖ మున్సిపల్ కార్పొరేషన్ ప్రధాన వాటాదారుగా ఉన్న విశాఖ ఇండస్ట్రియల్ సప్లయ్ కంపెనీ ద్వారా ఈ నీటిని సరఫరా చేయడానికి ప్రభుత్వం ఆయా కంపెనీలకు హామీనిచ్చింది. దాంతో చుట్టుపక్కల ఉన్న జలాశయాలన్నిటి నుంచి నీటిని ఇటువైపు మళ్లిస్తున్నారు. ప్రధానంగా రైవాడ జలాశయం, తాటిపూడి రిజర్వాయరు, చిలకలగడ్డ యేరు పరిసర ప్రాంతాల ప్రజలు పెద్ద ఎత్తున ఉద్యమించి తమ సాగునీటిని, తాగునీటిని పరిశ్రమలకు మళ్లించడానికి వీల్లేదని ఉద్యమించారు. దాంతో ప్రభుత్వం పోలవరం నీళ్లు వచ్చినంతవరకే అంటూ నీళ్లు నమిలింది. పర్యావరణ పరంగా తీవ్ర అభ్యంతరాలున్న పోలవరం ఎడమ కాలువ ప్రాజెక్టు నీరు ఇక్కడికి మళ్లించడానికే ప్రణాళికలు సిద్ధం చేస్తున్నారు. ఈ విషయం చెప్పకుండా గోదావరి నీళ్లు శ్రీకాకుళం ప్రజలకు అందుతాయని సమైక్యాంధ్ర వాదులు అబద్ధాలు చెప్తున్నారు. నిజానికి ఆ నీళ్లు విశాఖపట్నం వాసులకు తాగునీటికి ఇవ్వడానికి కూడా సరిపోవు. కేవలం ప్రజల ఉసురు కొట్టడానికే ముందుకొస్తున్న పారిశ్రామిక అవసరాల దాహార్తిని తీర్చడానికే ఎక్కడ నీళ్లు సరిపోనప్పుడు మనం తాగడానికి నీళ్లు గురించి ఆలోచనలేవి? ఇందులో మరో జోక్ ఏమిటంటే కాగితాల మీద ఆయా కంపెనీలన్నీ స్థానిక నీటి వనరులను వినియోగించుకోబోమని రాతపూర్వక హామీలు గుప్పిస్తుంటే, ప్రభుత్వం స్థానిక అవసరాలను విస్మరించి మన నీటిని పరిశ్రమలకు మళ్లిస్తోంది.

ఇక చింతపల్లి అడవుల్లో జెర్రల కొండలలో 24.6 కోట్ల టన్నుల బాక్సైట్ ఉన్నట్టు గుర్తించారు. ఆ ప్రాంతంలో బగత, వాల్మీకి, కోందు తదితర తెగల ఆదివాసీలు జీవిస్తున్నారు. నిజానికి జెర్రల కొండ బాక్సైట్ వెలికితీత ప్రారంభమైతే ప్రపంచంలోనే అరుదైన ఆదివాసీ జాతులు అంతరించిపోతున్నట్టేనని మనం గుర్తించాలి. వారిని అక్కడనుంచి తన్ని తరిమేయడమే తప్ప వారి పునరావాసానికి తగిన ఏర్పాట్ల గురించి ఎవరికీ లెక్కలేదు. ఇంతాచేసి లోహపు ధర నిర్ణయించడంలో మనకు పాత్ర ఉందనుకుంటే పెద్ద పొరపాటు. అదంతా వారే ఇష్టారాజ్యంగా నిశ్చయించేస్తున్నారు. ఒరిస్సాలోని నియమగిరి కేసులో సుప్రీంకోర్టు చెప్పినదాని ప్రకారం లండన్ మెటల్ ఎక్స్ఛేంజ్‌లో నమోదయ్యే అల్యూమినియం ధరలో ఒక శాతాన్ని ఖనిజం ధరగా నిర్ణయించాలని సూచించింది. ఈ లెక్కల ప్రకారం తనకొచ్చే ఆదాయంలో 20 శాతం ఆదివాసీ అభివృద్ధి నిధికి ఖర్చు చేయనున్నట్టు రాష్ట్ర ఖనిజాభివృద్ధి సంస్థ హామీ ఇచ్చింది. కాబట్టి ఖనిజం ధర ఎంత ఉండేది స్థానికులకు ఎంతో ముఖ్యమైన విషయం. అన్నింటిని గోప్యంగా ఉంచడమే పనిగా పెట్టుకున్న ప్రభుత్వానికి ఈ విషయాలు అర్థమవుతాయి కాని, పట్టించుకునే తీరిక లేదు.

నిజానికి సహజ లోహాలను వెలికి తీసినప్పుడు, ప్రభుత్వ రంగ సంస్థలు ఆ పనికి పూనుకొన్నప్పుడు కొంతలో కొంత నయంగా ఆ జాతీయ సంపద ప్రభుత్వానికి చేరి దేశం సంపన్నమవుతుందన్న వాదన గుడ్డిలో మెల్లగా నయం. కానీ ప్రైవేటు సంస్థలకు ఈ దేశ సహజ సంపదను గుత్తసొత్తుగా ధారాదత్తం చేస్తుండడం ఎవరి మేధకూ అంతుచిక్కని వాదనాంశం. కేంద్ర ప్రభుత్వ సంస్థ అయిన నాల్కో (నేషనల్ అల్యూమినియం కార్పొరేషన్) దేశంలోనే ఈ రంగంలో అనుభవమున్న అతి పెద్ద రిఫైనరీ సంస్థ. దానికి ఈ ప్రాజెక్టులు అప్పజెప్పి ఉంటే కోర్టుల ద్వారానైనా దాని మెడలు వంచి పరిహారాల విషయంలోనూ, పర్యావరణం విషయంలోనూ, విస్థాపన విషయంలోనూ ఎంతోకొంత మెరుగైన చర్యలు తీసుకునే వీలుండేది. కానీ ప్రైవేటు సంస్థలు తమ లాభాల ఆర్జన తప్ప మరోటి ఆలోచించడం లేదు. తమ సమస్యల గురించి ప్రజలు ఆక్రోశం వెలిబుచ్చాలనుకుంటే పోలీసుల పహారాతో ప్రజల గొంతు నులిమేస్తున్నారు. ప్రజలకు గొంతుక లేకుండా చేస్తున్నారు. ఆదివాసులకు పూర్తి భిన్నంగా సముద్ర జీవరాశిమీద ఆధారపడి బతుకుతున్న మత్స్యకారుల జీవన ప్రమాణాల మెరుగుదల గురించి

ఇప్పటివరకు జరిగింది గోరంత అయితే జరగాల్సింది కొండంత. ఈ ఒక్క సంవత్సరమే మూడు వరుస తుపానులు, పెనుగాలులతో తూరుపు తీరమంతా గజగజ వణికినపుడు గాలిలో పెట్టిన దీపంలాంటి మత్స్యకారుల బతుకులు మరింతగా ఊగిసలాడాయి. వారాల తరబడి వేటకు వెళ్లని మత్స్యకారులకు ప్రభుత్వం నుంచి అందిన సహాయం నాలుగు రోజులకు మించనపుడు వారి బతుకులకు భద్రతేది? చేపలు పట్టడానికి ఈ ప్రాంతపు వేటగాళ్లలో ఇప్పటికీ సగానికి పైగా తాతల కాలం నాటి పడవలూ వలలే వాడుతున్నప్పుడు మారుతున్న భద్ర జీవనపు భరోసా వారికి అందేది ఎలా? మెకనైజ్డ్ పడవలు, షిపింగ్ హార్బర్లు లాంటి మాటలన్నీ ఎన్నికల సీజన్ వాగ్దానాలే తప్ప వాస్తవిక రూపాలు కానేకావు. అలా నిరంతరం అభద్రత, బతుకుభయం అనే కెరటాల మధ్య కొట్టుమిట్టాడే చేపల రైతు దేశ ఆర్థిక నిర్మాణానికి మోసులెలా ఎత్తగలడు? నాలుగింట మూడొంతుల మంది మత్స్యకారులకు ఇన్సూరెన్స్ ఇప్పటికీ అందని మావిపండే. వందల కోట్ల రూపాయలను సబ్సిడీల రూపంలో, వడ్డీలేని అప్పు రూపంలో తీసుకుని పరిశ్రమలు స్థాపించే బడా పెట్టుబడిదారులకు ఇన్సూరెన్స్ అధికారులు ఈకకు ఈక, తోకకు తోక లెక్కలేసి కట్టించి సాయం చేస్తుంటారు. పేద మత్స్యకార కుటుంబాల ఇన్సూరెన్స్ విషయాలలో అదెవరికీ పట్టని విషయం.

అభివృద్ధి ఉగ్రవాదం సృష్టించబోతున్న విధ్వంస పెనువిపత్తు తీరప్రాంతాన్ని కోస్టల్ కారిడార్ రూపంలో చుట్టుముట్టనుంది. మన రాష్ట్రంలో కోస్టల్ కారిడార్ 1575 చదరపు కిలోమీటర్లు ఉంటుందని అంచనా. కోస్టల్ కారిడార్ అనేది ఒక ప్రాజెక్టు కాదు. ప్రభుత్వ, ప్రైవేటు రంగాల భాగస్వామ్యంలో రూపొందనున్న అనేక ప్రాజెక్టుల సమాహారం ఈ కోస్టల్ కారిడార్. ఇందులో సెజ్‌లుంటాయి. విమానాశ్రయాలుంటాయి. ఓడరేవులుంటాయి. జాతీయ రహదారులుంటాయి. విద్యుదుత్పత్తి కేంద్రాలుంటాయి. వీటిని వేయికళ్లతో, లక్షచేతులతో రక్షణ కల్పిస్తూ తీరప్రాంత పోలీసు గస్తీ దళాలు (మెరైన్ పోలీసు స్టేషన్లు) ఉంటాయి. శ్రీకాకుళం జిల్లా ఇచ్ఛాపురం నుంచి నెల్లూరు జిల్లా తడవరకు ఉన్న ఈ మొత్తం కారిడార్‌లో విశాఖపట్నం నుండి కాకినాడ దాకా 603 చదరపు కిలోమీటర్ల వైశాల్యంలో నెలకొల్పజూస్తున్న పెట్రోకెమికల్స్, పెట్రోలియం ఉత్పత్తుల ప్రాంతం (పిసిపిఐఆర్) 1.50 లక్షల ఎకరాలలో విస్తరించి ఉంది. దీని పరిధిలోకి రాని శ్రీకాకుళం జిల్లా కు చెందిన పారిశ్రామిక అవసరాలకు విద్యుత్ అందించే రెండు థర్మల్ విద్యుత్ కేంద్రాలు సైతం కోస్టల్ కారిడార్ పథకంలో పుట్టుకొచ్చినవే. ఈ ఒకటిన్నర లక్షల ఎకరాలపై అజమాయిషీ చేయడానికి ప్రభుత్వం ప్రత్యేక అభివృద్ధి సంస్థ (ఎస్‌డిఏ)ని నెలకొల్పింది. దీని ఆధ్వర్యంలో ఈ ప్రాంతంలో భూమి ఎవరిదైనా గుంజుకు లాక్కోవడమే దానికి తెలుసు. ఇప్పటికే ఆమోదం పొందిన రాంబిల్లి, అచ్యుతాపురం మండలాలలో రెండు, యు. కొత్తపల్లి, తొండంగి మండలాలలో ఒకటి; మొత్తం మూడు సెజ్‌లు ఇక్కడే ఏర్పాటయ్యాయి. పరవాడ మండలంలోని రాంకీ ఫార్మా, నక్కపల్లి మండలంలోని హెటిరో డ్రగ్స్‌లు సెజ్ హోదా పొందాయి. సింహాచలంలోని ఎన్‌టిపిసి థర్మల్ పవర్ ప్లాంటు సామర్థ్యాన్ని రెండు వేల మెగావాట్లకు పెంచి, మరో ఏడు గ్యాస్ ఆధారిత విద్యుత్ ఉత్పత్తి కేంద్రాలు నెలకొల్పడం ఇంకో ప్రణాళిక. ఇప్పటికే ఉన్న గంగవరం పోర్టు, కాకినాడ డీప్‌వాటర్ పోర్టులతో పాటు ముత్యాలమ్మపాలెం, రేవుపోలవరం, పూడిమడక, యు. కొత్తపల్లి, తొండంగిలలో నాలుగు పోర్టులు రాబోవడం మరో ప్రణాళిక. కళింగాంధ్రలో భీమునిపట్నం, కళింగపట్నం, భావనపాడు, ముక్కాంలలో కూడా కొత్త పోర్టులు ఏర్పాటుచేయాలన్న ఆలోచన లేకపోలేదు. ఇదంతా ఇక్కడ మౌలిక సదుపాయాలు ఏర్పాటుచేయడంలో ఒక భాగం. ఇవి పూర్తిగా విస్తరించిన తరువాత రసాయన, పెట్రో కెమికల్ పరిశ్రమలు, ఎరువుల కర్మాగారాలు, ఉక్కు ఫ్యాక్టరీలు, సిరామిక్స్ ఫ్యాక్టరీలు పుట్టుకొస్తాయి. వీటి కోసం సముద్ర తీర ప్రాంతంలో సహజంగా వాటికంతటకవే ఏర్పాటైన కొబ్బరి తోటలు, జీడిమామిడి తోటలు, సరుగుడు తోటలు, వరిచేలు, సహజ అంతర్జాతీయ పక్షుల విడిది కేంద్రాలు, మత్స్యకార గ్రామాలు, అన్నిటికంటే ముఖ్యంగా మంచినీరు, సముద్రపు నీరు కలిసే చోట సహజ సిద్ధంగా ఏర్పడిన సహజ తంపర ప్రాంతం తుడిచిపెట్టేయాల్సి రావడం మన తలకు మనమే కొరివి పెట్టుకోవడం లాంటిది. తీరప్రాంతాన్ని అభివృద్ధి చేస్తున్నట్టు కనిపించే ఈ కోస్టల్ కారిడార్ వల్ల సముద్ర కాలుష్యం జలజీవాల పునరుత్పత్తిని దెబ్బతీస్తుంది. జల జీవరాశి కాలక్రమంలో తగ్గిపోయే ఆస్కారముంది. జలజీవంపై ఆధారపడే ప్రజలకు జీవనాధారం పోతుంది. ఇదే వ్యాసంలో ముందే ఆందోళన చెందినట్టు ఈ పరిశ్రమలకు అవసరమైన నీటిని ఎక్కడనుంచి తరలిస్తారు? అవసరమైన విద్యుత్తును ఎవరి త్యాగంతో వీరికందిస్తారు?

అటు గిరిజన, ఇటు మత్స్యకార ప్రాంతాలకు మధ్య విశాలంగా అలరారుతున్న మైదాన ప్రాంత వాసుల ప్రాణాలకు ఉరిలా పరిణమించిన పరిశ్రమలెన్నింటినో డెవలప్‌మెంట్ టెర్రరిజం (అభివృద్ధి ఉగ్రవాదం) మోసుకొచ్చింది. పారిశ్రామిక కోస్టల్ కారిడార్ పేరుతో కళింగాంధ్రను ఇప్పటికే ఆంధ్రప్రదేశ్ రాష్ట్రానికి డస్ట్‌బిన్‌లా తయారుచేసారు. రసాయనాలు, మందులు, ఎరువుల పరిశ్రమలను మితిమీరి అనుమతులిచ్చి ప్రజల ప్రాణాలతో చెలగాటమాడుతున్న ప్రభుత్వం తన ప్రజల కొరివికి తానే నిప్పంటించిన సంగతి ఎప్పుడూ చెప్పదు. ఈ ఫ్యాక్టరీలు విడుదల చేసిన రసాయనాలు, విషవాయువుల ద్వారా ఏర్పడిన జల వాయు కాలుష్యాలు నూతన రోగాలకు కారణభూతమవుతున్నాయి. వీటికి తోడు నిర్మాణంలో ఉన్న రెండు థర్మల్ పవర్ ప్లాంటులతో పాటు కొవ్వాడ వద్ద నిర్మించ తలపెట్టిన అణు విద్యుత్ కర్మాగారం మనకు విధ్వంసాన్ని మిగిల్చేవే. సముద్రపు ఇసుకనుంచి సిలికాన్ లోహాన్ని తీసే ఫ్యాక్టరీలు తూరుపు తీరమంతటికీ కేవలం శ్రీకాకుళం వద్దే ఏర్పాటుచేయడం గమనించాలి. ఈ విద్యుత్ కేంద్రాలవల్ల అపరిమితమైన రేడియేషన్ సంభవించి, వేడిమి పెరిగి మత్స్య సంపద మరింత దూరంగా వెళ్లిపోవడమే కాకుండా తీరప్రాంతమంతా బొగ్గు, బూడిద, రేడియేషన్‌తో నిండిపోనున్నది. కళింగాంధ్రలో ప్రతిపాదించిన అణువిద్యుత్ కేంద్రం ఆరు వేల మెగావాట్ల సమర్థత గలది. దీనిని ప్రజల నెత్తిమీదన రుద్దడానికి ప్రభుత్వం అనేక అబద్ధాలు చెప్తోంది. అణువిద్యుత్తు చాలా చవకనీ, బహు భద్రమైనదనీ, అణువ్యర్థాలు పెద్దగా ఉండవని, వాతావరణానికి సంక్షోభానికి ఇదే సరైన సమాధానమని, దీనికి ప్రత్యామ్నాయం లేదని ప్రభుత్వం ప్రజలకు నచ్చచెప్తోంది. యురేనియం ఖనిజాన్ని సంపాదించడం నుంచి శుద్ధి చేయడం మీదుగా అణువులను విచ్ఛిత్తి

# నేటి ఉత్తరాంధ్ర ప్రజా సమస్యలు

*ఉత్తరాంధ్ర జిల్లాల సమస్యల గురించి, వెనుకబాటుతనం గురించి వివరిస్తూ, ఈ వెనుకబాటుతనానికి పాలకుల విధానాలే కారణమని అంటున్నారు* **తుంపాల శ్రీరామమూర్తి**

రాష్ట్రంలో తెలంగాణ తరువాత ఉత్తరాంధ్ర జిల్లాలైన శ్రీకాకుళం, విజయనగరం, విశాఖపట్నం బాగా వెనుకబడి ఉన్నాయి. ఉత్తరాంధ్ర మొత్తం 23,304 చదరపు కిల్లో మీటర్ల వైశాల్యం కలిగి మొత్తం జనాభా 93,38,147 మంది ఉన్నారు. వీరిలో పురుషులు 46,42,125 మంది, స్త్రీలు 46,96,052 మంది ఉన్నారు. ఉత్తరాంధ్రలో గిరిజనులు 10,20,174 మంది, దళితులు 8,32,878 మంది ఉన్నారు. రాష్ట్రంలో ఖమ్మం జిల్లా తరువాత విశాఖ జిల్లాలోనే గిరిజనులు ఎక్కువగా ఉన్నారు. విశాఖ జిల్లా 11 మండలాల్లో 6,18,500 మంది గిరిజనులు ఉండగా, శ్రీకాకులళంలో 1,66,118 మంది, విజయనగరంలో 2,35,556 మంది గిరిజనుల ఉన్నారు. విశాఖ జిల్లాలోనే ఆదివాసి (పిటిజి) గిరిజనులు కూడా ఎక్కువ మందే ఉన్నారు. సీలేరు విద్యుత్తు కేంద్రం ఈ జిల్లాలోనే ఉన్నప్పటికీ చాలా గ్రామాలకు కరెంట్ సౌకర్యం లేదు. రహదారులు లేవు. సుదూర గ్రామాలకు వైద్య సదుపాయం లేదు. పాడేరు, చింతపల్లి, అరకు ప్రాంతాలలో మాత్రమే ప్రధాన ఆసుపత్రులు ఉన్నాయి. మిగతా ప్రాంతాల్లో పిహెచ్‌సిలు ఉన్నా వైద్య సదుపాయం అంతంత మాత్రంగానే జరుగుతున్నది. ఏజెన్సీలో వంద పడకల ఆసుపత్రి లేదు. ఉన్న ఆసుపత్రుల్లో కూడా అధునాతన వైద్య పరికరాలు అందుబాటులో లేవు. చాలా మంది గిరిజనులు పౌష్టిక ఆహారం లేక మరణిస్తున్నారు. రక్షిత మంచి నీటి పథకాలు చెక్ డ్యాంలు తగినన్ని అందుబాటులో లేవు. పదేళ్ల క్రితం జాతీయ మానవ హక్కుల కమిషన్ సభ్యుడు కె.ఆర్. వేణుగోపాల్ తన బృందంతో పర్యటించి వైద్య సదుపాయాలు మెరుగుపరచాలని కోరుతూ ప్రభుత్వానికి అనేక సిఫార్సులు చేశారు. అవి నేటికీ అమలుకు నోచుకోలేదు. ప్రతి ఏడాది పిల్లలతో కలిపి సుమారు 1500 మంది గిరిజనులు చనిపోతున్నారు.

భూమి హక్కుకి సంబంధించి 1/70 చట్టం ఉన్నప్పటికీ వేలాది ఎకరాలు గిరిజనేతరుల ఆధీనంలో ఉన్నాయి. పాడేరులో భారీ భవంతులు, లాడ్జీలు తదితర ఆస్తులన్నీ గిరిజనేతరులవే. విశాఖ ఏజెన్సీలో 3399 షెడ్యూల్ గ్రామాలు ఉన్నాయి. నాన్‌షెడ్యూల్ గ్రామాలు, 55 ఉన్నాయి. శ్రీకాకుళం జిల్లాలో 108 షెడ్యూలు గ్రామాలు 16 పంచాయితీలలో సీతంపేట మండలంలో మాత్రమే ఉన్నాయి. ఇంకా 240 గ్రామాలు నాన్‌షెడ్యూల్ ప్రాంతంలో ఉన్నాయి.

శ్రీకాకుళం గిరిజన రైతాంగ పోరాటం 1968 – 72 వరకు సాయుధంగా జరిగిన నేపథ్యంలో సుమారు 300 మంది అమరులైనారు. ఈ క్రమంలో 1/70 చట్టం వచ్చినప్పటికీ ఆ చట్టం షెడ్యూల్

చేయడం, దానినుంచి విద్యుత్ దొరకబుచ్చుకోవడం వరకూ జరిగే పనులన్నీ చాలా ఖర్చుతో కూడుకున్నవే కావడం వాస్తవం. అన్ని దశల్లోనూ అణుధార్మికత ప్రమాదం పొంచివున్న అణు విద్యుత్ కేంద్రంలో ఏ మాత్రం అప్రమత్తంగా ఉన్నా భారీ మూల్యం చెల్లించుకోవలసినదే. తరాల తరబడి ప్రజలు రేడియో ధార్మికతకు లోనవడమే కాకుండా వివిధ వ్యాధులకు గురవుతూనే ఉంటారు. ఇవన్నీ మన సొంత పాలకులకు పట్టని విషయాలు కావడమే మన దురదృష్టం. దానిని నిందించుకుని కూర్చుంటే లాభం లేదు. దీనిపై పెద్దఎత్తున మనం పోరాడాలి.

కళింగాంధ్ర మైదాన ప్రాంత వాసులను పట్టిపల్లారుస్తున్న అతి ప్రధాన సమస్య నీటి కొరత. (శ్రీకాకుళం జిల్లా రైతాంగం సాగునీటి కోసం ప్రధానంగా వంశధార నదీజలాలపై ఆధారపడుతున్నప్పటికీ చాలీచాలని నీటితో వ్యవసాయం కొనసాగిస్తున్నారు. వంశధార నదినుంచి ట్రిబ్యునల్ తీర్పుల మేరకు సుమారు 18 టిఎంసిల నీటిని మాత్రమే వినియోగించు కోగలుగుతున్నాం. దైవాధీనం బతుకు అన్నట్టు వర్షాధారంగా, చెరువు నీళ్లపై ఆధారపడి సాగు చేస్తుండడం ఎవరికీ మంచిది కాదు. రకరకాల కారణాలవల్ల గిట్టుబాటు ధరలేక రైతు ఆర్థికంగా చతికిలపడిపోతున్నాడు. సరిగ్గా ఇదే పెట్టుబడిదారుడికి కావలసింది. రైతు రైతుగా బతకకుండా తన పొలంలోనే రైతుకూలీగా మారినప్పుడే తన పొలాలు అమ్ముకోవడానికి సాధ్యపడుతుంది. రైతుకు కాళ్లకింద నేల లేనప్పుడే వలసలు సాధ్యమవుతాయి. పట్టణాలు మహానగరాలుగా అభివృద్ధి చెందుతున్న చోటుకు దిక్కుతోచని రైతాంగం పొట్టచేతపట్టుకుని వలసపోతుంది. ఆర్థికంగా స్థిరపడలేని రైతాంగం ఎప్పటికీ వెన్ను స్థిరంగా పెట్టి నిల్చోలేదు. భారతదేశపు వెన్నెముక రైతు ఆత్మవిశ్వాస రాహిత్యంతో చేయిచాచి ప్రభుత్వాన్ని, రాజకీయ నాయకులను, పెట్టుబడిదారులను, ప్రతి ఒక్కరిని యాచిస్తున్నప్పుడు ఉద్యమాలు ఈ నేలమీద ఎలా నడుస్తాయని మనం ఆశించగలం? రైతే రాజని తాను భావించినప్పుడే ఈ దేశానికి దిశానిర్దేశం చేయగల సత్తా తనకొస్తుంది. అయితే ఇంత నిరాశామయ వాతావరణంలో సైతం సోంపేట రైతాంగం నాగార్జున థర్మల్ పవర్ నిర్మాణానికి వ్యతిరేకంగా ఏకమై సలిపిన పోరు సరికొత్త పాఠాలను అందించడమే కాకుండా ప్రజా ఉద్యమకారులకు కొత్త శక్తిని, ఉత్సాహాన్ని ఇస్తుంది.

*(రచయిత ఆంగ్ల విభాగంలో అసిస్టెంట్ ప్రొఫెసర్, ఆదిత్య ఇంజనీరింగ్ కళాశాల, టెక్కలి)* వీ

ప్రాంతాలలోనే విశాఖపట్టణం, విజయనగరం, శ్రీకాకుళం, తూర్పు గోదావరి, పశ్చిమ గోదావరి, ఖమ్మం, వరంగల్, ఆదిలాబాద్, మహబూబ్ నగర్ జిల్లాల్లో మాత్రమే వర్తించింది. ఇతర జిల్లాల్లో గిరిజనులు ఉన్నప్పటికీ షెడ్యూల్ ప్రాంతంగా గుర్తించనందున వారికి వర్తించలేదు. అంతేకాక షెడ్యూల్ ప్రాంతంగా గుర్తించిన జిల్లాల్లో కూడా నాన్‌షెడ్యూల్ గ్రామాల పేరుతో ఈ చట్టం వర్తించడం లేదు. పోరాటం జరిగిన శ్రీకాకుళం జిల్లాలో నాన్‌షెడ్యూల్ గ్రామాలు 240, విజయనగరం జిల్లాలో 170 ఉన్నాయి. ఈ గ్రామాల్లో భూమి 90 శాతం గిరిజనేతరుల ఆధీనంలో ఉన్నది. నాన్‌షెడ్యూల్ గ్రామాలను షెడ్యూల్ గ్రామాలుగా గుర్తించాలని 1962లో ధేబర్ కమిషన్ సూచించగా దీనికి వీలుగా 1976లో రాజ్యాంగ సవరణ తెచ్చారు. 1980లో రాష్ట్ర ప్రభుత్వం 9 షెడ్యూల్ జిల్లాల్లోనూ సర్వే జరిపించి 805 నాన్ షెడ్యూల్ గ్రామాలను గుర్తించి షెడ్యూల్ గ్రామాలుగా పరిగణించటకు చర్యలు చేపట్ట వలసిందిగా కోరుతూ కేంద్ర ప్రభుత్వానికి నివేదిక పంపారు. నేటికి 33 సంవత్సరాలు దాటినా సమాధానం లేదు. 1985లో మహారాష్ట్ర, 1987లో రాజస్థాన్ పంపిన నివేదికలు ఆమోదం పొందాయి. రాష్ట్రంలో మొత్తం గిరిజనులు 59,18,073, ఉత్తరాంధ్రలో దళితులు 8,32,878 మంది ఉన్నారు. వీరిలో 95 శాతం మంది వ్యవసాయ కూలీలుగా పారిశుద్ధ్య కార్మికులుగా జీవిస్తున్నారు. డ్రైలెట్రిన్‌లు నిషేధిస్తూ రెండు దశాబ్దాల క్రితం చట్టం వచ్చింది. కేంద్ర ప్రభుత్వం 2013 డిసెంబర్ 6న చట్టం చేసింది. అయినప్పటికీ ఒకరి మలవిసర్జననూ పాకీపనివారు తీసుకొని వెళ్లే దుర్మార్గపు విధానం ఉత్తరాంధ్రలో కొనసాగుతోంది. మాన్యువల్ స్కావెంజర్ నిషేధ చట్టం అమలు చేయాలి.

రాష్ట్ర ప్రభుత్వం అసైండ్ ల్యాండ్ చట్టం ప్రకారం కొంత మంది దళితులకు భూమలు ఇచ్చినప్పటికీ అవి అన్నీ దళితేతురల ఆధీనంలోనే కొనసాగుతున్నాయి. వ్యవసాయ భూములు రియల్‌ఎస్టేట్ ( ఇతర జిల్లాల అగ్రవర్ణ భూకామందులు) వ్యాపారస్తుల ఆధీనంలో ఉన్నాయి. వ్యవసాయం పూర్తిగా దెబ్బతిన్నందున ఇతర రాష్ట్రాలకు వలస కూలీలుగా వెళ్లిపోతున్నారు. శ్రీకాకుళం జిల్లా, విజయనగరం జిల్లాల నుండి వ్యవసాయ కూలీల వలసలు, విశాఖ జిల్లా నుండి మత్స్యకారుల వలసలు నిరంతరం కొనసాగుతూనే ఉన్నాయి. విశాఖ తీరప్రాంతంలో పెట్రో కారిడార్, కోస్టల్ కారిడార్ వలన లక్షలాది ఎకరాల భూమిని రైతులు కోల్పోయారు. జీవనోపాధి కరువై వలసబాట పట్టారు.

శ్రీకాకుళం జిల్లాలో వజ్రపు కొత్తూరు మండలం నుండి ఇచ్ఛాపురం మండలం వరకు ఉన్న సముద్ర తీర ప్రాంతాన్ని ఉద్దానం అంటారు. కోనసీమ ప్రాంతం వలే కొబ్బరి, జీడిమామిడి, మామిడి తోటలతో ఇక్కడి వాతావరణం ఆహ్లాదకరంగా ఉంటుంది. విహార కేంద్రంగా ఉన్నందున ఉద్యానవనం ఉన్నారు. క్రమంగా అది ఉద్దానంగా జనం పిలుపులో భాగమైపోయింది. అమరుడు సుబ్బారావు పాణిగ్రాహి దీనిని ఉద్యమాల వనంగా కీర్తించారు. కొబ్బరి, జీడిమామిడితో పాటు వరి, జునుగు, ఉలవలు పండిస్తారు. మహేంద్ర తనయ సునామిది వంటి చిన్న నదులు గెడ్డలు చాలా ఉన్నాయి. వీటిపైనా రిజర్‌వాయర్లు, లిఫ్టు ఇరిగేషన్ సదుపాయాలు కల్పిస్తే వీటితో పాటు వరి కూడా పుష్కలంగా పండుతుంది.

గత పదేళ్లుగా కొబ్బరి తోటలు తెగుళ్ల బారిన పడితే ప్రభుత్వాలు పట్టించుకోలేదు. కొబ్బరికాయలకు, జీడి పిక్కలకు గిట్టుబాటు ధర కల్పించి కొనుగోళ్లు కేంద్రాలు ఏర్పాటు చేయమని ప్రజలు కోరుతున్నా ప్రభుత్వాలు పట్టించుకోలేదు. అంతేకాక సహకార సంఘాల ద్వారా ఎరువులు, పురుగుల మందులు అందచేయవలసిన అవసరం ఉన్నది. ప్రధానంగా గత 10 సంవత్సరాలలో సంవత్సరానికి వెయ్యి మంది చొప్పున 10 వేల మంది ప్రజలు కిడ్నీ వ్యాధులతో మరణిస్తున్నారు. రాష్ట్రంలోనే అత్యధికంగా కిడ్నీ వ్యాధిగ్రస్తులు ఈ ప్రాంతంలోనే ఉన్నారు. ఈ తీర ప్రాంతంలో వేలాది మంది మత్స్యకారులు చేపల వేటపై ఆధారపడి జీవిస్తున్నారు. ఆధాయం చాలక సంవత్సరంలో నాలుగు నెలలు ఇతర రాష్ట్రాలకు వలసలు పోతున్నారు. ప్రసిద్ధి చెందిన కళింగపట్టణం, బావనపాడు, నువ్వల రేవు, బారువ, మెట్టూరు రేవుల దగ్గర పిషింగ్ హర్బర్‌లు నిర్మిస్తే మత్స్యకారుల వలసలు ఆగిపోతాయి.

గోదావరి అందుబాటులో ఉండి కూడా ఈ జిల్లాలకు చుక్క నీరు అందడం లేదు. గోదావరి డెల్టాలో 12 లక్షల ఎకరాలలోను, కృష్ణా డెల్టాలో 13 లక్షల ఎకరాలలోను ఏడాదికి రెండు పంటలు పండు తుండగా ఈ మూడు జిల్లాల్లో కేవలం 7 శాతం భూములలోనే రెండు పంటలు పండుతున్నాయి. రాష్ట్రంలో ప్రవహించే 40 నదులలో 15 నదులు ఉత్తరాంధ్రలో ప్రవహిస్తున్నప్పటికీ కరువు తాండవిస్తూనే ఉన్నది. 1979లో విజయనగరం జిల్లా ఏర్పడింది ఈ జిల్లాలో నాగావళి, జంజావతి సువర్ణముఖి, గోముఖి, వేగావతి, చంపావతి నదులు ప్రవహిస్తున్నప్పటికీ 10 వేల చెరువులు ఉన్నప్పటికీ కరువు పీడిత జిల్లాగా రాష్ట్రంలో మిగిలి ఉంది. జంజావతి ప్రాజెక్టు, తారక రామ తీర్థ సాగర ప్రాజెక్టు అలాగే విజయనగరం జిల్లాలో ఉన్న పెండింగ్ ప్రాజెక్టులు పూర్తి అయితే రైతులకు కొంత మేలు చేకూరుతుంది.

*(రచయిత పౌరహక్కుల కార్యకర్త)* వీ

**రాబోయే సంచికలలో...**

- **సావిత్రిబాయి పూలే - మసున అనూష విఘ్నేష్**
- **రూపాయి పతనం - ఆర్. శశికుమార్**
- **ఈ శతాబ్దపు రైఫిల్ - విశ్వం**
- **మానవ హక్కుల్లో భాగంగా తాగునీటి హక్కు - డా. వి. విజయకుమార్**
- **ఆర్‌టిసి అభివృద్ధి - ఒక పరిశీలన - డా. చిలుమూరి శ్రీనివాసరావు**

# క్రోనీ కాపిటలిజానిదే రాజ్యం

***నూతన ఆర్థిక విధానాలతో దేశ ఆర్థిక వ్యవస్థలో ప్రవేశించిన ఆశ్రిత పెట్టుబడిదారీ విధానం పాత ప్రజానుకూల చట్టాలన్నిటినీ తుంగలో తొక్కుతోందని అంటున్నారు డా. నూకతోటి రవికుమార్***

దేశ సంపద కొద్దిమంది చేతుల్లోకి పోయి, పెద్ద ఎత్తున పేదరికం చుట్టుముడుతోంది. ప్రభుత్వాలు పెట్టుబడిదారుల ముందు బేలగా నించోడమే కాదు. రాజ్యాంగం ప్రజలకిచ్చిన హక్కులకు సైతం బేరసారాలు పెడుతున్నాయి. అంతటితో ఆగడం మానుకోక, చట్టాలకు ప్రతికూల చట్టాలు చేసి దిక్కుమొక్కులేని జనాలకు వనవసాల్లోనూ బతికే హక్కు లేకుండా చేస్తున్నారు. అనివార్యంగా ఆయుధాలు పట్టి పోరాడాల్సిన స్థితిని కల్పిస్తున్నారు. దీనికి ఉదాహరణగానే మైనింగ్ కంపెనీల వాటాల నుంచి బొగ్గు కుంభకోణాల దాకా, ముంబై ఆదర్శ హౌసింగ్ సొసైటీ కుంభకోణం దాకా యుపిఎ 1, 2ల లెక్కలేనన్ని స్కాములను చెప్పుకోవచ్చు. ఒక ముష్కర గణం అధికార లాలసత్వంతో పోటీపడి దేశాన్ని స్కాముల మయం చేస్తుంటే, ఇంకో మతోన్మాద గణం దేశాన్ని మెజారిటీ మతోన్మాదానికి వేదికగా చేసి స్వదేశీ పేరుతో అధికారాన్ని పొంది విదేశాల పాదాల కింద సేద దీరాలనుకుంటోంది. ఈ మధ్యలో సామాన్యుడి విలవిలలు వినిపించడం లేదు, సరికదా, వీలైనంత మేర దేశంలోని ఆదివాసుల, మైనారిటీ మతస్తుల నెత్తురు పారించడమే ధ్యేయంగా పాలకులు తమకు చేతనైనంతగా కుట్రాజకీయాలు చేస్తున్నారు.

ప్రజాస్వామ్యం పేరుతో బడా పెట్టుబడిదారులకు అనుకూలమైన మార్పులు చాలా శరవేగంగా జరిగిపోతున్నాయి. అదే క్రమంలో సామాన్య, మధ్యతరగతి ప్రజలకు సంబంధించిన పనుల ఫైళ్లు ఏళ్ల తరబడి కార్యాలయాల గుమ్మాలు దాటే సాహసాన్ని చేయలేక పోతున్నాయి. దీనికి కారణం బ్యూరోక్రసీ బడాబాబుల కాలికింది చెప్పుగా మారిపోవడం ఇప్పుడు చాలా యాదృచ్ఛికంగా జరిగిపోతోంది. ప్రజలు పోరాడి సాధించుకున్న అటవీ హక్కుల చట్టాలు ఆచరణలో దారుణంగా వంచించబడుతున్నాయి. కానీ, ఆదివాసి, గిరిజన ప్రాంతాల్లో గనులు తవ్వకోడానికి మైనింగ్ కంపెనీలకు, పరిశ్రమలకు అనుమతులు ఆఘమేఘాల మీద వచ్చేస్తున్నాయి. చట్టాలకు తూట్లు పొడిచి మరీ వస్తున్న ఈ అనుమతుల వెనక జరుగుతున్న అధికార మతలబు బహుళ జాతి కంపెనీలు ఆడిస్తున్న నయవంచక నాటకాలుగా అభివర్ణించవచ్చు.

నిజానికి ఒడిశా, ఆంధ్ర, చత్తీస్‌ఘడ్‌లలోని గిరిజన, ఆదివాసి ప్రాంతాలలో స్థానిక గ్రామసభల అనుమతులు లేకుండానే, చట్టాలను సైతం తిరగరాసి, రాజ్యాంగ నిబంధనలను ఉల్లంఘించి మరీ గనుల తవ్వకాలకు కేటాయింపులు, లైసెన్సులు, లీజులు ఇచ్చేస్తున్నారు. తద్వారా ఆయా ప్రాంతాల ఆదివాసి, గిరిజన ఆవాస ప్రాంతాల నుంచి వారికి నివాస వసతులు లేకుండా కూడా చేసేస్తున్నారు. అంతేకాదు, అసలు కేంద్ర పర్యావరణ మంత్రిత్వ శాఖకు ఫైళ్లు రాకుండానే కూడా అనుమతులు ఇచ్చేస్తున్నారు. సాక్షాత్తూ కేంద్ర గిరిజన సంక్షేమ మంత్రే ఈ మాటలు అనడం ప్రజాస్వామ్య ప్రక్రియ ప్రహసనంలో మరో మైలురాయిగా చెప్పుకోవచ్చు. గిరిజన సంక్షేమ మంత్రిత్వ శాఖకు రాకుండానే, నేరుగా పర్యావరణ శాఖకు, ఆపై న్యాయశాఖకు, చివరకు ఏకంగా ప్రధానికి సదరు ఫైళ్లు జాగ్రత్తగా వెళుతున్నాయి. కానీ, అదే క్రమంలో బొగ్గు కుంభకోణాలకు చెందిన ఫైళ్లు మాత్రం ఏకంగా ప్రధాన మంత్రిత్వ కార్యాలయం నుంచే మాయం అవుతున్నాయి. ఇవన్నీ ఏ పరిణామాలకు నిదర్శనమో ఆలోచిస్తే, ప్రజాస్వామ్యం పేరుతో క్రోనీ కాపిటలిజం ఆడిస్తున్న నాటకాలు విస్తుగొలిపిస్తాయి.

అటవీ హక్కుల చట్టంలోని సెక్షన్ –3 ప్రకారం ఆదివాసి ప్రాంతాల లోని గ్రామసభల అనుమతి విధిగా ఉండాలి. దీని ఆధారంగానే అసలు అనుమతుల ఫైళ్లు ప్రాథమికంగా కదలాలి. కాదూ, కూడదంటే, ఒక్క పార్లమెంట్‌కు మాత్రమే ఈ వ్యవహారంపై నిర్ణయం తీసుకోగలుగుతుంది. కానీ, ఇవేవీ లేకుండా మల్టీనేషన్ కంపెనీలకు ఏకంగా అనుమతులు మంజూరు కావడమే బుద్ధిజీవులను కలవరపరుస్తున్న అంశం. ఒడిశా లోని నియాంగిరి కొండల్లో గనులు తవ్వకోడానికి వేదాంత కంపెనీకి ఆ రాష్ట్ర మైనింగ్ కార్పొరేషన్ అడుగులకు మడుగులొత్తడాన్ని, పర్యావరణ శాఖ పరుగెత్తి అనుమతులు తీసుకురావడాన్ని సుప్రీంకోర్టు ప్రశ్నిస్తే తప్ప అసలు ప్రభుత్వాలు కానీ, ప్రజాప్రతినిధులు కానీ, ఈ వ్యవహారంపై నోరు మెదపడం లేదు, సరికదా, అంతా జోహుకుం అంటూ ఎంఎన్‌సిల ముందు సాగిలపడుతున్నారు. చివరకు గత్యంతరం లేని పరిస్థితుల్లో స్థానిక గిరిజనుల, ఆదివాసుల నిరసను గుర్తించిన కోర్టు ఆయా గనులపై అధికారం విషయంలో స్థానిక గ్రామసభల అనుమతి తీసుకోకుండా ఫైళ్లు నడిపే అధికారం మీకెవరిచ్చారంటూ ప్రభుత్వాలను, అధినేతలను , బ్యూరోక్రాట్లను సుప్రీంకోర్టు 2013 ఏప్రిల్‌లో నిలదీసింది. తద్వారా నియాంగిరి కొండల్లో బాక్సైట్ గనుల తవ్వకాలను నిలిపేసింది. షెడ్యూల్డ్ ఏరియా చట్టం 1996 ప్రకారం, గ్రామ సభ అనుమతి తప్పనిసరి అని ఆదేశించింది. దీనినే అటవీ హక్కుల చట్టం కూడా ధృవీకరించిన విషయం మీకు తెలియదా అంటూ సూటిగా ప్రశ్నించింది. అయితే, ఇదిలా ఉంటే, ఇప్పుడా పనిని వదిలేసి, చిన్నచిన్న కంపెనీల పేర్లతో గిరిజన ఆదివాసి ప్రాంతాలలో రోడ్లు, రైల్వే లైన్లు, మౌలిక సదుపాయాల కల్పన పేరుతో కొత్త నాటకం మొదలెట్టింది. ఆయా ప్రాజెక్టులకు అనుమతులు సాధించి అటవీ ప్రాంతాలలో చిన్న ఆక్రమణల నుంచి పెద్ద ఆక్రమణ అనే కుట్ర పూరిత ప్రాజెక్టుల అనుమతులు తీసుకొచ్చుకుంటున్నాయి. దీనికోసం కొత్తగా సవరించిన భూసేకరణ చట్టాన్ని పునరావాస చట్టాన్ని అడ్డగోలుగా ఉపయోగించుకుంటున్నాయి. నిజానికి షెడ్యూల్ ఏరియాల్లో ఇటువంటి భూసేకరణకు కూడా గ్రామ సభల అనుమతి తప్పనిసరి. కానీ, గ్రామ సభల అనుమతి లేకుండా ఏకంగా క్యాబినెట్ ఆమోదాన్ని తెచ్చుకుంటు న్నాయి. దీనిని బట్టి చూస్తే గ్రామసభలను బలి తీసుకునేందుకు క్యాబినెట్‌లు ఎంత పక్కాగా ముందుడుగు వేస్తున్నాయో తెలిసిపోతోంది. ఇంకోవైపు గిరిజన, ఆదివాసి ఆవాన ప్రాంతాలలో పరిశ్రమల ఏర్పాటు వల్ల అభివృద్ధి సాధ్యమవుతుందనే అపోహను సృష్టిస్తున్నాయి. అయితే, అభివృద్ధి అయినా, పరిశ్రమల అవసరాలయినా వాటి గురించి తెలుసుకుని

ప్రశ్నించే హక్కు ప్రజలకు ఉంది. ఇదిలా ఉంటే, ఆంధ్ర, ఒడిశా, చత్తీస్‌గఢ్ వంటి రాష్ట్రాలలోని గిరిజన ఆదివాసి ప్రాంతాలలో, కొండలలో బాక్సైట్ గనులు తవ్వుకోడానికి ఎంఎన్‌సిలకు అనుమతులు కట్టబెట్టేందుకు యుపిఎ-2 రకరకాల నాటకాలు ఆడుతోంది. ఒకే వ్యక్తికి ఒకే ఏడాదిలో మూడేసి మంత్రిత్వ శాఖలు మార్చేందుకు కూడా సాహసం చేస్తున్నది. తద్వారా ఆయా ఫైళ్లను సత్వరం పూర్తి చేసి పంపిస్తున్నది. దీనికి ఉదాహరణే వీరప్ప మొయిలీ. మొన్నటివరకూ న్యాయ శాఖ మంత్రిగా ఉన్న వీరప్ప మొయిలీ, ఇప్పుడు కొత్తగా పర్యావరణ శాఖ మంత్రి అయ్యారు. తద్వారా ఎంతోకాలంగా పర్యావరణ శాఖలో పెండింగ్‌లో ఉన్న ఎంఎన్‌సిల ఫైళ్లన్నింటినీ క్లియర్ చేసే పనిలో పడ్డారాయన. వాటిల్లో మరీ ముఖ్యమైనది ఆంధ్రరాష్ట్రంలోని అన్‌రాక్ కంపెనీకి సంబంధించినది. ఆంధ్రలో జెరాల కొండల్లో ఉన్న బాక్సైట్ గనులను సదరు కంపెనీకి ధారదత్తం చేసేందుకు మొయిలీ పర్యావరణ శాఖ మంత్రిగా వేగంగా చర్యలు చేపడుతున్నారు. ఈ విషయమై ఇప్పటికే కేంద్ర క్యాబినెట్‌లోనూ దీనిపై చర్చ జరిగింది. నర్సీపట్నం దగ్గర అన్‌రాక్ కంపెనీ ఇప్పటికే ఫ్యాక్టరీ కూడా నిర్మించింది. ఎటొచ్చీ ఇక తవ్వకాలు మొదలుపెట్టటమే మిగిలిపోయింది. కొత్తగా రామాయణం రాసిన చేతుల్తో మొయిలీ ఆ ఫైలు పూర్తి చేసి పంపడాన్ని పవిత్ర కార్యంగా స్వీకరించారు. నిజానికి ఈ కొండల్లో బాక్సైట్ తవ్వకాల కోసం జిందాల్ కంపెనీతో సహా దాదాపు 7కు పైగా కంపెనీలు వలపన్ని ఉన్నాయి. చాలాకాలం అక్కడి ప్రజల ఆందోళనలు, చట్టపర పోరాటాలు ఆ వలను నిరోధించాయి. అయినా సరే, రాజ్యాంగంలోని ఆర్టికల్ 244ను సైతం ఫణంగా పెట్టడానికి కూడా ప్రభుత్వాలు సాహసం ప్రదర్శిస్తున్నాయి.

ఇదిలా ఉంటే, రాష్ట్రాలలోని ప్రభుత్వాలతో పనిలేకుండా ఏకంగా కేంద్రమే అమ్మకాలు, పంపకాలు సాగిస్తుండడంపై కొన్ని రాష్ట్రాల్లో నిరసన వ్యక్తమవుతోంది. ఇక కొన్ని రాష్ట్రాలు ఏకంగా కేంద్రంతో తామేం తక్కువ కాదంటూ, స్థానిక గిరిజ, ఆదివాసి ప్రాంతాలను గంపగుత్తగా ఎంఎన్‌సిలకు స్వయంగా ధారాదత్తం చేస్తున్నాయి. ఒడిశా మైనింగ్ కార్పొరేషన్, ఆంధ్రప్రదేశ్ మైనింగ్ కార్పొరేషన్‌లు బడా కంపెనీలకు గిరిజన ఆదివాసి ప్రాంతాలలోని భూములను లీజు పేరుతో ఏకపక్ష అమ్మకాలు సాగిస్తోంది. తద్వారా అధినేతలకు వాటాలు పడేస్తూ కొందరు బ్యూరోక్రాట్లు క్రోనీ క్యాపిటలిజం ముందు చొంగ కార్చుకుంటున్నారు. దీనికి వారు కల్పిస్తున్న మరో భ్రమ, స్థానిక గిరిజనులకు మైనింగ్ కంపెనీల లాభాల్లో వాటాలిస్తామని. ఇలా దేశంలోని అనేక రాష్ట్రాల్లోని గిరిజన, ఆదివాసి ప్రాంతాలలో ఎంఎన్‌సిల మైనింగ్ కంపెనీలకు అనుమతులు ఇచ్చే విషయంలో కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు చట్టాలను కాలరాసి దిగజారుడుతనానికి పరాకాష్టగా ఎదిగిపోతున్నాయి. చడీచప్పుడు లేకుండా ఇదంతా ఓవైపు జరిగిపోతుంటే, ఇటీవల, జనవరి 2వ వారంలో జరిగిన కాంగ్రెస్ వర్కింగ్ కమిటీ సమావేశంలో సోనియా, తాము అటవీహక్కుల చట్టం పక్కాగా ఆచరిస్తామంటూ కంటితుడుపు మాటలు మాట్లాడారు.

ఇటువంటి లోపాయికారీ ఒప్పందాలతోనే కర్నాటకలో గాలి సోదరులు స్థానిక ప్రభుత్వం కేటాయించిన భూమికంటే 50రెట్లు అదనంగా తవ్వకాలు జరిపారు. అలాగని ఆక్కడి స్థానిక ప్రజలకు లాభాల్లో వాటాలిచ్చారా అని మరి ప్రశ్నించాల్సిన అవసరం లేదు. ఇక అక్కడి గిరిజన ప్రజల అవస్థలు వర్ణనాతీతం. ముందస్తు రక్షణ చర్యలు చేపట్టకుండా మైనింగ్ కార్యకలాపాలు నిర్వహించిన కారణంగా రకరకాల వ్యాధుల బారిన పడి వారు మరణాల పాలవుతున్నారు. కనీస జీవనోపాధులు లేక, ఉన్న ప్రాంతం నుంచి గెంటేయబడి, అవిద్య, ఉపాధి లేమి, ఆనారోగ్యంతో వారి కష్టాలను వినే నాథుడు లేదు. ఇదిగో, ఇటువంటి దీనావస్థ నుంచి విముక్తి కలుగుతుందనే ఆశతోనే చాలాచోట్ల గిరిజన ఆదివాసిలు అడవి బాట పడుతున్నారు. క్రోనీక్యాపిటలిస్టులు చట్టాలను తమ చేతుల్లోకి తీసుకుని ప్రజాస్వామ్యహక్కులను కాలరాస్తుంటే, కనీస హక్కులు అడుగుతున్న గిరిజన ఆదివాసిలను అక్రమ కేసుల్లో ఇరికించటం, కాదంటే, మావోయిస్టుల పేరుతో నిర్దాక్షిణ్యంగా చంపి వేయడం చేస్తున్నారు. విచిత్రంగా ఎంఎన్‌సిల అవసరాలు తీర్చేక్రమంలోనే కొంతకాలం పెట్రోలియం శాఖ మంత్రిగా ఉండి, మరో నెల తర్వాత పర్యావరణ శాఖ మంత్రిగా మారి, దీనికి కొనసాగింపుగా న్యాయ శాఖమంత్రిగా కూడా మారటం క్రోనీక్యాపిటలిస్టుల అవసరాలు తీర్చేందుకే కదా అంటే, వారి దగ్గర సమాధానం ఉండదు. వీటన్నింటినీ చూస్తూ, ప్రధానమంత్రి తన పాలనలో సరళీకృత ఆర్థిక విధానాల విష ప్రయోజనాల సత్వర అభివృద్ధిని వేగరి పరుస్తుంటారు. దీనికి ప్రధాన ఉదాహరణ మధ్యప్రదేశ్‌లోని బొగ్గు కుంభకోణమే. అక్కడ మహన్‌మైన్స్ కంపెనీకి షెడ్యూల్డ్ ఏరియాలోని కొన్ని చట్టాలు అడ్డుపడ్డాయి. విచిత్రంగా నూతనంగా భూసేకరణ చట్టం మార్పులు చేర్పులతో వచ్చింది. అనేక మంది గిరిజనులు, ఆదివాసులు ఆయా ప్రాంతాల్లో నివసిస్తున్నప్పటికీ వారిని అక్కడ నుంచి గెంటేసి మరీ ఆ భూమిని కంపెనీకి అప్పగించాయి. కేంద్ర, రాష్ట్రాలు కూడబలుక్కుని మరీ చట్టాలను అతిక్రమించాయి. స్థానిక కోర్టులు, రాష్ట్రాలకు చెందిన హైకోర్టులు పట్టించుకోకపోయిన సందర్భంలో కనీసం సుప్రీంకోర్టయినా కొంచెం స్పందించడం కాస్త ఊరట కలిగించే అంశం. మధ్యప్రదేశ్‌లో బొగ్గు తవ్వకోడానికి అనుమతులు పొందిన కంపెనీలు, సదరు కంపెనీకి మంజూరు చేసిన కంపెనీలకు గ్రామసభ అనుమతులు, పర్యావరణ అనుమతులు చూయించాలని సుప్రీంకోర్టు అనేకసార్లు అడుగుతోంది. 5వ షెడ్యూల్ ప్రాంతంలో బొగ్గు తవ్వకాలకు ఉండాల్సిన అనుమతుల్లో చాలావరకు ధృవీకరణ పత్రాలు చూపించకపోవడమేకాదు, స్థానిక ఆదివాసి గిరిజనులను ఆ ప్రాంతాల నుంచి అక్రమంగా గెంటేయడం, ఈ క్రమంలో వారిపై అక్రమ కేసులు పెట్టటం, వేధింపులకు పాల్పడడం, ఆదివాసి మహిళలను అత్యాచారాలకు గురిచేయడం నిరాటంకంగా జరిగిపోతుండడంతో వారు ప్రజాస్వామ్యంపై కనీస నమ్మకాన్ని కూడా కోల్పోతున్నారు. విచిత్రమేమంటే గిరిజన, ఆదివాసిలకు ఇచ్చిన భూమి హక్కులు, పట్టాల విషయంలో ఇసుమంత కూడా పట్టించుకోని ప్రభుత్వాలు ఎంఎన్‌సి కంపెనీల అనుమతుల విషయంలో కొద్ది ఆలస్యాన్ని కూడా భరించలేకపోవడం.

దేశంలోని గిరిజన ఆదివాసిల జనాభా 10 కోట్ల మంది ఉంటే, వారిలో కేవలం 13 లక్షల మందికే భూమి పట్టాలు మంజూరు కావడం తనకు ఆవేదన కలిగిస్తుందని, సాక్షాత్తూ కేంద్ర గిరిజన సంక్షేమ మంత్రి కిశోర్ చంద్రదేవ్ ఆవేదన వ్యక్తం చేయడం విచారకరం. ఇదే సమయంలో గిరిజన, ఆదివాసి ప్రాంతాలలో పెట్రేగుతున్న చట్టబద్ధ హింసను వ్యతిరేకిస్తూ మావోయిస్టులూ ఆందోళనలు చేపడుతున్నారు. దీనికి ఆదివాసుల మద్దతు ఉండడం సహజం. విచిత్రంగా అధికార కుర్చీలకు అంటకాగుతున్నవాళ్లు, అభివృద్ధి జరిగితే, గిరిజన ప్రాంతాల్లో మావోయిజం ప్రభావం ఉండదు అంటున్నారు కానీ, ఆ అభివృద్ధి ఏ రూపంలో ఉంటుందో సెలవీయరు. క్రోనీ క్యాపిటలిజం ప్రజా ప్రతినిధులకు దేవతా వస్త్రాలు వేసి ఆటలాడిస్తున్నది. సామాన్యజనం చావు బతుకుల మధ్య జీవచ్ఛవాల్లా కాలం వెళ్లదీస్తున్నారు. దీనికి ముగింపు పలకగలిగే శక్తి ప్రజా చైతన్యమే. క్రియాశీల పోరాటా నిర్మాణమే.

*(రచయిత ఫ్రీలాన్స్ జర్నలిస్టు, అధ్యాపకులు)* వీ

# ఆదివాసుల స్వయం పాలన

***ప్రకృతి మీద ఆధారపడి జీవనం సాగించే ఆదివాసులకే అటవీ సంపదపై, అక్కడి సహజ వనరులపై అధికారం ఉండాలనీ, వాటి కోసం స్వయం పాలన కోరుకుంటున్నారనీ అంటున్నారు* దాసరి నివాస్**

ఆదివాసి సమాజంలో సహజవనరుల వినియోగం, వాటిపై నియంత్రణకు సంబంధించిన రాజకీయాలు ఈ నాటివి కావు. బ్రిటిష్ వలస పాలకుల కాలం నుంచి ఈ సమస్య నానుతూనే ఉంది. దట్టమైన పర్వత ప్రాంతాల్లో బతుకు వెళ్లదీస్తున్న స్థానిక జాతులకు, ప్రభుత్వానికి మధ్య ఎన్నో ఘర్షణలు సంభవించిన, 1970 – 1980 దశకాల్లో మాత్రమే ఈ రాజకీయాలు అందరి దృష్టిని ఆకర్షించాయి. పర్యావరణ సంబంధిత అంశాలపై అంతర్జాతీయంగా చైతన్యం వెల్లివిరుస్తున్న దశలో ఈ అంశం దేశవ్యాప్తంగా చర్చనీయాంశమైంది. భూమి, అడవులు వంటి సహజ వనరులపై మాత్రమే ఆధారపడి మరేవిధమైన బతుకుమార్గం తెలియని బడుగుజీవులు, అడుగడుగునా దోపిడికి గురవుతున్న తీరు తీవ్రమైన సమస్యల రూపు సంతరించుకుంది. వలసవాద పాలనకు ముందు, ఆ తరువాత నిరాటకంగా జరిగిన దురాక్రమణలు ఒకవైపు ప్రభుత్వాలు, ప్రభుత్వేతర శక్తులు, విదేశీ కంపెనీలు పద్ధతి ప్రకారం సాగించిన దోపిడి మరోవైపు స్థానిక ప్రజల హక్కుల్ని, సహజ వనరులపై వారికున్న నియంత్రణను క్రమేపి బలహీనం చేయసాగాయి. ఈ దుష్ఫలితాల వల్ల స్వావలంబనతో స్వతంత్రంగా, స్వయం నిర్ణయాధికారంతో జీవిస్తూ వచ్చిన స్థానికులు – వడ్డీ వ్యాపారులు, లేబరు క్రాంటాక్టర్లు, ప్రభుత్వ దళారీలచేతిలో చిక్కి చివరకు సహజ వనరులపై తమ హక్కులు కోల్పోవడమేగాక పరాధీనమైపోయిన బతుకులతో ఉసూరుమంటూ బతకాల్సిన పరిస్థితులు ఏర్పాడ్డాయి.

స్వతంత్రానంతరం తొలి రెండు దశాబ్దాల కాలంలో ఆదివాసిల్లో ఎన్నో ఆశలు రేకత్తాయి. తమ జీవితాలను దుర్భరం చేసిన వలసవాద చట్టాలకు ఇక కాలం చెల్లినట్టేనని వాటి స్థానంలోనే సరికొత్త లక్ష్యాలు ఆశయాలతో కొత్త చట్టాలు జీవం పోసుకొని తమ జీవితాల్లో మెరుగైన ఫలితాలు తీసుకొస్తాయని ఆదివాసులు ఆశించారు. దాని కోసమని దేశంలో అక్కడక్కడ అందోళనలు తిరుగుబాట్లు చేశారు. అయితే తమ నమ్మకం కేవలం భ్రమనేనని తెల్లదొరల స్థానంలోనే నల్లదొరలు వచ్చినా ఫలితం లేదని పాలకుల ఆలోచన దృష్టిలో మార్పురాలేదని అర్థం కావడానికి ఆదివాసులకు ఎంతో కాలం పట్టలేదు. అయితే చిత్తశుద్ధి, నిజాయితీ గల కొందరు ఆదివాసి నేతలు అణగారిన వర్గాల హక్కుల పరిరక్షణకు పాటుపడిన సందర్భాలు కొన్ని లేకపోలేదు. ఇవేమీ ఆదివాసిల్లో రగులుతున్న అసంతృప్తి జ్వాలలను ఆర్పలేకపోయాయి. ఫలితంగా మళ్లీ ఆందోళనలు తిరుగుబాట్లు తలెత్తడం ప్రారంభమైంది. వీరికి భావసారూప్యం ఉన్న కొందరు అధికారులూ, సంస్థలూ, ఉద్యమ పార్టీలూ, విప్లవ సంఘాలూ తోడయ్యాయి. 1980 దశకంలో అప్పటి షెడ్యూల్ కులాల కమిషనర్, బిడి. శర్మ తన రాజ్యాంగబద్ధమైన పదవిని ఉపయోగించి ఆదివాసి జీవితాల దుర్భరావస్థల్ని ప్రభుత్వ దృష్టికి తెచ్చారు. వారి సంక్షేమం పట్ల ప్రభుత్వానికున్న రాజ్యాంగ బాధ్యతను మరోసారి గుర్తుచేశారు. ఈ దశలో ఆదివాసుల పోరాటాలకు మద్దతుగా ఎన్నో స్వరాలు గళమెత్తాయి. బయటి శక్తుల దోపిడి విధానాల నుంచి విముక్తి కల్పిస్తూ మరింత స్వతంత్ర ప్రతిపత్తిని డిమాండ్ చేయసాగాయి. ప్రాంతం, జాతి అనే తేడాల్లేకుండా ఆదివాసులంతా వివిధ కూటములుగా ఏర్పడడం ఈ దశలోని మరో ముఖ్యమైన పరిణామం. భారత జన ఆందోళన, నేషనల్ ఫ్రంట్ ఫర్ ట్రైబల్ సెల్ఫ్ రూల్, ఆదివాసి సంఘం, స్వతంత్ర గిరిజన ఉద్యమ వేదిక వీటితో పాటు ఆంధ్రప్రదేశ్‌లో తుడుంబెబ్బ, గిరిజన సంక్షేమ పరిషత్, ఆదివాసి సంక్షేమ పరిషత్, నాయకపోడు సంఘం, కొండరెడ్ల సంఘాలు వీటిలో ముఖ్యమైనవి. తమ వనరులు దోచుకుంటూ, తమ ఆచార వ్యవహారాలను, సంప్రదాయాలను విచ్ఛిన్నం చేస్తూ పోతున్న రాజ్యం, రాజ్యేతర శక్తులపై ఆదివాసులు దేశవ్యాప్తంగా చేస్తున్న ఆందోళనలకు కలత చెందిన పార్లమెంట్ ఆదివాసి ఎంపి. దిలీప్‌సింగ్ 'భూరియా' నేతృత్వంలో ఒక కమిటీని నియమించింది. దీనిపై కమిటీ 1995లో సవివరమైన నివేదిక సమర్పించింది. నివేదికలో కమిటీ పలు సూచనలు చేసింది. ఆదివాసులకు సొంత పాలన వ్యవస్థ అంటూ ఒక్కటుందని, గ్రామ పెద్దలతో ఏర్పడిన గ్రామ, మండల/ గ్రామ సభ ద్వారా స్వయంపాలన చేసుకుంటోందని ఆదివాసి పాలనలో కీలక కేంద్రంగా చట్టబద్ధంగా దీనిని గుర్తించాలని కమిటీ సూచించింది. అటవీ వనరులు, ఉత్పత్తిపై తమకే నియంత్రణ ఉండాలంటూ అధికార యంత్రాంగ జోక్యాన్ని సాధ్యమైనంతవరకు పరిమితం చేయాలని కూడా కమిటీ కోరింది. ఆదివాసుల వాస్తవ అవసరాలు పాలనా వ్యవస్థ దోపిడి తీరుతెన్నుల గురించి భూరియా కమిటీ చేసిన పలు సిఫారసులను ప్రభుత్వం యథాప్రకారం పెడచెవిన పెట్టింది.

ఈ సమయంలోనే ఆదివాసుల 'మా ఊళ్లో మా రాజ్యం' అనే శక్తిమంతమైన ఏకవాక్య ప్రకటన దేశంలో శక్తివంతంగా ప్రతిధ్వనించింది. ఈ ప్రకటన చూడడానికి దేశం నుంచి విడిపోవాలన్న అర్థాన్ని ధ్వనించినప్పటికి నిజానికీ ఆదివాసుల ఉద్దేశం లేదా అభిమతం అది కాదు! సామాజికంగా, ఆర్థికంగా, రాజకీయంగా, సంస్కృతిపరంగా ఏళ్ల తరబడి ప్రభుత్వాలు, ప్రభుత్వేతర శక్తులు తమపై తమ ప్రాంతాల్లో చేస్తున్న నిరంతర దోపిడి దౌర్జన్యాలకు విముక్తి ప్రసాదించే స్వతంత్ర ప్రతిపత్తి తమకు కల్పించాలన్నదే ఆదివాసుల వాస్తవ మనోగతం, చివరకు

ప్రభుత్వం దిగివచ్చి, ఆదివాసుల స్వయంపాలన హక్కును చట్టబద్ధమైన హక్కుగా గుర్తిస్తూ 1996 డిసెంబర్‌లో పార్లమెంట్‌లో 'పిసా' చట్టానికి ప్రభుత్వం ఆమోద ముద్ర వేయించింది. అయినా ఏజన్సీ ఏరియాలో ఎంతవరకు ఈ ప్రభుత్వం అమలు చేస్తున్నదో ఆదివాసుల సమస్యలు చూస్తే అర్థం అవుతున్నది.

స్థానిక స్వపరిపాలనలో ప్రజలు చురకైన భాగస్వామ్యాన్ని ప్రోత్సహించలన్న సదుద్దేశంతో దేశంలో ప్రయోగాత్మకంగా చేపట్టిన అధికార వికేంద్రీకరణ కూడా ఆశించిన ఫలితాన్ని ఇవ్వలేకపోయింది. గిరిజనులకు సహజ వనరుల నియంత్రణపై ఎలాంటి అధికారాన్ని కట్ట బెట్టలేకపోయింది. పార్లమెంట్ కానీ, రాష్ట్రాలు కానీ చేసే చట్టాలైనా షెడ్యూల్డ్ ప్రాంతాలకు వర్తించకుండా అడ్డుకొవాలన్నా, లేదా కొన్ని మార్పులు చేర్పులతో ఆయా చట్టాలను ఆయా ప్రాతాలకు వర్తింప చేయాలన్నా గవర్నర్లకు విశేషమైన అధికారాలు ఉన్నాయి. వీరికి రాజ్యాంగం ఈ హక్కుల్ని ప్రసాదించింది. కేవలం ఒక నోటిఫికేషన్‌తో గవర్నర్ తమ అధికారాలను ఉపయోగించుకోవచ్చు. అయితే చరిత్రలో ఎప్పుడైనా కానీ, ఎక్కడైనా కానీ గవర్నర్లు ఈ విచక్షణాధికారాల్ని ఉపయోగించిన దాఖాలాలు మచ్చుకైనా మనకు కనిపించవు. దీనికి విరుద్ధంగా – పార్లమెంట్ లేదా రాష్ట్రాలు చేసిన చట్టాలను, అవి స్థానిక జాతుల ఆచారాలు, సంప్రదాయాలు వారి సంస్కృతులకు అనుగుణంగా ఉన్నాయో లేదా కనీసం చూడనైనా చూడకుండా తగువిధంగా మార్పులు, చేర్పులు చేయకుండా వాటిని యథాతథంగా షెడ్యూల్ ప్రాంతాలకు వర్తింప చేసిన సంఘటనలు కోకొల్లలుగా కనిపిస్తాయి. చివరకు వివిధ రాష్ట్రాల్లో అధికార వికేంద్రీకరణ ధ్యేయంగా రూపొందించిన పంచాయతీ రాజ్ చట్టాన్ని కూడా గిరిజన జాతుల ఆచార వ్యవహారాలు, సంప్రదాయాలు మత వ్యవహారాలు, వారి పాలనా వ్యవస్థను సంబంధించిన అంశాలను కనీసంగా కూడా పరిగణనలోకి తీసుకోకుండా షెడ్యూల్డ్ ప్రాంతాలకు వర్తింపచేయడం శోచనీయం! దారుణం !

శతాబ్దాల తరబడి ఆదివాసి వనరులపై నియంత్రణ సాగించిన శక్తులు, అధికారాలు పంపిణీ విషయంలో అడ్డుపడుతున్నారంటే వారి ఆలోచన అర్థం చేసుకోదగ్గదే ! ఈ శక్తులు వివిధ రూపాల్లో ఆదివాసుల సమగ్రతను, ఐక్యతను దెబ్బతీసే ప్రమాదం ఉంది. ఈ నేపథ్యంలో ప్రస్తుత పరిస్థితులపై సీనియర్ ఐఎఎస్ అధికారి హర్షమందిర్ ఆందోళన అర్థం చేసుకోదగ్గదిగా ఉంటుంది. ఎంత తీవ్రమైన అంశమంటే దేశంలో గిరిజన విధానానికి సంబంధించి అంధకారం ఇంకా తొలిగిపోలేదు. రక్షణ చట్టాలు చాలా అరుదుగా అమలవుతున్నాయి. గిరిజన ఉప ప్రణాళికలు అనుకున్న ఫలితాలు సాధించలేకపోయాయి. విద్యా విధానాలు కూడా గిరిజన సంస్కృతి ప్రగతికి దోహదపడడం లేదు. గిరిజన సముదాయాలకు స్వయంపాలన కల్పిస్తూ చేసిన (పిసా) చట్టమొక్కటే ఈ విషయంలో ఆశాకిరణంగా కనిపిస్తోంది. అయితే తానే చేసిన చట్టాన్ని అర్థవంతంగా అమలు చేయడంలో ప్రభుత్వమే ఉదాసీనంగా వ్యవహరిస్తోందంటూ హర్షమందిర్ వ్యాఖ్యలు ఆలోచించదగినవి. వాస్తవానికి చాలా ఆదివాసి ప్రాంతాల్లో 'స్వయం పాలన' అనే భావన మరింతగా దెబ్బతింది. తమ జాతి సంప్రదాయాల్లో వారు ఇంతవరకు అనుభవిస్తూ వచ్చినా హోదా అమర్యాదపాలైంది. ఎన్నికల ప్రక్రియలో పాల్గొంటున్నప్పటికీ వారి ప్రజాస్వామ్య హక్కులకు కనీస రక్షణ లేకుండా పోతుంది. ఎన్నికల వల్ల తమ జీవితాలు మెరుగుపడతాయని, తమకు మెరుగైన పారదర్శకమైన న్యాయం అందుతుందన్న ఆశలు పట్టి భ్రమేనని తేలిపోతుంది. ఫలితంగా ఎన్నికలు తమ చిత్తం కోల్పోయాయి. అలాగే వాటిపట్ల ఆదివాసుల్లో విశ్వాసం కూడ లోపించింది.

ఉదాహరణకు ఏజన్సీ ప్రాంతంలో కేవలం గిరిజనుల, గిరిజనేతరుల మధ్యనే కాకుండా చివరకు గిరిజనేతరులు, గిరిజనేతరులకు మధ్యన కూడా భూమి బదిలీని నిషేధించే చట్టం 1/70 ప్రస్తుతం అమల్లో ఉన్న రెగ్యులేషన్‌పై ఎన్‌జిఒలు, రాజకీయ పార్టీలు, ఇతర విప్లవ సంఘాలు, సమూహాలు భిన్న సిద్ధాంతాలను కలిగి ఉన్నాయి. కొన్ని సిపిఐ(ఎంఎల్) గ్రూపులు 1/70 రెగ్యులేషన్ కచ్చితంగా అమలు జరగాలి అంటుంటే, మరికొన్ని వర్గాలు గిరిజనేతర సన్నకారు రైతులకు ప్రయోజనం కల్పిస్తూ ఈ రెగ్యులేషన్‌కు పాక్షికంగా సవరణ అవసరమని భావిస్తున్నాయి. ప్రధాన స్రవంతిలో ఉన్న కొన్ని రాజకీయ పార్టీలు కూడా ఇదే రకంగా ఆలోచిస్తున్నాయి.

కాబట్టి సహజవనరులపైనే ఆధారపడి జీవించే గిరిజనుల అభీష్టాలకు అవరోధం కల్పించే బయటి శక్తులను పూర్తిగా అరికట్టకలిగే పట్టిష్టమైన గ్రామసభలను ఇక్కడ అభివృద్ధి చేయవలసిన అవసరం ఒకటి కచ్చితంగా ఉంది. అయితే తమ లక్ష్య సాధన కోసం స్థానిక సంస్థల నుండి మద్దతును అది సముచితమైంది. మంచి ఆలోచన అనుకున్నప్పుడు తీసుకుంటే తీసుకోవచ్చు.

గిరిజన స్వయంపాలన అంటే కేవలం కొన్ని నిబంధనలకు కట్టుబడి ఉండడం కాదు. సిద్ధాంతపరమైన (లేదా) విషయ సంబంధమైన అంశాలలో చురగ్గా పాలుపంచుకోవడం కూడా ! అయితే ఈ విషయంలో చట్టం సంకుచితంగా వ్యవహరించడం లేదు అనేది గిరిజనుల అభిప్రాయం.

*(రచయిత అర్థశాస్త్ర పరిశోధక విద్యార్థి, కాకతీయ యూనివర్సిటీ)* వీ

*ఇటీవల పోస్టల్ శాఖ అన్ని మనీ ఆర్డర్‌లను ఎలక్ట్రానిక్ మనీ ఆర్డర్‌లుగా పంపుతున్నది. మీరు ఎం.ఒ. చేసినప్పుడు కింద కూపన్‌లో రాసిన ఉత్తరం, సమాచారం ఈ ఎలక్ట్రానిక్ ఎం.ఒ.లో మాకు చేరదు. కనుక ఎం.ఒ.లు చేసేవారందరూ విడిగా ఒక పోస్ట్‌కార్డు రాయడం గానీ, ఫోన్ చేసి చెప్పడం గానీ చేయాలి. అలాగే, బ్యాంక్ అకౌంట్‌లోకి నగదు బదిలీ చేసినప్పుడు అది ఎందుకో వివరాలు వీక్షణం కార్యాలయానికి ఫోను ద్వారా గాని, కార్డు ద్వారా గాని తెలపాలి. – సం.*

# పెరిగిపోతున్న గ్రీన్‌హంట్ దాడులు

***ఆపరేషన్ గ్రీన్‌హంట్ పేరుతో కేంద్ర ప్రభుత్వం ఆదివాసులపై విధ్వంసకర దాడులు అమలు చేస్తోందనీ, జల్ జంగల్ జమీన్‌ల హక్కుల కోసం పోరాటం చేస్తున్నందుకే ఈ దాడులు జరుగుతున్నాయనీ అంటున్నారు*** **కొర్ర జ్యోతి**

ఒడిశా రాష్ట్రం మల్కన్‌గిరి జిల్లా చిత్రకొండ బ్లాక్ (మండలం) రోళ్లగెడ్డ (72 గ్రామాలు), బొడపొద్దూర్ (18 గ్రామాలు), బొడపడ (16 గ్రామాలు), పప్పరమెట్ట (24 గ్రామాలు) పంచాయితీల పరిధిలో రాజ్యహింస ఏ స్థాయిలో ఉందో పరిశీలిద్దాం! ప్రధానంగా ఈ ప్రాంతంలో ఆదివాసులు జీవనం సాగిస్తున్నారు. తెగల వారిగా చూస్తే ప్రధానంగా కనిపించేది కువ్వి బడియా మిగతా కులాలుగా చూస్తే కొండదొర, నూకదొర, కోయా, భగత కులాలు జీవనం సాగిస్తున్నాయి. వీరి ఆదాయం చూస్తే పోడు (కొండపోడు) వ్యవసాయం మీద వచ్చే ఆదాయం. పంటలను చూస్తే, సోల్లు, సామలు, కందులు (కొండ కందులు). గొచ్చకందులు, చిక్కులు, మెట్ట ధాన్యం, పసుపు (మూడు సంవత్సరాలకు ఒక పంట)లు పండిస్తారు. ఆదివాసులు పండించే పంటలు సంవత్సరంలో 4-5 నెలలు. ఆదివాసులకు చేపలు అంటే చాలా ప్రీతి కావడంతో కొన్ని గ్రామాలు చేపవేట (బలిమెల రిజర్వాయిపై) చేస్తారు. ఇకపోతే మిగతా సమయంలో అడవిపై ఆధారపడాల్సిందే. అడవి నుండి ఆదివాసులను విడదీసి చూడలేం. అడవి నుండి ఆదివాసులను వేరు చేస్తే, సముద్రం నుండి చేపలను వేరు చేసినట్లుగా ఉంటుంది. ఇలాంటి ఆదివాసులపై రాజ్యం ఎందుకు దాడులకు పూనుకుంటుంది? ఆదివాసులు చేసిన పాపం ఏమిటి అనే ప్రశ్నలు వేసుకోవాలి.

ఈ నాలుగు పంచాయితీలు జిల్లా (మల్కన్‌గిరి) హెడ్ క్వార్టర్‌కు కూతవేటు దూరంలో ఉన్నాయి. ఈ ప్రాంతం పచ్చని కొండలతో కూడుకుని ఉంటుంది. ముఖ్యంగా ఖనిజ సంపదతో ఉంటుంది. ఒక్క మాటలో చెప్పాలంటే ఎస్.ఆర్, జిందాల్, మిట్టాల్, టాటా లాంటి కంపెనీలకు ఈ ప్రాంతంపై కన్ను పడింది. ఇక అంతర్జాతీయంగా, జాతీయంగా, ప్రాంతాల (రాష్ట్రాల వారిగా) వారిగా పాలక వర్గాలు, సామ్రాజ్యవాదులు, తీవ్రమైన ఆర్థిక సంక్షోభంలో మోకాళ్లలోతు కూరుకుపోయి కొట్టు మిట్టాడుతున్నారు. 2008లో వచ్చిన సంక్షోభం 1930ల నాటి సంక్షోభాలను తలపిస్తుంది. ఈ సంక్షోభాల నుండి కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు వీరి తైనాతీలైనా సామ్రాజ్యవాదులు బహుళజాతి కంపెనీలతో ఎంఒయులు కుదుర్చుకుని, ఖనిజ సంపదని వెలికి తీయడానికి ఆదివాసి ప్రాంతాల్లో ఉన్న విలువైన ఖనిజాల కోసం మనదేశ పాలకులు ముఖ్యంగా సోనియా, మన్మోమోహన్ సింగ్, చిదంబరం, జైరామ్ రమేష్, సుశీల్ కుమార్ షిండే, వీరికి పాలేరుగా పని చేస్తున్న ఒడిశా రాష్ట్ర ముఖ్యమంత్రి నవీన్ పట్నాయక్ ముమ్మర ప్రయత్నాల్లో భాగంగానే, ఆదివాసులపై ఆపరేషన్ గ్రీన్‌హంట్ -2 దశను అమలు చేస్తున్నారు. ఈ దాడులను ఎదుర్కోవడంలో భాగంగా ఆదివాసులు విలువైన ఆస్తులు, ప్రాణాలు కోల్పోతున్నారు.

ఈ దాడుల ద్వారా తల్లులు పిల్లలను, పిల్లలు తల్లులను, చివరికి కుటుంబాలు, కుటుంబాలే నిర్వాసితులుగా మారి వలస బాట పట్టారు. అక్కడనైన ప్రశాంతంగా బతుకుదామని అనుకుంటే అక్కడి యజమాన్యం ద్వారా ప్రతిరోజు అవమానాలకు, వేదింపులకు గురి కావాల్సి వచ్చింది. ఇలాంటి బతుకుల నుండి ఆదివాసులు ప్రత్యక్షంగా తెలుసుకొని మూడు దశబ్దాల క్రితం జల్ జంగల్ జమీన్‌పై హక్కు కోసం ఆదివాసులు ఉద్యమిస్తున్నారు. ఆదివాసి ఉద్యమాలను రక్తపుటేరులో ముంచడం, పాలక వర్గాలకు, సామ్రాజ్యవాదులకు వెన్నతో పెట్టిన విద్యగా మారింది. 2008లో వచ్చిన సంక్షోభం నుండి బయట పడడానికి మనదేశ పాలకులు మరో అడుగు ముందుకేసి ప్రజా ఉద్యమాలపై 2009-ఆగస్టు-సెప్టెంబర్‌ల నుండి ఆపరేషన్ గ్రీన్ హంట్ దాడులకు పూనుకున్నారు. 2009 నుండి ఎస్.ఆర్. కంపెనీ పైపులైను పనులను అడ్డుకోవడంలో రోళ్లగెడ్డ, పప్పరమెట్ట, బొడపడ, బోడపొద్దూర్ (పంచాయితీలు) ప్రాంత ఆదివాసులు కీలక పాత్రని పోషించారు.

చత్తీస్‌గడ్ (రాష్ట్రం) బైలదిల్లా ప్రాంత ఆదివాసులు, ఎస్.ఆర్ కంపెనీ తవ్వకాల ద్వారా కలుషితమైన నీరు తాగి చర్మ వ్యాధులు, మలేరియా, డైలేరియా వికలాంగుల సమస్య తీవ్రంగా వేదిస్తుంది. ఇలాంటి సమస్యల్ని ఆదివాసులు ప్రత్యక్షంగా అర్థం చేసుకుని ముందు భవిష్యత్ కోసం ఉద్యమిస్తున్నారు. ఈ నాలుగు పంచాయితీలో జరుగుతున్న సంఘటన వీరి కళ్ల ముందు కనిపిస్తుంది. కోరాపుట్ జిల్లా నాల్కొ ప్రాంతం చక్కని ఉదాహరణ. ఈ ప్రాంత ఆదివాసులు తీవ్రమైన వ్యాధుల బారిన పడి గోడు గోడున జీవిస్తున్నారు. మరోపక్క బంగారం లాంటి భూములను కోల్పోయి వారి భూమిలో వారే బానిసలుగా పని చేయాల్సి వస్తుంది. ఇలాంటి బానిస బతుకులను చూపిస్తూ మనదేశ పాలకులు అభివృద్ధి చాంపియన్లమంటూ పార్లమెంట్ ముందు, టివి చానల్స్ ముందు ఊకదంపుడు ఉపన్యాసాలు ఇస్తున్నారు. ఈ ఉపన్యాసాలను చూసి సభ్య సమాజం సిగ్గు పడాల్సిందే.

ఇలాంటి విధ్వంసాలు జరుగుతుంటే ఆదివాసులు ఎలా చూస్తూ ఉండాలి. ఒకవేల వారు చూస్తూ ఉంటే, ఆదివాసులకు మిగిలేది ఏమిలేదు. పాలకులు చివరికి ఆరు అడుగుల జాగ కూడా మిగులకుండ చేస్తారు. ఇలాంటి విషయాలను ఆదివాసులు ప్రత్యక్షంగా తెలుసుకుని రాబోయే ప్రమాదాన్ని అర్థ చేసుకుని ఎస్.ఆర్ కంపెనీ పైప్‌లైన్ పనులను తీవ్రంగా వ్యతిరేకిస్తున్నారు. ఆదివాసి ఉద్యమాలను అణిచివేయడానికి

ఎస్.ఆర్ కంపెనీ యాజమాన్యం, సామ్రాజ్యవాదులు, బహుళజాతి కంపెనీలకు అనుకూలంగా (పాలేరుగా) పనిచేస్తున్న ఒడిశా రాష్ట్ర ముఖ్యమంత్రి నవీన్ పట్నాయక్ 2012 నుండి ఆదివాసి ప్రాంతాలను పోలీస్ కాన్సంట్రేషన్ ప్రాంతాలుగా (యుద్ధ భూమిగా) మార్చాడు. ఈ నాలుగు పంచాయితీల పరిధిలో (భూ భాగంలో) ఆటోగూడ వద్ద 2012 జనవరి మాసంలో బిఎస్ఎఫ్ పోలీసు క్యాంపు ఏర్పాటు చేశారు. దీనికి సపోర్టుగా బొడపడ వద్ద మరో బిఎస్ఎఫ్ క్యాంపును ఏర్పాటు చేశారు. ఈ రెండు క్యాంపుల బలగాలు సమన్వాయంతో గ్రామాలపై దాడులు చేయడం, అక్రమ అరెస్టులు, బూటకపు సరెండర్స్, హత్యలు చేసి మాయం చేయడం, బూటకపు ఎన్‌కౌంటర్లు చేయడం బిఎస్ఎఫ్ పోలీసులకు నిత్య కృత్యంగా మారింది.

ఈ రెండు సంవత్సరాల కాలంలో 400 మంది ఆదివాసులను (పిల్ల, జెల్ల అనే తేడా లేకుండా) బూటకపు సరెండర్స్ చూపిస్తూ (మావోయిస్టు పార్టీ సానుభూతి పరులుగా, మిలిషియా సభ్యులుగా, సంఘ నాయకత్వంగా) వారి నుండి సంప్రదాయ ఆయుధాలు (గొడ్డలి, కత్తి, వెంటిబద్ధ, విల్లంబు, నాటు తుపాకి) స్వాధీనం చేసుకుని వారిని మావోయిస్టులుగా చిత్రీకరించారు. బిఎస్ఎఫ్ బలగాలకు ఆదివాసులు అడవిలో (వేట నిమిత్తం. గొడ్ల కాపురుగా) కనిపించిన, క్యాంపుకు తీసుకువెళ్లి ఫోటోలు తీసుకుంటారు. చివరికు వారపు సంతకు వెళ్లిన బిఎస్ఎఫ్ బలగాలు వేదించి, ప్రతిరోజు క్యాంపుకు రావాల్సిందిగా ఆంక్షలు విధిస్తున్నారు. అంటే ఆదివాసుల బతుకులు రోజు రోజుకు బానిస బతుకులను తలపిస్తుందని చెప్పుకోవాలి. ఇక ఈ నాలుగు పంచాయితీల పరిధిలో షావుకార్లు, రాజకీయ నాయకులు, గ్రామ పెద్దలు (మునిసాబ్) దోపిడికి పట్ట పగలు లేకుండా పోయింది. ఇక రాజకీయ నాయకుల అవినీతికి హద్దులేదు. ఒక బొడపడ ప్రెసిడెంట్ ఇందిరమ్మ ఇల్లు, రోడ్డు కాంట్రాక్టర్‌గా పనిచేస్తూ రెండు సంవత్సరాల కాలంలోనే 35 లక్షల అవినీతి చేసి చిత్రకొండ (బ్లాక్) బిఎస్ఎఫ్ క్యాంపు పక్కన ఉంటూ పంచాయతి ప్రెసిడెంట్‌గా చెలామని అవుతున్నాడు. అంటే ఒక ప్రెసిడెంట్ అవినీతి ఇంత ఉంటే మరి పైస్థాయిలో అవినీతికి అంతేలేదు. ఇలాంటి అవినీతిపరులకు రాజ్యం అన్ని విధాలుగా ఉపయోగపడుతుంది.

ఈ రాజ్యాంగంలో ఉన్న చట్టాలు కూడా ఇలాంటి అవినీతి పరులకే చుట్టాలుగా మారి పనిచేస్తున్నాయి. ఇలాంటి అవినీతి పోరాటాల నుండి జల్ జంగల్ జమీన్‌పై హక్కుల కోసం ఈ నాలుగు పంచాయితీల ఆదివాసులు ఉద్యమిస్తున్నందుకే వీరిపైన కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు ఆపరేషన్ గ్రీన్‌హంట్ -2 దశ (బహుముఖ దాడిని) అమలు చేస్తున్నాయి. ఈ బహుముఖ దాడిలో భాగంగానే 2013 ఫిబ్రవరి 11న షీకుపనస గ్రామంపై దాడిచేసి ఆ గ్రామస్తులను చితకబాది గ్రామ పెద్ద బంగారయ్యను, ఆదే గ్రామంలో ఉన్న భాగ్యను (అనారోగ్యం నిమిత్తం) అక్రమంగా అరెస్టు చేసి, చిత్రహింసలకు గురి చేసి జైల్లో బంధించారు. గత సంవత్సరం గజ్జెడి (గాసీ), జీన్‌భా (తోపోన్, సోప్పోన్, రత్తోన్), దగ్గుడుపల్లి (లక్ష్మణ్‌రావు), పన్గరేవు (వీర), బైలుగుమని (ధావిట్) లను మరీ ముఖ్యంగా వందల మందిని అక్రమంగా నిర్బంధించారు. జీన్‌భా, తోపోన్, సోప్పోన్, రత్తోన్ (ఒకే కుటుంబం అన్నతమ్ములు)ల తల్లితండ్రులు, భార్య, పిల్లలు వీథిన పడ్డారు. ఇలాంటి వందల కుటుంబాలు రాజ్య హింసకు గురవుతున్నాయి. 2013 జూలై 2న మల్కన్‌గిరి జిల్లా రోళ్లగెడ్డ గ్రామం అయిన డబ్బలపాడుపై బిఎస్ఎఫ్ పోలీసులు దాడి చేసి గ్రామస్తులను చితకబాది గొడ్డు మాంసంను వెదజల్లి ధ్వంసం చేయడంతో గ్రామస్తులు తిరగబడగా, వెనుతిరిగి పోయారు. అంటే రాజ్యం చివరికి ఆదివాసుల తిండిని కూడా ధ్వంసం చేస్తోంది. ఇదే తరహాలో 2013 జూలై 22న వేళంపాకల గ్రామంపై దాడి చేసి బెన్ను (వేను) అనే ఆదివాసిని పట్టుకుని తీవ్రమైన చిత్రహింసలకు గురిచేసి, హత్య చేసి మాయం చేశారు. ఇలాంటి గాథల నుండి తేరుకోక ముందే మరోసారి జవాభా (ఆంధ్రప్రదేశ్) గ్రామంపై ఆంధ్ర, ఒడిశా పోలీసులు దళారీ నిరంకుశ వర్గమైన ఎస్. ఆర్. కంపెనీ (యాజమాన్యం 30 మంది పోలీసులు వాళ్లు కలిసి ఆగస్టు -7న దాడి చేసి 30 ఇళ్లు ధ్వంసం చేసి నాలుగు తులాల బంగారం, 1,80,000 రూపాయలు, చీరలు, దుప్పట్లు 5 లక్షల విలువైన ఆస్తిని ధ్వంసం చేసి, 8 మందిని గాయపర్చారు. 5 మంది మహిళల్ని తీవ్రంగా కొట్టడంతో ఒక వృద్ధురాలు చావు బతుకుల మధ్య ఉంది. మత్స్యలింగంను అక్రమంగా అరెస్టు చేసి తీవ్రంగా హింసించారు. అంటే కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు దళారీ నిరంకుశ వర్గానికి, సామ్రాజ్యవాదుల ప్రయోజనాలకు ఎంత అంకితమై పని చేస్తున్నాయో మనం ఇక్కడే అర్థం చేసుకోవాల్సిన అవసరం ఉంది. ముఖ్యంగా ఆదివాసి ప్రాంతాలపై, దేశ పీడిత ప్రజలపై ఆపరేషన్ గ్రీన్‌హంట్-2 దశని మరింత క్రూరంగా అమలు చేస్తున్నాయి.

ముఖ్యంగా మన దేశ పాలకులు అమెరికా సామ్రాజ్యవాదులు రూపొందించిన ఎల్ఐసి (లో ఇన్‌టెన్సిటీ కాంఫ్లిక్ట్) బహుముఖ దాడిని ఆదివాసి ప్రజలపై తీవ్రంగా అమలు చేస్తున్నారు. ఇలాంటి ఆపరేషన్ గ్రీన్ హంట్ దాడులను ఎదుర్కోవాలంటే దేశ పీడిత ప్రజలు ఐక్యంగా ఉండి, సాయుధ పోరాటం ద్వారానే ఇలాంటి దాడులనుతిప్పికొడతారు. మన ప్రజలు అప్రమత్తంగా లేకపోతే దేశ పాలకులు మనకు ఆరు అడుగుల భూమిని కూడా మిగలకుండా తన్నుకు పోతారు. అడవిని, భూమిని కాపాడుకోవాలి అంటే, ముఖ్యంగా దోపిడి దారులను (భూస్వాములు, సామ్రాజ్యవాదులు, దళారీ నిరంకుశ వర్గం) తరిమికొట్టాలంటే, సాయుధ పోరాటమే ఏకైక మార్గంగా కనిపిస్తుంది. దేశాన్ని దోచుకుంటున్న వారిని తరిమికొట్టి ప్రజా రాజ్యాధికారం నిర్మించుకోవాలి.

*(రచయిత ఆదివాసి మహిళా సంఘం కార్యకర్త)* వీ

*వీక్షణంకు వచ్చే రచనలలో కొన్ని జిరాక్స్ కాపీలు వస్తున్నాయి. జిరాక్స్ నాణ్యత సరిగా ఉండడంలేదు. కొన్నిటిలో చేతి రాతలు కూడా కష్టంగా ఉంటున్నాయి. అందువల్ల అర్థం చేసుకొని టైప్ చేయడంలో చాలా ఇబ్బందులు, సమస్యలు ఎదురవుతున్నాయి. అక్షరాలు అర్థమయ్యేలా రాయండి. జిరాక్స్ మీరు ఉంచుకుని ఒరిజినల్స్ మాకు పంపి సహకరించండి. - సం.*

# స్త్రీలపై అత్యాచారాలు ఆపడమెలా?

***స్త్రీలపై జరుగుతున్న అత్యాచారాల నిరోధానికి ప్రభుత్వాలు చేసే చట్టాలు పరిష్కారాలు చూపవనీ, సమాజం మొత్తం చైతన్యవంతంగా ఆలోచించాలనీ, అత్యాచారాలను నిరోధించే బాధ్యత అందరి మీద ఉందనీ అంటున్నారు* రోజా రమణి**

స్త్రీలపై అత్యాచారాలు అనేది కేవలం నేటి సమస్యకాదు. మానవ జాతి చరిత్రలో ఆదిమ దశ దాటిన తరువాత నుండి ఈ సమాజంలో స్త్రీ రెండవ శ్రేణి పౌరురాలుగా మారింది. స్త్రీలపై ఈ వివక్షతకు మూలాలు వెతుకుతూ పోతే, అది వ్యక్తిగత ఆస్తి పుట్టుకతో ముడిపడి ఉందని చెప్పక తప్పదు. ఈ వివక్షత కుటుంబంలోనూ, బయటి సమాజంలోనూ క్రమక్రమంగా వ్యవస్థీకృతమైంది. స్త్రీ ఈ సమాజంలో సమాన భాగమున్న మనుషులుగా కాక పురుషుల ఆస్తిగా మారిపోయిన స్థితి ఉంది.

చరిత్రను పరిశీలిస్తే యుద్ధాలలో గెలిచిన వర్గం వారు, ఓడిపోయిన వర్గంలోని స్త్రీలను కూడా, వారి ఇష్టాయిష్టాలతో సంబంధం లేకుండా సొంతం చేసుకోవడం గమనిస్తాం. ఇలాంటి అవమానాలు తప్పించుకోవడానికి చాలా మంది ఓడిపోయిన వర్గంలోని స్త్రీలు, తమ భర్తలు చనిపోయిన విషయం తెలిసిన వెంటే తాము కూడా ఆత్మహత్యలు చేసుకుని చనిపోయిన విషయం కూడా మనకు తెలుసు. భర్తలు చనిపోయినపుడు, సతీసహగమనం పేరుతో భార్యలను కూడా వారితో పాటుగా బలవంతంగా తగులబెట్టిన ఘనత కూడా మనకు ఉంది.

మన సమాజంలోని కుటుంబాలు కూడా పురుషాధిక్య భావజాలంతో నిండి ఉన్నాయి. పుట్టినప్పటి నుండి ఆడపిల్లలకు, మగ పిల్లలకు మధ్య తేడాలు కనిపిస్తున్నాయి. వారు కట్టుకునే బట్టలు వేరు, ఆడుకునే వస్తువులు కూడా వేరు. ఆడపిల్లలు సుకుమారంగా, అందంగా ఉండడమే ముఖ్యమని కుటుంబంలో ఆప్తులైన తల్లిదండ్రులే మొట్టమొదట నేర్పిస్తారు. వారు సదా మగవారి రక్షణలోనే ఉండాలని, అలా లేకుంటే వారు అత్యాచారాలకు గురి అవుతారని, కుటుంబం, బయటి సమాజం కూడా ఆడ పిల్లలను ఎల్లప్పుడు అదుపులో ఉంచుతూ, వారిపై పోలీసు కాపాలా కాస్తుంటుంది. అదే కుటుంబం, సమాజం మగ పిల్లలకు మాత్రం అందం కన్నా, ధైర్యమే ముఖ్యమని వారు బలంగా ఉండాలని తమ ఆడ పిల్లలను కాపాడవలసిన బాధ్యత వారిదేనని నేర్పిస్తుంది. ఈ విధంగా కుటుంబం, సమాజం ఆడ పిల్లలను శారీరకంగా పూర్తి బలహీనంగా తయారు చేస్తున్నపుడు, ఆమెకు స్వీయ రక్షణకు అవకాశం ఎక్కడ?

ఏ సమాజంలోనైనా సాహిత్యం, కళలు ఆ సమాజ లక్షణాలను ఎంతోకొంత మేరకు ప్రతిబింబిస్తాయి. నేటి ఆధునిక సమాజంలో సినిమాలు, సీరియళ్లు ఆడవారిని ఏడిపించిగాని, బలవంతంగానైనా సొంతం చేసుకోవడమే మగ లక్షణంగా ప్రచారం చేస్తున్నాయి. స్త్రీలు కూడా మనుషులేనని వారి అభిప్రాయాలకు విలువ ఇవ్వాలని స్పృహ లేకుండా వారిని దౌర్జన్యంగానైనా సొంతం చేసుకోవడమే ప్రేమ అని తప్పుడు ప్రచారం చేస్తున్నాయి. ప్రేమ అనేది మానసిక శక్తితో పొందవలసిన అంశంగా కాక శారీరక బలంతో పొందే విషయంగా చూపించడం నిజంగా మన దౌర్భాగ్యం.

స్త్రీలపై జరుగుతున్న అత్యాచారాలకు అసలు మూలం ఎక్కడ అనేది వెతకకుండా కొంతమంది అది నేటి ఆధునిక స్త్రీల వస్త్రధారణలోనే ఉంది అని తేల్చేస్తున్నారు. కాని మనం గమనించవలసిన విషయం రోజు అత్యాచారాలకు గురయ్యే వారిలో పొలాల్లో పనిచేసే మహిళా కూలీలు, నెలల పసిపాపల నుండి 60 సంవత్సరాలు పైబడిన ముసలవ్వలు కూడా మెజారిటీగా ఉన్నారు. వీరు ఎలాంటి వస్త్రధారణ చేస్తారో మనకందరికి తెలుసు. సినిమాల్లో చూపించే విధంగా వస్త్రధారణ అధిక శాతం కాలేజ్ అమ్మాయిలు కూడా అనుకరించడం లేదు అనేది సత్యం. ఒకవేళ నిజంగానే ఒక అమ్మాయి వస్త్రధారణ సరిగా లేదు అనుకుందాం. ఆ కారణం చేతనే ఆ అమ్మాయిపై అత్యాచారం చేసే హక్కు మగవారికి ఎలా వస్తుంది? కనుక ఈ అత్యాచారాలకు మూలం, వస్త్రధారణలో కాదు. మన సమాజంలోని పురుషాధిక్య భావజాలంలో వెతకవలసిన అవసరం ఉంది.

స్త్రీలు అనగానే సమాజంలోని స్త్రీలందరు అని మనం అనుకోలేం. ఎందుకంటే మన సమాజంలో స్త్రీలు కులాల వారిగా, మతాల వారిగా, వర్గాల వారిగా, జాతుల వారిగా ఇంకా రకరకాలుగా విడిపోయినారు. ఒక స్త్రీ ఏ కులం, ఏ జాతి, ఏ మతం, ఏ వర్గం అనే దానిపై ఆధారపడి ఆమెపై జరిగే అత్యాచారం, అవమానాలు, దౌర్జన్యాలు వేరు వేరుగా ఉంటాయి. ఉదాహరణకు మనం ఈ మధ్యలో ఢిల్లీలో పారామెడికల్ విద్యార్థినిపై జరిగిన అత్యాచారాన్ని తీసుకుంటే ఈ సంఘటనకు సమాజంలోని మెజారిటీ విద్యార్థి, మేధావి వర్గాలు స్పందించాయి. తమ గొంతులు వినిపించాయి. ఫలితంగా ప్రభుత్వం నిర్భయ చట్టం చేయవలసిన పరిస్థితి ఏర్పడింది. ఈ చట్టం అమలు ఎలాగయినా ఉండని, అసలు ఒక చట్టం (మంచి) అనేది రావడం కూడా ఆ పోరాటాల గెలుపే. ఇంతవరకు మనం దీనిని అర్థం చేసుకోవచ్చు. కాని ఇదే విద్యార్థి, మేధావి వర్గాలు ఒక పేద, దళిత మహిళపై అత్యాచారం జరిగినపుడు ఎందుకు స్పందించడం లేదు? అప్పుడు కేవలం కొన్ని మహిళా, దళిత, కమ్యూనిస్టు సంఘాలు మాత్రమే ఎందుకు స్పందిస్తున్నాయి? ఈ ప్రశ్నలు కూడా మనకు మనమే వేసుకోవాలి. అప్పుడే మనకు సమాజంలో స్త్రీలు అందరు సమాన స్థాయిలో లేరని, అందువల్లనే వారిపై అత్యాచారాలు జరిగినపుడు సమాజం స్పందించే తీరు కూడా వేరువేరుగా ఉంటుందని మనకు అర్థమవుతుంది.

ఒక స్త్రీ పై అత్యాచారం జరిగినప్పుడు, ఆ నేరానికి పాల్పడ్డ నేరస్తుడిని శిక్షించడం పోయి మన సమాజం మొదటగా ఆ అమ్మాయి ప్రవర్తన మంచిది కాదా? ఆమె శీలవతి అవునా, కాదా అని శల్య పరీక్షలు చేసి ఆమె మంచి ప్రవర్తన లేనిది కనుకనే ఆమెపై అత్యాచారం జరిగింది అని చాలా సార్లు నిర్ధారించడం మనం చూస్తున్నాం. కాని చట్ట ప్రకారం ఆమె ప్రవర్తనతో సంబంధం లేకుండా ఏ మగ వాడయినా ఆమె ఒప్పుదల లేకుండా లైంగిక అత్యాచారానికి పాల్పడడం నేరం. కాని మన సమాజంలో పెళ్లి పేరుతో భార్యను ఇష్టం లేకున్నా, భర్తలు వారిపై చేస్తున్న లైంగిక అత్యాచారాలకు, కుటుంబాలలో బాలికలపై ఆ

# రోగమొస్తే మరణమే దిక్కు

***ఆదివాసి ప్రాంతాల్లో అకాల మరణాలకు గురవుతున్న ప్రజలకు కనీస ఆరోగ్య వసతులు కల్పించకుండా ప్రభుత్వం చేపడుతున్న ప్రజా వ్యతిరేక విధానాలను ప్రజాస్వామిక వాదులు ప్రతిఘటించాలని అంటున్నారు ఎం. నాగమణి***

'మహా భాగ్యవంతులకే ఆర్యోగం' అన్నట్లుగా ఏటికేడు పరిస్థితులు దిగజారుతున్న వర్ధమాన దేశం మనది. 'మంచి ఆరోగ్యమన్నది ఈ దేశంలో ప్రతి పౌరుడి హక్కు'. రోగాలూ, రోష్టులకూ మందు మాకూ కొనుక్కొనే ఆర్థిక స్థోమత లేక అర్థాయుష్కు వధ్యశిలపై ఏటా కోట్లాది బతుకులు తెగటారిపోతున్నాయి. మెడికల్, పారామెడికల్ సిబ్బందితో పాటు, మందులు, రోగ నిర్ధారణ సేవలు కొరవడి ప్రభుత్వరంగంలో వైద్య సేవలు ప్రమాదకర స్థితికి చేరాయని ప్రణాళికా సంఘమే మొత్తుకుంటోంది. అర్ధాంతరంగా ప్రాణం మీదకి వస్తే ప్రైవేట్ వైద్యమే దిక్కు అయిన కుచేల భారతం, మందుల ధరాభారం భరించలేక బావురుమంటుంది. ఈ దయనీయ దుస్థితి నేపథ్యం మన్యం ఆదివాసి విద్యార్థినీ, విద్యార్థులు ఆరోగ్య సేవలకు సంబంధించిన విశ్లేషణే ఈ వ్యాసం ముఖ్యోద్దేశ్యం.

ఆదివాసుల సాంప్రదాయ ఆహారపు అలవాట్లు రక్తహీనతకు ప్రధాన కారణంగా వైద్యులు చెపుతున్నారు. ఆదివాసుల్లో ఎక్కువగా అపక్వ ఆహారం తీసుకునే అలావాటు ఉంటుంది. చెలమల్లో నీరు తాగడం, కాళ్లకు, శరీరానికీ ఆచ్ఛాదన తక్కువగా ఉండడం వంటి కారణాలతో వారి శరీరంలోకి నులిపురుగులు ఎక్కువగా చేరి రక్తహీనతకు కారణమవుతున్నాయి. సహజంగా ఆదివాసి ప్రాంతాలన్నీ ఎక్కువ ఎత్తులో ఉండడంతో ఇక్కడ లభ్యమయ్యే నీటిలో ఖనిజ లవణాలుండవు, ఇది కూడా ఆదివాసి చిన్నారుల్లో రక్తహీనతకు దారితీస్తుంది. రక్తహీనతతో బాధపడే చిన్నారులు మలేరియా, టైఫాయిడ్, ఇతర జ్వరాల బారిన పడినప్పుడు తట్టుకోలేక ప్రాణాలు కోల్పోతున్నారు.

ఆదివాసి విద్యార్థుల్లో రక్తహీనత ఎక్కువగానే ఉంది. ఈ సమస్యతో అనేక మంది విద్యార్థినీ, విద్యార్థులు ప్రాణాలు కోల్పోయారు. ఇలాంటి విషాదాలు మన్యసీమల్లో సర్వ సాధారణంగా మారాయి. పౌష్టికాహార లోపం కారణంగా తలెత్తే రక్తహీనత కారణంగా గిరిజనుల బిడ్డలు చిన్నపాటి జ్వరాలకే కుప్పకూలిపోతున్నారు. రాష్ట్రంలోని మొత్తం 10 ఐటిడిఎల పరిధిలోని సుమారు 572 వసతి గృహాలున్నాయి. వీటిలో సుమారు 90 వేలమంది ఆదివాసి విద్యార్థులు విద్య నభ్యసిస్తున్నారు. పలు గిరిజన ఆశ్రమ పాఠశాలల్లో జరిపిన వైద్య, రక్త పరీక్షల్లో 50 శాతం మందికి రక్తంలో హిమోగ్లోబిన్ శాతం 9 లోపే ఉన్నట్టు గుర్తించారు. సాధారణంగా చిన్నారుల్లో 11 నుంచి 14 శాతం వరకు హిమోగ్లోబిన్ ఉండాలి.

గత ఏడాది తూర్పు గోదావరి జిల్లా రంపచోడవరం ఏజెన్సీలోని 79 వసతి గృహాల్లో చదువుతున్న సుమారు 12 వేల మంది విద్యార్థులకు వైద్య పరీక్షలు నిర్వహించగా 50 శాతం మందికి కేవలం 6 నుంచి 7

---

కుటుంబాలకే చెందిన మగవారు చేస్తున్న అత్యాచారాలకు అసలు లెక్క లేదు. ఇవన్ని ఏ స్టేషన్‌లోను, ఏ కోర్టుల్లోను నమోదు కావడం లేదు.

ఒక స్త్రీపై అత్యాచారం జరిగినది అని అన్నపుడు చట్టం, నిజంగా ఆమెపై అత్యాచారం జరిగిందా? లేదా? అనేది నిర్ణయించడానికి కేవలం శారీరక సంబంధమైన విషయాలు మాత్రమే పరిగణనలోనికి తీసుకుంటుంది. కాని నిజంగా ఒకవేళ అక్కడ శరీరాల కలయిక జరుగక పోయినా, అసలు ఒక స్త్రీని, ఆమె అంగీకారం లేకుండా ముట్టుకోవడం, ఆమెపై అత్యాచారం చేయాలని ప్రయత్నంచేయడం కూడా ఆమెకు ఎంత మానసిన క్షోభను కలిగిస్తాయో ఈ చట్టాల కఠినమైన హృదయాలకు ఎంత మాత్రం అర్థం కాదు. శరీరాల కలయిక కేవలం శరీరాలకు మాత్రమే సంబంధించినది కాదని దానికి మనసుల కలయిక పునాదిగా ఉండాలనే సున్నితమైన విషయాలను ఈ సమాజం అర్థం చేసుకోనంత వరకు ఇలాంటి అత్యాచారాల వలన కాని, అత్యాచార యత్నాల వలన కాని, ఆ బాధిత స్త్రీలు ఎంతటి మానసిక వేదనకు గురవుతారో, వారి భావి జీవితాలపై ఈ ఘటనలు ఎలాంటి ప్రభావం చూపుతాయో పురుషాధిక్య భావజాలంతో నిండి ఉన్న ఈ సమాజం అర్థం చేసుకోలేదు.

స్త్రీలపై జరిగే అత్యాచారాలను అరికట్టడానికి తీవ్రమైన శిక్షలు వేయాలని, ఉరిశిక్షలు, బహిరంగ శిక్షలు వేయాలని చాలా మంది వాదిస్తుంటారు. తప్పు చేసిన వారిని శిక్షించడం కేవలం ఒక అంశం మాత్రమే. ఈ శిక్షల వలన మరల అలాంటివి జరగకుండా ఆపలేమనేది వాస్తవం. ఇక్కడ గమనించవలసిన మరో విషయం కఠినమైన శిక్షలు అమలు జరిపే దేశాలలో కూడా నేర శాతం ఏ మాత్రం తక్కువగా లేదు. అందువల్ల తప్పు చేసిన వారిని శిక్షించడంతో పాటుగా, మరల అలాంటి సంఘటనలు జరగకుండా చూడవలసిన బాధ్యత కూడా ఉంది.

స్త్రీలు కూడా ఈ సమాజ నిర్మాణంలో సగ భాగం కల వారు అని వారికి సొంత అభిప్రాయాలు ఉంటాయని, వాటిని గౌరవించవలసిన బాధ్యత ప్రతి ఒక్కరిది అని గుర్తించే సమాజం కొరకు మనం అందరం పోరాటం చేయాలి. చివరిగా ప్రేమ తప్ప స్త్రీ, పురుషుల మధ్య సంబంధంలో ఎటువంటి పెత్తనాలు, దౌర్జన్యాలు ఉండకూడదు అని ప్రతి ఒక్కరు గ్రహించిన రోజే ఈ అత్యాచారాలకు అంతం. కాని ఈ మార్పు దానంతట అది రాదు. ఏ దేవుడో దయతలచి వరం ప్రసాదించడు. స్త్రీలందరు కలసి పోరాటం చేయవలసినదే కాని వేరే సులభమైన మార్గం లేదు. ఏ జాతి అయిన, ఏ మతం అయినా, ఏ కులం అయినా, ఏ వర్గం అయినా స్త్రీలందరు ఏదో విధంగా పురుషాహంకారానికి బలవుతున్నారు. కనుక స్త్రీలందరూ తమ, జాతి, కుల, వర్గ, మత, ప్రాంతీయ ఇంకా రకరకాల విభేదాలను వదిలించుకొని తమపై జరుగుతున్న ఈ అత్యాచారాలకు, దౌర్జన్యాలకు వ్యతిరేకంగా సమరశంఖం పూరించాలి.

*(రచయిత వివరాలు రాయలేదు)* వీ

శాతమే హిమోగ్లోబిన్ ఉన్నట్లు తేలింది. సీతంపేట, పార్వతీపురం, పాడేరు ఐటిడిఎ పరిధిలో 270 వరకూ వసతి గృహాల్లో చదువుతున్న 65 వేల మంది చిన్నారులున్నారు. వారిలో 60 శాతం మంది చిన్నారులకు 9 శాతం లోపే హిమోగ్లోబిన్ ఉన్నట్లు గుర్తించారు. ఆదిలాబాదు జిల్లాలో ఈ ఏడాది జూలై – ఆగస్టు మాసాల్లో వైద్యాధికారులు ర్యాపిడ్ ఫీవర్ సర్వే నిర్వహించారు. సుమారు 25 వేల మంది చిన్నారులను పరీక్షించగా 9190 మందికి రక్తహీనత ఉన్నట్లు గుర్తించారు. భద్రాచలం ఐటిడిఎ పరిధిలో 74 గిరిజన ఆశ్రమ పాఠశాలల్లో 20 వేల మంది చిన్నారుల్లో 62 శాతం మంది రక్తహీనతతో బాధపడుతున్నారు.

మాటల్లోనే పోషకాహారం... 1971 నుంచీ గిరిజన వసతి గృహాల్లో ప్రత్యేక పోషకాహార కార్యక్రమాన్ని అమలు చేస్తున్నారు. ప్రతి విద్యార్థికీ కనీసం 400 క్యాలరీల ప్రోటీన్లు, 16 గ్రాముల విటమిన్లు అందజేయాలని రూపొందించారు. కానీ రక్తహీనతను నివారించే ఐరన్‌ను అందించే ఆహారం మాత్రం ఈ మెనూలో ఉండదు. ఆశ్రమ పాఠశాలలో చిన్నారులకు రక్షిత తాగు నీటిని అందించాలని ఏర్పాటు చేసిన ఆర్ఒ ప్లాంట్లు, ఏర్పాటు చేసిన 6 నెలలకే అటకెక్కాయి. అడవి జంతువులకూ, క్రూర మృగాలకూ ఉన్న రక్షణ ఈ దేశ మూలవాసులైన ఆదివాసులకు లేదు. అభయారణ్యం, వన్యప్రాణుల సంరక్షణ పేరుతో మన పాలకుల జంతువులకు అడవిలో రక్షణ కేంద్రాలను ఏర్పాటు చేస్తున్నారు. వేసవి కాలంలో వాటికి తాగు నీటి కోసం ప్రత్యేక ఏర్పాట్లు చేస్తున్నారు. కానీ అడవి బిడ్డల ప్రాణాలకు రక్షణ లేకుండా పోయింది. కలుషితమైన తాగునీరు, పోషకాహార లేమితో దేశవ్యాప్తంగా ఏటా వేలాది మంది ఆదివాసులు విష జ్వరాల బారినపడి మరణిస్తున్నారు. వైద్య సదుపాయం అందుబాటులో లేక అడవిబిడ్డలు పిట్టల్లా రాలిపోతున్నారు. క్రూర మృగాలపై చూపించే శ్రద్ధలో ఒక్క శాతం కూడా మన పాలకులు ఆదివాసులపై చూపించడం లేదు. పైగా ఆదివాసులను అడవి నుంచి తరిమివేయడానికి అనేక ప్రయత్నాలు చేస్తున్నారు.

అనారోగ్యం బారిన పడే విద్యార్థులను, ఆశ్రమ పాఠశాలల సిబ్బంది గానీ, అధికార యంత్రాంగం గానీ అంతగా పట్టించుకోవడం లేదు. వీలైనంతలో అలాంటి పిల్లలను వారి ఇళ్లకు పంపేయడానికే ప్రాధాన్యత ఇస్తున్నారు. అసలే వైద్య సదుపాయాలు అంతంత మాత్రంగా ఉండే గిరిజన పల్లెలకు అనారోగ్యంతో వెళ్లిన పిల్లలు వెనువెంటనే మృత్యువాత పడుతున్నారు. సకాలంలో వైద్యం అందక ఈ ఏడాది రాష్ట్ర వ్యాప్తంగా అనేక మంది గిరిజన విద్యార్థులు మృతి చెందారు. ప్రభుత్వం నుండి ఎలాంటి నిధులు అందకపోవడంతో వసతి గృహ సిబ్బందే సొంత డబ్బులతో అనారోగ్యం బారిన పడ్డ విద్యార్థులను పిహెచ్‌సిలకు తీసుకెళ్లాల్సిన దుస్థితి. ఏజెన్సీలో సుమారు 20–30 కిలో మీటర్లు వెళ్తేగానీ పిహెచ్‌సిలు అందుబాటులో ఉండే పరిస్థితి లేదు. దీంతో చాలా మంది వార్డెన్లు, ఉపాధ్యాయులు, విద్యార్థుల పరిస్థితి బాగా విషమించే దాకా స్థానిక ఎఎన్ఎంలతో వైద్యం చేయిస్తున్నారు. ప్రతి 15 రోజులకు ఒకసారి సమీపంలోని పిహెచ్‌సి వైద్యాధికారులు ఆశ్రమ పాఠశాలల్లో వైద్య పరీక్షలు నిర్వహించాల్సి ఉన్నా, ఎక్కడా అవి అమలు కావడం లేదు. రెండు, మూడు నెలలకు ఒకసారి కూడా పరీక్షలు చేయడం లేదు. ఏజెన్సీలోని ప్రాథమిక ఆరోగ్య కేంద్రాల్లో రక్తం గ్రూపు, హిమోగ్లోబిన్ శాతం తెలుసుకోవడం వంటి పరీక్షలు నిర్వహించాలి. రాష్ట్ర వ్యాప్తంగా 10 ఐటిడిఎల పరిధిలోని 274 పిహెచ్‌సిలు ఉండగా వాటిలో 60 పిహెచ్‌సిల్లో రక్తం గ్రూపు గుర్తించే సదుపాయాలు లేవు. మిగిలిన పిహెచ్‌సిలలో సైతం రక్త పరీక్షలు నిర్వహించడానికి అవసరమైన స్లైడ్లు, పిక్సేటర్లు, రీఏజెంట్లు అందుబాటులో ఉండడం లేదు.

పేదరికాన్ని, దాని కవలలైన ఆకలి, అనారోగ్యాల్నీ తుదముట్టిస్తామనీ స్వాతంత్ర్య భానూదయ వేళ జాతి నేతలు వాగ్దానం చేసిన ఆరునర దశాబ్దాలుగా పేదరికం మలిగింది లేదు. ఆకలీ అనారోగ్యాలు తరిగింది లేదు. గ్రామీణ భారతంలో పేదల రుణాల ఊబిలో కూరుకుపోవడానికి వైద్య ఖర్చులే ప్రధాన కారణంగా నిలుస్తున్నాయని పలు అధ్యయనాలు చాటుతున్నాయి. అడవినే నమ్ముకుని చాలీ చాలని బతుకులతో బతుకు నావ నడుపుతున్న ఆదివాసులకు వైద్యం ఎప్పటికీ అందని ద్రాక్షే. ఆమ్ ఆద్మీకి ఏదో మేలు చేస్తామంటూ అందలమెక్కిన పాలకులు ఇప్పుడు అందుకు విరుద్ధంగా సామాన్యుడి వెన్ను విరిచే చర్యలకు పాల్పడు తున్నారు. ప్రపంచీకరణ ఆర్థిక సంస్కరణల్లో భాగంగా ప్రభుత్వ రంగంలో వైద్య సేవలు ప్రమాదకర స్థితికి చేరాయి. క్రమేణా ఈ రంగం కూడా విదేశీ శక్తుల కబంధహస్తాల్లో కరిగిపోనుంది. ఇప్పటికే ఆరోగ్యశ్రీ వంటి పథకాలతో కార్పొరేట్ ఆస్పత్రులకు కోట్లు గుమ్మరిస్తూ ప్రాథమిక ఆరోగ్య కేంద్రాలను పంచన బెట్టేసి, బహుళ జాతి కంపెనీల పాదసేవకు పరితపిస్తోంది. ప్రపంచీకరణ నేపథ్యంలో ప్రజల ప్రాధమ్యాల్లో చోటు చేసుకుంటున్న పెనుమార్పులు – అసంతృప్తికీ, సంక్లిష్టతకు అంటుకడు తున్నాయి. నిలువునా కూలి పోతున్న ఆర్థిక వ్యవస్థలు, పల్లెల నుంచి పట్టణాలకు పెరుగుతున్న వలసలు, ఆకలి చావులు, అనారోగ్య మరణాలు మనిషి మానసిక వాతావరణాన్ని అల్లకల్లోలంగా మార్చేస్తున్నాయి. వ్యక్తుల ఆరోగ్యకరమైన అభివృద్ధికీ బాటలు పరిచి వారి చుట్టూ రక్షణ దడి కట్టాల్సిన ప్రభుత్వాలు ప్రజా వ్యతిరేక విధానాలతో స్వయంగా వారిపైనే యుద్ధం ప్రకటించి నిండు ప్రాణాలను బలిగొంటోంది. అభివృద్ధికి ఆమడదూరంలో నిలిచిపోతున్న సమాజాలు గనుల మాఫియా, అభివృద్ధి, ఉగ్రవాదం మితిమీరిన అసమానతలకు అంటుకడుతున్నాయి. బతుకు పోరాటంలో మానవ సంబంధాలు పెళుసుబారి పోతున్నాయి.

ప్రపంచీకరణ ఒక అద్భుత దీపమనీ, కారుచీకట్లను అది పారద్రోలుతుందనీ ప్రభుత్వాలు నమ్ముతున్నాయి. అందులో ఎంత మాత్రం నిజం లేదని అనుభవాలు చెప్తున్నా అవి నమ్మలేకున్నాయి. ప్రపంచీకరణ సమాజానికి మేలు చేకూర్చేదేమీ కాదు. అది పేదరికాన్ని తగ్గించదు. పైపెచ్చు పేదల, సమాజంలోని ఇతర బలహీన వర్గాల ప్రయోజనాలకు విఘాతం కలిగిస్తుంది. పై స్థాయిలో సంపద పోగుపడినా, చివరకు అది అట్టడుగు స్థాయికి చేరుతుందన్న అర్థం పర్థం లేని సిద్ధాంతాలు వల్లెవేస్తూ ప్రభుత్వం ఇంకెంత మాత్రం కాలక్షేపం చేయజాలదు. నానాటికీ పెరిగిపోతున్న పేదరికం, ఆకలీ, దారిద్ర్యం, ఆకలి చావులు ప్రజల్లో అసంతృప్తికీ, అసహనానికీ దారితీస్తోంది. వాస్తవ విరుద్ధ వాదనలతో దాన్ని అణచివేడం సర్కార్ వల్ల కాని పని. సంపద, ఉత్పత్తి సాధనాలు కొద్ది మంది గుప్పిట్లోనే కేంద్రీకృతమయ్యేలా మన ఆర్థిక వ్యవస్థ పని చేయరాదని రాజ్యాంగంలోని 39(సి) అధికరణ స్పష్టం చేస్తోంది. దేశంలో పేరుకుపోతున్న పేదరికం, తారతమ్యాలు ఆ భావనకే విరుద్ధమని ప్రభుత్వం గ్రహించాలి. పై నేపథ్యంలో నుండే ఆదివాసి ప్రాంతాల్లో జరుగుతున్న అనారోగ్య మరణాలను, విషాదాలను అర్థం చేసుకోవలిసిన అవసరం ఉంది. ఆర్థిక, రాజకీయ, సామాజిక రంగాల్లో అడుగడునా పొడసూపుతున్న అసమానతలు ఆదివాసి సమాజ వ్యక్తిత్వ వికాసానికి, ఎదుగుదలకూ ప్రతిబంధకాలుగా మారుతున్నాయి. వీటిని ఎదుర్కోవడానికి ప్రజాస్వామిక ప్రగతి కాముకులు తక్షణం మేలుకోవాల్సిన అవసరం ఉంది. విస్తృత ప్రజావళికి వర్తించే సుగతి నమూనాకు ప్రాణం పోయడం ద్వారా లక్షల ప్రాణాలను నిలబెట్టాల్సిన కీలక బాధ్యత మన అందరిదీ

*(రచయిత ఆదివాసి ఉద్యమ కార్యకర్త)* వీ

# పశ్చిమ ఒడిశాలో దళితులపై దాడులు

***దళితులపై జరుగుతున్న దాడులను బలమైన విశాల ఐక్య ప్రజా ఉద్యమాలను నిర్మించడం ద్వారానే అరికట్టగలమనీ అంటున్నారు* నటాషా**

ఇప్పుడున్న ఒడిశా రాష్ట్రం 1936 ఏప్రిల్ 1న ఏర్పడింది. అంతకు ముందు ఒడిశా కళింగ, ఒడ్రా, కోసల, ఉత్కల మొదలగు పేర్లతో పిలువబబడింది. బ్రిటిష్ ఆక్రమణకు ముందు ఈ ప్రాంతం అనేక మంది స్థానిక రాజులతో పాటు గంగులు, మరాఠాలు చాలా కాలం పరిపాలించారు. గంగుల కాలంలో గంగా నది తీరం నుండి గోదావరి నది ఇవతలి రాజమండ్రి వరకు విశాల ప్రాంతాన్ని పరిపాలించారు. అప్పటి నుండి ఉత్తరాంధ్ర ఒడిశా ప్రజల మధ్య సన్నిహిత సంబంధాలు, పరస్పర ప్రభావం ఉంటూ ఆంధ్ర, ఒడిశా ప్రజల మధ్య మైత్రి పోరాటానుబంధం కొనసాగుతున్నది. ఒడిశాకు, ఆంధ్రప్రదేశ్‌కు చాలా విషయాల్లో పోలికలున్నాయి. అక్కడ కోస్తాంధ్ర సంపన్న వర్గాలు మిగిలిన ప్రాంతాల (తెలంగాణ, రాయలసీమ, కోస్తాంధ్ర) పై దోపిడి, ఆధిపత్యం కొనసాగించినట్లే, ఇక్కడ తూర్పు కోస్తా సంపన్న వర్గాలు దక్షిణ, పడమర ఒడిశాలపై దోపిడి, ఆధిపత్యం కొనసాగిస్తున్నారు. అక్కడి ప్రత్యేక తెలంగాణ ఉద్యమం లాగే ఇక్కడ ప్రత్యేక కోసల (పశ్చిమ ఒడిశాలోని పది జిల్లాలు) రాష్ట్రం కోసం చాలా కాలంగా పోరాడుతున్నారు. ఈ ప్రాంతంలో ప్రజలు మాట్లాడే భాషను కోసల భాష (సంబల్‌పురి) అని ప్రియంగా పిలుచుకుంటారు. కట్టు, బొట్టు, సంస్కృతిలో ప్రత్యేకత ఉంటుంది. కాని ఇక్కడి సంపన్న పాలక వర్గాలచేత ఇప్పుడు ఇక్కడి భాష బనాయింపుకు, అవహేలనకు గురవడం, ఈ ప్రాంతంలోని ప్రకృతి సంపదల్ని దోచుకోవడంపై ఉన్న శ్రద్ధ ఈ ప్రాంతాన్ని అభివృద్ధి చేయడంపై లేకపోవడం లాంటి సమస్యలన్ని ఉన్నాయి.

ఇక్కడి దళితుల పరిస్థితి చూస్తే ఒకప్పటి కారంచేడు, చుండూరులను స్ఫురణకు తెచ్చేలా ఉంటుంది. అలాంటి మచ్చుకు కొన్ని ఘటనల్ని ఇక్కడ పేర్కొంటాను. బొలంగీర్ జిల్లా కప్రకోల్ బ్లాక్‌లో లతూర్ అనే చిన్న పట్టణం ఉంది. రాయపూర్ నుండి టిట్లాగడ్ మీదుగా సంబల్‌పూర్ వెళ్లే రైలు మార్గంలో నవ్‌పాడా, దటకా, లక్నా - తుర్కేల రైల్వే స్టేషన్‌ల మధ్య లాతూర్ రైల్వే స్టేషన్ ఉంటుంది. దీన్ని హరిశంకర్ రోడ్ అని కూడా అంటారు. ఇక్కడ ఆదివాసులు, దళితులు మెజారిటీ జనాభా కాగా ఇతర ప్రజానికం కూడా ఉన్నారు. ఇక్కడ సంపన్న వర్గం మాత్రం మార్వాడీ సెటిలర్స్. ఇక్కడి పెద్ద పెద్ద దుకాణాలన్నీ మార్వాడీ వ్యాపారులవే. 2012 మార్చ్ నెలలో ఒకరోజు ఓ దళిత యువకుడు మార్వాడి బట్టల దుకాణంలో బట్టలు కొనడానికి వెళ్లాడు. రేట్ల విషయంలో దుకాణదారుతో చర్చ జరుగగా మార్వాడి దుకాణ దారుడు దళిత యువకున్ని బూతులు తిట్టి అవమానపరుస్తూ తన్నాడు. విషయం తెలిసిన మిగతా దళిత ప్రజలు ఉక్రోషంతో బ్లాక్ సెంటర్‌కు వెళ్లి దుకాణ దారునిపై కేసు పెట్టడానికి పోలీస్ అధికారుల దగ్గరికి వెళ్లారు. ఈ విషయం తెలిసిన మార్వాడి సంపన్న వర్గాల అగ్రకుల అహంకారానికి ఇది జీర్ణం కాలేదు. కాళ్ల కింద పడి ఉండాల్సిన వారు మనపై ఎదురు తిరగడమా? దీన్ని సహించొద్దు. తగిన శాస్తి చెయ్యాలని మార్వాడి వ్యాపారులంతా ఏకమయ్యారు. లాతూర్ మార్వాడి వ్యాపార సంఘం అధ్యక్షుడు 'గాశిరాం అగర్వాల్' నాయకత్వంలో కుట్రపన్నారు. ఈయన ఒడిశా సారా వ్యాపారంలోనే నెంబర్ 2గా పేరు పొందిన సారా సామ్రాట్. రాత్రికి రాత్రే వందకు పైగా గుండాల్ని పోగేసి పీకల దాకా తాగించి పెట్రోల్, కిరోసిన్ చేతికిచ్చి 50 ఇల్లు గల దళిత గూడాన్ని మార్చ్ 22 రాత్రి కాలబెట్టించారు. కేసు పెట్టడానికి పోయినవాళ్లు తిరిగి రాకముందే దళిత వాడను బూడిత చేయాలనేది అగ్రకుల సంపన్నుల ఉపాయం. రాత్రంతా గూడెం తగలబడి పోతుంటే ప్రజలు కట్టుబట్టలతో పారిపోయి ఎలాగొలా ప్రాణాలు దక్కించుకున్నారు. గాశిరాం అగర్వాల్ మాత్రం తన బంగ్లాలో పై అంతస్తు నుండి కాలిపోతున్న దళిత గూడాన్ని చూస్తూ బ్రాండి మత్తులో ముసి ముసి నవ్వులతో తన్మయత్వంతో గడిపిన పెద్ద శాడిస్ట్. ఇక లాతూర్‌లో ఉన్న పోలీస్‌స్టేషన్‌లోని పోలీసులు గానీ, ప్రభుత్వ అధికారాలు గానీ తెల్లవారేదాకా ఘటనా స్థలానికి రాకపోవడం వెనుక మతలబు ఏమిటో అర్థం చేసుకోవచ్చు. మార్వాడి సంపన్న వర్గాలు, పోలీసులు, ప్రభుత్వ అధికారులు వీళ్లందరి మధ్య ఎలాంటి లంకె ముడి ఉందో అర్థం చేసుకోవచ్చు. నిరాశ్రయులైన దళితులు కట్టుబట్టలతో దుర్గా హైస్కూల్ గదుల్లో శరణార్థులుగా బతుకుతున్నారు. ఘటన జరిగి సంవత్సరం దాటిపోయినా కేసు ముందుకు పోయింది లేదు. ఎవరిని అరుస్ట్ చేసి శిక్షించింది లేదు. దోషులందరూ బోరవిరుచుకొని తిరుగుతున్నారు. గాశీరామ్ అగర్వాల్ సారా వ్యాపారం మూడు పువ్వులు ఆరు కాయలుగా పోలీసు రక్షణలో వర్థిల్లుతున్నది. సంవత్సరం తరువాత దళితులకోసం ఇందిర ఆవాస్ ఇండ్లనే పేరుతో పిట్టగూడు లాంటి ఇండ్లు నిర్మించి అందులోకి గృహ ప్రవేశం చేయించడానికి ఎస్‌సి, ఎస్‌టి కమిషన్ ప్రెసిడెంట్ పున్నయ్య 2013 మార్చ్ చివరలో లాతూర్‌కు వచ్చాడు. అదే రోజు ఇండ్ల పంపకం విషయంలో దళితుల్లోని ఇరుపక్షాల మధ్య వివాదం తలెత్తి పరిష్కారం కోసం పోలీస్ స్టేషన్ ముందుకు రాలీగా వెళ్లిన దళితులపై పోలీసులు విచక్షణ రహితంగా లాఠీ చార్జ్ చేశారు.

ఇందులో మహిళలు పిల్లలు గాయపడ్డారు. ఇక్కడ ఇప్పటికే దళితుల్ని అంటరాని వాళ్లుగా, నిత్యం హీనంగా చూడబడుతూ అవమానపరచడం, తెల్లబట్టలేసుకున్న పెద్ద చదువులు చదివినా ఓర్వలేనితనం ఇక్కడ నిత్యకృత్యం. ఆంధ్రప్రదేశ్‌లో మావోయిస్టు ఉద్యమం పెరగడం

మూలంగా తరువాత కాలంలో కారంచేడు, చుండూరులు పునరావృతం కాలేదు. ఇక్కడ ప్రజాస్వామిక ఉద్యమాలు కొనసాగుతున్నాయి. ఈ ఉద్యమాలు బలపడడం ద్వారానే వీటిని అరికట్టగలం.

బొలంగీర్ జిల్లాలోని కాప్రాకోల్ బ్లాక్‌లో దండముండ అనే గ్రామం ఉంది. ఇది కాప్రాకోల్ – పదంపూర్ రోడ్‌పై గల పెద్ద గ్రామం. ఇక్కడ సూరు మాస్టర్, నిరోద్, మదు సాహుల ఆదిపత్యం కొనసాగుతోంది. ఇదే గ్రామంలో నలభై దళిత కుటుంబాలు నివాసం ఉంటుండేవి. 2012లో ఒక రోజు అకస్మాత్తుగా దళిత గూడెంపై దండయాత్ర చేసినట్లుగా ఎస్‌డిఒపి, తహసీల్‌దార్, గ్రామ సంపన్న వర్గాల నేతృత్వంలో బుల్డోజర్లతో వచ్చి దళితుల్ని తరిమేసి ఇండ్లన్ని కూలగొట్టి నేలను చదును చేశారు. తరతరాలుగా తమ స్వంత ఇండ్లల్లో నివాసముంటూ వచ్చిన దళితుల జీవితాల్లో అదొక కాలరాత్రిగా మిగిలిపోయింది. రెప్పపాటులో కొంప గూడు కోల్పోయి కట్టుబట్టలతో విస్తాపితులై దండముండ హైస్కూల్‌లో శరనార్థులుగా మారిపోయారు. ఇంతటి దౌర్జన్యం వెనకాల కారణం ఏమిటయ్యా అంటే మావోయిస్టు ఉద్యమ అణచివేతల్లో భాగంగా పాలకులు ఇక్కడొక పోలీస్ క్యాంపు వేయాలనుకున్నారు. దానికి అనువయిన స్థలంగా దళితపేట గల జాగ వాళ్లకు నచ్చింది. ఇంకేముంది రాజు తల్చుకుంటే దెబ్బలకు కొదువా అన్నట్లుగా పాలకులు తలచిందే తడవుగా దళితపేటను కూల్చి నేలమట్టం చేశారు. ఏమిటి ఇదేమన్న రాజుల కాలమా ప్రజాస్వామ్యం కదా అనుకుంటున్నారా? మిమ్మల్ని ఎవరు అలా అనుకొమ్మన్నారు? అది మీ అమాయకత్వం కాకపోతే. ఇది ఆదునిక రాజుల పరిపాలన మరి. పాత రాజుల కాలంలోనైతే రాజు తలచుకుంటే వీపుపై కొరడా దెబ్బలు కొట్టేవాడు. కానీ నేటి రాజులు తలుచుకుంటే ఒక్క కలం పోటుతో వేలాది మంది పొట్టలపై చట్టబద్ధంగానే కొట్టగల సమర్థులు. రాత్రికి రాత్రే వేలాది మందిని విస్తాపితులను చేసి శరాణార్థులుగా మార్చే సునామీ కంటే భయంకరమైన వాళ్లు. ఇంతగోరం జరిగాక ఆ నోట ఈ నోట విని ఎంక్వయిరి కోసం వెళ్లిన పత్రకారులను ఖద్దరు దుస్తులు దరించి గాంధీ టోపి పెట్టుకున్న గ్రామ పెద్దలు ముందే అటయాయించి 'అబ్బే మా గ్రామం చాలా ప్రశాంతంగా ఉండే గ్రామం ఇక్కడ అలాంటివేమి జరుగలేదండి' అని మస్కాకొట్టి పంపారు. ఇప్పటికీ దళితులు హైస్కూల్‌లో శరణార్థులుగా కొనసాగుతున్నారు. బెండెర్ బర్వాముండ అనే మరో గ్రామంలో కువిముండ పేరుతో చిన్న దళిత గూడెం ఉంది. ఇక్కడ ఎనిమిది దళిత కుటుంబాలు నివాసముంటున్నాయి. బర్వముండలో టికేంద్రజాల్ అనే సంపన్నుడి పెత్తనం కొనసాగుతున్నది. ఈయన నాయకత్వంలో కుయిముండ దళిత గూడాన్ని వెళ్లగొట్టి అక్కడి భూములను ఆక్రమించుకోవాలనే కుట్ర రచించబడింది. మొదట దళితుల్ని నెగలకుండా చేయడానికి, వాళ్లంత వాళ్లే పారిపోయేలా చేయడానికి టికేంద్రజాల్ డైరెక్షన్‌లో కుయిముండ దళితుడు రవిబాగ్ కూతురు పదిహేనేళ్ల అమ్మాయిని అపహరించి రోజుల తరబడి దాచి ఉంచి అత్యాచారం చేశారు. ఈ కిడ్నాప్, అత్యాచారానికి పాల్పడిన వాళ్లు ఇదే గ్రామానికి చెందిన లుంపెన్ గుండాలు. హరిక్రిష్ణ చదర్, తపన్ చటర్, ఉమాకాంట్ చటర్. ఈ ఘటన జరిగి సంవత్సరంన్నర కావస్తున్నా దోషులెవరు అరెస్టు కూడా కాకుండా దర్జాగా తిరుగుతుండగా, కిడ్నాప్‌కు గురయిన అమ్మాయి తండ్రిని, చిన్నాయనని తప్పుడు కేసులో బనాయించి జైల్లో వేశారు. ఇందులో కొసమెరుపు ఏమిటంటే ఈ కేసులో బలత్కారానికి గురయిన అమ్మాయిని సర్కారి డాక్టర్ మిశ్రాతో పరీక్షలు చేయించి అమ్మాయి చరిత్ర హీనురాలు కాబట్టి అత్యాచారం అనలేం. ఆమె ఇష్టంతోనే జరిగిఉండొచ్చు అనే సర్టిఫికెట్ డాక్టర్‌తో ఇప్పించారు. ఇందులో ముఖ్యపాత్ర ఎస్‌డిఒపి లక్ష్మినారాయణ పండది. కుయిముండ దళితుల్ని వెళ్లగొట్టి ఆ భూమి కాజేయాలనుకోవడం వెనుక కారణమేమంటే ఆర్‌సిడిసి అనే స్వచ్ఛంద సంస్థ (ఎన్‌జిఒ) ఈ స్థలంలో ఔషధ మొక్కల ప్లాంటేషన్ నిర్మించాలనేది. ఇలా చెప్పుకుంటూ పోతే చాలా ఘటనలు ఉన్నాయి. ఇవి మచ్చుకు కొన్ని మాత్రమే. ఇంత విచ్చలవిడిగా దళితులపై దాడులు జరుగుతున్నా కనీసం ప్రధాన స్రవంతి మీడియా అని తనకు తాను డబ్బా కొట్టుకునే ప్రసార సాధనాలు వీటిని పట్టించుకున్న పాపాన పోలేదు. నేను మొదట్నే చెప్పినట్లుగా బలమైన ప్రజాస్వామిక ఉద్యమాలు, బలమైన మావోయిస్టు ఉద్యమం నిర్మాణం అయ్యేవరకు ఈ దాడుల్లో తగ్గుదలను ఆశించలేము. ఈ వ్యవస్థలో ఇదే రాజ్యంగ చట్రంలో దళితులకెన్నడూ సరియైన న్యాయం దొరకదనడానికి అనేక ఉదాహరణలున్నాయి. కాబట్టి నూతన ప్రజాస్వామిక భారతంలోనే దళితులు సగటు మనుషులుగా సమాన హక్కులతో గౌరవప్రదంగా జీవిస్తారు. వీ

*(రచయిత ఫ్రీలాన్స్ జర్నలిస్టు)*

# వార్సా వాతావరణ సదస్సు - 2013

***పెట్టుబడిదారీ ఉత్పత్తి విధానం పర్యావరణ విధ్వంసానికి, ఆర్థిక సంక్షోభానికి దారి తీస్తోందనీ, భవిష్యత్తులో ఏకంగా జీవి ఉనికే ప్రశ్నార్థకమయ్యే ప్రమాదముందనీ హెచ్చరిస్తున్నారు ఎ. నర్సింహా రెడ్డి***

మానవ సమాజ పురోగమన క్రమంలో పెట్టుబడిదారీ ఉత్పత్తి అభివృద్ధి ఈ భూగోళంపై భయంకరమైన వాతావరణ సంక్షోభాన్ని సృష్టించింది. కన్పించని విపత్తు ఒకటి భూగోళాన్ని చుట్టేస్తోంది. మానవాళి ఆదమరచి ఉంటే మృత్యుపరిష్వంగంలోకి నెట్టేసేందుకు నిరీక్షిస్తోంది. తాను కన్పించకుండా భూకంపం, సునామీ, ఆమ్ల వర్షం, అతివృష్టి, అనావృష్టి, కరువులు, కాటకాలు, పర్యావరణ విధ్వంస రూపంలో మానవ సమాజాన్ని సమాధి చేసే ఆ మహాప్రళయం పేరు 'గ్రీన్ హౌస్ ప్రభావం'. ఈ మహా ప్రళయాన్ని నిరోధించేందుకు... కనీసం కొంతకాలం వాయిదా వేసేందుకు అంతర్జాతీయ సమాజం నిర్విరామ కృషి చేయాల్సి ఉంది. ఈ సంక్షోభం ఇప్పుడు ఏ స్థితికి వచ్చిందంటే అది ప్రపంచ మానవాళి ముందు రెండే మార్గాలుంచింది. అది పెట్టుబడిదారీ ఉత్పత్తి విధానాన్ని రద్దు చేసుకోవాలి లేదంటే మానవాళి నాశనం కావాలి. గత రెండు దశాబ్దాలుగా ఐక్యరాజ్యసమితి ఆధ్వర్యంలో వాతావరణ మార్పుపై ఏర్పాటైన ప్రభుత్వాల బృందం 'యుఎన్‌ఎఫ్‌సిసి' జరుపుతున్న సదస్సుల్లో సంపన్న దేశాల బాధ్యతా రాహిత్య ధోరణి వల్ల సత్ఫలితాలు రావడం లేదు.

పందొమ్మిదవ అంతర్జాతీయ వాతావరణ సదస్సుకు పోలెండ్ రాజధాని వార్సా ఆతిథ్యమిచ్చింది. 2013 నవంబర్ 11 నుంచి 23వ తేదీ వరకు ఈ సదస్సు కొనసాగింది. ఇది వార్షిక కాన్ఫరెన్స్ ఆఫ్ పార్టీస్ (కాప్) 19వ సదస్సు కాగా, 1997 నాటి క్యోటో ప్రోటోకాల్‌పై సంతకాలు చేసిన దేశాలు (సిఎంపి)కు 9వ సదస్సు. నవంబర్ 11న ఆరంభమైన ఈ సదస్సు వాస్తవానికి 22న ముగించాల్సి ఉంది. కానీ ఎడతెగని చర్చల నేపథ్యంలో మరో 30 గంటలు అదనంగా కొనసాగింది. భూతాపానికి, తద్వారా వాతావరణ వైపరీత్యాలకు దారితీస్తున్న గ్రీన్‌హౌస్ వాయు ఉద్గారాలను తగ్గించడం లక్ష్యంగా నిర్వహించిన ఈ సదస్సు ఆశించిన ప్రయోజనాలను సాధించలేకపోయింది. వార్సాలో 195 దేశాలకు చెందిన సుమారు 10 వేల మంది ప్రతినిధులు దాదాపు 13 రోజుల పాటు జరిపిన చర్చల్లో సదస్సు చివరి రోజు దాకా వివిధ అంశాలపై ఎలాంటి అంగీకారం కుదరకపోవడంతో చివరి రోజున మొక్కుబడిగా వార్సా సదస్సులో పాల్గొన్న దేశాలన్నీ ఒక నామమాత్ర ఒప్పందానికి వచ్చాయి.

సంపన్న దేశాలు స్వల్పకాలిక ఉద్గారాల తగ్గింపు లక్ష్యాలను పెంచుకోవడానికి అంగీకరించలేదు. 2009లో కోపెన్ హెగెన్ సదస్సులో పేద దేశాలకు వాతావరణ సమస్యలను ఎదుర్కోవడానికి సంపన్న దేశాలు ఏటా 10 వేల డాలర్లు 2020 వరకు అందిస్తామని హామీ ఇచ్చాయి. ఇప్పుడు హరిత వాతావరణ నిధి (గ్రీన్ క్లయిమేట్ ఫండ్)కి నిధులు అందించేందుకు వెనక్కి తగ్గాయి. ఈ సమావేశాల్లోనైనా ఆ దేశాలు తమ హామీల గురించి నిర్దిష్టంగా చెపుతాయనుకున్న వారికి నిరాశే మిగిలింది. వీటన్నింటి నేపథ్యంలో సదస్సు దాదాపు విఫలమవుతుందన్న పరిస్థితుల్లో పలు దేశాలు తమ తమ కాలుష్య ఉద్గారాలను వీలైనంత త్వరగా తగ్గించాలనీ, 2015 మొదట్లో అయినా ఈ ప్రక్రియ ప్రారంభించాలనీ అంగీకారానికి వచ్చాయి. నిజానికి ఏ దేశం ఎంత కోత విధించాలో 2015లో పారిస్‌లో జరిగే సమావేశంలో నిర్ణయించి 2020 నుండి అమలు చేయడం ప్రారంభించాలి. పారిస్ సమావేశంలో తీసుకోబోయే కోటా లక్ష్యాలను గురించి ఆయా దేశాలు వార్సా సమావేశంలో ప్రకటించాల్సి ఉంది. కానీ నిర్దిష్ట ప్రకటనలేవి లేకుండానే సమావేశం ముగిసింది. ఇంకా సదస్సులో 'వార్సా అంతర్జాతీయ యంత్రాంగం' పేరిట ఒక వ్యవస్థ ఏర్పాటుకు కూడా ప్రతిపాదించారు. అయితే దీని రూపు రేఖలపై 2016లో సమీక్షిస్తారట. స్థూలంగా సదస్సులో పై మూడింటిపై ఉత్తి హామీలతో అంగీకారం కుదిరింది. 2015 కల్లా ఖరారు చేయాలని ఆశిస్తున్న వాతావరణ ఒప్పందానికి రూపకల్పనలో ముందుకు సాగడమెలా అన్నదానిపై 2014లో పెరూలో చర్చలు జరుగనున్నాయి. దానికి ముందస్తుగా వార్సాలో జరిగిన 13 రోజుల సదస్సులో తొలి అడుగులు కూడా పడలేదు.

**'గ్రీన్‌హౌస్' అంటే ఏమిటి? పర్యవసానాలు ఏమిటి?**

భూమి వేడెక్కడంతో వాతావరణానికి ముప్పు కలుగుతుంది. సూర్యకిరణాలలోని హానికరమైన అతినీల లోహిత (అల్ట్రావైలెట్) కిరణాల నుంచి భూమిని వాతావరణంలోని పై పొర అయిన ఓజోన్ రక్షిస్తుంది. అతినీల లోహిత సూర్యకిరణాల వల్ల పంటలకు, ప్రాణులకు, ప్రజలకు హాని జరుగుతుంది. అంటే ఓజోన్ రక్షణ పైనే మన రక్షణ ఆధారపడి ఉంది. సూర్యుని నుంచి వచ్చే కాంతి శక్తిలో దాదాపు 30 శాతం శక్తిని బాహ్య ఆవరణం, భూ ఉపరితలం వెనక్కి పరావర్తనం చెందిస్తాయి. మిగిలిన శక్తిని భూమి గ్రహిస్తుంది. ఫలితంగా భూగోళం వేడెక్కి పరారుణ (ఇన్‌ఫ్రారెడ్) ధార్మికతను విడుదల చేస్తుంది. మామూలుగా అయితే ఇది తిరిగి వాతావరణంలోకి వెళ్లిపోవాలి. కానీ మనం ఉత్పత్తి చేస్తున్న గ్రీన్‌హౌస్ వాయువులు... భూ ఉపరితలంపై ఒక దుప్పటిలా దట్టంగా ఆవరించి... ఈ ధార్మికత మొత్తం తిరిగి వాతావరణంలోకి వెళ్లకుండా అడ్డుకుంటున్నాయి. ఫలితంగా ఈ ధార్మికత ఇక్కడే ఉంటూ భూమి, ఉపరితలం మొత్తం అనూహ్యంగా వేడెక్కి పోతున్నాయి. గ్రీన్‌హౌస్ వాయువులు ఉష్ణాన్ని పట్టి ఉంచే ధర్మాన్ని కలిగి ఉంటాయి. ఉదాహరణకు నైట్రస్ ఆక్సైడ్, కార్బన్ డై ఆక్సైడ్, కార్బన్ మోనాక్సైడ్, క్లోరో ఫ్లోరో కార్బన్స్, మీథైన్, నీటి ఆవిరి లాంటి ఉష్ణాన్ని పట్టి ఉంచే వాటి ధర్మాన్ని గ్రీన్‌హౌస్ ఎఫెక్ట్ అంటారు. గ్రీన్‌హౌస్ వాయువులు వాతావరణంలో 1 శాతం మించిలేవు గానీ ఇవి భూమి చుట్టూ దట్టమైన గాజు పొరలా ఆవరించి, వేడిని ఇక్కడే బంధిస్తున్నాయి. ఈ గ్రీన్‌హౌస్ వాయువుల స్థాయిలను ఎంత వేగంగా తగ్గిస్తే అంత మంచిది. కానీ పెట్రోల్, బొగ్గు తదితరాలను భారీ ఎత్తున వాడడం వలన వాతావరణంలో కార్బన్‌డై ఆక్సైడ్ ఇంకా పెరిగిపోతోంది.

అదుపులేని గ్రీన్‌హౌస్ వాయు ఉద్గారాలు భూతాపానికి, తద్వారా వాతావరణ వైపరీత్యాలకు కారణమవుతున్నాయి. దీనికి తోడు ముఖ్యంగా శిలాజ ఇంధనాల వల్ల వాతావరణంలో తీవ్రమైన మార్పులు చోటు చేసుకుంటున్నాయి. ఇవి ప్రపంచవ్యాప్తంగా అనేక దుష్పరిణామాలకు దారి తీస్తున్నాయి. పలు ప్రపంచ దేశాల్లో సంభవిస్తున్న భీకరమైన ప్రకృతి విపత్తులు ఇందుకు నిదర్శనం. భారత్‌తో సహా అనేక దేశాలు ఈ ప్రకృతి విపత్తుల బారిన పడుతున్నాయి. ఒకవైపు తుఫాన్లు, మరోవైపు హరికేన్లు, ఇంకొకవైపు కార్చిచ్చులు వంటి ఉత్పాతాలు సంభవిస్తున్నాయి. ఫలితంగా మనిషి మనుగడకే సవాలు ఎదురవుతోంది. వాతావరణ వైపరీత్యం భారత్ సహా అనేక దేశాల ఆర్థిక వ్యవస్థలను చిన్నాభిన్నం చేసే పరిస్థితి దాపురిస్తోంది. వాతావరణ మార్పులకు ప్రధాన కారణమైన గ్రీన్‌హౌస్ వాయువులను నియంత్రించడం ఎంతో అవసరం. లేనిపక్షంలో భవిష్యత్తులో మరిన్ని ఉపద్రవాలు సంభవించే ప్రమాదం ఉంది. సముద్ర మట్టాలు సైతం పెరిగిపోయి భూమికే తీరని ఉపద్రవం వచ్చి పడేందుకు ఆస్కారముంది.

పారిశ్రామిక విప్లవం ముందు వరకు నేడు మనం ఎదుర్కొంటున్న వాతావరణ సమస్య లేదు. పారిశ్రామిక విప్లవం బొగ్గు వినియోగంతో వచ్చింది. తరువాత చమురు, గ్యాస్ వినియోగం పారిశ్రామిక ప్రగతికి ఇంధనాలుగా మారాయి. అభివృద్ధి పేరుతో, అడవులను పెద్ద ఎత్తున నరికి వేయడం జరుగుతోంది. ఒకవైపు పరిశ్రమలు, వాహనాల నుండి వాతావరణంలోకి భూతాపం పెంచే వాయువుల విడుదల పెంచడం, మరో వైపు కార్బన్ డై ఆక్సైడ్ వాయువును వాతావరణం నుండి పీల్చుకునే వృక్షాలను పెద్ద ఎత్తున నరికి వేయడం వల్ల భూగోళం వేడెక్కుతోంది. పారిశ్రామిక విప్లవం నాటి ఉష్ణోగ్రత కంటే 2 డిగ్రీలకు పెరిగితే ఇక మన చేతులు దాటిపోయే పెను ఉత్పాతాలు సంభవిస్తాయని శాస్త్రవేత్తలు చెపుతున్నారు. వాతావరణంలోకి దాదాపు 1 లక్ష కోట్ల (ట్రిలియన్) టన్నుల కర్బన ఉద్గారాలు విడిచిపెడితే 2 డిగ్రీల వేడి పెరుగుతుందని అంచనా.

ఈ పరిస్థితి రాకుండా చూడాలంటే... ప్రపంచ ఉష్ణోగ్రతలు పారిశ్రామిక విప్లవం నాటి స్థాయి కంటే రెండు డిగ్రీల సెల్సియస్‌కు మించి పెరగకుండా చూడాల్సిన అవసరముంది. కానీ ఇలా పెరగకుండా చూడాలంటే... కర్బన ఉద్గారాలను 1050 గిగా టన్నులకు పరిమితం చేయక తప్పదని వాతావరణ మార్పులపై ఏర్పాటైన ప్రభుత్వాల బృందం (ఐజిపిసిసి) తన తాజా నివేదికలో హెచ్చరించింది. ఈ నేపథ్యంలో కర్బన ఉద్గారాలను తగ్గించడం అవశ్యం. అయితే ఇందుకోసం బొగ్గు వినియోగాన్ని తగ్గించడం అవసరం. కానీ ఈ వినియోగాన్ని తగ్గించడం సాధ్యపడేలా కనిపించడం లేదు. ప్రస్తుతం అందుబాటులో ఉన్న బొగ్గు నిల్వలను తవ్వి వినియోగించిన పక్షంలో... ఆ ఉద్గారాలు 2190 గిగా టన్నులకు చేరుకునే ప్రమాదముంది. ఇదే పరిస్థితి కొనసాగితే... ప్రపంచ ఉష్ణోగ్రతలు సమీప భవిష్యత్తులో ఆరు డిగ్రీల సెల్సియస్ వరకు పెరిగే ప్రమాదం పొంచి ఉంది. దీనిని నివారించాలంటే... కర్బన ఉద్గారాలను తగ్గించుకోవడం ఒక్కటే మార్గం. ఇందులో భాగంగా శిలాజ ఇంధనాల వాడకాన్ని తగ్గించుకోవడం అత్యవసరం. దీనికి బదులుగా సౌర, పవన విద్యుత్ వంటి ఇతరత్రా ప్రత్యామ్నాయాల వైపు దృష్టి పెట్టడం అత్యావశ్యకం.

ప్రపంచ వ్యాప్తంగా తీవ్రమైన వాతావరణ మార్పులకు కారణ మవుతున్న కర్బన ఉద్గారాల విడుదల అంతకంతకు పెరిగిపోవడానికి ధనిక, పారిశ్రామిక దేశాలదే బాధ్యత. పారిశ్రామిక విప్లవం అనంతరం వాతావరణంలోకి విడుదలైన గ్రీన్‌హౌస్ వాయువుల్లో 60 శాతంపైగా వాటా సంపన్న దేశాలదే. చమురు, సహజ వాయువు, బొగ్గు ఉత్పత్తి వంటి కార్యకలాపాల్లో పాల్గొంటున్న 90కి పైగా సంస్థలకు ఈ పాపంలో సింహభాగం వాటా ఉంది. షెవ్రాన్, ఎక్సాన్‌మొబిల్, సౌదీఅరామ్కో, బిపి, గజ్‌ప్రోమ్‌లతో పాటు మనకోల్ ఇండియా లిమిటెడ్ సైతం వాటిలో ఉందన్న సమాచారం కలవరం కలిగిస్తోంది. భారత్, చైనాల్లో ఇప్పుడు అధిక స్థాయిల్లో శిలాజ ఇంధనాల ఉద్గారాలు వెలువడుతున్నాయి. నిరుడు ఒక్క ఏడాదే భారత్‌లో కార్బన్-డై-ఆక్సైడ్ ఉద్గారాలు 7.7 శాతం పెరిగాయని తేల్చారు.

1751-2012 మధ్యకాలంలో మొత్తం ఉద్గారాలు 384 గిగా టన్నులు కాగా ఇందులో అమెరికా 26 శాతం, కెనడా, ఆస్ట్రేలియా 3.1 శాతం, ఓడలు, విమానాల వల్ల 3.7 శాతం, ఆఫ్రికా 2.6 శాతం, దక్షిణ మధ్య అమెరికా 3.9 శాతం, మధ్యప్రాచ్యం 3.4 శాతం, ఇతర ఆసియా పసిఫిక్ 4.4 శాతం, బ్రిటన్ 5.4 శాతం, జర్మనీ ఆరు శాతం, మిగతా యూరప్ 16.4 శాతం, జపాన్ 4 శాతం, రష్యా 7.3 శాతం, భారత్ 3 శాతం, చైనా 10.7 శాతం ఉద్గారాలను విడుదల చేశాయి. వాతావరణంలో కార్బన్‌డైఆక్సైడ్ 1990లో 355 పిపిఎం మేరకు ఉండేది. 2013 మే నాటికి 400 పిపిఎంకు పెరిగింది. ఈలోగా అభివృద్ధి చెందుతున్న దేశాల ఉద్గారాలూ పెరిగాయి. అమెరికాను రెండో స్థానానికి నెట్టి చైనా అగ్రస్థానాన్ని ఆక్రమించింది. యూరోపియన్ యూనియన్, భారత్ 3, 4 స్థానాల్లో ఉన్నాయి. పదేళ్ల క్రితం... విపత్తుల వల్ల దాదాపు 20 వేల కోట్ల డాలర్ల మేరకు నష్టం జరిగేది. ఇటీవల ఈ నష్టం 20 వేల కోట్ల నుంచి 40 వేల కోట్ల డాలర్లకు పెరిగింది. ఇదంతా ఉద్గారాల తగ్గింపుపై కాలయాపనకు మానవాళి చెల్లిస్తున్న మూల్యమే!

**ఫలితంలేని వార్సా చర్చలు**

ఉద్గారాలకు కారణం సంపన్న దేశాలు, దుష్ఫలితాలు అనుభవిస్తున్నది మాత్రం పేద దేశాలు. అందుకే మానవ కల్పిత విపత్తుల వల్ల జరిగే నష్టానికి కొంత పరిహారం చెల్లించాలని పేద దేశాలు సంపన్న దేశాలను డిమాండ్ చేస్తున్నాయి. పేద దేశాలకు నష్టపరిహారం ఇచ్చే ప్రసక్తి లేదు, అటువంటిదేమైన ఉంటే 2015 తర్వాత చర్చిద్దాం అని అమెరికా, కెనడా, ఆస్ట్రేలియా, జపాన్, ఇయు దేశాలు తెగేసి చెప్పడంతో చైనాతో సహా 134 దేశాలు నవంబర్ 20న చర్చల నుండి వాకౌట్ చేశాయి. ఫలితంగా విపత్తుల వల్ల నష్టపడుతున్న దేశాలకు నేరుగా సహాయం అందించేందుకు ప్రత్యేక యంత్రాంగం ఏర్పాటు కానుంది. అయితే, ఇప్పటికీ ఇది స్పష్టత లేని బలహీనమైన యంత్రాంగమే. దీని పరిధి ఎంత? నిధులు మాటేమిటి? ఇవన్నీ సమాధానాల్లేని ప్రశ్నలే. చివరి రోజు కుదిరిన ఒప్పందం ప్రకారం 2015లో చేసుకోనున్న ఒప్పందానికి వీలుగా కాలక్రమణిక ఖరారు చేయడం మొదటిది. 2012లో దోహా వాతావరణ చర్చల్లో అంగీకరించిన విధంగా విపత్తు నష్టాల మీద ఒక యంత్రాంగాన్ని ఏర్పరచడం రెండోది. వాతావరణ ముప్పు ఎదుర్కొంటున్న దేశాలకు అభివృద్ధి చెందుతున్న దేశాల సహాయంపై అంగీకారం మూడోది.

వార్సా వాతావరణ సమావేశాల్లో చెప్పుకోదగ్గ విషయాల్లో మొదటిదేమిటంటే... ఉద్గారాల తగ్గింపు బాధ్యతకు సంబంధించి అభివృద్ధి చెందిన దేశాలు, అభివృద్ధి చెందుతున్న దేశాల మధ్య తారతమ్యం పాటించనక్కర్లేదని అంగీకారం కుదరడం! భూతాపం తగ్గింపు చర్యలపై ఎటువంటి వాగ్దానాలూ లేవు. అభివృద్ధి చెందుతున్న దేశాలకు, ముఖ్యంగా భారత్‌కు, అశనిపాతమైన నిర్ణయం ఇది. సంపన్న దేశాలతోపాటు వర్ధమాన, పేద దేశాలు సైతం కర్బన ఉద్గారాల తగ్గింపు

విషయంలో ఎలాంటి తేడాలను పాటించనక్కర్లేదన్న తీర్మానాన్ని భారత్, చైనాలు వ్యతిరేకించాయి. పారిశ్రామిక విప్లవ కాలం నుంచీ కాలుష్యాన్ని పెంచుతున్నది అభివృద్ధి చెందిన దేశాలే. కాబట్టి, ముందు ఆ దేశాలే ఉద్గారాలను తగ్గించాలని భారత్, చైనా తదితర దేశాలు ఇరవయ్యేళ్లుగా వాదిస్తున్నాయి. 'క్యోటో ప్రోటోకాల్'కు ఈ వాదనే ప్రాతిపదిక. అయితే, ఇప్పుడు ఈ విభజన రేఖ చాలా వేగంగా చెరిగిపోతున్న పరిస్థితికి వార్సా సదస్సు అద్దం పట్టింది. ధనిక, పేద దేశాలు కర్బన ఉద్గారాలు విడుదల చేస్తున్నప్పటికీ పేద దేశాలు విడుదల చేస్తున్న ఉద్గారాలు చాలా తక్కువ. ప్రపంచ జనాభాలో 20 శాతం మాత్రమే ఉన్న సంపన్న పారిశ్రామిక దేశాలు వాతావరణంలో 74 శాతం కార్బన్-డై-ఆక్సైడ్ ఉద్గారాలు పేరుక పోవడానికి కారణమయ్యాయి. 80 శాతం ప్రజలు నివసించే వర్ధమాన దేశాలు కేవలం 26 శాతం ఉద్గారాలను విడుదల చేశాయి.

**లక్ష్యాలకు కట్టుబడని పారిశ్రామిక దేశాలు**

పారిశ్రామికీకరణకు ముందునాటితో పోలిస్తే ఉష్ణోగ్రత పెరుగుదలను రెండు డిగ్రీల సెల్సియస్ (3.6 డిగ్రీల ఫారన్‌హీట్)కు పరిమితం చేస్తామని, ఉద్గారాలను తగ్గించుకోవడం ద్వారా ఆ లక్ష్యసాధన దిశలో ముందుకు సాగిపోతామని 2009 కోపెన్ హెగన్ సదస్సులో ప్రపంచ దేశాల ప్రభుత్వాలు హామీ ఇచ్చాయి. దర్బన్‌లో 2011లో సంపన్న దేశాలు తమ ఉద్గారాల లక్ష్యాలను పెంచుతామనీ, 2020 దాకా ఏటా 100 బిలియన్ డాలర్ల చొప్పున 'హరితనిధికి' సాయం అందిస్తామనీ హామీ ఇచ్చారు. కానీ 2013 జూన్ వరకు అవి ఇచ్చింది 75 లక్షల డాలర్లు మాత్రమే. సాంకేతిక బదిలీ అంశాలపై సమస్యలు పరిష్కరిస్తామనీ అంగీకరించాయి. కానీ అమెరికా, ఇయు సహా పలు దేశాలు ఐరాస సాంకేతిక ప్యానెల్ సిఫార్సుల మేరకు లక్ష్యాలు పెంచడానికి నిరాకరించాయి. నిజానికి క్యోటో ప్రోటోకాల్ (1997) కాలం నుంచి ఇప్పటిదాకా జరిగిన వాతావరణ సదస్సుల్లో ఇన్ని ప్రణాళికలు, తీర్మానాలు, నిర్ణయాలు తీసుకున్నా వాటిలో సంపన్న దేశాలు కట్టుబడిన వాటి సంఖ్య అతి తక్కువ.

భూతాపం రెండు డిగ్రీల సెల్సియస్‌కు మించకుండా కొనసాగించడం మధ్యకాలిక లక్ష్యంగానూ, 1.5 డిగ్రీల సెల్సియస్‌కు తిరిగి తగ్గేలా చేయడం దీర్ఘకాలిక లక్ష్యాలుగా, అందుకోసం కాలుష్య ఉద్గారాలను సంపన్న దేశాలన్నీ లెక్క ప్రకారం తగ్గించుకోవాలని క్యోటో ప్రోటోకాల్ (1997) నిర్దేశించింది. కానీ కర్బన కాలుష్య ఉద్గారాలను ప్రపంచంలో అన్ని దేశాల కంటే అతి ఎక్కువగా విడుదల చేస్తున్న అమెరికా (ఇటీవల అది రెండో స్థానానికి దిగింది. చైనా అతి ఎక్కువ కాలుష్య ఉద్గారాలలో మొదటి స్థానంలో ఉంది.) మాత్రం మొదటి నుంచి క్యోటో ప్రోటోకాల్‌కు కట్టుబడకుండా, దానిపై సంతకమే చేయలేదు. అభివృద్ధి చెందుతున్న దేశాలు చారిత్రకంగా అది తమ తప్పిదం కాదు కాబట్టి లక్ష్యాలకు కట్టుబడమని స్పష్టం చేస్తున్నా, అమెరికా వంటి దేశాల కంటే అవే మిన్నగా స్వచ్ఛంద లక్ష్యాలు విధించుకుంటున్నాయి. తాజాగా వార్సా వాతావరణ సదస్సులో కూడా జరిగింది ఇదే. ఉద్గారాలను 1990 స్థాయికన్నా (2020 నాటికి) 25 శాతం తగ్గిస్తానని లోగడ చెప్పిన జపాన్ మాట మార్చి... 31 శాతం పెరగనున్నాయని చావు కబురు చల్లగా చెప్పింది. ఇక అమెరికా, ఇయు, తదితర సంపన్న దేశాలు - అభివృద్ధి చెందుతున్న దేశాలు కూడా కర్బన ఉద్గారాల తగ్గింపు లక్ష్యాల పెంపుకు కట్టుబడాలని డిమాండ్ చేశాయి. రిఫ్రిజిరేషన్ వాయువుల నిషేధం గురించి వర్ధమాన దేశాల దగ్గర్నుంచి వాగ్దానం తీసుకోవాలని ప్రయత్నించాయి గానీ తాము మాత్రం లక్ష్యాలకు కట్టుబడేందుకు ముందుకు రాలేదు.

యుకె, ఆస్ట్రేలియా, కెనడా, అమెరికాలు హరిత వాతావరణ నిధికి ఆర్థిక వనరులు అందిస్తామని గతంలో ఇచ్చిన వాగ్దానాన్ని తోసి పారేసి అసలు ఆ నిధి అవసరమేమిటని ఒకసారి, దానికి వర్ధమాన దేశాలు ప్రైవేటు పెట్టుబడులను సేకరించాలని మరోసారి సలహాలిచ్చాయి. క్యోటో ప్రోటోకాల్ కాలం 2012లో ముగిసినందున 2015 నాటికి కొత్త ఒప్పందాన్ని ఖరారు చేసి 2020 నాటికి అమల్లోకి తేవాలని 2011 నాటి దర్బన్ సదస్సు నిర్ణయించింది. ఈలోగా క్యోటో ఒప్పందాన్నే కొనసాగించాలని నిర్ణయించారు. కానీ పెద్ద దేశాలు ఆ లక్ష్యాలకు ఇప్పుడే కట్టుబడడంలేదు. ఇక కొత్త ఒప్పందానికి లోబడతాయనే నమ్మకం ఎలా ఉంటుంది అనేది వర్ధమాన, పేద దేశాల ఆందోళన. సంపన్న దేశాలు తమ వాగ్దానాలకు కట్టుబడకపోవడం పట్ల అభివృద్ధి చెందుతున్న దేశాల బృందం (లైక్‌మైండెడ్ డెవలపింగ్ కంట్రీస్) తీవ్రంగా విమర్శించింది. పెద్ద దేశాలు తాము ఇస్తామన్న ఆర్థిక సహాయాన్ని వీలైనంత త్వరలో అందించాలని డిమాండ్ చేశాయి. ఈ బృందంలో భారత్, చైనా దేశాలు కూడా ఉన్నాయి. వర్ధమాన దేశాలు కాలుష్య ఉద్గారాల లక్ష్యాలను స్వచ్ఛందంగా నిర్ణయించుకోవచ్చనీ, సంపన్న దేశాలకు ప్రత్యేక లక్ష్యాలుండాలనే నిబంధనకే ఈ దేశాలు ప్రాధాన్యత ఇస్తున్నాయి.

**ముంచుకొస్తున్న ప్రమాద ఘంటికలు**

వాతావరణంలో వస్తున్న మార్పులు ప్రపంచ వ్యాప్తంగా అనేక విపరిణామాలకు అంటుకడుతున్నాయి. అవి పర్వత సానువుల విధ్వంసం, ఉష్ణప్రాంత అడవులు అంతరించిపోవడం, సముద్ర ప్రవాహాల దిశ మార్పు, ఓజోన్ పొర దెబ్బతినడం, గ్లోబల్ వార్మింగ్, సమశీతోష్ణ మండలం అడవులు అంతరించడం, చిత్తడి భూముల నాశనం, భూమి కోత, అణుధార్మిక కాలుష్యం, ఎడారులు విస్తరించడం, భూగర్భ జలాలు అంతరించి పోవడం, కోరల్ రీఫ్‌ల నాశనం, పునరుత్పత్తి కాని వనరులు అంతరించిపోవడం, సముద్ర జలాలపై చమురు తెట్టు ఏర్పడడం, వ్యర్థ పదార్థాలు పారవేసే విస్తీర్ణం పెరగడం, వాయు జల కాలుష్యాలు పెరగడం, అరుదైన ప్రాణులు అంతరించిపోవడం మనం గమనిస్తున్నదే.

భారత్‌లో పరిస్థితిని చూస్తూనే ఉన్నాం. ఉత్తరాఖండ్ వరదలు రేపిన గాయం మానకముందే మన రాష్ట్రం మీదకు వరుసగా విరుచుకు పడుతున్న పెను తుఫానులు భవిష్యత్ దృశ్యాన్ని భయానకంగా ఆవిష్కరిస్తున్నాయి. పొరుగు దేశం బంగ్లాదేశ్ ముంపు ముప్పును ఎదుర్కొంటోంది. సూడాన్‌లో కొద్దిపాటి వ్యవసాయ భూమినీ మింగేస్తూ, సహారా ఎడారి విస్తరిస్తోంది. వేడెక్కుతున్న సముద్ర జలాలు కరీబియన్ దీవులపై తీవ్రఉప్పెనల రూపంలో విరుచుకు పడుతున్నాయి. గత వెయ్యేళ్లలో ఎన్నడూ లేనంత తరచుగా అట్లాంటిక్ మహాసముద్ర ప్రాంతంలో హరికేన్‌లు పుడుతున్నాయి. ఆస్ట్రేలియాలోని కొన్ని చోట్ల అధిక ఉష్ణోగ్రతల కారణంగా కార్చిచ్చులు పేట్రేగడం మామూలై పోయింది. సైబీరీయాలోనైతే చలికాలంలో ఉష్ణోగ్రత మైనస్ యాభై డిగ్రీలకు చేరుకొని, మనిషి మనుగడ దుస్సాధ్యంగా మారుతోంది. పసిఫిక్ మహా సముద్ర ప్రాంతంలోని తువాలు దీవులు పూర్తిగా తుడిచిపెట్టుకు పోయే దుస్థితి దాపురించింది. ఉమ్మడిగా 44 లక్షల కోట్ల డాలర్ల మేరకు ఉత్పత్తి సాధించే సత్తా కలిగిన 67 దేశాలు ప్రకృతి విపత్తుల వల్ల దెబ్బతినే సూచనలు ఉన్నాయని వాతావరణ మార్పు ప్రమాద సూచి (సిసివిఐ)లో వెల్లడించారు. భారత్, చైనా, పాకిస్థాన్, వియత్నాం, ఇండోనేషియా, థాయ్‌లాండ్ వంటి దేశాలన్నింటి నెత్తిమీద కత్తి వేలాడు తోందిప్పుడు. ఢాకా (బంగ్లాదేశ్), ముంబై, కోల్‌కత్తా (ఇండియా), మనీలా

# తిరుపతిని అయోధ్యగా మారుస్తారా

***లౌకిక దేశంగా చెప్పకుంటున్న భారతదేశంలో మతం పేరుతో మైనారిటీలపై ఎన్నో అకృత్యాలు జరిగాయనీ, ఇప్పడు తాజాగా తిరుపతి వివాదాన్ని కూడా అందులో భాగంగానే చూడాలనీ అంటున్నారు* ఎం.కె. కుమార్**

ప్రతి హిందూ దేవాలయాన్ని తవ్వితే వాటి కింద ఒక బౌద్ధ దేవాలయం ఉంటుందని ప్రముఖ చరిత్రకారిణి రొమిల్లా థాపర్ పేర్కొన్నారు. రాష్ట్రంలో పేరెన్నికగన్న తిరుమల ఆలయం ఒకప్పుడు బౌద్ధ ఆరామంగా ప్రసిద్ధి గాంచిందని చరిత్ర చెపుతోంది. నాజీ ఫాసిజాన్ని, ఆర్య మనువాదాన్ని వంటపట్టించుకున్న హిందూ మతోన్మాదులు ముస్లిం జాతి పట్ల తీవ్ర వ్యతిరేకతను, విద్వేషాన్ని ప్రజల్లో పెంపొందించి బాబ్రీ మసీదును కూలగొట్టారు. చరిత్రలో ఇది మొదటి ఘట్టం కాకపోయినా ఆ విధ్యంసంతో మైనారిటీల పట్ల తమ అసహనాన్ని బాహాటంగా ప్రదర్శించారు. ముస్లిం మసీదులతో పాటు చర్చిలను విధ్వంసం చేసిన ఘటనలు ఉన్నప్పటికీ, వీరి హైందవీకరణ బౌద్ధ ఆరామాల ధ్వంసంతో మొదలై తన వికృత విస్తృతిని అన్య మతస్థుల పాఠశాలలను వినాశనం చేయడం వరకు సాగడం ఫాసిస్టు అత్యున్నతదశను గుర్తుకు తెస్తోంది.

తిరుపతి సమీపంలోని చంద్రగిరి మండలం తొండవాడ సమీపంలో హీరా ఇస్లామిక్ కళాశాల భవనాన్ని కూల్చెయ్యాలని తిరుపతిలో హిందుత్వవాదులు 10 రోజుల క్రితం జరిపిన హిందూగర్జన సభలో ఒక తీర్మానాన్ని ప్రవేశపెట్టడం లౌకికవాదులను భయంకంపితులను చేసింది. అత్యంత భయానక, విద్వేషపూరిత వాతావరణాన్ని తిరుపతి పరిసర ప్రాంతాలలో కల్గించడానికే హిందూగర్జన సభను తిరుపతిలో పెట్టడం జరిగింది.

ముస్లింలు తిరుమలలోని ఆలయాన్ని ధ్యంసం చేయడానికి కుట్ర పన్నుతున్నారని, దాని పవిత్రతను దెబ్బతీయడానికి ప్రయత్నిస్తున్నారని హిందుత్వవాదులు గత దశాబ్ద కాలంగా ప్రణాళికా బద్ధంగా ప్రచారం చేస్తున్నారు. తిరుమలలో బైబిల్‌ను ఉచితంగా యాత్రికులకు పంచుతున్నారని, ముస్లిం మతస్తులు తిరుమలలో అక్రమంగా కొన్ని ప్రైవేటు హోటళ్లలో పనిచేస్తూ తిరుమలకు హాని తలపెట్టే యోచనలో ఉన్నారని దుష్ప్రచారం చేశారు. ఇంతవరకు ఒక్క అన్యమతస్తునిపై కూడా పోలీసులు కనీసం కేసును నమోదుచేయలేకపోయారు. దీనర్థం అటువంటి ప్రయత్నాలు ఏవీ తిరుమలలో జరగట్లేదని స్పష్టమైనట్లే కదా. గత సంవత్సరం అక్టోబర్‌లో తిరుమలలో గరుడోత్సవం జరుగడానికి ముందు రోజు ముస్లిం కుటుంబాన్ని తిరుపతి నుండి 23 కిలోమీటర్ల పరిధిలోని వడమాలపేట గ్రామంలోని ఒక ఇంట్లో పోలీసులు అరెస్టు చేశారు. వీరు గరుడోత్సవం రోజున చెన్నై నుండి తిరుమలకు కాలినడకన భక్తులు తీసుకువస్తున్న గొడుగులో బాంబులు అమర్చి

---

(ఫిలిప్పీన్స్), బ్యాంకాక్ (థాయ్‌లాండ్) వంటి నగరాలూ వాతావరణ మార్పునకు బలి కావచ్చునన్న అంచనాలు హడలెత్తిస్తున్నాయి.

నిజానికి వార్సా సమావేశానికి ముందే ఈ సమావేశం వల్ల ఒరిగే ప్రయోజనం ఏమీ ఉండబోదని పరిశీలకులు చెప్పారు. దానికి పశ్చిమ దేశాల వైఖరి ఒక కారణమైతే, పోలెండ్ ప్రభుత్వం ఈ సమావేశాల పట్ల వ్యవహరించిన తీరు మరో కారణం. పోలెండ్ ప్రభుత్వం వార్సాలో 19వ ప్రపంచ వాతావరణ సదస్సుతో బాటు ప్రపంచ బొగ్గు పారిశ్రామికుల సదస్సు కూడా అదే సమయంలో నిర్వహించింది. ప్రభుత్వ దృష్టి మొత్తం బొగ్గు కార్పొరేట్ సంస్థలకు ఊడిగం చేయడంపైనే కేంద్రీకరించింది. వాతావరణ సదస్సును పెద్దగా పట్టించుకోలేదు. పైగా సదస్సు మధ్యలో దీని నిర్వహణ ఏర్పాట్లు చూస్తున్న పర్యావరణ శాఖా మంత్రి మార్సిన్ కొరొలెక్‌ను మంత్రివర్గం నుండి తొలగించింది. దాంతో చర్చల తీరు, బహుళజాతి సంస్థల జోక్యం, ప్రభుత్వ వైఖరికి నిరసనగా 800 మందితో కూడిన వాతావరణ ప్రతినిధుల గ్రూపు సమావేశం మధ్య నుండి వాకౌట్ చేసింది. ఇందులో గ్రీన్‌పీస్, ప్రపంచ వన్యమృగ నిధి (డబ్ల్యు.డబ్ల్యు.ఎఫ్) కూడా ఉన్నాయి. 'ఇది పూర్తిగా కార్పొరేట్లు, బొగ్గు పారిశ్రామిక వేత్తలకు 'బందీ' అయిన సదస్సు' అని 'ఎర్త్ ఇంటర్నేషనల్' సంస్థ ప్రతినిధి దీప్తి భట్నాగర్ పేర్కొన్నారు.

పెట్టుబడిదారీ వ్యవస్థను కొనసాగిస్తూ ఉద్గారాలను తగ్గించుకోవడానికి ఎన్ని సదస్సులు నిర్వహించినా ఫలితం ఉండదు. గత రెండు దశాబ్దాలుగా వాతావరణ మార్పులపై చర్చోపచర్చలు జరుగుతున్నా ఫలితం ఉండడంలేదు. 'గ్రీన్‌టెక్నాలజీ', 'ఉద్గారాల వ్యాపారం (కార్బన్ క్రెడిట్స్)' వంటివి ఎన్ని వచ్చినా అవన్నీ ఫలితం ఇవ్వని ప్రయత్నాలుగానే మిగులుతున్నాయి. అందువల్లనే వార్సా అంతర్జాతీయ వాతావరణ సదస్సుల్లాంటివి ఎన్ని జరుగుతున్నా ఉద్గారాలు తగ్గించడానికి మాత్రం ఏ సంపన్న పారిశ్రామిక దేశం ముందుకు రావడం లేదు. వాతావరణ కాలుష్యానికి, పెట్టుబడిదారీ అభివృద్ధికి పీట ముడిపడి ఉండడమే ఈ జాప్యానికి కారణం. అంతిమ విశ్లేషణలో తేలేదేమంటే "నేటి వాతావరణ సంక్షోభానికి కారణంగా ఆధిపత్యంలో ఉన్న సామాజిక వ్యవస్థ ఉత్పత్తి సంబంధాలు, సాంకేతిక విజ్ఞాన ఎంపికగా మన ముందున్నాయి" అని జాన్ బెల్లమీ పోస్టర్, బ్రెట్ క్లార్క్‌లు పేర్కొన్నారు. మరోరకంగా చెప్పాలంటే పెట్టుబడిదారీ ఉత్పత్తి విధానానికి, మానవాళి మనుగడకు మధ్య వైరుధ్యంగా పర్యావరణ సంక్షోభం రూపంలో మన ముందుకొచ్చింది. ఈ సంక్షోభం వలన భవిష్యత్తులో జీవావరణ వ్యవస్థ దెబ్బతిని సామాజిక – ఆర్థిక సమస్యలూ తలెత్తవచ్చుననీ శాస్త్రవేత్తల్లో భయాందోళనలు వ్యక్తమవుతున్నాయి. అలాంటి సమస్యలకు ఆస్కారం లేకుండా ప్రత్యామ్నాయ ఇంధనాల దిశలో ముందంజ వేయగలిగితే, అనవసర వినియోగాన్ని తగ్గించుకుంటే – విపత్కర పరిస్థితులకు దారితీస్తున్న వాతావరణ మార్పునకు అడ్డుకట్ట వేయడం కష్టమేమి కాదు! కానీ, లాభాలే పరమావధిగా భావిస్తున్న పారిశ్రామిక, వాణిజ్య వర్గాలు ఊరుకుంటాయా అంటే అనుమానమే.

*(రచయిత ఉపాధ్యాయ ఉద్యమ నాయకులు, రాజనీతిశాస్త్ర విద్యార్థి)* వీ

తిరుమలలో పేల్చాలని అనుకున్నారని పత్రికలు విపరీతంగా ప్రచారం చేశాయి. ఇందుకు ఆ గొడుగులు తీసుకువచ్చే బ్రాహ్మణ పూజారితోనే ఒప్పందం కుదుర్చుకున్నారని కూడా మీడియా కథనాలను ప్రచారం చేసింది. ఇంతవరకు ఎవ్వరినీ ఆ నెపంతో పోలీసులు అరెస్టు చేయలేదు. అరెస్టు కాబడ్డ ముస్లింలు అతి పేద కుటుంబానికి చెందినవారు. చిన్న, చిన్న దొంగతనాలకు పాల్పడేవారే కాని తీవ్రవాదులు కాదు. వారు తీవ్రవాదులని , తిరుమలలో విధ్వంసం చేయడానికి కుట్ర పన్నుతున్నారని చెప్పేదానికి పోలీసులకు ఇంతవరకు ఆధారాలతో కూడిన సాక్ష్యాలు దొరకలేదు. ఈ ఘటన జరిగిన తర్వాత తిరుపతిలో హిందూత్వశక్తులు తమ దుష్ప్రచారాన్ని ఎక్కువ చేశారు. తిరుపతిలో ఉన్న మదర్సాలను. మసీదులను పోలీసులు వెంటనే తనిఖీ చేయాలని డిమాండ్ చేస్తూ ధర్నాలు చేశారు. తిరుపతి ప్రజల్లో అభద్రతా భావాన్ని నెలకొల్పడంలో ఈ సంఘటన ప్రముఖ పాత్ర పోషించింది. తిరుమల గరుడోత్సవంలో 3 లక్షల దాకా పాల్గొనే ప్రజలు ఈ సంఘటనతో ఒక లక్షకే పరిమితమయ్యారు. తిరుపతి నగరాన్ని వాటికన్ తరహా పుణ్యక్షేత్రంగా తీర్చిదిద్దాలని బిజెపి మొదటినుండి ప్రచారం చేస్తోంది. పవిత్ర పుణ్యక్షేత్రమైన తిరుమలను హిందూత్వశక్తుల అదుపులోకి తెచ్చుకోవడానికి ఇది ఎంతో ఉపయోగపడుతోందనేది వారికి తెలుసు. ఆ విధంగా మత ప్రాతిపదికన ప్రజలను విడగొట్టి హిందువుల ఓట్లను కొల్లగొట్టాలని వారి తాపత్రయం.

జిల్లాలో ముస్లిం ఓటు బ్యాంకు ఎక్కువగా కాంగ్రెస్‌తోనే ఉంది. వైఎస్ఆర్ కాంగ్రెస్ పార్టీ ఏర్పడ్డ తర్వాత, ముస్లిం ఓటుబ్యాంకులో చాలా భాగం ఇందులో చేరింది. రెడ్డి సామాజిక వర్గానికే అంటిపెట్టుకున్న ఈ ఓటు బ్యాంకు జాతీయ స్థాయిలో గెలుపొందే పార్టీకే మొదటి నుండి తమ ఓట్లను వేస్తూ వచ్చారు. కాంగ్రెస్ వల్లెవేస్తున్న కుహనా లౌకికత్వాన్ని వీరు విధిలేక నమ్ముతూ వస్తున్నారు. ముస్లిమేతర ఓటుబ్యాంకు కులాల వారీగా చీలిపోయింది. వీటంతటిని గుత్త హిందూ ఓటుబ్యాంకుగా మార్చాలని బిజెపి వ్యూహం. నాలుగు రాష్ట్రాల ఎన్నికల్లో బిజెపి విజయం సాధించిన తర్వాత, మధ్యతరగతి ప్రజానీకానికి ఆరాధ్య దేవుడిగా మోడీని మార్చారు. అభివృద్ధి మంత్రాన్ని జపిస్తున్న మోడీని ప్రధాని అభ్యర్థిగా ప్రకటించిన తర్వాత మత విద్వేషాలను ప్రాంతాల వారీగా రెచ్చగొట్టి, హిందువులను ఏకం చేసి వారి మన్నన పొందాలనేది వారి ఎత్తుగడగా ఉంది. అందుకే ముజఫర్‌నగర్ నుండి తిరుపతి వరకు హిందూ ముస్లిం మధ్య మత ఉద్రిక్తతలను రెచ్చగొట్టే విధంగా ఎత్తుగడలు రూపొందిస్తున్నారు. తిరుపతిలో జరిగిన హిందూగర్జన సభలో దక్షిణ భారతదేశంలోని 6 రాష్ట్రాల హిందూత్వ ప్రతినిధులు పాల్గొనడం యాధృచ్ఛికం కాదు. ఆ సభలో హీరా ఇస్లామిక్ యూనివర్సిటీ కట్టడాన్ని కూల్చాలని తీర్మానించడమూ యాధృచ్ఛికం కాదు.

తిరుమలకు 22 కిలోమీటర్ల దూరంలో హీరా ఇంటర్నేషనల్ స్కూల్ ఉంది. ఇది ప్రస్తుతం మదర్సాగానే కొనసాగుతోంది కాని, ఇస్లామిక్ పాఠశాలగా కాదు. అది నిర్వాహకుల భవిష్యత్తు ప్రణాళిక మాత్రమే. మదర్సాను ఇస్లామిక్ యూనివర్సిటీగా చేసి ముస్లిం మతస్తుల్లోని పేదవారికి ఉచితంగా విద్యను అందించాలని, అందులో రాష్ట్ర ప్రభుత్వ పాఠశాలలో మాదిరే పాఠ్యాంశాలను బోధించాలని రూపకల్పన చేసుకున్నారు. ఇస్లామిక్ యూనివర్సిటీ నెలకొల్పేదానికి నిర్వాహకులు ప్రభుత్వానికి దరఖాస్తు చేసుకున్నారు. దీనికి ప్రభుత్వం అనుమతి ఇవ్వవలసి ఉంది.

ఈ మదర్సా గత సంవత్సరమే ఏర్పడలేదు. 15 సంవత్సరాల నుండి ఈ మదర్సా నడుస్తోంది. 2004లో మదర్సా నిషాన్ ఇషా అతుల్ ఇస్లాం ఉర్దూ అండ్ అరబిక్ సొసైటీ పేరుమీద రిజిస్టర్ అయింది. సుమారు 280 మంది పేద, అనాథ విద్యార్థులతో తిరుపతి, చంద్రగిరిలలో ఉంది. 2007లో తొండవాడ దగ్గర స్వర్ణముఖి నది దగ్గర భూమిని కొనుగోలు చేసి హీరా మదర్సా పేరుతో రిజిష్టరు చేసుకున్నారు. 2010లో గ్రామ పంచాయితీ మొదటి అంతస్థు వరకు అనుమతి నిచ్చింది. వ్యవసాయ యోగ్యమైన ఆ భూమిని నివాస స్థలాలుగా చాలామంది వాడుకుంటున్నట్టే మదర్సా నిర్వాహకులు భవనాన్ని నిర్మించుకున్నారు. ఆ చుట్టుప్రక్కల ప్రాంతాల్లో ప్రభుత్వ అనుమతులు పొందకుండానే రెండు, మూడు అంతస్థులు కట్టుకోవడం సర్వసాధారణం. ఆ ప్రకారమే హీరా మదర్సా సంస్థ వారు మరో ఐదు అంతస్థులు కట్టుకున్నారు. క్రమబద్ధీకరణకు ప్రభుత్వానికి విన్నవించుకున్నా అనుమతి నిరాకరించడంతో కోర్టులో కేసు వేశారు. తీర్పు ఇంకా రావలసే ఉంది.

హీరా ఇస్లామిక్ కళాశాల భవనం నిర్మించిన స్థలంలో ఒకప్పుడు హిందూ దేవాలయమైన తిమ్మప్ప ఆలయ పుష్కరిణి వుండేదని స్థానిక గ్రామస్థులు చెపుతున్నారు. నిజానికి ఇది చారిత్రకంగా రుజువు కావల్సి ఉంది. హీరా స్థలానికి ప్రక్కన కొంచెం దూరంలో తిమ్మప్ప ఆలయం ఇప్పటికీ ఉంది. 1949లో తితిదే ముద్రించిన ప్రథమ శ్రీ అన్నమాచార్యోత్సవ క్రమం అనే పుస్తకంలో తిమ్మప్ప ఆలయ ప్రస్తావన ఉంది. ఈ ఆలయాన్ని గొల్లవారి గుడి అని ఇప్పటికీ స్థానికులు పిలుస్తుంటారు. ప్రస్తుతం ఆ ఆలయంలో మూలవిరాట్టు విగ్రహమే లేదు. అది కొన్ని ఏళ్ల క్రితమే చోరీ అయింది. మూల విగ్రహం 4.5 అడుగుల ఎత్తులో ఉన్నట్లు స్థానికులు పేర్కొంటున్నారు. గుప్తనిధుల కోసం మూలవిరాట్ పాదపీఠాన్ని కూడా తవ్వివేశారు. ఇది ప్రస్తుతం పూర్తి శిథిలావస్థలో ఉంది. తిరుపతి పరిసర ప్రాంతాల్లో శిథిలావస్థలో ఉన్న ఆలయాలు సుమారు వందకు పైగా వుంటాయి. వీటిని పట్టించుకునే నాథుడే లేడు. తిమ్మప్ప ఆలయ భూములు మొత్తం 17 ఎకరాలున్నట్లు చెపుతున్నారు. ఇది కూడా నిరూపణ కావల్సిఉంది. గడియారం వంశస్తుల అధీనంలో ఉన్న ఈ భూములను 1990 లో కౌలుకు ఇవ్వడంతో ఈ భూములు అన్యాక్రాంతమయ్యాయి. గుడికి సంబంధించిన 36 రాతిస్తంభాలను ఎస్వి యూనివర్సిటీకి తరలించి భద్రపరిచారు. తిమ్మప్ప ఆలయ భూముల్లో చాలమంది ఇళ్లు కట్టుకున్నారు. కొన్ని వ్యవసాయ భూములుగా వున్నాయి. ఈ భూముల్లోనే హీరా కళాశాల యాజమాన్యం భూములను కొనుగోలు చేసిందని పేర్కొంటున్నారు. ప్రహరీగోడ కోసం కాల్వ పోరంబోకును ఆక్రమించారని, నౌహీరాషేక్ అనే ముస్లిం మహిళ హఠాత్తుగా కోట్లకు పడగలెత్తి ఇస్లామిక్ యూనివర్సిటీని ముస్లిం దేశాలనుండి నిధులు స్వీకరించి కడుతోందని ఆరోపిస్తున్నారు. 1.48 ఎకరాల భూములను హీరా యాజమాన్యం చట్టబద్ధంగానే కొనుగోలు చేసుకుని రిజిష్టరు చేసుకుంది. 1955లో కేంద్ర ప్రభుత్వం మిరాశీ చట్టాన్ని రద్దుచేసిన తర్వాత ఆలయ భూములు ప్రైవేటు వ్యక్తుల చేతుల్లో నుండి ప్రభుత్వ అధీనంలోకి వచ్చాయి. ఈ మధ్యే సుప్రీంకోర్టు ఇచ్చిన తీర్పు మేరకు అన్నమయ్య వంశస్తుల అధీనంలో ఉన్న భూములకు తితిదేని హక్కుదారునిగా ప్రకటించింది. అన్నమయ్య నాల్గవ తరానికి చెందిన గడియారం వంశస్తులకు చెందిన ఈ భూములు సుప్రీంకోర్టు తీర్పు ప్రకారం తితిదేకి చెందుతాయని అధికార వర్గాలు పేర్కొంటున్నాయి. క్రీశ 1542లో అచ్యుతదేవరాయల కాలంలో ఈ ఆలయాన్ని నిర్మించారని చరిత్రకారులు పేర్కొంటున్నారు. కన్నడ ప్రజలు వేంకటేశ్వరున్ని తిమ్మప్ప అనే పేరుతో పిలుచుకుంటారని, అందువల్లే ఈ ఆలయానికి తిమ్మప్ప దేవాలయంగా పేర్కొన్నారని చెప్తున్నారు. పురాణాలకు సంబంధించి పద్మావతి అమ్మవారు పద్మశాలి వంశానికి చెందిందని, అందువల్లే

పద్మశాలి కులస్తులు 10 వేల వరహాల విరాళాలను సేకరించి, మరో 10 వేల వరహాలను తిరుమల ఆలయం నుండి తీసుకుని చంద్రగిరి సమీపంలోని ఆళ్లగట్టుతిప్ప అనే ప్రాంతంలో నిర్మించారనే వాదన ఉంది. దీన్నే ప్రస్తుతం తొండవాడ అని పిలుస్తున్నారు.

హీరా మదర్సా గత 15 సంవత్సరాలుగా తిరుపతి పరిసర ప్రాంతాల్లో నడుస్తున్నా దీనిపై ఇంతవరకు ఎటువంటి అభియోగం లేదు. తిరుపతిలో 20కి పైగా మదర్సాలు, 25కిపైగా మసీదులు, 60కి పైగా చర్చీలు వున్నాయి. వీటివల్ల తిరుమల ఆలయ పవిత్రతకు ఎటువంటి ముప్పు కలుగలేదు. పైగా హిందూత్వశక్తుల వల్లే అన్యమత ఆలయాలకు పెనుముప్పు దాపురించబోతోంది. ఈ నేపథ్యంలోనే తిరుమల, తిరుచానూరులోను అన్యమత ఆలయాలు , ప్రచారం వుండకూడదనే ఉత్తర్వులు ప్రభుత్వం ఇవ్వాలనే డిమాండ్ ఊపందుకుంటోంది. అంటే ఈ ప్రాంతాన్నుండి మైనార్టీలను తరిమి కొట్టాలని, చిన్నపాటి మతతత్వరాజ్యాన్ని ఇక్కడ స్థాపించాలని కంకణం కట్టుకున్నారన్నమాట.

తిరుపతిలోని ముస్లింలు, హిందువులు కొన్ని వందల సంవత్సరాలుగా సహజీవనం చేస్తున్నారు. తిరుమల శనివారాల్లో హిందువులతో పాటు ముస్లింలు కూడా మాంసం భుజించరు. ముస్లింలు కనీసం మాంసం అంగళ్లను కూడా తెరవరు. ముస్లింల పీర్ల పండుగలో హిందువులు పెద్ద ఎత్తున పాల్గొంటారు. మసీదుల ముందర సాయంత్రం వేళల్లో హిందువుల  పిల్లలకు జ్వరం తగిలినప్పుడు ముస్లింల చేత పొగ వేసుకునే పద్ధతి ఇంకా కొనసాగుతోంది. ఒక్కో మసీదు ముందర దీనికోసం హిందువులు 50మందికి పైగా శుక్రవారం గుమిగూడతారంటే అతిశయోక్తికాదు.

తిరుపతిలో ఇప్పటివరకు మతఘర్షణలు జరుగలేదు. అక్రమంగా హీరా సంస్థ స్థలాన్ని ఆక్రమించినా, కట్టడాలను కట్టినా చట్టపరమైన చర్యలు తీసుకోవడంలో ఎటువంటి తప్పులేదు. అదే క్రమంలో హీరా సంస్థవారు ఆక్రమించినట్టే, ఇతరులు తిమ్మప్ప భూములను ఆక్రమించితే వారిపై చర్యలు తీసుకోవాలి. కాని ఎవ్వరూ ఇతరుల గురించి మాట్లాడడం లేదు. తిరుపతిలో అక్రమంగా నిర్మించిన అపార్ట్‌మెంట్లు 100కిపైగా ఉన్నాయి. ఒక అపార్ట్‌మెంట్‌ను తిరుపతి కమీషనర్ కూల్చేయబోతే ఒక్కరోజులోనే ఆయన్ని ట్రాన్స్‌ఫర్ చేశారు.

తిరుపతిలోని హిందూ ముస్లింలు ఎంత సంయమనాన్ని పాటించారంటే ఈ విషయంపై ఎటువంటి వివాదాస్పద చర్యలు చేయలేదు. హిందూగర్జన సభలో హీరా మదర్సా ప్రస్తావన తేకూడదని, దానివల్ల మొదటకే ప్రమాదమొస్తుందని స్థానిక ఆర్‌ఎస్‌ఎస్ నేతలు హెచ్చరించినా నిర్వాహకులు పెడచెవిన పెట్టారు. ఈ సభలో స్థానికంగా ఉన్న హిందువులు కనీసం 200మంది కూడా లేరు. ఇతర రాష్ట్రాల, ప్రాంతాల నుండి వచ్చిన వారే ఎక్కువున్నారు.

నిజానికి తిరుమల ఆలయ దర్శనానికి వచ్చే భక్తులకు మెరుగైన సేవలు అందించాలని, వ్యాపార ధోరణిని తితిదే మానుకోవాలని, భక్తుల డబ్బులను ఇష్టానుసారంగా ఖర్చు చేయకూడదనే అంశాలతో సభ నిర్వహించి వుంటే వేల సంఖ్యలో భక్తులు పాల్గొనేవారు. ఈ సభ విజయవంతం అయినప్పటికీ, వారి ఎత్తుగడ ఫలించలేదు.

తిరుపతి గోవిందరాజస్వామిగుడిలో బీబీ నాంచారమ్మ విగ్రహం హిందువుల చేత పూజలందుకుంటూనే ఉంది. ఈమె ముస్లిం అని తితిదే పుస్తకాలలో ప్రచురితమైఉంది. తిమ్మప్ప ఆలయ పునరుద్ధరణకు పూనుకోవడానికి కూడా హిందూత్వశక్తులు ఆసక్తి చూపడంలేదు. రాష్ట్రంలో అన్యాక్రాంతమైన లక్షల సంఖ్యలో ఉన్న  దేవాలయ భూములను ప్రభుత్వం స్వాధీనపర్చుకొని, భూమిలేని పేదలకు ఇవ్వాలనే డిమాండ్ వారిపైవు నుండి రావడం లేదు. తిరుపతి పరిసర ప్రాంతాల్లో మదర్సాలు వుండకూడదని, అవి ఉగ్రవాదాన్ని ప్రేరిపిస్తాయని వారు వాదిస్తున్నారు. హిందూ దేవాలయాలకు ఆనుకునే కాశీ, మధురలలో మసీదులున్నాయి. చట్టంలో అట్లా వుండకూడదనే సెక్షన్లు కూడా లేవు. ఒక ప్రదేశంలో అనేక మతస్తుల దేవాలయాలు వుండవచ్చు. మదర్సాలు కేవలం మతపరమైన జీవన విధానాన్ని, జ్ఞానాన్ని అందించే పాఠశాలలు మాత్రమే. మఠాలు, వేదపాఠశాలలలో హిందూమత విలువలను బోధించినట్టే వీరి పాఠాలు వుంటాయి. మదర్సాలుండకూడదంటే వేదపాఠశాలలు, సరస్వతి శిశు మందిర్‌లు, భారతీయ విద్యా భవన్‌లు ఉండకూడదనే వాదనను మైనార్టీలు వినిపించాల్సి వస్తుంది.

తిరుపతి పరిసర ప్రాంతాల్లో, తుడా పరిధిలో 34 వెంచర్లను, అక్రమ లే-అవుట్లను తిరుపతి పట్టణాభివృద్ధి సంస్థ (తుడా) రద్దు చేసింది. ఇందులో 98 శాతం వెంచర్లలో అక్రమ కట్టడాలు యధేచ్ఛగా కడుతున్నారు. ఆ భూముల్లో క్రయవిక్రయాలు, రిజిస్ట్రేషన్లు జరుగుతున్నాయి. సుమారు 2000 ఎకరాల్లో ఈ పరిస్థితి నెలకొని ఉంది. రాజకీయంలోకి రియల్ ఎస్టేట్ వ్యాపారంలోని మిగులు కుప్పలు, తెప్పలుగా వచ్చిపడుతోంది. ప్రతి రాజకీయ నాయకుడు పార్టీతో సంబంధం లేకుండా రియల్ ఎస్టేట్ వ్యాపారం చేస్తున్నాడు.

ఇది వామపక్ష పార్టీలకు కూడా పాకడం కొత్త విషయం కాదు. వేల ఎకరాల్లో, తుడా అనుమతి లేకుండా, గ్రామ పంచాయితీ అప్రూవల్ లేకుండా కడుతున్న కట్టడాలను ప్రభుత్వం కూల్చగలదా? వందల సంఖ్యలో అనుమతి లేకుండా కట్టిన అపార్ట్‌మెంట్లను తుడా కూలుస్తుందా? తిరుపతి పరిసర ప్రాంతాల్లో మొత్తం 30 చెరువులున్నట్లు రెవెన్యూ గణాంకాలు చెప్తున్నాయి. వీటి పరిధి సుమారు 1500 ఎకరాలు. వీటిని ఎప్పుడో రియల్ ఎస్టేట్ వ్యాపారులు ప్లాట్లు వేసి అమ్మేశారు. వీటన్నిటికి తుడా (తిరుపతి పట్టణాభివృద్ధి సంస్థ) అనుమతి లేదు. ఒక అసాంఘిక శక్తిగా రియల్ ఎస్టేట్ రంగం ఎదిగింది. కొద్దిపాటి వర్షానికే ఆ ప్రాంతాలలోని  కాలనీలన్నీ జలమయం అవుతూ, ఇళ్లలోకి  నీళ్లు వస్తున్నాయి. న్యాయం ఎవరికైనా ఒకటిగానే ఉండాలి. దీన్ని నియంత్రించడం ప్రభుత్వం వల్ల కాదు.

1991 నుండి క్రమంగా బలపడుతున్న సామ్రాజ్యవాద, హిందూత్వశక్తుల పొత్తు సామ్రాజ్యవాద వ్యతిరేక శక్తులను మత, ప్రాంత, కుల ప్రాతిపదికన విభజించి బలహీనపరుస్తోంది. సామ్రాజ్యవాదాన్ని బలంగా వ్యతిరేకిస్తున్న శక్తుల్లో ముస్లింలు కూడా ఉన్నారు. వీరిని అణచడానికి అమెరికా ఉగ్రవాదం బూచి చూపెడుతుంటే, అదే బూచిని హిందూత్వశక్తులు మనదేశంలో కూడా చూపిస్తున్నారు.

లౌకికవిలువల్ని, పౌరహక్కులను ధ్వంసం చేసే విధంగా హీరా మదర్సాపై అవాస్తవ విషయాలను ప్రచారం చేస్తున్నారు. అందులో ఉన్న పేద, అనాథ పిల్లలను నిజానికి ప్రభుత్వమే దత్తత తీసుకుని చదివించవచ్చు. ముస్లిం మతాన్ని లక్ష్యంగా చేసుకుని చేసే దుష్ప్రచారాన్ని అందరూ వ్యతిరేకించాలి. హిందూ దేవాలయాలకు నిధులిచ్చే ప్రభుత్వం మదర్సాలకు, చర్చిలకు ఎందుకు నిధులివ్వదో ప్రశ్నించాలి. హీరా సంస్థ నడుపుతున్న మదర్సా వల్ల తిరుమల పవిత్రతకు ఏ మాత్రం భంగం వాటిల్లదు. స్థలం, కట్టడం అక్రమంగా ఉంటే చట్టబద్ధంగా చర్యలు తీసుకోవాలి. ఇదే న్యాయాన్ని జిల్లాలోని అన్ని స్థలాలకు, కట్టడాలకు వర్తింపజేయాలి. ఒక్క హీరా సంస్థ కట్టడమే కూలుస్తాననడం దుర్మార్గమైన విషయం. ప్రభుత్వం కూల్చకపోతే మేమే ధ్వంసం చేస్తామడం హిందూత్వనాయకుల అహంకారాన్ని సూచిస్తుంది. మత సామరస్యాన్ని, ప్రశాంతతను కాపాడే విధంగా ప్రభుత్వం చర్యలు తీసుకోవాల్సిన అవసరం ఉంది.

*(రచయిత పౌరహక్కుల కార్యకర్త)* వీ

# హిందూత్వం-మోడీ-తెలంగాణ

*లౌకిక వాద దేశమంటూనే ప్రజలను కులాల పేరుతో, మతాల పేరుతో చీల్చి అధికారంలోకి రాజూస్తున్న హిందూత్వ రాజకీయ పార్టీ పట్ల తెలంగాణ ప్రజలు జాగరూకత వహించాలని అంటున్నారు* **ఎం. సంధ్య**

**భా**రతదేశం 21వ శతాబ్దంలో నూతన రాజకీయ సంస్కృతిని సంతరించుకుంటున్నది. గత 10 సంవత్సరాలుగా అధికారానికి దూరమైన బిజెపి, దాని అనుబంధ సంఘాలు (విహెచ్‌పి, ఆర్‌ఎస్‌ఎస్, భజరంగ్‌దళ్, ఇతర నూతన సంస్థలు) 2014లో అధికారం చేజిక్కించుకోవడమే లక్ష్యంగా సర్వ శక్తులు ఒడ్డుతున్నాయి. సామ్రాజ్యవాద దళారీ, పెట్టుబడిదారీ వర్గానికి ప్రధాని మన్మోహన్‌సింగ్ స్థానంలో మరొక నమ్మిన బంటును తీసుకురావాల్సిన అవసరం ఏర్పడింది. రానున్న పార్లమెంట్ ఎన్నికల్లో అద్భుతం ఏదో జరగబోతున్నట్లు కార్పొరేట్ మీడియా మితిమీరిన ప్రచారం చేస్తున్నది. గుజరాత్ మోడల్ డెవలప్‌మెంట్ దేశానికే నేడు ఆదర్శమైనట్లు, దాని కర్త, కర్మ, క్రియ అయిన నరేంద్రమోడీ దేశానికి నాయకత్వం వహించాల్సిన చారిత్రక అనివార్యత ఏర్పడినట్లు అంతులేని, హద్దుల్లేని ప్రచారం జరుగుతోంది. ముస్లిం వ్యతిరేకిగా తనదైన ఫాసిస్టు పాలనతో చరిత్రలో రక్తాక్షరాలు లిఖించిన ఆధునిక మనువైన నరేంద్రమోడీ ఏవిధంగా దేశ ప్రజలను ఉద్ధరించగలడో ఒక్క పత్రికగానీ, మీడియాగానీ వాస్తవికంగా, కనీస హేతుబద్ధంగా రిపోర్ట్ చేయడంలేదు.

హిందూత్వ రాజకీయాలే ఎజెండాగా నరేంద్ర మోడీ రంగంలోకి దిగి 2014 వైపు గురి ఎక్కుపెట్టినాడు. బిజెపి ప్రత్యర్థి కాంగ్రెస్ కూడా హిందూత్వ ఎజెండా ఏ ఒక్కరి సొంతం కాదంటూ కసబ్ నుండి అఫ్జల్‌గురు లను ఉరి తీసి నిరూపించుకుంది. మరోవైపున 3 రాష్ట్రాల్లో ఎన్నికల్లో గెలిచి మంచి ఊపు మీదున్న బిజెపి తెలంగాణ పైన కూడా తన కేంద్రీకరణ పెంచింది. ఈ పరిస్థితుల్లో తెలంగాణలో కాంగ్రెస్ పాలనపై విముఖత, మోడీ ప్రధాని అభ్యర్థిగా సాగుతున్న ప్రచారంలో మధ్యతరగతిని ఆకర్షించబడుతుంది. కొన్ని తేడాలున్నప్పటికీ తెలంగాణ ప్రాంతంలోని పట్టణ యువతరంలో ఈ రకమైన ప్రభావం ఉంది. ఈ స్థితిలో తెలంగాణను ప్రజా ఆకాంక్షల నుండి ఉద్యమం ఇచ్చిన చైతన్యం నుండి దేశ రాజకీయాలు అర్థం చేసుకోవాల్సి ఉంది.

2014లో నరేంద్రమోడీనో లేక రాహుల్ గాంధీనో ప్రధానిగా ఎంచుకోవడానికి ఈ దేశ ప్రజల ముందు రెండు అవకాశాలు ఉన్నాయి. రెండు పార్టీల జెండాలు వేరు. అయినా వారి ఎజెండా స్వల్ప తేడాలతో ఒక్కటేనన్నది సత్యం. సారాంశంలో ఎన్‌డిఎ ప్రభుత్వ విధానాలను యుపిఎ కొనసాగిస్తుంది. నాటి ఎన్‌డిఎ కాంగ్రెస్ విధానాలను కొనసాగించింది. రేపు బిజెపి అధికారంలోకి వస్తే యుపిఎ విధానాలే అమలు అవుతాయి. ఇది రాజకీయ విశ్లేషకులకు మాత్రమే కాదు సామాన్య ప్రజలకు కూడా ఒక స్థాయి వరకూ అర్థం అయింది. అయినా నరేంద్ర మోడీ నాయకత్వంలో కషాయ దండు ఎలా ఓటర్లను పరిశీలించి దానికి విరుగుడు కనుక్కోవలసి ఉంది.

మొదటిది: అభివృద్ధి మంత్రం. రెండు జాతి సమైక్యత, టెర్రరిస్టు, మావోయిస్టు ప్రచారం, రామరాజ్య స్థాపన ప్రధానంగా ఈ అంశాలు కేంద్రంగా ప్రచారం సాగుతోంది.

గుజరాత్ అభివృద్ధి దేశానికే ఆదర్శం అని జరుగుతున్న ప్రచార హోరులో వాస్తవాలు ఇప్పటికే కనుమరుగైపోయాయి. కానీ నిజానికి గుజరాత్‌లో జరిగిన అభివృద్ధి ఏమిటి? జరిగింది ఎవరి అభివృద్ధి? కొంచెం లోతుల్లోకి వెళితే కాషాయ దండును ఆకాశానికెత్తుతున్న కార్పొరేట్ మీడియా అసలు రంగు బయటపడుతుంది.

ప్రణాళిక సంఘం తరపున ప్రఫుల్ భండారి అనే ఆర్థిక శాస్త్రవేత్త విద్య, వైద్యం, మౌలిక సదుపాయాల కల్పన గురించి 21 రాష్ట్రాల తులనాత్మక అధ్యయనం చేస్తే అసలు సంగతి అర్థమవుతుంది. ప్రజలకు ఆరోగ్యం కల్పించడంలో దేశంలో గుజరాత్ 16వ స్థానంలో, విద్యలో 14వ స్థానంలో ఉంది. పేదరిక నిర్మూలనలో 28 రాష్ట్రాల్లో 12వ స్థానంలో ఉంది. ఆంధ్రప్రదేశ్‌లో వ్యవసాయ కరెంట్‌కు 0.32 వసూలు చేస్తుంటే గుజరాత్‌లో 1.76 పైసలు వసూలు చేస్తున్నారు. విద్య, వైద్య, మౌలిక సదుపాయాల కల్పనతోపాటు పారిశ్రామిక, వ్యవసాయ రంగాలతో సహా ఏ రంగంలోనూ గుజరాత్ చెప్పుకోదగ్గ స్థాయి వృద్ధి సాధించలేదు. అంకెల గారడీలతో సామ్రాజ్యవాద బహుళజాతి కంపెనీల లాభాల కోసం జిడిపిల గాలి మేడలే గుజరాత్ అనేది స్పష్టం. రాజకీయ ప్రత్యర్థులు మాట్లాడే మాటలేమోకాని ప్రభుత్వ గణాంకాలే అభివృద్ధిలోని డొల్లతనం గొప్పతనం తెలియజేస్తాయి. గురువింద గింజ చందంలా నిత్యం యుపిఎ అవినీతి గురించి చిందులేస్తున్న మోడీ పాలనలో గుజరాత్ అవినీతిలో మొదటి స్థానాన్ని ఆక్రమించింది. గుజరాత్ అసెంబ్లీకి ఎన్నికైన 182 మంది అభ్యర్థుల్లో 57 మంది ఎంఎల్‌ఎలు క్రిమినల్ కేసులు ఎదుర్కొంటున్నవారే. నేర రాజకీయాలు, అవినీతిలో ఆంధ్రప్రదేశ్‌తో పోటీ పడుతున్న మోడీ క్యాబినెట్‌లోని సీనియర్ మంత్రి బాబు బొఖిరియాకు అవినీతి కేసులో కోర్టు మూడేళ్ల జైలు శిక్ష విధించింది. బెయిల్‌పై బయటకొచ్చిన బొఖిరియా మంత్రిగా కొనసాగుతున్నాడు. ల్యాంకో ముషియాతోపాటు అన్ని రకాల అవినీతి అక్రమదారులకు అండనిచ్చే మోడీ రేపు దేశంలో అవినీతిరహిత పాలన తీసుకొస్తానని అంటున్నాడు.

రామరాజ్య స్థాపన, జాతి సమైక్యత, తీవ్రవాదాన్ని ఎదుర్కోవడం బిజెపి హిందూ ఫాసిస్టు సిద్ధాంత భావజాలానికి భిన్న పార్శ్వాలు మాత్రమే. బాబ్రీ మసీదు కూల్చివేసి భారతదేశ ప్రజల్లో శాశ్వత విభజన సృష్టించాలని కలలుగన్న హిందూ ఫాసిస్టులు కొంతవరకు విజయం సాధించారు.

2002లో 2000 మంది ముస్లింలను ఊచకోత కోసిన హత్యాకాండ రక్తపు మరకలు ఇంకా ఆరిపోలేదు. ఆ పునాది మీదనే అధికారం సాధించిన విజయ గర్వంతో రామరాజ్య జపం చేస్తున్న మోడీ దేశాన్ని నరోడా పాటియాగా మార్చాలని ఉత్సాహంగా ఉన్నాడు. ఫాసిస్టు మనస్తత్వాన్ని నిండుగా జీర్ణించుకున్న మోడీకి ప్రజాస్వామ్యమంటే ఎంతపాటి గౌరవమో, నమ్మకమో చరిత్ర కండ్ల ముందు సజీవ సాక్ష్యంగా కదలాడుతూనే ఉంది.

'ఈ దేశంలో ప్రజాస్వామ్యం ఒట్టి బూటకమే. మాటలు చెప్పకుండానే నియంతృత్వ పాలన సాగించడమే ఈనాటి ప్రజాస్వామ్యం' అని పాలకులు నమ్ముతూ ఆచరిస్తున్నారు. హిందుత్వాన్ని సంతరించుకున్న మోడిత్వ రాజకీయాలు మోడీ ప్రజాస్వామ్యాన్ని విశ్వసించని వారికి ప్రజాస్వామ్యమే లేదని తెగించి ప్రకటిస్తున్నాడు.

హిందుత్వ శక్తులు నవ భారత నిర్మాతగా కొనియాడబడుతున్న సర్దార్ వల్లభాయ్ పటేల్ ఈ దేశ పీడిత ప్రజలకు ముఖ్యంగా తెలంగాణ (హైద్రాబాద్ స్టేట్) ప్రజలకు తీరని నష్టం కల్పించాడు. సైనిక చర్య పేరుతో రక్తపుటేరులు పారించాడు. పటేల్ భారీ విగ్రహ ప్రతిష్ట, దానికోసం ఇనుము, ఇతర సామాగ్రి, నిధులు సేకరించడం దీని చుట్టూ 2014 ఎన్నికల ప్రచారం సాగుతుంది. పటేల్‌ను ఒక ఐకాన్‌గా నిలబెట్టడం ద్వారా దేశంలోని మైనారిటీ, సెక్షన్స్, దళిత, పీడిత కులాలు, వివిధ జాతులకు ఇవ్వదలుచుకున్న ప్రమాద సంకేతాలు ఏమిటో స్పష్టంగా అర్థం చేసుకోవచ్చు. ఊహాజనితమైన భారత జాతి గురించి మాట్లాడడమే బ్రాహ్మణీయ వర్గాల సృష్టి తప్ప, మరొకటి కాదని చరిత్ర చూస్తే అర్థం కాగలదు. అనేక జాతుల బందిఖానాగా ఉన్న భారతదేశాన్ని జాతి సమైక్యత పేరుతో తలపెట్టనున్న ఘోరమేమిటో ఊహించవచ్చు. స్వతంత్ర భారతంలో కశ్మీర్ ప్రజలు బొందలగడ్డ పాలైనారు. ఈశాన్య రాష్ట్రాలు కల్లోలమైనాయి. అడుగడుగునా ప్రజాస్వామ్య ఖూనీ కేంద్రాలు వెలిశాయి. రేపు ఈ దాష్టీకాలకు చట్టబద్ధత తీసుకురావడమే బిజెపి జాతి సమైక్యత.

పాలకుల దృష్టిలో టెర్రరిజం, మావోయిజం రెండు ఒక్కటే. వాటి రూపసారాలు వేరు. రాజ్యానికి సమాజంలోని ప్రజల ఆకాంక్షల పట్ల అవసరాల పట్ల ఎటువంటి బాధ్యత లేదు. 'ప్రశ్నించిన ప్రతి మనిషి ఒక నేరస్తుడే' అనేది పాలకుల తత్వం. 2004 నుండి ప్రపంచ బ్యాంక్ అధికారిగా నమ్మిన బంటుగా సేవలందిస్తున్న ప్రధాని మన్మోహన్ సింగ్ మావోయిస్టు ఉద్యమమే దేశ అంతర్గత భద్రతకు పెను ప్రమాదమని ప్రతి సందర్భంలో ఉచ్చరిస్తున్నాడు. మావోయిస్టు బలాబలాలు భారత రాజ్య వ్యవస్థతో పోల్చితే ఎంతటివో పాలకులకు తెలియనిది కాదు. మావోయిజాన్ని, ముస్లిం తీవ్రవాదాన్ని సమర్థంగా ఎదుర్కోవాలని ఇటీవల మోడీ పదేపదే మాట్లాడుతున్నాడు. మన్మోహన్‌సింగ్ మాటలనే మోడీ తన భాషలో మాట్లాడుతున్నాడు. ఈ సంకేతాల ద్వారా దేశంలోని పీడిత ప్రజల విముక్తి కోసం పోరాడుతున్న ప్రజలకు హిందూ ఫాసిజానికి వ్యతిరేకంగా స్వీయ రక్షణ కోసం పోరాడుతున్న మైనారిటీలకు మోడీ హెచ్చరిక చేస్తున్నాడు.

తెలంగాణపై సిడబ్ల్యుసి ప్రకటన రాకముందు అధికారంలోకి వచ్చిన వంద రోజుల్లో తెలంగాణ ఇస్తామని బిజెపి ప్రకటించింది. కాకినాడ తీర్మానం బంగాళాఖాతంలో వదిలిన బిజెపి అవకాశవాద రాజకీయ నినాదం కూడా తెలంగాణ ప్రజలను బిజెపివైపు మొగ్గేలా చేసింది. రాజకీయ జెఎసి ముసుగులో అగ్రకుల బ్రహ్మణీయ సంస్కృతిని చొప్పించిన హిందుత్వ శక్తులు బలపడ్డాయి కూడా. కాబోయే ప్రధానిగా నరేంద్రమోడీని కొనియాడుతూ తెలంగాణలో పట్టు సంపాదించేందుకు అనేక ప్రయత్నాలు చేస్తున్నారు. ఈ క్రమంలో హిందుత్వ శక్తులు కొంత సాధించగలిగాయని చెప్పవచ్చు. ఈ పరిణామాలు ప్రజలకు ఎంత నష్టం కలిగించగలవో తేలిగ్గానే కనబడుతుంది. కేవలం రాష్ట్రం ఏర్పాటు మాత్రమే అన్నింటిని అన్ని ప్రజా సమస్యలకు పరిష్కారం. అది కాంగ్రెస్ అయినా, బిజెపి అయినా, ఎవరిచ్చినా ఫరవా లేదని ప్రాంతీయ మూఢ భక్తి ప్రమాదకరం. బలమైన కేంద్రం, బలహీనమైన రాష్ట్రాలుండాలనే బిజెపి సిద్ధాంత అవగాహన ఫెడరల్ స్ఫూర్తికి విరుద్ధమైనది. తెలంగాణ రాష్ట్రం తెలంగాణ ప్రజలకోసం. అందుకే ప్రజల ఆకాంక్షలు నెరవేర్చే తెలంగాణ సాధన వైపు ప్రజలు ఆలోచించాలి. నిజాం రాజ్యంలో రజాకార్ల అణచివేత పేరుతో 2 లక్షల మంది పేద ముస్లింలను ఊచకోత కోసిన సర్దార్ పటేల్ బొమ్మ పెట్టుకొని వస్తున్న నరహంతక మోడీ పట్ల తెలంగాణ సమాజం ఎన్నటికీ ఏమరుపాటుగా ఉండరాదు. మిలటరీని దింపి 4000 మంది తెలంగాణ రైతు కూలీలను చంపిన పటేల్ తెలంగాణ దురాక్రమణ ప్రాంతంగా చూసినాడు. ఇక్కడ ప్రజల ప్రజాస్వామిక హక్కులను గుర్తించలేదు. తెలంగాణ ప్రజల ప్రజాస్వామిక హక్కులను గుర్తించలేదు. తెలంగాణ ప్రజల అజాత శత్రువైన పటేల్ విగ్రహం కోసం తెలంగాణలో ప్రజల దగ్గర ఇనుప ముక్కల కోసం రావడమేంటనేది చైతన్యవంతమైన తెలంగాణ ప్రజలు ఆలోచించాలి, తిప్పికొట్టాలి. తెలంగాణ ముఖంతోని ఓట్లడిగే హక్కు కూడా బిజెపికి లేదు. సీమ, కోస్తా పెట్టుబడిదారుల వత్తిడికి తలొగ్గి, బడా కంపెనీల ప్రయోజనమే లక్ష్యంగా తెలంగాణపై ఆంక్షలు విధిస్తే బిజెపి నోరెందుకు మెదపదు? తెలంగాణ రాష్ట్రానికి అనుకూలంగా నిర్ణయం తీసుకోవలసిన స్థితికి కాంగ్రెస్ నెట్టబడడానికి, బిజెపిని సమర్థించడానికి ప్రజా పోరాటమే కారణం తప్ప, పార్టీల విజయం కాదని తెలంగాణ సమాజం లోతుగా అర్థం చేసుకోవాలి. బిజెపి కాకినాడ తీర్మానం అమలు జరిపి ఉంటే 2001లోనే తెలంగాణ ఏర్పడి ఉండేది. వేలాది మంది తల్లులకు కడుపుకోత తప్పేది కదా!

రామరాజ్యం, జాతి సమైక్యత, తీవ్రవాద నిర్మూలన, తెలంగాణ ఏర్పాటు ఏదైనా ఎన్నికల ఎత్తుగడ అనేది స్పష్టం. ఈ ఎత్తుగడలకు మధ్యతరగతి ఆకర్షణకు గురికాకుండా హిందుత్వ రాజకీయాలను అర్థం చేసుకోవాలి. బిజెపి, హిందూ మతతత్వశక్తుల కుట్రలను సమర్థంగా తిప్పికొట్టాలి. ఆ దిశగా విప్లవ ప్రజాతంత్ర లౌకికశక్తులు కదలాలి. బూర్జువా పార్లమెంటరీ పార్టీలన్నింటికీ ఉన్న హిందుత్వ స్వభావాన్ని సాధారణీకరించడం, వాటిని నిర్దిష్టంగా పరిశీలించడం ముఖ్యం. హిందుత్వ శక్తులు రాజకీయాధికారంతో పాటు లౌకిక వ్యవస్థను నామమాత్రంగా కూడా లేకుండా పునాదులతో పెకిలించివేసే పెను ప్రమాదం దగ్గరలో ఉంది. హిందుత్వ రాజకీయాల పునాదిపై పెట్టుబడిదారీ వ్యవస్థ నిర్మాణం కోసం మోడీ ప్రదర్శించిన తెగువ మోడీని దోపిడీ శక్తులకు ఆరాధ్యునిగా నిలిపింది. ఈ దేశంలో సమస్త పీడిత జాతుల కలలు ప్రజలకు పోరాడే శక్తులకు శత్రువుగా నిలిపింది.

*(రచయిత్రి పరిశోధక విద్యార్థిని, సామాజిక కార్యకర్త)* వీ

# సహకార సంఘాలు - ప్రకాష్ బక్షీ కమిటీ

*వ్యవసాయ రంగానికి రుణ, పరపతి సౌకర్యాలు అందించే సహకార సంఘాలను మూసివేయడానికి వేసిన ప్రకాష్ బక్షీ కమిటీ మోసాలను వివరిస్తున్నారు* **ముప్పాళ్ళ భార్గవశ్రీ**

దేశానికి రైతే వెన్నెముక అని ఊదరగొడుతున్న పాలక ప్రభువులు ఆచరణలో రైతు వెన్నెముకను విరిచే చర్యలకు పాల్పడుతున్నారు. నాబార్డ్ చైర్మన్ ప్రకాష్ బక్షీ కమిటీ చేసిన సిఫార్సులు రైతుని వ్యవసాయం నుండి గెంటివేయడానికే. ఇప్పటికే వివిధ రూపాలలో పెరుగుతున్న వ్యవసాయ పెట్టుబడులను తట్టుకొని వ్యవసాయం చేయడానికి కావలసిన పెట్టుబడులను రుణాల రూపంలో ప్రాథమిక వ్యవసాయ సహకార సంఘాల ద్వారా అరకొరగా అందుతున్న రుణాలను కూడా అందకుండా చేస్తున్నాయి. పేద, మధ్యతరగతి రైతాంగాన్ని మరింత సంక్షోభంలోకి నెట్టేవిగా ఉన్నాయి. ప్రకాష్ బక్షీ కమిటీ సహకార రంగంలో చేసిన సిఫార్సులు సహకార వ్యవస్థ మెడకు ఉరితాడుగా మారడానికి ఇంతకుముందు వేసిన కమిటీలు ఎటువంటి 'ఘనకార్యాలు' చేశాయో గమనించడం అవసరం.

**సహకార సంఘాలను బలహీనం చేయడంలో రిజర్వు బ్యాంక్ పాత్ర**

మన ప్రాథమిక వ్యవసాయ సహకార సంఘాలను బలహీనం చేయడానికి పాలకులు ఆర్‌బిఐ (రిజర్వ్ బ్యాంక్ ఆఫ్ ఇండియా) ని ముందుకు పెట్టారు. 1904 లో కో- ఆపరేటివ్ యాక్ట్ వచ్చినప్పటి నుంచి స్థానిక బ్యాంకులు డిపాజిట్లు సేకరించడం, రుణాలు ఇవ్వడం జరుగుతున్నది. తరువాతి క్రమంలో ఈ కార్యకలాపాలు అన్ని నాబార్డు అనుమతితోనే జరుగుతున్నాయి. అయితే సుమారు 67 సంవత్సరాల క్రితం రాష్ట్రంలోని కొన్ని చిట్ ఫండ్ కంపెనీలలో జరిగిన కుంభకోణాల వలన ఆర్‌బిఐ తీసుకొన్న నిర్ణయం ప్రకారం ఏ బ్యాంకు లేదా సంస్థలు అయినా ఆర్‌బిఐ పర్మిషన్ లేకుండా డిపాజిట్లు సేకరించరాదు, రుణాలు ఇవ్వకూడదు. కాని సహకార బ్యాంకులు నాబార్డు పర్మిషన్‌తో తన విధులను యథావిధిగా సాగిస్తూ ముందుకు సాగుతున్న క్రమంలో సహకార బ్యాంకులు, సొసైటీలపై ఆర్‌బిఐ ప్రపంచ బ్యాంకు డైరెక్షన్‌లో ఆంక్షలు విధించడానికి పూనుకుంది. తన పర్మిషన్ లేకుండా కొనసాగుతున్న వ్యవసాయ సహకార సొసైటీలు, బ్యాంకుల కార్యకలాపాలను ఆపివేయాలని వాటికి సంబంధించిన అన్ని రకాల రికార్డులను జిల్లా బ్యాంకులకు బదిలీ చేయాలని ఆర్డర్ వేసింది. ఇప్పటికే కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు వివిధ రంగాలలో సాగుతున్న సహకార వ్యవస్థలను బలహీనం చేశాయి. స్పిన్నింగ్ మిల్లులు, ఆయిల్ మిల్లులు, చెక్కర ఫ్యాక్టరీలు మొదలగు సొసైటీలను బలహీనం చేసి వాటిని బడా పెట్టుబడి దారులకు అప్పజెప్పిన విధంగానే వ్యవసాయ రంగంలో ఉన్న సహకార వ్యవస్థను కూడా బలహీనం చేసి కార్పొరేట్ సంస్థలకు, బహుళజాతి కంపెనీలకు, బడా భూస్వామ్య పెత్తందారి వర్గాలకు అప్పజెప్పబోతున్నారు.

**సమస్యగా మారిన రైతాంగ రుణపరపతి**

ఇప్పటి వరకు నాబార్డ్ నుంచి ఆప్కాబ్‌కు, ఆప్కాబ్ నుంచి డిసిసిబి లకు, డిసిసిబిల నుంచి పిఏసిఎస్‌ల ద్వారా రైతులకు వ్యవసాయ రుణాలను అందిస్తున్నారు. ఈ సొసైటీలను బలహీనం చేయాలనుకున్న ప్రభుత్వం, రైతులకు ఇచ్చే రుణాలను ఒక క్రమంలో నాబార్డు నుంచి విడుదల చేయడాన్ని తగించేసింది. దీనితో సొసైటీల ద్వారా రైతులకు ఇవ్వాల్సిన వ్యవసాయ రుణాలను ఇవ్వలేకపోవడం, ఉన్నంతలో గ్రామాల్లో పలుకుబడి కలిగిన కొందరికి సరిపెట్టడం జరుగుతోంది. బక్షీ కమిటీ సిఫార్సులతో సొసైటీలు స్వయం ప్రతిపత్తిని కోల్పోవడంతో, సొసైటీ అధ్యక్షులకు వ్యవసాయ రుణాలు ఇవ్వడానికి అవకాశం లేకుండా పోయింది. వాణిజ్య బ్యాంకులు వ్యవసాయ రుణాలను ఎలాగో ఇవ్వడం లేదు. ఈ దశలో రైతులు అధిక వడ్డీకి అప్పులు తెచ్చుకోవాల్సిన పరిస్థితులు ఏర్పడ్డాయి. ఇప్పటికే రుణ భారంతో కుంగిపోతున్న రైతాంగానికి సహకార సొసైటీల ద్వారా వ్యవసాయ రుణాలు అందకపోవడం వలన వ్యవసాయం నుంచి తప్పుకోవడం మినహా మరోదారి లేకుండా పోయింది. పాలకులు సరిగ్గా ఇదే కోరుకుంటున్నారు. ఈ విధంగా నాబార్డ్ గ్రామీణ వ్యవసాయాన్ని అభివృద్ధి చేయకపోగ దివాలా తీయిస్తూ, తన నిజరూపాన్ని బహిర్గత పరుచుకుంది.

నూతన ఆర్థిక విధానాలు, సరళీకరణ, ప్రపంచీకరణ విధానాల అమలుతో పాటు, ప్రపంచ బ్యాంక్ ఆదేశాలకు అనుగుణంగా సహకార రంగాన్ని ముఖ్యంగా వ్యవసాయ రంగాన్ని బలహీనం చేసే విధానాలను పాలకులు అమలు చేస్తున్నారు. పోషక విలువల పేరుతో ఎరువుల సబ్సిడీని తగ్గించడం, ఎరువుల రేట్ల నిర్ణయాధికారాన్ని కంపెనీల ఇష్టా రాజ్యానికే వదలివేయడం, ఎరువుల, విత్తనాల ధరలు పెంచడం అందులో భాగమే. వీటితో పాటు రైతాంగానికి ఇచ్చే రుణాలను కూడా తగ్గిస్తూ రుణ పరపతి సౌకర్యాన్ని బలహీనం చేసే విధానాలను అమలు చేస్తున్నారు. జిల్లా, గ్రామీణ వ్యవసాయ రుణపరపతి సంఘాలకు నిధులను తగ్గించడం, ఉద్యోగులను కుదించడం, కాంట్రాక్టు పద్ధతిలో వేతనాలు చెల్లించడం, నష్టాల్లో ఉన్నాయంటూ కొన్ని సంఘాలను రద్దు చేయడం వంటి చర్యలను పాలకులు ఇప్పటికే అమలు చేస్తూ వస్తున్నారు. ఆంధ్రరాష్ట్రంలో 17 వందల సహకార సంఘాలను మూసివేశారు. తద్వారా గ్రామీణ వ్యవసాయ రుణ పరపతి సంఘాలను చాలావరకు బలహీనం చేశారు.

**సహకార రంగాన్ని బలహీన పరిచే కమిటీల సిఫార్సులు**

ఇందులో భాగంగానే సహకార సంఘాల స్థితిగతులపై 2004 ఆగస్టులో ప్రొఫెసర్ వైద్యనాథ్ అధ్యక్షతన కమిటీని ప్రభుత్వం

నియమించింది. ఈ కమిటీ, తన నివేదికను 2005 ఆగస్టులో కేంద్ర ప్రభుత్వానికి అందచేసింది. కొన్ని సంఘాల మూసివేతకు, మిగతా సంఘాలు ఆర్థికంగా నిలదొక్కుకోవడానికి ప్రత్యేక ఆర్థిక ప్యాకేజీని ప్రకటించాలని కమిటీ సూచించింది. వాటి అమలులో భాగంగా దేశవ్యాప్తంగా అనేక సంఘాలను మూసివేశారు. అందులో భాగంగానే మన రాష్ట్రంలో 17 వందల సంఘాలు మూసివేతకు గురయ్యాయి. దీనితో పాటు 17 రాష్ట్రాల్లోని 53202 ప్రాథమిక సహకార సంఘాలకు 9002 కోట్ల ప్యాకేజీని ప్రభుత్వం ప్రకటించింది. కొన్ని రైతు సంఘాలూ, పార్టీలూ, కొందరు వ్యక్తులూ ఈ ప్యాకేజీ వలన సహకార సంఘాలకు ఎంతో మేలు జరుగుతుందని ప్రశంసించారే గానీ, సంఘాల మూసివేత దుర్మార్గ విధానాన్ని చూడలేకపోయారు.

2006లో రాజేష్‌మోహన్ అధ్యక్షతన మరో కమిటీని ఏర్పరిచారు. సహకార బ్యాంక్‌ల ఆర్థిక పరిస్థితి, బ్యాంక్‌ల పునఃవ్యవస్థీకరణపై సూచనలు చేయవలసిందిగా కోరారు. ఈ కమిటీ తన నివేదికలో కొన్ని సూచనలు చేసింది. లైసెన్సులు లేని సహకార బ్యాంకుల ఆర్థిక కార్యక్రమాలను నిరోధించాలని, అలాంటివి అత్యధికంగా ఉన్నాయని పేర్కొంది. ప్రతి ప్రాథమిక వ్యవసాయ పరపతి సంఘం మొదట రిజిస్టరు కావాలి. ఆర్థిక కార్యకలాపాల నిర్వహణకు లైసెన్స్ తీసుకోవాలి. అలా పొందిన సంఘాలే ఆర్థిక కార్యక్రమాలు నిర్వహించాలి. రాజేష్‌మోహన్ కమిటీ నివేదిక ప్రకారం అత్యధిక సంఘాలు లైసెన్సులు లేకుండా ఇన్ని సంవత్సరాలు ఆర్థిక కార్యక్రమాలు ఎలా నిర్వహించగలిగాయి? ఇప్పుడు బలహీనం చేయదల్చుకున్నారు గనుక లైసెన్సు నిబంధనలను ముందుకు తెచ్చారు.

దేశవ్యాప్తంగా ప్రాథమిక సహకార సంఘాలను ఏకీకరణ చేసేందుకు మూడు జోన్‌ల విధానాన్ని కేంద్ర ప్రభుత్వం 2011లో ముందుకు తెచ్చింది. ఒక్కో జోన్‌కి ఒక బ్యాంక్‌ని నిర్ణయించింది. ఈ విధానం ప్రకారం ఒక ప్రాంతంలో ఉన్న ప్రధాన సహకార సంఘంలో మిగతా సంఘాలను విలీనం చేయాలి. దీనివలన అనేక సంఘాలు కనుమరుగయ్యే ప్రమాదం ఉంది. వాటిలో పనిచేసే ఉద్యోగులంతా నిరుద్యోగులుగా మారే ప్రమాదం ఉంది. దీనిని వెంటనే ఆచరణలో పెట్టకుండా శంఖంలో పోసిన తీర్థం చేయడానికి పూనుకున్నారు.

### ప్రకాష్ బక్షీ కమిటీ ఎవరికోసం? ఎందుకోసం?

రాజేష్‌మోహన్ సిఫార్సులకు అనుగుణంగా సహకార బ్యాంక్‌లు ఇచ్చే స్వల్పకాలిక రుణ పపరపతి విధానంపై సూచనలు చేయవలసిందిగా నాబార్డ్ చైర్మన్ ప్రకాశ్ బక్షీ అధ్యక్షతన మరో కమిటీని రిజర్వ్ బ్యాంక్ ఏర్పాటు చేసింది. ఈ కమిటీ తన నివేదికను 2013 జనవరి 1న రిజర్వ్ బ్యాంకుకు అందజేసింది. ఆర్‌బిఐ ఆ రిపోర్టును ఆమోదించి నాబార్డుకు పంపగా జూలై 22 తేదిన సర్కులర్‌ను విడుదల చేసి రాష్ట్ర సహకార బ్యాంకులకు పంపింది. ఈ కమిటీ ప్రాథమిక సహకార సంఘాల కాళ్లు, చేతులు కట్టివేసే విధంగా తన నివేదికను తయారు చేసింది. ఈ కమిటీ సూచనల ప్రకారం ప్రాథమిక వ్యవసాయ పరపతి సంఘాలు కనీసం ఇప్పుడు ఇస్తున్న విధంగా కూడా రైతులకు రుణాలు మంజూరు చేయగూడదు. డిపాజిట్లు సేకరించగూడదు. సేకరించిన డిపాజిట్లను జిల్లా సహకార బ్యాంక్‌లకు బదిలీ చేయాలి. కొత్తగా రుణాలు ఇవ్వకూడదు. యథావిధిగా రుణేతర(నాన్ క్రెడిట్) కార్యకలాపాలు – అంటే ఎరువుల అమ్మకాలు, వ్యవసాయ ఉత్పత్తుల కొనుగోళ్లు, అమ్మకాల లాంటి వాటిని సాగించవచ్చు. డిసిసిబిల నుండి రైతులకు రుణాలు ఇప్పించి, ఇవి వసూలు చేయాలి. ఇందుకుగాను డిసిసిబి నిర్ణీత మొత్తంలో కమిషన్ అందిస్తుంది. అంటే స్థాయి సహకార బ్యాంకులు జిల్లా బ్యాంకు అనుమతితో చేసే వివిధ రకాలైన పనులకు, సేవలను బట్టి కమిషన్లు ఇస్తారు. రైతుల నుండి వసూలు చేసే మూలధనం వాటా కూడా జిల్లా సహకార బ్యాంక్‌లకు బదిలీ చేయాలి. రుణాలు పొందిన రైతులు, డిపాజిట్‌దారులు నేరుగా డిసిసిబి సభ్యులుగా ఉంటారు.

వ్యవసాయం వాణిజ్య కార్యకలాపం కాదు. వ్యవసాయానికి ఇచ్చే రుణాలను వాణిజ్య రుణాలుగా చూడరాదు. ఇది ఆర్థికవేత్తలందరూ అంగీకరించిన సూత్రమే. అందుకనే వ్యవసాయ రుణాల కొరకు ప్రభుత్వాలు నిధులు సమకూరుస్తూ వస్తున్నాయి. ఈ సూత్రాన్ని పక్కనబెట్టి, వాణిజ్య బ్యాంకుల ప్రమాణాలను తీసుకున్నారు. ఆ విధంగా ప్రాథమిక సంఘాలను బలహీనపరిచే సిఫార్సులను కమిటీ చేసింది. రైతాంగానికి స్వల్పకాలిక రుణాలు అందించడం లక్ష్యంగా ఏర్పడిన ప్రాథమిక సంఘాలు, రైతాంగానికి రుణాలివ్వద్దన్న సూచన చేసింది. జిల్లా సంఘాలిచ్చే రుణాలకు కమిషను తీసుకొని రైతులు – జిల్లా బ్యాంకుల మధ్య దళారీగా ఉండమని నిర్దేశిస్తున్నాయి.

అసలు పనే చేయనప్పుడు ఈ సంఘాలెందుకు? రైతులకు అవసరమైన ఉత్పాదకాలు (ఎరువులు, పురుగు మందులు) అమ్మకాలు సాగించమని మరో సూచన. అంటే పరిశ్రమాధిపతుల ఉత్పత్తులు అమ్మి, వారికి సక్రమంగా చెల్లింపులు చేసే దుకాణదారుగా మారమని సెలవిస్తున్నారు. ఇదికాక రైతుల నుండి పంటలను కొని, అమ్మివేసే వ్యాపారి పాత్ర నిర్వహించమని మరో సూచన. అంటే రిటైల్ రంగంలోకి వచ్చే ప్రైవేటు, విదేశీ పెట్టుబడికీ, వారి రైతాంగ దోపిడీకి వాహకంగా ప్రాథమిక సంఘాలు పని చేయాలని కూడా కర్తవ్య ప్రబోధం చేస్తున్నాయి.

ఇకపోతే రైతాంగానికి రుణాలిచ్చే జిల్లా సంఘాల సంస్కరణలకు చేసిన సూచనలన్నీ వాటిని వాణిజ్య బ్యాంకులు గానూ, ప్రాథమిక సంఘాలను వాటి ఏజెంట్లు గానూ మార్చేవిగా ఉన్నాయి. ఇప్పుడు వాణిజ్య బ్యాంకులు గ్రామీణ ప్రాంతాల నుండి సేకరిస్తున్న డిపాజిట్లలో కొద్దిభాగం మాత్రమే తిరిగి గ్రామీణ ఆర్థిక వ్యవస్థకు రుణాలుగా అందజేస్తున్నాయి. ఇక నుంచి జిల్లా సంఘాలు కూడా ఇదే పద్ధతిని అనుసరించాలి. అంటే రైతాంగం నుండి పొందిన డిపాజిట్లను నగరాలలో బడా బాబులకు రుణాలిచ్చేందుకు వినియోగిస్తారు. దీనినే ఆర్థిక సమ్మిళితం అని పిలుస్తున్నారు. దేశంలో జనులందరికీ బ్యాంకుల సేవలు అందుబాటులోకి తేవడం దీని లక్ష్యంగా ప్రకటించారు.

ఇప్పటికే రైతాంగానికి రుణాలు అందించడం అస్తుబిస్తుగా ఉంది. రైతాంగ రుణ అవసరాలలో 18 శాతం మాత్రమే బ్యాంకులు, సహకార సంఘాల వంటి సంస్థాగత రుణంగా ఉంది. మిగిలిన 80 శాతం అవసరాలకు వడ్డీ వ్యాపారుల మీదనే రైతాంగం ఆధారపడుతున్నారు. బక్షీ కమిటీ సూచనలు అమలు చేస్తే రైతాంగానికి సంస్థాగత రుణ సౌకర్యం మరింత కుదించుకు పోతుంది.

నాబార్డు ఆదేశాలు ప్రకాష్ బక్షీ కమిటీ సిఫార్సులను అమలు జరిపేవి గానే ఉన్నాయి. ఎన్నికలు వస్తున్నాయి గనుక తమిళనాడు, కేరళ, కర్నాటక, మహారాష్ట్ర, మధ్యప్రదేశ్, హర్యానా, పంజాబ్ మరికొన్ని రాష్ట్ర ప్రభుత్వాలు వ్యతిరేకతను వ్యక్తం చేస్తున్నాయి. మన రాష్ట్రమంత్రి కూడా తన 'వ్యతిరేకత' ను లెటర్ రూపంలో వ్యక్తం చేశారు. కేంద్రం కూడా దీనికోసమే వెనకకు తగ్గవచ్చు. మరో కమిటీ వేసి మోసానికి

# భారతీయుల సహనం, ఓర్పు

***బలహీనవర్గాలన్నీ సామాజికంగా, రాజకీయంగా సంఘటితం కావాలనీ, వారి సమస్యల పరిష్కారానికి సంఘటితంగా ఉద్యమించాలనీ అంటున్నారు* వాసిరెడ్డి భాస్కరరావు**

**భా**రతదేశం శాంతికి, అహింసకు పుట్టినిల్లు. భారతీయుల ఓర్పు, సహనం చరిత్రాత్మకం. భారతీయులకు ఓర్పు వెన్నతో పెట్టిన విద్య. భారతీయ కుటుంబం, సమాజం, సంస్కృతి, పాలన భారతీయులను అత్యంత సహనశీలురుగా తయారు చేసింది. ఎంతటి అన్యాయాన్నైనా, అక్రమాన్నైనా ఎంతో ఓర్పుతో సహించడం భారతీయుల లక్షణం. భారతీయులు సహనాన్ని చేవలేని, చేతకాని తనంగా, బలహీనంగా కాక ఒక సుగుణంగా భావించారు. ఎన్ని కష్టాలు పడితే, ఎంత ఓర్చుకుంటే, ఎంత సహిస్తే అంత లాభమని, ఓర్పు ఫలం చాలా తియ్యగా ఉంటుందని కూడా బోధించారు. నిరాశా, నిస్పృహ, అసహనం చేటు తెస్తుందని కూడా నూరిపోశారు. భయపెట్టారు. కనుక తమకు జరిగిన అన్యాయాలకు, తమపై దౌర్జన్యాలకు, హింసకు తలొగ్గుతూ వచ్చారు. వాటికి వ్యతిరేకంగా, నిరసన తెలియజేయడం భారతీయులకు అంతగా తెలియదు. కనుకనే వందల, వేల సంవత్సరాల బానిసత్వం, అంటరానితనం, పరదేశీయుల పాలన, హింస చరిత్ర నిండా ఉన్నవి. దీనికి మూలకారణం హిందూమత కర్మ సిద్ధాంతం. ఎవరికి ఎంత దక్కాలో, ఎవరెవరు ఎక్కడ ఉండాలో అంతా ముందే రాసిపెట్టి ఉన్నదని, ఈ జన్మ, పూర్వజన్మ సుకృతమని కూడా బోధించారు. ఈ సిద్ధాంతానికి ఎదురు చెప్పిన వారిని బాధించారు, హింసించారు. మరణదండన కూడా విధించారు. దొర నీకాలు మొక్కుత 'నీ బాంచను' అని ప్రతివాడితో అనిపించారు. ఎలాగైనా ఎంత దుర్భరమైనా, బతికితే చాలు, 'బలుసాకైనా తిని బతకవచ్చన్న' హీనమైన స్థితికి మనిషిని కిందికి దిగలాగి అధోగతి పాలు కావించారు. సమాజాన్ని, మనుషులను అనేక విధాలుగా విభజించారు. మనిషి బతుకుని జన్మకు, పుట్టుకకు అంటగట్టారు.

కులం, మతం, లింగం, నివాసం ఆధారంగా విభేదాలు కల్పించారు. అధికులు-అల్పులు, చిన్నా పెద్దగా, ఆడ-మగగా, ఉన్నవారు - లేనివారుగా అనేక అసమానతలు సృష్టించారు. సృష్టిలో అందరూ సమానులు కాదన్నారు. కొందరు పుట్టుకతోనే అధికులు-అల్పులుగా, సామాజికంగా, ఆర్థికంగా ఉన్నవారు- లేనివారుగా చూడబడ్డారు. ప్రపంచంలో ఏ దేశంలో కూడా కానరాని అంటరాని మనుషులను భారత జాతి, హిందూ మతం సృష్టించింది. వారిని మనుషులుగా ఏరకంగానూ పరిగణించలేదు. పశువులకంటే కూడా హీనంగా వారిని చూశారు. వారి నివాసాలను ఊరికి దూరంగా ఉంచారు. గుడిలో, బడిలో ప్రవేశం లేదు. ఇదంతా ఐదువేల సంవత్సరాల భారతీయ నాగరికత, సంస్కృతి, చరిత్రకు ఒక మచ్చ. వారి కష్టాలు, బాధలు చెప్పరానివి. భారతీయ సమాజాన్ని వందలు, వేల కులాలుగా, తరగతులుగా చీల్చారు. ప్రజల మధ్య ఐక్యత లేకుండా చేశారు. ఇదంతా గత చరిత్ర, గతించిన చరిత్రగా పరిగణిస్తే ప్రయోజనం లేదు.

స్వతంత్ర భారతదేశం, స్వాతంత్రోద్యమం ద్వారా భారతీయుల

---

పూనుకోవచ్చు. ఏ పాలక ముఠా గెలిచినా ఈ సూచనల సారాన్నే వివిధ రూపాల్లో అమలు చేస్తారనేది స్పష్టం.

అలాగే బక్షీ కమిటీ చేసిన సిఫార్సులకు వ్యతిరేకంగా సహజంగానే రాష్ట్ర వ్యాప్తంగా సహకార సొసైటీలు, బ్యాంకుల సిబ్బంది, సొసైటీల పాలకవర్గాలు రాష్ట్ర వ్యాప్తంగా తీవ్రంగానే స్పందించాయి. అందులో భాగంగానే సిఫార్సులు అమలు చేస్తే సొసైటీల ఉద్యోగులు, రైతులు ఏ విధంగా నష్టపోతారో, అలాగే వంద సంవత్సరాలపైగా చరిత్ర ఉన్న సహకార వ్యవస్థలు ఎలా బలహీనం అయిపోతాయో తెలియపరుస్తూ, సిఫార్సులను ఉపసంహరించుకోవాలని వివిధ జిల్లాల డిసిసిబిల పాలక వర్గం, సభ్యులు తీర్మానాలు చేసి పై సంస్థలకు పంపారు. హైదరాబాద్‌లో నాబార్డు కార్యాలయం ఎదుట వివిధ రైతు సంఘాలు రాష్ట్ర స్థాయిలో బక్షీ కమిటీ సిఫార్సులను వెనకకు తీసుకోవాలని ఆందోళన చేశాయి. 7,8 రాష్ట్రాలు బక్షీ కమిటీ చేసిన సిఫార్సులను వ్యతిరేకిస్తున్నప్పటికీ ఆర్థిక సంస్కరణలలో భాగంగానే ప్రభుత్వం తన నిర్ణయాన్ని అమలు చేయడానికే వివిధ రూపాలలో ప్రయత్నిస్తుంది అన్నదానిలో ఎటువంటి సందేహం లేదు.

ప్రపంచ బ్యాంక్ ఆదేశాలలో భాగంగా ఇతర అన్నిరంగాల ప్రజలపై భారాలు వేస్తున్న దానిలో భాగంగానే సరళీకృత ఆర్థిక విధానాలను మరింత ముందుకు తీసుకుపోవడానికి పేద, మధ్యతరగతి రైతాంగానికి వెన్నుదన్నుగా ఉన్న సహకార రంగ వ్యవస్థలను బలహీనం చేస్తూ వ్యవసాయ రంగాన్ని కార్పొరేట్, బహుళజాతి కంపెనీలకు, బడా భూస్వామ్య పెత్తందారీ వర్గాలకు అప్పజెప్పడానికి తగిన భూమికను దళారీ బూర్జువా పాలకులు ఏర్పాటు చేసున్నారన్న విషయాన్ని బక్షీ కమిటీ సిఫార్సుల ద్వారా బహిర్గతమవుతున్నది. కనుక ఈ దశలో మన వ్యవసాయ రంగాన్ని, సహకార సంఘాలను, బ్యాంకులను కాపాడుకోవడం కోసం రైతులకు నిజమైన అర్థంలో సహకారం ఇచ్చేవిగా ఈ సొసైటీలను తీర్చిదిద్దడం కోసం, సహకార సంఘాల సిబ్బంది ఉద్యోగాల భద్రత కోసం రైతులు, ఉద్యోగులు సంఘటితపడి బలమైన ఉద్యమాన్ని నిర్మించడం ద్వారానే సహకార వ్యవస్థకు ఉరితాళ్లుగా మారబోతున్న బక్షీ కమిటీ సిఫార్సులను తిప్పికొట్టగలం.

*(రచయిత సిపిఐ (ఎం.ఎల్.), రాష్ట్ర కమిటీ సభ్యులు)*

వీ

సమస్యలను బాగానే గుర్తించింది. రాజ్యాంగ నిర్మాతలు ఆయా సమస్యల నివారణకై, నిర్మూలనకై సరైన పరిష్కారాలు సూచించారు. కాని వాటి నిర్మూలన, నివారణ ఇంకా ఫలవంతం కాకముందే స్వతంత్ర దేశ పాలకులు మరికొన్ని సమస్యలను సృష్టించారు. పాత సమస్యలతో ప్రజలు సతమతమవుతుంటే కొత్త సమస్యలు వారిని మరింత కష్టాలపాలు చేశాయి. పాత కష్టాలను, కొత్త సమస్యలను పాలకులు గుర్తించినా సరైన విధాన నిర్ణయాలు లేక, తీసుకున్న నిర్ణయాలు అమలుకాక సమస్యలు మరింత జటిలమవుతున్నాయి. కనుక స్వతంత్ర భారతంలో తమ సమస్యలు తీరతాయని ఆశించిన ప్రజలు మరింత నిరాశకు, నిస్పృహకు గురవుతున్నారు. సహనం కోల్పోయి, అసహనంగా ప్రవర్తించుటకు ప్రయత్నిస్తున్నారు. ప్రజలు ఇప్పుడైనా అసహనాన్ని ప్రదర్శించ వలసిన అవసరం వచ్చింది.

తీవ్రమైన ప్రజా సమస్యల పరిష్కారానికై ప్రజల వద్దనుండి చాలా ఒత్తిడి వస్తుంది. దీర్ఘకాలిక ప్రజా అవసరాలను సదుపాయాలను (పాఠశాల విద్య, ఆరోగ్య భద్రత, పౌష్టికాహార లభ్యత, పర్యావరణ రక్షణ లాంటి) ప్రజలందరికీ అందుబాటులోకి రావడానికి ప్రభుత్వ బడ్జెట్‌లో అధిక కేటాయింపులు జరగాలని ప్రజలు గట్టిగా కోరుతున్నారు. అత్యధిక ప్రజల మధ్యనున్న అసమానతల అగాధం తగ్గించాలంటే ఆర్థిక అభివృద్ధిని సాధించడమేకాక, అభివృద్ధి ఫలాలను అత్యధిక ప్రజలకు లభించేటట్లు చూడవలసిన గురుతర బాధ్యత ప్రజాస్వామిక ప్రభుత్వంపై ఉంది. ఆర్థిక సమానత్వం, సామాజిక భద్రత, భౌతిక, సామాజిక మౌలిక అవస్థాపన జరగడానికి ప్రజా సేవలందించే పాలనా యంత్రాంగంలో మౌలిక సంస్కరణలు తీసుకువచ్చి నాణ్యతకు, జవాబుదారీతనానికి, పాలనా యంత్రంగాన్ని మళ్లీ రూపొందించాలి.

### భారతీయ అసమానతల స్వరూపం

సమకాలీన భారతదేశం స్వరూపం గురించి తెలుసుకునేటప్పుడు అక్కడ వ్యాప్తి చెందిన అసమానతలను మాత్రమేకాక అసమానతలు ప్రత్యేక తరహా రూపాన్ని గురించి తెలుసుకోవడం ముఖ్యం. ప్రజల మధ్యనున్న అసమానతల అగాధాన్ని గురించే కాక, పేదవారి ఆదాయాల స్థాయి ఎంత తక్కువంటే, వారు తమ దైనందిన ప్రాథమిక అవసరాలను కూడా సమకూర్చుకునే పరిస్థితిలో లేరు. ఉన్నవారు-లేనివారి మధ్యనున్న వ్యత్యాసం పూడ్చలేనిది, ఘోరమైనది. అసమానతల సూచికలు అందుకోలేనిది. ప్రజల సాధారణ రక్షణకు, స్వేచ్ఛకు అసమానతలు చాలా అన్యాయంగా ఉన్నాయి. ప్రాథమిక సదుపాయాలు లాంటి పనికొచ్చే బడి, అందుబాటులో వైద్యశాల, ఇంట్లో మరుగుదొడ్డి, రెండు పూటలా తిండి అత్యధిక జనాబాకు లేవు. ఇటువంటి సదుపాయాలులేని, అసమానతలు గల దేశం ఇతర నాగరిక ప్రపంచంలో చాలా అరుదు. ఇది భారతదేశ ప్రత్యేకతగా పరిగణించాలి. భారతీయ సామాన్య ప్రజల జీవితాలు చాలా దుర్భరం. జీవిత ప్రమాణాలు కూడా తక్కువ. ఏ దేశంలో కూడాలేని ఆచారం బహిరంగ ప్రదేశంలో మల విసర్జన భారతదేశంలో తాండవిస్తుంది. ఇటువంటి అనాగరిక ఆచారాలు ఇక్కడ జరుగుతున్నాయని చాలా మంది విజ్ఞులకు తెలియదు. ప్రజలలో, మీడియాలో వీటి గురించి చర్చలేదు. చంద్రుని దగ్గరకు, అంగారక గ్రహానికి, గగనతలంలో మన శాస్త్రజ్ఞుల ప్రయోగాల గురించి గొప్పలు చెప్పుకుంటున్నారు కాని ప్రజల మధ్యనున్న అనాచారాలను, అసభ్యకర అసమానతలను గురించి ఆధునిక భారత గౌరవప్రదమైన పౌరసమాజం పట్టించుకోవడం లేదు. ఉన్నవారి మధ్య ఇతరుల మధ్య పాతుకుపోయిన భారతీయుల విభజన, వ్యత్యాసాలు, కులం, వర్గం, కమ్యూనిటీ, లింగ వివక్షతల వల్ల ఉన్నాయి. భారతదేశానికి ఇదొక ప్రత్యేకత. ఇక్కడవున్న అసమానతలు, సామాజిక అడ్డంకులు ప్రగతికి అడ్డుగా నిలుస్తున్నాయి.

భారతీయ తరహా అసమానతలు సామాజిక న్యాయ పోరాటాల మీద ప్రభావం చూపుతాయి. సంపదల, అధికారాల కేంద్రీకరణను ప్రతిఘటించడం ఈ పోరాటాలు చేయవలసి ఉంది. పోరాటాలు, ఆందోళనలు మౌలిక సదుపాయాలను అందరికీ అందుబాటులో ఉండాలన్న ఆశయంతో జరిగితేనే పేదవారికి సామాజిక న్యాయం జరుగుతుంది అన్న అంశం ముందుకు రావడం లేదు. ఇటువంటి పోరాటాలు కేరళ, తమిళనాడు రాష్ట్రాలలో జరిగి అక్కడున్న దళితులకు, వెనుకబడిన తరగతుల వారికి కొంతమేలు జరిగింది. కులవివక్ష, అసమానతలు కొంతవరకు తగ్గాయి. సామాజిక అన్యాయం, అసమానతలు తొలగాలంటే ప్రాథమిక అవసరాలు అందరికీ అందుబాటులోకి రావాలంటే, ఆందోళనలు, పోరాటాలు అత్యవసరమని భారత దేశంలోని ప్రజాస్వామిక రాజకీయవాదులు ఇంకా గుర్తించడం లేదు.

### ప్రజా సేవలు - సామాజిక విభజన

భారత ప్రభుత్వ అభివృద్ధి విధానాల ప్రాధాన్యాలు అసమగ్రమైనవి. విధానాల ప్రాధాన్యం ఉన్నత వర్గాల ఉన్నతిని గురించే ఆలోచించాయి. వారి బాగోగుల గురించే అధిక చర్చ జరిగింది. ముఖ్యంగా మీడియా దీనికి మద్దతునిచ్చింది. అంతేగాని సామాన్య జనుల జీవిత చిత్రం వారికి కనపడలేదు. సామాజిక వైఫల్యాలు కొట్టొచ్చినట్లు కనపడుతున్నా, కనీసశ్రద్ధ సామాజికుల పట్ల పాలక వర్గం కనపరచలేదు. ప్రజా వ్యవస్థలో వారిని గురించి, విద్య, ఆరోగ్యం, కనీసవేతనం, ఉపాధి గురించి కనీస చర్చ జరగలేదు. గత 20 సంవత్సరాల నుండి కనీస వేతనాలలో మార్పు రాలేదు. ప్రజలలోనున్న శక్తి, సామర్థ్యాలను ఉపయోగించుకోవడానికి సంపూర్ణ ప్రయత్నం చేయలేదు. విద్య, ఆరోగ్య, ఉపాధి ప్రమాణాలు, జీవిత ప్రమాణాల సూచికలు చూపించే వాటిని లెక్కచేయలేదు. అసలు దేశంలోని అత్యధిక జనాభా ప్రధాన సమస్యల గురించి పెద్దగా చర్చించలేదు. సరైన నిర్ణయాలు తీసుకోలేదు. ఒకవేళ కొన్ని నిర్ణయాలను తీసుకొన్నా వాటి అమలు లోపభూయిష్టంగా ఉంది. వాటిలాభాలు కూడా అధికారాలున్న వర్గాలు దొడ్డి దారిన లాకున్నారు. ముఖ్యంగా విద్యావంతులు, ధనవంతులు, పాలనాధికారులు, రాజకీయ నాయకులు, భారతదేశంలోని నూతన శిష్టవర్గం (న్యూ ఇండియన్) వారి స్వ ప్రయోజనాలు, సొంత లాభాలు, సుఖాల గురించే ఆలోచిస్తున్నారు కాని ఆర్థిక అభివృద్ధిని సాధించి, అభివృద్ధి ఫలితాలను అందరికీ సమానంగా పంచాల్సిన బాధ్యత, కర్తవ్యం తమ మీద ఉందన్నది వారు విస్మరించడం చాలా విస్మయకరంగా ఉంది. మానవత్వంతో మానవీయ ప్రజాస్వామిక సమాజాన్ని నిర్మించాలన్న సదుద్దేశం వారికి రాకపోవడం అత్యంత విచారకరం. సుస్థిర ఆర్థికవృద్ధికి ఆరోగ్యకరమైన,

విద్యావంతులైన, వంచనకు గురికాని జనాభా అవసరమే కాక, మానవీయ ప్రజాస్వామిక సమాజం ప్రాథమిక ఆశయాలుగా గుర్తించాలి.

భారతీయ సమాజపు నల్లమచ్చలను తొలగించడానికి భారతీయ ప్రజాస్వామ్యంలో ఇంకా తగినంత అవకాశముంది. సామాజిక అంశాలపై విస్తృతమైన ప్రజల్లో చర్చ జరిగి సమస్యలు అందరికి తెలిసేటట్లు వెల్లడి కావాలి. కొన్ని విషయాలలో ఈ దిశలో కొంత ఆశాజనక చర్చ ప్రారంభయినా, ఇంకా అధిక చర్చ జరగాల్సి ఉంది. ప్రజాజీవితాలను మెరుగు పరచడానికి భారత్‌లో జరిగిన కృషిని గురించి అది సాధించిన విజయాలను గురించి కూడా ఇంకా అందరికీ తెలియజేయవలసి ఉంది. ఉదాహరణకు, హిమాచల్‌ప్రదేశ్ రాష్ట్రంలో ప్రాథమిక విద్యలో సాధించిన ప్రగతిని గురించి, అలాగే తమిళనాడు, కేరళ ప్రభుత్వాలు ప్రజారాజ్యం, శిశు సంరక్షణ విషయాలలో సాధించిన ఫలితాలు అందరికీ తెలియవు. ఇతర రాష్ట్రాలు కూడా వారి నుండి నేర్చుకోవలసి ఉంది. కొన్ని రాష్ట్రాలు కొన్ని మెరుగైన ప్రజా సేవలు అందిస్తోంది. కేంద్ర ప్రభుత్వం కూడా మహాత్మాగాంధి జాతీయ ఉపాధి హామీ చట్టం, ప్రజా పంపిణీ విధానం, సమగ్ర శిశు అభివృద్ధి సేవలందిస్తున్నాయి. వాటి అమలు తీరును గురించి మీడియా విశేషాలను తెలియచేస్తూ ఉంది.

ఎన్నిచేసినా పరిస్థితులలో మెరుగైన మార్పు కనబడడం లేదు. కనుక నిజమైన మార్పు నిర్మాణాత్మక చర్యల ద్వారా మాత్రమే సాధ్యమవుతుంది. అట్టి చర్యల ద్వారా మెక్సికోలో ఆరోగ్య సంరక్షణ, బ్రెజిల్‌లో ప్రజా సేవలు పెద్ద ఎత్తున చేపట్టడంతో చాలా మార్పు వచ్చినట్లు తెలుస్తుంది.

**అసహనం – ప్రజాస్వామ్యం**

సహించడం–సహనం భారతీయుల గొప్ప లక్షణంగా వర్ణించారు. కాని అతి దారుణమైన అసమానతలను, కులాల విభజన ఆధారంగా సమాజ స్థిరీకరణాన్ని భారతీయ సామాజిక వ్యవస్థకు అవసరంగా భావించడం మట్టుకు సహించరానిది. బ్రిటీష్ వలస పాలనలో ఘోర అసమానతలను ప్రజలు సహించారు. అనేక దశాబ్దాలపాటు ఆర్థిక అభివృద్ధి నిలిచిపోతే అంతకంటే ఎక్కువ భారతదేశం సాధించలేదని సరిపెట్టుకున్నారు. భారతీయ స్త్రీలపై విధించిన భౌతిక, సామాజిక అసమానతలను వారు మౌనంగా భరించారు. అసమర్థ పాలన, జవాబుదారీతనం లేనిపాలనను, అవినీతి, లంచగొండి తనం అలుముకొన్న పాలనను ఎంతో కాలంగా సహిస్తున్నారు. సమాజంలోని బలహీన వర్గాలు, పరాధీనులు ఎంతో కాలంగా బాధలలో మునిగివున్నా, వారిని అనేక అవమానాల పాలుచేసినా, వారిని అనేక రకాలుగా దోచుకున్నా, వంచించినా, పెరగని ఆర్థిక వ్యవస్థతో సరిపుచ్చుకుంటూ, అణచివేతకు, అణగిమణగి ఉండడానికి అలవాటుపడ్డారు. అన్నిటినీ సహిస్తూ ఈనాడున్న అసమానతలను, అన్యాయాల నివారణకు ఓపిక–సహనం ఏమాత్రం సహాయం చేయలేదని రుజువైంది. కనుక సమస్యలపట్ల అసహనం ప్రదర్శించి, వాటి నివారణకు క్రియాశీలక విముక్తి ఉద్యమాలు, బలమైన చైతన్యవంతమైన పోరాటాలతోనే సాధించబడతాయి. బ్రిటిష్ పాలన అంతానికి కారణం రాజకీయ అసహన ప్రదర్శన, సహాయ నిరాకరణ, బలమైన ప్రజా ఉద్యమాల ద్వారా నిరసనలను తెలియజేసి, బ్రిటిష్ పాలన భారతదేశంలో కొనసాగనీయకుండా చేశాయి.

అయితే, సమకాలీన భారతదేశంలో జరుగుతున్న అక్రమాలకు, అన్యాయాలకు వ్యతిరేకంగా నిరసన ఉద్యమాలు లేవనికాని, ప్రజలు అసహనంగా లేరని మాత్రం కాదు. కాని ఆయా ఉద్యమాల గళం శక్తివంతంగా లేకపోవడంవల్ల జరుగుతున్న అన్యాయాలను అవి పూర్తిగా ఎత్తి చూపలేకపోతున్నాయి. రాజకీయంగా పలుకుబడి, సామాజిక అధికారం ఉన్న వర్గాలు, ధనవంతులు, మధ్యతరగతి ప్రజలు, పేద వర్గాలను ఆదుకోవాలని, వారికి సహాయం అందించాలని లేకపోవడం ఒక దౌర్భాగ్యం. అత్యధికులైన భారతీయుల సమస్యలు రాజకీయ సమస్యలు కానివిగా చూడబడుతున్నాయి. కనుక అట్టడుగునున్న సామాన్య ప్రజల సమస్యలు ప్రజా ప్రభుత్వంలో తగినచోటు చేసుకోవడం లేదు. అందుకే, విద్యా, ఆరోగ్యం, సామాజిక భద్రతలాంటి ముఖ్య విషయాలకు భారతీయ ప్లానింగ్ విధానంలో సరైన స్థానం దొరకడం లేదు. ప్రభుత్వ విధానాల పక్షపాత ధోరణి వల్ల వ్యవసాయాన్ని, గ్రామీణ అభివృద్ధిని, పర్యావరణ దోపిడీని లెక్క చేయకుండా ప్రైవేట్‌వారి ప్రయోజనాలను, ఉన్నవారి ప్రయోజనాలను కాపాడడం కోసం పరోక్షంగా, ప్రత్యక్షంగా రాయితీలుకూడా ఇస్తూ ప్రభుత్వ విధానాలను తీసుకుంటున్నారు.

శతాబ్దాలుగా పరదేశీయుల ఆక్రమణలకు, పాలనకు వ్యతిరేకంగా ప్రతిఘటించలేక పోవడం, భారతీయులకు ఇష్టం లేకపోవడమేకాక వారి శక్తిని వారు గ్రహించకపోవడం కూడా అన్న ఒక అభిప్రాయం ఉంది. బ్రిటిష్ పాలకులకు వ్యతిరేకంగా ఉద్యమించడం కూడా అహింస పూర్వకంగా జరిగిందే తిరుగుబాటు ద్వారా కాదు. ఈరోజుకు కూడా భారతీయ రాజకీయాలలో ఏ అధికారంలేని వెనుకబడిన ప్రజలు వారి సమస్యల నివారణకు, పరిష్కారాలకు ముందుకు వచ్చి తమ గళాన్ని గట్టిగా వినిపించడానికి సుముఖంగా లేరు. ఆర్థికంగా కొంచెం ఉన్నవారు సంఘటితమై, ఐక్యమై, వారి సమస్యలను గట్టిగా వినిపించే వారికి రాజకీయాలలో స్థానం దక్కుతుంది.

భారతీయ ప్రజాస్వామ్య రాజకీయాలలో ఇప్పటికీ అవకాశాలున్నయి. బలహీన వర్గాలు వారిశక్తిని వారు గ్రహించి సంఘటితమై అసమానతలను, అన్యాయాలను తొలగించాలని వారి జీవితాలలో వెలుగు నిండాలని కోరుకున్నట్లయితే సమస్యలు చాలా వరకు తీరతాయి. కనుక ఆయా ప్రజలు తమ గళాన్ని విప్పాలి. రాజకీయంగా సంఘటితం కావాలి. ఆందోళనలు చేయాలి. ఉద్యమించాలి. అప్పటిదాకా కోట్లాది ప్రజల జీవితాలు బాగుపడవు. కనుక అన్యాయానికి, అసమానతలకు, బాధామయ జీవితాలకు అలవాటుపడ్డ ప్రజలు ఇంకెంతమాత్రం ఆలస్యం చేయకుండా భారతీయ ప్రజాస్వామ్యం, రాజ్యాంగం ఇచ్చిన అవకాశాలను ఉపయోగించుకోవాలి. తమ శక్తిని తెలుసుకుని, అసహన పూరితులై, తమ న్యాయమైన కోరికలను పరిష్కరించుకోవడానికి సంఘటితం కావాలి. ఆందోళన చేయాలి. ఉద్యమించాలి. లేకపోతే భవిష్యత్ అంధకారంగానే మిగిలిపోవచ్చు. ఇదే ఈనాటి భారతీయ సమాజం ప్రధాన సవాలు.

*(రచయిత రిటైర్డ్ ప్రొఫెసర్)* వీ

# నేర స్వభావ మూలాలు

***నేరాలకు కారణమవుతున్న మూలాలకు పరిష్కారాలు వెతక్కుండా చట్టాల్లో పరిష్కారాలు వెతకడమంటే నేర మూలాలను పదిలపరచడమేననీ, అదే ఈ వ్యవస్థ స్వభావమనీ అంటున్నారు ఎన్. భగవాన్ రెడ్డి***

'మాయమైపోతున్నడమ్మా మనిషన్నవాడు' అని ఓ కవి ఆందోళన వ్యక్తం చేసినట్లుగా దేశవ్యాప్తంగా ఈ మధ్యకాలంలో వివిధ ప్రాంతాల్లో ముఖ్యంగా మహిళల పట్ల జరుగుతున్న అమానుష, నేరపూరిత సంఘటనల పట్ల సర్వత్రా ఆందోళన వ్యక్తమవుతుంది. సమాజంలో సగ భాగమైన మహిళలపై కొనసాగుతున్న అత్యాచార సంఘటనలు, సమాజం పట్ల, మానవ సంబంధాల పట్ల ఆరాటం గల ప్రజాస్వామిక వాదులందర్ని కలవరపాటుకు గురిచేస్తున్నాయి. గత ఏడాది 2012 డిసెంబర్ 16న దేశ రాజధాని ఢిల్లీలో ఒక విద్యార్థినిపై అమానుష లైంగిక దాడికి వ్యతిరేకంగా దేశవ్యాప్తంగా ఆందోళనలు రేకెత్తాయి. ఢిల్లీలో విద్యార్థి యువత వ్యవస్థను మార్చివేస్తారా అన్నట్లుగా నిరసనలు వ్యక్తం చేశారు. ఫలితంగా 2013 సెప్టెంబర్ 13న నిందితులకు కోర్టు మరణశిక్ష విధిస్తూ తీర్పునిచ్చింది. ఆ శిక్షలు మాకు కాదు కదా అనుకున్నారో ఏమో తీర్పు వెలువడిన నెలరోజులకే 2013 అక్టోబర్ 22న రాష్ట్ర రాజధాని హైదరాబాద్‌లో సాఫ్ట్‌వేర్ ఉద్యోగినిపై కారు డ్రైవర్, మరో వ్యక్తి అమానుషమైన రీతిలో లైంగిక దాడికి పాల్పడ్డారు. ఢిల్లీ ఘటనపై వెల్లువెత్తిన ఆందోళనల వలన 'నిర్భయ' చట్టం వచ్చింది. నిందితులకు ఉరిశిక్ష ఖరారైంది. నిర్భయ నిందితులకు కఠిన శిక్షలు విధించినా, కఠిన చట్టం వచ్చినా అలాంటి సంఘటనే రాష్ట్ర రాజధానిలో పునరావృతమైంది.

ఢిల్లీ ఘటనకన్నా ముందు కూడా ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలోని వరంగల్‌లో ఇంజనీరింగ్ విద్యార్థినులు స్వప్నిక, ప్రణీతలు ప్రేమను నిరాకరించారని ఇద్దరు యువకులు యాసిడ్ దాడికి పాల్పడ్డారు. అప్పుడు నిందితుల దాడిపట్ల పెద్దఎత్తున నిరసన రావడంతోపాటు పోలీసుల వైఖరి సైతం విమర్శలకు గురికావల్సి వచ్చింది. ఆత్మరక్షణలో పడిన పోలీసులు నిందితుల్ని ఎన్‌కౌంటర్‌లో హతమార్చేదాకా వెళ్లింది. నేరస్తుల్ని హత్య చేయాలనే డిమాండ్ వచ్చినందుకు పోలీసుల తీరును ప్రశంసించిన వాళ్లు ఇకముందు ఇలాంటివి జరగవని భావించిన వారున్నారు. ఐనా వెంట వెంటనే రాష్ట్రంలో అనేక సంఘటనలు చోటు చేసుకున్నాయి. ఇలాంటి నేర సంఘటనలు జరిగినప్పుడు సమాజంలోని అన్ని వర్గాల ప్రజలు వ్యతిరేకిస్తూ ఆందోళనలు చేస్తున్నప్పటికీ మళ్లీ జరగడానికి ప్రేరేపిస్తున్న అంశాలేమిటి? సంఘటనలు జరిగినప్పుడే ఆందోళనలు చేయడమో తాత్కాలికంగా ఏదోమేరకు స్పందించడమో చేస్తున్నారు తప్ప నేర స్వభావపు లక్షణాలు ఎక్కడున్నాయి? ఆ మూలాలను కనిపెట్టి అవి జరగకుండా అరికట్టలేమా? అన్న కోణాల్లో ఆలోచించి అందుకు తగిన చర్యలు తీసుకున్న దాఖలాలు ఉన్నాయా?

చట్టాలు ఒక్కటే నేర సంఘటనలు జరగకుండా చేయలేవనీ, సమాజంలో తగిన మార్పులు వస్తేనే అమానవీయ నేరాల్ని తగ్గిస్తామని లోక్‌సభ స్పీకర్ మీరాకుమార్ నిర్భయ ఘటన నేపథ్యంలో పేర్కొనడంలో ఉన్న వాస్తవాన్ని ఆలోచించాలి. సమాజంలో రావాల్సిన మార్పులు వాటంతట అవే వస్తాయా? ఎవరు ఆ మార్పులు తీసుకు రావాలి? మార్పులు తేవడానికి ప్రయత్నిస్తున్న వారిని ప్రస్తుత రాజకీయాలు ఏ మేరకు స్వాగతిస్తున్నాయి? చట్టం తీసుకరావడమూ దాన్ని నీరుగారేలా చేస్తున్నదెవరు? 'నిర్భయ' చట్టం అమలులోకి వచ్చిన తర్వాత నాలుగు నెలల్లో 463 కేసులు వివిధ పోలీసు స్టేషన్లలో నమోదయ్యాయి. 2013 సంవత్సరం మొదటి అర్ధభాగంలో 42 అత్యాచార కేసులు నమోదయ్యాయంటే రాష్ట్రంలో, దేశంలో ఎన్ని జరుగుతున్నాయో పాక్షికంగానైనా అంచనా వేసుకోవచ్చు.

ఇలా సమాజంలో చోటు చేసుకుంటున్న అమానుష, అనైతిక, నేరపూరిత చర్యల మూలాల్ని తెలుసుకొని వాటిని నిర్మూలించే చర్యలు చేపట్టే దిశగా ప్రయత్నాలు చేయాల్సిఉంది. వ్యవస్థను శాసించేది, పాలించేది రాజకీయ రంగమైనందున నేర స్వభావపు మూలాల్ని కనిపెట్టి, నేరపూరితమైన చర్యల్ని రూపుమాపాల్సిన బాధ్యత ప్రధానంగా పాలకవర్గ రాజకీయాలపై ఆధారపడిఉంది. కాని ప్రస్తుత రాజకీయ వ్యవస్థ అందుకు భిన్నంగా అప్రజాస్వామికంగా, ప్రజా ఆకాంక్షలకు భిన్నంగా స్వార్థపూరితమైన అధికారమే పరమావధిగల రాజకీయాలు కొనసాగుతున్నాయి. వివిధ రకాల మాఫియా ముఠాలకు, కేంద్రాలుగా రాజకీయాలు నిలుస్తున్నాయి. నీతి, నిజాయితీ, ధర్మం తప్పిన రీతిలో నేరస్వభావపు వ్యక్తులు ప్రవేశించడంతో అవినీతి రాజ్యమేలే పరిస్థితులున్నాయి. రకరకాల కుంభకోణాల్లో కోట్లాది రూపాయల అవినీతి బయటపడ్డా రాజ్యం నేర చరితులకు అండగా నిలబడి ఆశ్రయం కల్పిస్తోంది. మానవత్వం, నీతి, నిజాయితీ, ధర్మం అనేవి రాజకీయాల్లో మనుగడ సాగించడం కష్ట సాధ్యమవుతుంది. అలా అని మొత్తం రాజకీయ వ్యవస్థ అలా ఉందనుకోనక్కర్లేదు. రాజకీయాల్లో విలువల పునర్నిర్మాణం జరగాల్సిన అవసరం ఉంది. ల్యాండ్ మాఫియా, మద్యం మాఫియా, మైనింగ్ మాఫియాల ప్రభావం తగ్గాలి. వాటిలో భాగస్వాములవుతున్న రాజకీయ నాయకులకు స్థానం ఉండకూడదు. ఎందుకంటే గ్రామ పంచాయతీ స్థాయిలో సర్పంచ్, వార్డు సభ్యులే లక్షల రూపాయలు ఖర్చుపెట్టి మద్యం ప్రవహింపచేసి ఓట్లు రాబట్టు కుంటున్నారు. ఆ ఖర్చు మొత్తం మళ్లీ రెట్టింపు స్థాయిలో సంపాదించే ప్రయత్నాలు చేస్తున్నారు. ప్రజా సంక్షేమం, సేవ లాంటివి ప్రధానం కావట్లేదు. ఎంఎల్ఎ, ఎంపిల సంగతి చెప్పనక్కర్లేదు. ఓటర్లను మద్యం మత్తులో ముంచి నేతలు అధికార దాహంలో తేలిపోతున్నారు. ఈ పరిస్థితుల్లో నిస్వార్థపు సేవ రాజకీయాల పునరుద్ధరణ జరగాలి. కలుషిత రాజకీయాల్ని కడిగేయాలి. అక్రమాలు చేసేవాళ్లు అధికార రాజకీయాల్లో ఉంటే అన్యాయాలు, అరాచకాలు చేసేవాళ్లకు ఆదర్శమవుతారు. ఆ పరిస్థితి మారాలి.

విద్య మనిషిని వివేకవంతుడిగా తయారుచేయాలి. అందుకు తగిన విధంగా మంచి, నీతి, న్యాయం వంటి విలువల ప్రాతిపదికన పాఠ్యాంశాల రూపకల్పన జరగాలి. విద్యార్థులను ఉత్తమ ఆశయాలు, ఆలోచనలు కలవారిగా తీర్చిదిద్దేదిగా ఉండాలి. కాని వాటి స్థానంలో వ్యాపార విలువలు చోటు చేసుకున్నాయి. విద్య కొనగలిగే వారికో విద్య, కొనలేని వారికో విద్య అన్నట్లు అంతరాలను సృష్టించేదిగా మారింది. కొనగలిగినవారి లక్ష్యం కోట్లు సంపాదించేదిగా ఉంటుంది తప్ప సమాజం పట్ల బాధ్యత కలగడం లేదు. విద్య కొనలేని వారికి ఉద్యోగాలు లేక నైరాశ్యం చోటుచేసుకొని బాధ్యతారహితంగా మారిపోతున్నారు. మద్యం బారినపడి బలహీనతలకు లోనై రకరకాల అఘాయిత్యాలకు పాల్పడుతున్న సంఘటనలున్నాయి. విద్య అనేది సమస్యలకు పరిష్కారాన్ని సూచించేదిగా, కష్టాలు తట్టుకొని నిలబడేదిగా ఉండాలి. సమస్యలకు పరిష్కారం సూచించేదిగా ఉండాలి తప్ప పారిపోయేట్లు చేసేదిగా ఉండకూడదు. పాలకవర్గ రాజకీయాలు, సమాజ ఉన్నతికి దోహదపడి మనుషుల్ని మానవత్వం గల మనుషులుగా తీర్చిదిద్దే విద్యా విధానాన్ని ప్రవేశపెట్టే దిశగా ప్రయత్నించాలి.

సమాజంలోని అనేక రుగ్మతలకు చికిత్సచేసి ఒక మంచి సమాజాన్ని నిర్మించే శక్తి విద్యార్థి యువకులదే. వక్రమార్గంలో పయనించే సమాజాన్ని సక్రమ మార్గంలో పయనించేందుకు దిశా నిర్దేశం చేస్తూ చైతన్యవంతమైన, బాధ్యతాయుతమైన పాత్ర నిర్వహించాల్సింది విద్యావంతులే. కాని విద్యార్థి సంఘాలు, రాజకీయ పార్టీల అనుబంధ సంఘాలుగా మారి అధికారం కోసమో, సంపాదన కోసమో తాపత్రయ పడుతూ బాధ్యతలు నిర్వహించడంలో ఓ మేరకే పరిమితమైపోతున్నాయి. ఉన్నత ఆశయాలకోసం పనిచేయాల్సిన విద్యార్థులు చైతన్య రహితంగా మారిపోతున్నారు. విద్యా విధానం, రాజకీయాలు అలా తయారు చేస్తున్నాయి. వాటి నుండి బయట పడాల్సిన అవసరముంది. అందుకు తగిన విధంగా చారిత్రక, సాంస్కృతిక, సామాజిక విలువలతో కూడిన విద్యా విధానం, పాఠ్యాంశాలు అమలు చేయబడాలి. సామాజిక శాస్త్రాల అధ్యయనమే వృథా అన్నట్లు ప్రభుత్వాలు ఉన్నప్పుడు ఏమేరకు మార్పులు వస్తాయో ఆలోచించాలి. విద్యను పెట్టుబడిగా చూస్తూ లాభాల్ని ఆశించినప్పుడు లక్షల ఖర్చుతో నేర్చే విద్య పెట్టుబడి తిరిగి ఏ విధంగా వస్తుందో చూస్తుంది తప్ప సామాజిక బాధ్యతగా నిలబడుతుందని ఊహించలేం కదా! సమస్యలు ఎదురైనప్పుడు తట్టుకోలేక జీవితాల నుంచి పారిపోయి ఆత్మహత్యలకు పాల్పడుతున్నారంటే ఆత్మస్థైర్యాన్ని, విశ్వాసాన్ని ఇచ్చి నిలబెట్టలేక పోతుందనే విషయం తెలుస్తుంది.

ప్రచార మాధ్యమాలు పూర్తి వ్యాపారాత్మకంగా వ్యవహరిస్తూ స్త్రీని ఒక భోగవస్తువుగా చూపిస్తూ మరీ బాధ్యతా రహితంగా వ్యవహరిస్తు న్నాయి. మహిళను ఒక వస్తువుగా మార్కెట్‌తో సంబంధం లేకున్నా అశ్లీలంగా, అసభ్యంగా చూపిస్తున్నారు. సినిమాల్లో కూడా స్త్రీలను అర్ధనగ్న దృశ్యాలతో చిత్రీకరిస్తున్నారు. సినిమాలు తీసేవారు డబ్బుల కోసం తీస్తున్నప్పటికీ అవగాహనలేని మనుషుల మీద మరింత దుష్ప్రభావాన్ని కలిగిస్తున్నారు. హీరో నిండు దుస్తుల్లో కనిపిస్తే హీరోయిన్ ఛిన్నంగా కనిపిస్తుంది. వీటిని అరికట్టలేని రాజకీయ నాయకులు, సంఘటనలు జరిగినప్పుడు మహిళలదే తప్పన్నట్లు మాట్లాడుతున్నారు. ఢిల్లీలో నిర్భయ ఘటన నేపథ్యంలో పార్లమెంటు సభ్యుడొకరు మాట్లాడుతూ 'ఆడపిల్లలు చూపులతో రెచ్చగొట్టకపోతే మగవాళ్లు వాళ్లవైపే చూడరు' అన్నారు. మరో నాయకుడు మహిళల వస్త్రధారణతో ఈ ఘటనలు జరుగుతున్నాయనడం దిగజారుతున్న రాజకీయాలకు నిదర్శనాలు కాక మరేమంటారు? నిర్భయ, అభయల ఘటనలు దుస్తులు, చూపులతో సంబంధం ఉందా? ఐదారేండ్ల బాలికలు ఏ చూపుల్తో రెచ్చగొడుతున్నారు? ఏ వస్త్రధారణతో అత్యాచారాలకు, కిడ్నాప్ హత్యలకు బలై పోతున్నారు? మానసిక దౌర్బల్యంతో మంచి, చెడు అవగాహన కొరవడిన వ్యక్తులను ప్రచార మాధ్యమ దృశ్యాలుగాని వాటిని అనుకరిస్తున్న కొద్దిమందిగాని ప్రేరేపితుల్ని చేస్తుండవచ్చు. కాని చాలా సంఘటనల్లో బాధితులకు వీటితో సంబంధాలు లేకుండానే జరుగు తున్నవి. అధిక సంఖ్యాక సినిమాల్లో ప్రేమ తప్ప మరేం ఉండడం లేదు. ప్రేమకోసం ఎవరినైనా, ఏమైనా చేయొచ్చు అనేతరహాలో ఉండడం టీనేజర్స్‌లో ఆ ప్రభావం ఎక్కువ కనిపిస్తుంది. సామాజిక, కుటుంబ సంబంధాలు, విలువల స్థానంలో ఒకే ఒక అంశం ప్రాధాన్యత వహిస్తుంది. అది యువతపైన ముఖ్యంగా కొన్ని సహజ కోరికలకు దూరంగా ఉన్నవాళ్లో, మద్యం మత్తులో మునిగి తెగించినవాళ్లో ఈ దారుణాలకు పాల్పడుతున్నట్లు కన్పిస్తుంది. అందుకే అలాంటి యువత ఉపాధిలేకనో, అనాథలుగా ఉండకుండా, మద్యం మత్తులో మునిగి పోకుండా చూడడంతోపాటు సరైన మార్గనిర్దేశం గావించే వ్యవస్థ ఏర్పడాలి. మానసిక బలహీనతలతో దుష్ప్రభావాలకు లోనుకాకుండా చూడాలి.

ఆడది ఒంటరిగా అర్ధరాత్రి నడవగలిగినప్పుడే నిజమైన స్వాతంత్ర్యం వచ్చినట్లని ఆనాడే గాంధీజీ అన్నారు. మద్య నిషేదం, గ్రామ స్వరాజ్యం గూర్చి కలలుకన్నాడు. గాంధీజీ విగ్రహాల్ని ఊరూరా నెలకొల్పిన నాయకులు ఆ సిద్ధాంతాల్ని మాత్రం పాటించట్లేదు. ధర్మం లేదు. సత్యం లేదు. మద్యాన్ని మాత్రం టార్గెట్లు పెట్టి విక్రయిస్తున్నారు. ఆ ఆదాయంతో పరిపాలన నడిపించే పరిస్థితుల్లో ఉన్నారు. గ్రామాల్లో మంచినీళ్లు దొరకకపోయినా మద్యం మాత్రం దొరుకుతుంది. మద్యం సేవించి గృహహింసకు పాల్పడి కుటుంబ బాధ్యతల నుండి దూరమవుతున్నారు. భార్యా, పిల్లల పోషణ చూసుకోకుండా కుటుంబాల్ని నాశనం చేస్తున్నారు. మద్యం మత్తులో మునిగినవాళ్లకు ఎదుటివాళ్లు ఎలా కనిపిస్తారో? మంచేదో, చెడేదో తెలుసుకునే పరిస్థితిలో ఉంటారో? ఉండరో? నీతి, రీతి, ధర్మం ఎలా పాటిస్తారో అందరికి తెలిసిందే. క్లబ్బులు, పబ్బుల సంస్కృతి ఎలా ప్రభావం చూపిస్తుందో తెలుసుకోవడం కష్టం కాదు.

నేర స్వభావాల్ని సరిచేయాల్సిన రాజకీయ వ్యవస్థలాగే సమాజంలో నేరాల నుండి రక్షించాల్సిన పోలీసు విభాగం సైతం రుగ్మతల్లోనే ఉందనవచ్చు. పోలీసు స్టేషన్లకు వెళ్లిన వారిని సవాలక్ష ప్రశ్నలతో, సందేహాలతో విసిగిస్తారు. సరైన న్యాయం జరుగుతుందన్న విశ్వాసం కల్పించలేకపోతున్నారు. వరంగల్ నగరంలో స్వప్నిక, ప్రణీతలపై దాడికి ముందే ఫిర్యాదులపై చర్య తీసుకుంటే అలా జరిగేది కాదని బాధితులే పేర్కొన్నారు. అలాగే గిరిజన ప్రాంతాల్లో సైనికులు గిరిజన మహిళలపై అత్యాచారాలకు పాల్పడుతూ రక్షించాల్సిన వారే భక్షిస్తున్నారు. ఒకటేమిటి రాజకీయ, వ్యాపార, సినిమా, సామాజిక, ఆర్థిక, సాంస్కృతిక, విద్యా రంగాల్లో అనేక రుగ్మతలు చోటు చేసుకున్నాయి. సంఘటనలు జరిగినప్పుడు స్పందించి తాత్కాలిక ఉపశమనం పొందడం సమాజం వంతైంది. ఈ అవలక్షణాల్ని నిర్మూలించనిదే ఈ సంఘటనలు ఆగిపోవడం కష్టమే. శాశ్వత చర్యలు చేపట్టాలి.

సమాజ నిర్మాణంలో సగభాగమైన మహిళల జీవితాలకు భద్రత, భరోసా కల్పించాల్సిన బాధ్యత మొత్తం రాజకీయ, సామాజిక రంగాలపై ఎంతగానో ఉంది. సామాజిక రుగ్మతలకు చికిత్స చేయాల్సిన అవసరం ఉంది. చైనాలో రాజకీయ పరిణామాలు చోటు చేసుకుంటున్న సమయంలో మావో సాంస్కృతిక ఉద్యమాన్ని నిర్మించినట్లుగానే ప్రస్తుతం మహత్తర సాంస్కృతిక ఉద్యమాన్ని నిర్మించాల్సిన అవసరం ఉంది.

# నిత్య జీవితంలో గతితర్కం

***మార్క్సిజం, లెనినిజం, మావోయిజం రాజకీయార్థిక సామాజిక సిద్ధాంతం మాత్రమే కాదనీ, శాస్త్రీయ సిద్ధాంతం కూడా అనీ, దీన్ని మానవుల నిత్య జీవితానికి అన్వయిస్తే అద్భుతాలు సృష్టించవచ్చనీ అంటున్నారు* లోక సంచారి**

ఒళ్లంతా 90 శాతానికి పైగా కాలిపోయి ఏ క్షణంలోనైనా చావు ఖాయం అనే పరిస్థితిలో ఒక వ్యక్తిని ఆసుపత్రికి తీసుకెళ్తే భారతదేశంలో ఆ వ్యక్తి పరిస్థితి ఎలా ఉంటుంది? ప్రభుత్వ ఆసుపత్రి అయితే, పోలీసుల రిపోర్టు అవసరమని, రక్త సంబంధికుల సంతకాలు అవసరమని, ఎమర్జెన్సీ డాక్టరు లేడని, కాలిపోయిన వ్యక్తిని బతికించడానికి కావలసిన ప్రత్యేకమైన మందులు లేవని, ఒకవేళ పైవన్నీ ఉన్నప్పటికీ లంచం ఇవ్వనిదే అసలు వైద్యం మొదలు పెట్టమని, ఇలా రకరకాల కారణాలు చెపుతారు. ఒకవేళ, ప్రైవేట్ ఆసుపత్రులయితే అడ్వాన్స్‌గా డబ్బులు కట్టకపోతే వైద్యం మొదలే పెట్టరు. డాక్టర్లతో సహ పేషెంట్ బంధుమిత్రులందరూ, దేవుని మీద భారం వేసి రోగికి 'అదృష్టం' బాగుంటే, జాతకం బాగుంటే, 'దేవుని దయ' ఉంటే బతుకుతాడని, ఒకవేళ 'తలరాత', 'విధి' సరిగా లేకపోతే బతకడని అంటూ మాట్లాడుతూ ఉంటారు. ఒకవేళ బతికితే దేవుని దయ అని నమ్ముతూ తమ ఇష్ట దైవాన్ని దర్శించుకుంటారు. ఒకవేళ వైద్యుల తప్పు వలన చనిపోయినా, రోగికి ఆయుశు అంతవరకే రాసిపెట్టి ఉన్నందున అలా చనిపోయాడని నమ్ముతారు. 'మేము చేయగలిగేదంతా చేస్తాం. మిగతాది దైవాధీనం' అని స్వయంగా డాక్టర్లే అశాస్త్రీయ ఆధ్యాత్మిక ధోరణిలో మాట్లాడడం మనం తరుచుగా వింటుంటాం.

అదృష్టం, జాతకం, విధి, తలరాత, దైవాధీనం లాంటివన్నీ బూటకమని, 95 శాతానికి పైగా శరీరం కాలిపోయినప్పటికీ, అత్యంత సంక్లిష్టమైన ఎమర్జెన్సీ సందర్భాల్లో కూడా గతితార్కిక శాస్త్రం ద్వారా రోగులను చావు నుండి తప్పించవచ్చని 1960 దశకంలో (మావో కాలం) చైనాలోని యువ డాక్టర్లు నిరూపించారు. గతితార్కిక భౌతిక వాద శాస్త్రం కేవలం సమాజాన్ని బాగుపరచడానికి మాత్రమే కాదు, రోగులను కూడా బాగు చేయడానికి, ఆ మాటకొస్తే, ఈ విశ్వంలో ఉన్న ఏ శాస్త్రానికైనా అన్వయించి అద్భుతమైన ఫలితాలు సాధించవచ్చని ఆ చైనా డాక్టర్లు నిరూపించారు. మందులు, వైద్య పరికరాలే మనిషిని బతకించడంలో అత్యంత ప్రముఖ పాత్ర పోషిస్తాయని నమ్మచూపే పెట్టుబడిదారీ ఆలోచనా విధానం అశాస్త్రీయమైనది, అభివృద్ధి నిరోధకమైనదని ఈ చైనా యువ డాక్టర్లు నిరూపించారు. మార్క్సిజం, లెనినిజం, మావోయిజం అనే గతితార్కిక ఆలోచనా విధానాన్ని వైద్య రంగానికి అన్వయించి, ప్రపంచ వైద్య రంగ చరిత్రలో ప్రముఖంగా నిలిచిపోవలసినంత అద్భుత ప్రయోగాలు చేసి విజయం సాధించారు.

అయితే, పెట్టుబడిదారీ దేశాల గుప్పిట్లో ఉన్న ప్రపంచ వైద్య రంగం, తమ కంపెనీల లాభాల కోసం మందులను, వైద్య పరికరాలను మాత్రమే అతి ముఖ్యమైనవిగా చూపుతూ, ఈ చైనా యువ డాక్టర్లు 1960 దశకంలో సాధించిన అద్భుత విజయాలను గుర్తించలేదు. 1966, ఫిబ్రవరి 4 నాడు వెలుబడిన 'పీకింగ్ రివ్యూ' అనే చైనా పత్రికలో అచ్చయిన వీరి విజయ గాథను 'వీక్లీ బోల్షివిక్' అనే వెబ్‌సైట్ వారు ఈ మధ్య వెబ్‌సైట్‌లో యథాతథంగా ప్రచురించారు. దాని ఆధారంగా ఈ వ్యాసం రాయబడింది.

మార్క్సిజం-లెనినిజం- మావోయిజం (ఎంఎల్ఎం) రాజకీయార్థిక, సామాజిక సిద్ధాంతం అని ఎవరైనా అనుకుంటే వారు ఈ సిద్ధాంతాన్ని తప్పుగా అర్థం చేసుకున్నట్టే. ఎంఎల్ఎం అనేది ఒక సైంటిఫిక్ సిద్ధాంతం. దాన్ని ఖగోళ శాస్త్రం నుండి మొదలుకొని భూగర్భ శాస్త్రం వరకు దేనికైనా చివరికి వ్యక్తిగత జీవితానికైనా అన్వయించి అద్భుత ఫలితాలను సాధించవచ్చు. ఈ అవగాహనతో 1960 దశకంలో పీకింగ్ పట్టణంలోని జిషివిటన్ ఆసుపత్రిలోని డిపార్ట్‌మెంట్ ఆఫ్ ట్రామటాలజీలో పని చేసే కొందరు యువ డాక్టర్లు ఎంఎల్ఎం గతితార్కిక సిద్ధాంతాన్ని వైద్య శాస్త్రానికి అన్వయించాలని నిర్ణయించుకొన్నారు. అప్పటి ప్రపంచ వైద్య శాస్త్ర చరిత్ర ప్రకారం 80 శాతం మించి శరీరం కాలిపోతే ఆ రోగి బతకడం చాలా అరుదు. అయితే జిషివిటన్ ఆసుపత్రికి చెందిన యువ డాక్టర్లు ఆ చరిత్రను తిరగ రాశారు. ఇది ఎలా సాధ్యమైంది? వారు ఏదైనా కొత్త మందునో, వైద్య పరికరాన్నో కనుగొన్నారా? లేదా వాటిని తమ రోగులపైన ప్రయోగించారా? లేదు, ఇవేవీ కాదు. వారి అద్భుత విజయం వెనుక కారణం వారు మావో ఆలోచనా విధానాన్ని, మార్క్స్ గతితార్కిక భౌతికవాదాన్ని తమ వైద్య విధానానికి అన్వయించారు. వారు ఎంఎల్ఎం సిద్ధాంతాన్ని వైద్య శాస్త్రానికి ఎలా అన్వయించారో చూద్దాం.

**సమస్తాన్ని దృష్టిలో ఉంచుకొని దాంట్లో ఒక భాగంతో వ్యవహరించాలి**

ఈ గతితార్కిక సూత్రానికి విరుద్ధాంశం చైనీస్ సామెతలో ఉంది. 'తలనొప్పి ఉంటే తలకు వైద్యం చేయి. కాలినొప్పి ఉంటే కాలికి వైద్యం చేయి'. ఈ అధిభౌతిక ఆలోచనా విధానం 1960ల వరకు కూడా వైద్య రంగంలో చాలా ప్రభావం కలిగి ఉండేది. శరీరం కాలిన కేసులలో డాక్టర్లు చాలా సంక్లిష్టమైన త్వరితగతంగా మారుతున్న రోగి పరిస్థితులతో

---

విద్య, రాజకీయ, సామాజిక, వ్యాపార, సినిమా, రక్షణ రంగాల్లోని అవలక్షణాల్ని కూకటివేళ్లతో నిర్మూలించే విధంగా మానవ సంబంధాలు, నైతిక విలువల నిర్మాణం జరగాలి. నేర స్వభావపు మూలాల్ని పెకలించి మాయమైపోతున్న మనిషిని మానవత్వపు, నీతి, నిజాయితీ, ధర్మం లక్షణాలు గల మనిషిని నిర్మింప జేసుకోవాలి. అవి వాటంతటవే ప్రతిష్టింపబడలేవు. కావున సమాజంలోని ప్రతిరంగం దేనికదే బాధ్యతాయుతమైన పాత్ర వహించేటట్లుగా మార్పురావాలి. ఉన్నతమైన ఆశయాలతో, ఉన్నత విలువలుగల సమాజం నిర్మాణం దిశగా ప్రతి ఒక్కరమూ ఆలోచిద్దాం.

*(రచయిత ఉపాధ్యాయులు)* వీ

సతమతమయ్యే వారు. ఒకే సమయంలో రోగి ఎన్నో రకాల ఆరోగ్య సమస్యలను ఎదుర్కొంటాడు. దాంతో, డాక్టర్లు అన్ని రకాల మందులు ఒకేసారి ఇచ్చేవారు. జ్వరానికి ఒక మందు. తలనొప్పికి ఒక మందు. నొప్పి నివారణకు ఒక మందు. యాంటీ – బయాటిక్ మందు. చీము పట్టకుండా ఇంకో మందు, ఇంజెక్షన్లు, ఆపరేషన్లు – ఈ అతి వైద్యం ద్వారా రోగి బాగుపడడం అటుంచి ఆరోగ్యం ఇంకా చెడిపోతుండేది. ఇలాంటి కేసులలో పైకి డాక్టర్లు సమస్తాన్ని (అంటే రోగి మొత్తం పరిస్థితిని) దృష్టిలో ఉంచుకొని వైద్యం చేస్తున్నట్టు అనిపించినా నిజానికి వారు శరీరం కాలిన రోగికి వస్తున్న వివిధ రకాల ఆరోగ్య సమస్యలకు విడివిడిగా మాత్రమే వైద్యం చేసేవారు. సమస్తాన్ని (హోల్) దృష్టిలో ఉంచుకున్నట్లు అనిపించినా, సమస్యను ఏ ముక్కకు ఆ ముక్కను విడిగా (పీస్‌మీల్) చూసే దృక్పథం ఉండేది. నిజానికి, ఈ రోజుకు కూడా ప్రపంచ వ్యాప్తంగా మెజారిటీ డాక్టర్లు పీస్‌మీల్ దృక్పథాన్నే అవలంబిస్తున్నారు. కేవలం మంచి నైపుణ్యం కలిగిన, లాభాపేక్ష లేని వైద్యులు మాత్రమే దీనికి మినహాయింపు. ఎంఎల్ఎం గతితార్కిక సిద్ధాంతం ప్రకారం ఒక సమస్య సమస్తాన్ని లేదా మొత్తాన్ని ఒకేసారి పరిష్కరించలేం. (కాలిపోయిన శరీరాన్ని మొత్తం ఒకేసారి బాగు చేయలేరు) ఒక పెద్ద సమస్యలో ఉన్న ఇతర చిన్న సమస్యలను విడివిడిగా అర్థం చేసుకొని, ఆ విడి భాగాలు పెద్ద సమస్య సమస్తంతో ఎలాంటి సంబంధాన్ని కలిగి ఉన్నాయని అర్థం చేసుకొని, దాని ప్రాతిపదికగా మాత్రమే పరిష్కరించాలి. ఈ గతితార్కిక సిద్ధాంతాన్ని శరీరం కాలిపోయిన రోగులకు అన్వయించిన జిషివిటన్ ఆసుపత్రి డాక్టర్లు కేవలం ఐదు సంవత్సరాల లోపునే ప్రపంచ ట్రామటాలజీ చరిత్రలో కనీవిని ఎరుగని స్థాయిలో 96 శాతం శరీరం కాలిపోయిన వారిని కూడా చావు నుండి రక్షించడమే కాదు, చాలా త్వరితగతిన కోలుకునేట్టు చేయగలిగారు.

**పని ప్రదేశంలో గతితర్కకం**

జిషివిటన్ ఆసుపత్రి యువ డాక్టర్లు ప్రతి రోగి సమస్యను చర్చించుకునే క్రమంలో తప్పనిసరి ఎంఎల్ఎల్ గతితార్కిక సిద్ధాంతాన్ని చర్చించుకోవడం ద్వారానే చేసేవారు. వారు తమ ఆసుపత్రిలోనే ఎంఎల్ఎం సిద్ధాంత గ్రంథాలను ఉంచుకొని వైద్యశాస్త్ర గ్రంథాలను రెఫర్ చేసిన దానికన్నా ఎక్కువగా రెఫర్ వైద్యం చేసేవారు. గతితార్కిక ఆలోచనా విధానంపై పట్టు పెంచుకోవడానికి తమ ఆసుపత్రిలోనే తరుచుగా సెమినార్లు నిర్వహించుకునేవారు. వారి ఆసక్తి ఎంత వరకు వెళ్లిందంటే, వారు ఏ అంశంపై మాట్లాడుకున్నప్పటికీ అది అంతిమంగా గతితార్కిక సిద్ధాంతం వైపే వెళ్లేది.

ప్రపంచ వైద్యశాస్త్ర సాహిత్యాన్ని గుడ్డిగా అనుసరించడం మానేసి, తమ రంగంలో ప్రపంచ స్థాయి కలిగిన వైద్యులు, శాస్త్రవేత్తలు, చివరికి నోబెల్ ప్రైజ్ వచ్చిన వారు చెప్పే విషయాలను కూడా విమర్శనాత్మకంగా చర్చించడం, వాటిని ఎంఎల్ఎం గతితార్కిక సిద్ధాంత కోణం నుండి చూడడం ద్వారా వారు తమ రంగంలో ప్రపంచ వ్యాప్తంగా అమలులో ఉన్న ఎన్నో అంశాలను తప్పుడు అవగాహనలుగా నిరూపించి చూపారు.

**యాంటీ – బయాటిక్ మందులపై అప్పట్లోనే వారి హెచ్చరిక**

2010 సంవత్సరం తర్వాత ప్రపంచ వైద్యరంగంలో అత్యంత హాట్ టాపిక్ ఏదైనా ఉందంటే అది నిరుపయోగంగా మారుతున్న యాంటీ – బయాటిక్ మందుల ప్రభావం. బ్యాక్టీరియా, రోగిని ప్రమాదంలో పడవేయకుండా ఉంచడానికి, వాటిని చంపే యాంటీ – బయాటిక్ మందు కనుగొన్నారు. వైద్యరంగంలో ఇవి ప్రవేశించిన తర్వాత వీటిని ఇబ్బడి ముబ్బడిగా రోగుల చేత వాడిపిస్తున్నారు. మందుల కంపెనీలు ఇచ్చే కమిషన్లకు ఆశపడి ఖరీదైన, అతి ఎక్కువ డోసెజ్ కలిగిన యాంటీ – బయాటిక్ మందులను మాత్రమే గత కొన్ని దశాబ్దాలుగా రోగులకు ఇస్తున్నారు. వీటి వలన చాంతాడంత దుష్ప్రభావాలు ఉండడం వలన, రోగులు ఎన్నో శారీరక, మానసిక సమస్యలు ఎదుర్కొంటున్నారు. వీటిని కనిపెట్టి ఎన్నో దశాబ్దాలు గడిచినా సైడ్ – ఎఫెక్టుల చిట్టా పెరుగుతున్నదే తప్పించి తగ్గడం లేదు. అయితే, ఇప్పుడు వైద్యరంగం ఎదుర్కొంటున్న అతి పెద్ద సవాలు ఏంటంటే, రకరకాల బ్యాక్టీరియా అత్యంత పవర్‌ఫుల్ యాంటీ – బయాటిక్ మందును కూడా తట్టుకునే స్థాయికి ఎదిగాయి. ఇప్పటికే, అల్లోపతి వైద్యరంగంలో నంబర్‌వన్ దేశమైన అమెరికాలో యాంటీ – బయాటిక్ మందుల ప్రభావం పని చేయక ప్రతి సంవత్సరం కనీసం ఇరవై వేల మంది చనిపోతున్నారు. ప్రపంచ వ్యాప్తంగా ఈ సంఖ్య కొన్ని లక్షల్లోనే ఉంటుంది. అన్ని రకాల మందులను ప్రయోగించినా పెట్టుబడిదారీ విధానం విఫలమై మరణశయ్య పైకి చేరుకొని పీడిత ప్రజల చేత చావడానికి ఎలా ఎదురు చూస్తున్నదో, అల్లోపతి వైద్య రంగంలో యాంటీ – బయాటిక్ మందుల పాత్ర కూడా చావు దశకు చేరుకున్నది. నిజానికి 1960 దశకం ఆరంభంలోనే 30 సంవత్సరాలు కూడా నిండని జిషివిటన్ ఆసుపత్రి వైద్యులు ఎంఎల్ఎం గతితార్కిక సైద్ధాంతిక ఆలోచనా దృక్పథంతో ఆలోచించి యాంటీ – బయాటిక్ మందులను అత్యవసరమైతే తప్పించి వాడకూడదని అనుభవ పూర్వకంగా తెలుసుకొని వాటి దుష్పరిణామాల గురించి హెచ్చరించారు. ప్రపంచ వైద్యరంగాన్ని శాసిస్తున్న యాంటీ – బయాటిక్ మందుల కంపెనీలు తమ ఇబ్బడి ముబ్బడి లాభాల కొరకు ఈ సత్యాన్ని తొక్కిపెట్టి, ఈ రోజు ప్రపంచ మానవాళిని ప్రమాదంలోకి నెట్టాయి. మావో మరణానంతరం కూడా సోషలిస్టు వ్యవస్థ కొనసాగి ఉంటే, బహుశా ఆ సోషలిస్టు చైనాలోనే ప్రత్యామ్నాయ యాంటీ – బయాటిక్ మందును కనుగొనే స్థాయికి వారి సాంకేతిక విజ్ఞానం చేరి ఉండేది.

**సేవ ముందా ? నైపుణ్యం ముందా?**

విప్లవానంతరం వివిధ రంగాల్లో ఉన్న నిపుణులలో ఉండే బూర్జువా ఆలోచనా విధానం, అశేష ప్రజానీకానికి రాజీలేని సేవ చేసే సోషలిస్టు విధాన అమలుకు అడ్డంకిగా ఎలా మారుతుందో గ్రహించారు. వారిలో ఎంఎల్ఎం సైద్ధాంతిక అవగాహన కల్పించడం ద్వారా అడ్డంకిని అధిగమించడమే కాకుండా, అద్భుతాలు సాధించవచ్చని నిరూపించారు. విప్లవానంతరం కూడా చాలా మంది చైనా వైద్యులలో (వివిధ ఇతర రంగాల నిపుణుల లాగానే) 'నైపుణ్యం – సేవ – పెరిగిన నైపుణ్యం' అనే బూర్జువా ఆలోచనా విధానం ఉండేది. అంటే, వారి దృష్టిలో 'మాకు మా చదువు, అనుభవం రీత్యా ఇప్పటికే నైపుణ్యం ఉంది. ఆ నైపుణ్యంతో మేము ప్రజలకు వైద్యం చేసి, మా నైపుణ్యాన్ని మరింత పెంచుకుంటాం' అనే బూర్జువా భావన ఉండేది. పైపైన చూసినపుడు సరైన ఆలోచనగా కనిపించే ఈ భావనను ఎంఎల్ఎం గతితార్కిక ఆలోచనా విధానం ద్వారా లోతుల్లోకి వెళ్లి చూస్తే సరైన భావన కాదని అర్థమవుతుంది. ఈ భావనలో ఉన్న లోపం, ప్రమాదం ఏంటంటే, వీరు తమ నైపుణ్యాన్ని, విషయ పరిజ్ఞానాన్ని మరింతగా పెంచుకోవాలనే లక్ష్యంతో, తామందించే సేవను (ఉద్యోగాన్ని) ఒక సాధనంగా వాడుకుంటారు. ఈ భావన వెనుక ఉన్న అసలు ఆలోచన తాను ఒక గొప్ప నిపుణుడు లేదా పరిశోధకుడు కావాలని, పేరు ప్రఖ్యాతలు సంపాదించాలని ఉంటుంది. ఈ రకమైన

ఆలోచన ఉన్న వైద్యులు రోగులకు సేవ చేయడం తగ్గించి రోగాలపై పరిశోధనకు ఎక్కువ సమయం కేటాయిస్తారు. అందులో కూడా, అన్ని రోగాలపై వారికి ఆసక్తి ఉండదు. వేటిపై పరిశోధన చేసి, పరిశోధనా పత్రాలు రాసి మెడికల్ జర్నల్స్‌కు పంపితే వారికి పేరు వస్తుందో ఆ రోగాలపైనే వారికి ఆసక్తి. మామూలు రోగాల విషయానికి వస్తే వారు ఆ రోగులను ఇతర వైద్యులకు అంటగట్టాలని చూస్తుంటారు. ఇలాంటి ఆలోచనా విధానం విప్లవానంతరం దేశంలోని అన్ని రంగాల నిపుణులకు ఉన్నట్టే జిషివిటన్ ఆసుపత్రి యువ వైద్యులలో కూడా ఉండేది. అయితే వారు మావో ఇచ్చిన 'కార్మిక వర్గ ఆలోచనా దృక్పథం పెంచుకోవాలి' అనే పిలుపు మేరకు 'నైపుణ్యం – సేవ – పెరిగిన నైపుణ్యం' అనే బూర్జువా ఆలోచనా విధానాన్ని వదిలించుకొని 'సేవ – పెరిగిన నైపుణ్యం – సేవ' అనే కార్మిక వర్గ ఆలోచనా విధానాన్ని అలవర్చుకున్నారు. ఈ ఆలోచనా విధానం ప్రకారం అశేష ప్రజానీకానికి రాజీలేని సేవ చేయాలనే తపనే అత్యంత ముఖ్యమైనది, ముందు చూపవలసినది.

సేవ చేయడమే మన ఏకైక లక్ష్యంగా ఉండాలి. అలా సేవ చేసే క్రమంలో మన నైపుణ్యం, విషయ పరిజ్ఞానం మరింతగా పెరుగుతుంది. ఏ ప్రజా క్షేత్రంలో మన నైపుణ్యం, విషయ పరిజ్ఞానం పెరుగుతుందో, తిరిగి వాటిని ఆ ప్రజల సేవకే ఉపయోగించాలి. ఈ అత్యంత మానవీయ ఎంఎల్ఎం ఆలోచనా విధానం, చైనా వైద్యుల ఆలోచనా విధానంలో ఎంతో గొప్ప మార్పులు తెచ్చింది. దాంతో వారు ప్రజాసేవ చేయడాన్నే అతి పెద్ద లక్ష్యంగా చేసుకొని అనన్య త్యాగాలను చేశారు. ఉదాహరణకు, కొందరు జిషివిటన్ ఆసుపత్రి యువ వైద్యులు 95 శాతానికి పైగా శరీరం కాలిపోయి వచ్చిన రోగులను 24 గంటలు వారి వద్దే గడుపుతూ (చివరికి రోగి గదిలోనే పడుకొని), ఇంటికి కూడా వెళ్లకుండా కొన్ని వారాల పాటు ఆసుపత్రిలోనే, రోగుల పక్కనే ఉండేవారు. ఒక డాక్టర్ తన భార్య వేరే ఊరిలోని ఆసుపత్రిలో ప్రసవించిందని తెలిసినా, తన భార్యను, పాపను క్షేమంగా చూసుకునే వైద్య సిబ్బంది అక్కడ ఉన్నందున, తనను నమ్ముకున్న రోగులను 24 గంటలు కంటికి రెప్పలా కాపాడుతూ, వారిని చావు ప్రమాదం నుండి బయట పడవేసి, బాగుచేసి, దాదాపు రెండు నెలలకు తన భార్య, పాపను చూడడానికి వెళ్లాడు. ఇలా 24 గంటలు రోగుల వద్దే ఉండి, వారి ప్రతి ఒక్క మార్పును రికార్డ్ బుక్‌లో రాసేవారు. కొన్ని కేసుల్లో ఈ రికార్డ్ బుక్‌లు కేవలం పదిహేను రోజుల్లోనే ఒక మనిషి మోయలేనంతగా (కేవలం ఒక్క రోగి రికార్డ్‌లు మాత్రమే) తయారయ్యేవట. ఈ రికార్డ్‌లే వారిని ప్రపంచంలో ఎవరూ చేయని అద్భుతాలు చేయడానికి పరిశోధనా పత్రాలుగా ఉపయోగపడ్డాయి. కంప్యూటర్లు వాడకంలో లేని ఆ రోజుల్లో ఒక రోగి కొత్త సమస్యను అర్థం చేసుకోవడానికి ఒక పెద్ద హాల్‌లో ఉన్న పాత రికార్డ్‌లను ముందేసుకొని చదివేవారు. ఎంఎల్ఎం గతితార్కిక సిద్ధాంతాన్ని చదవడం, చర్చించడం, సిద్ధాంత సెమినార్లు నిర్వహించడం, రోగులకు సేవ చేయడం, వారి మార్పులు రికార్డ్ చేయడం, పాత రికార్డ్‌లను పరిశోధించడం, వైద్యశాస్త్ర గ్రంథాలు చదవడం, వినూత్న పద్ధతులు కనుగొనడం, ఇదే వారి జీవితంగా ఉండేది.

**విప్లవం చేయాలంటే, విప్లవకారుడిగా ఉండాలి**

ఒక కొత్తగా స్థాపించబడ్డ ఆసుపత్రిలో, అప్పుడే వైద్య విద్య చదువుకొని వచ్చిన యువ వైద్యులు, ప్రపంచ స్థాయిలో కనీవిని ఎరుగని అద్భుతాలు ఎలా సాధించారు? ప్రపంచ వ్యాప్తంగా వైద్యరంగంలో ఎదురు లేకుండా అమలు చేయబడుతున్న కొన్ని విధానాలను తప్పుడు విధానాలుగా నిరూపించే స్థాయికి ఎలా ఎదిగారు? ఈ అద్భుతాల వెనుక ఉన్న సత్యమేంటి? అదే, మార్క్స్, లెనిన్, మావోలు చెప్పిన మాట, 'మనస్ఫూర్తిగా విప్లవానికి అంకితం కావడం, అంటే రాజీ లేకుండా ప్రజలకు సేవ చేయడం. ప్రజల గురించే బతకడం, ప్రజల గురించే మరణించడం. ప్రజలకు సేవ చేయడమనే విప్లవం చేయాలంటే, నిరంతరంగా సేవ చేసే విప్లవకారునివి కావలసిందే.

నిరంతరంగా, రాజీ లేకుండా ప్రజలకు మనస్ఫూర్తిగా సేవ చేయడమే తమ జీవిత అతి పెద్ద లక్ష్యంగా చేసుకున్న జిషివిటన్ ఆసుపత్రి యువ వైద్యులు ఈ రోజు ప్రపంచ వ్యాప్తంగా సేవా దృక్పథం గల వైద్యులకు స్ఫూర్తిదాయకమయ్యారు. చైనాలో విప్లవానికి ముందు కోట్లాది ప్రజలకు సరైన వైద్యం అందని ద్రాక్ష పండే. విప్లవానంతరం మావో నాయకత్వంలోని చైనా కమ్యూనిస్టుపార్టీ ఇచ్చిన పిలుపు మేరకు దేశ వ్యాప్తంగా ప్రభుత్వ ఆసుపత్రులను స్థాపించి ఉచిత వైద్యం అందించారు. రోగులకు ఉచిత ఆహారాన్ని, మందులను కూడా ఇచ్చారు. ఇలా వైద్యాన్ని అట్టడుగు పేద ప్రజలకు అందించడంలో జిషివిటన్ ఆసుపత్రి యువ డాక్టర్ల పాత్ర అనిర్వచనీయమైనది. ప్రజలకు మనస్ఫూర్తిగా సేవ చేయాలనే విప్లవంలో వీరంతా విప్లవకారులుగా ఉన్నందునే వైద్య రంగంలో అతికొద్ది సమయంలోనే గొప్ప ముందడుగు వేశారు.

**వ్యక్తిగత జీవితంలో గతితర్కం**

అయితే జిషివిటన్ యువ వైద్యులు ఎంఎల్ఎం గతితార్కిక ఆలోచనా విధానాన్ని కేవలం వైద్య శాస్త్రానికే పరిమితం చేయలేదు. దాన్ని వారు తమ వ్యక్తిగత జీవితాలకు కూడ అన్వయించుకున్నారు. తమ ప్రతి ఆలోచనలను కూడా నిశ్చితమైన, శాస్త్రీయమైన గతితార్కిక ఆలోచనా విధానం ద్వారా పరీక్షించుకోవడం మొదలుపెట్టారు. దాంట్లో భాగంగానే వరుస విజయాలను అనుభవిస్తున్న తమలో అపజయానికి కారణమయ్యే గుణాలైన గర్వం, నిర్లక్ష్యం, అల్ప సంతోషం లాంటివి అభివృద్ధి కాకుండా చర్యలు తీసుకున్నారు. అలాగే విపత్కర, ప్రమాదకర పరిస్థితులలో ఉజ్వల భవిష్యత్ వైపు చూడడం, అలాగే పరిస్థితులు తమ అనుకూలంగా ఉన్నప్పుడు, తమకు ప్రతికూలంగా ఉండవచ్చునుకునే అంశాలను శోధించడం నేర్చుకున్నారు. యూనిటీ ఆఫ్ ఆపోజిట్ (భిన్నాంశాల మధ్య ఐక్యత) అనే ఈ గతితార్కిక సిద్ధాంతాన్ని వారు తమ వ్యక్తిగత ఆలోచనా విధానానికి అన్వయించుకున్నారు.

అలాగే, ప్రజలకు మనస్ఫూర్తిగా సేవ చేయాలనే ఈ విప్లవ దారిలో ప్రతి అడుగులో మనలో ఉన్న వ్యక్తివాదపు అవశేషాలను వెతికి పట్టుకొని, వదిలించుకునే కార్యక్రమం నిరంతరంగా జరిగితేనే సమష్టి లక్ష్యాలను సాధించుకుంటామని వారు అర్థం చేసుకున్నారు. అలాగే, అద్భుత విజయాలను సాధించిన సందర్భంలోనే మనలో ఉన్న లోపాలను, తప్పులను నిర్ద్వందంగా, ధైర్యంగా చెప్పుకోవడం మితగా అన్ని సందర్భాల కన్నా ఎక్కువ అవసరమని చెప్పే 'గతితార్కిక ఆలోచనా విధానాన్ని వారు అమలు పరిచారు. ప్రజలకు మనస్ఫూర్తిగా సేవ చేయాలనే విప్లవం పట్ల ఉండే అంకిత భావానికి హద్దులు లేవు. విప్లవం ఎలా చేయాలనే దాన్ని నేర్చుకోవడానికి అంతం లేదు. విప్లవం పురోగమిస్తున్న కొలది, ప్రతి అడుగులో అంతం లేనన్ని వివిధ రకాల సమస్యలు వస్తుంటాయి. అయితే, మార్క్స్, లెనిన్, మావోలు అభివృద్ధి చేసిన సైంటిఫిక్ ఆలోచనా విధానమైన గతితార్కిక ఆలోచనా విధానాన్ని సరిగ్గా అర్థం చేసుకొని, ప్రజలకు మనస్ఫూర్తిగా సేవ చేయాలనే విప్లవ స్ఫూర్తితో అన్వయిస్తే అద్భుతాలు చేసి చూపవచ్చు.

*(రచయిత అనేక దేశాల్లో పనిచేసిన సామాజిక కార్యకర్త)* వీ

# సామ్రాజ్యవాదం: పెట్టుబడిదారీ వ్యవస్థ అత్యున్నత దశ - 2

*రచించి వంద సంవత్సరాలు గడిచినా ఇవాళ్టికీ సామ్రాజ్యవాదాన్ని అర్థం చేసుకోవడానికి ప్రామాణికమైన లెనిన్ గ్రంథాన్ని పరిచయం చేస్తున్నారు* **ఎన్.వి.ఎస్. నాగభూషణ్**

*(...గత సంచిక తరువాయి)*

ఫైనాన్స్ పెట్టుబడి, దానికి అనుగుణమైన విదేశాంగ విధానం – ఈ రెండూ పరాధీన రాజ్యం అనే దానికి అనేక సంధి (ట్రాన్సిషనల్) రూపాల్ని సృష్టిస్తాయి. ఈ యుగ స్వభావానికి చిహ్నంగా ఉన్నవి వలసలూ, యజమానులూ అనే రెండు ముఖ్య రకాలైన దేశాలు మాత్రమే గాక, వివిధ రూపాలైన పరాధీన దేశాలు కూడా ఉన్నాయి. చట్టరీత్యా రాజకీయ స్వాతంత్ర్యం ఉంటుంది గానీ, ఆర్థిక దౌత్య వ్యవహారాల వలలో చిక్కుకుని ఉండే దేశాలు ఒక రూపం అర్ధవలస కాగా, మరో రూపం అర్జెంటీనా. దక్షిణ అమెరికా, ముఖ్యంగా అర్జెంటీనా లండన్ మీద ఎంతగా ఆధారపడి ఉంటుందంటే, దాన్ని దాదాపు బ్రిటిష్ వాణిజ్య వలస అనడం న్యాయం అంటాడు బ్రిటిష్ సామ్రాజ్యవాదం మీద పుస్తకం రాసిన షూల్జె–గేవెర్నిట్జ్. ఇక ఆర్థిక, దౌత్య పరాధీనతకు ఒక భిన్న రూపం పోర్చుగల్. 1701–14 స్పానిష్ వారసత్వ యుద్ధం నుండి అది బ్రిటిష్ రక్షణ కింద (ప్రొటెక్టోరేట్) ఉంది. దాన్ని బ్రిటన్ రక్షించడానికి కారణం – తన పోటీదారులైన స్పెయిన్, ఫ్రాన్స్‌లతో పోరాటానికి గాను తన స్థావరాలను భద్రపరుచుకోవడానికి. దీనికి బదులు బ్రిటన్‌కు – వాణిజ్య సౌకర్యాలు, పోర్చ్‌గల్‌కు, దాని వలసలకు పెట్టుబడి ఎగుమతి సౌకర్యాలు, పోర్చ్‌గల్ రేవుల్ని, దాని తంతి మార్గాల్ని ఉపయోగించుకునే హక్కులు లభించాయి. పెద్ద రాజ్యానికి చిన్న రాజ్యాలకూ ఇలాంటి సంబంధాలు ఎపుడూ ఉన్నవేగానీ, పెట్టుబడిదారీ సామ్రాజ్యవాద యుగంలో ఇది సాధారణమవుతుంది.

ఇక ఈ గ్రంథంలో ఏడవ ప్రకరణం 'పెట్టుబడిదారీ వ్యవస్థలో ప్రత్యేక దశగా సామ్రాజ్యవాదం' అనేది. పెట్టుబడిదారీ వ్యవస్థ సామ్రాజ్యవాదంగా ఎప్పుడు మారింది? ఈ ప్రశ్నకు సమాధానంతో లెనిన్ ఈ ప్రకరణాన్ని ఆరంభించాడు. పెట్టుబడిదారీ వ్యవస్థ ఉన్నత దశలో – దాని మౌలిక లక్షణాల్లో కొన్ని తద్విరుద్ధమైన లక్షణాలుగా మారడం ప్రారంభించినప్పుడే అది సామ్రాజ్యవాదంగా మారిందంటాడు లెనిన్. ఆర్థికంగా ఈ ప్రక్రియలోని ముఖ్య లక్షణం–పెట్టుబడిదారీ నిర్నిబంధ పోటీని తొలగించి, దాని స్థానంలో పెట్టుబడిదారీ గుత్తాధిపత్యం రావడం. భారీ పరిశ్రమలు వచ్చి, చిన్న పరిశ్రమల్ని గెంటేస్తున్నాయి. భారీ పరిశ్రమల స్థానంలో అతి భారీవి వస్తున్నాయి. కార్టెళ్లు, సిండికేట్లు, ట్రస్టులు–వందల కోట్ల డబ్బుతో వ్యవహరించే ఏ డజను బ్యాంకులతో కలవడం, అలా కలిసి ఏర్పడిన గుత్త సంస్థలు నిర్నిబంధమైన వాటిని తొలగించవు, వాటి పక్కనే ఉంటాయి. తద్వారా తీవ్రమైన రాపిళ్లను, శత్రుత్వాలను, ఘర్షణలను ఉత్పన్నం చేస్తాయి. గుత్తాధిపత్యం ఏర్పడడం అంటే, పెట్టుబడిదారీ వ్యవస్థ మరింత ఉన్నత వ్యవస్థకు పరివర్తన చెందడమే అంటాడు లెనిన్.

ఇప్పటి దాకా పాఠకులకి సామ్రాజ్యవాదం గురించి బూర్జువా ఆర్థిక శాస్త్రజ్ఞులిచ్చిన నిర్వచనాలనే ఎక్కువ ఇచ్చానని, అందుకు కారణం వారి సందేహాల్ని నివృత్తి చేయడానికేనని అంటూ, అయితే బూర్జువా శాస్త్రజ్ఞులు కూడా పెట్టుబడిదారీ వ్యవస్థ తాజా దశలోని మరీ కాదనవీల్లేని వాస్తవాల్ని అంగీకరించాల్సి వచ్చిందనీ అంటాడు లెనిన్. అయితే సామ్రాజ్యవాదాన్ని నిర్వచించే విషయంలో మాత్రం వివాదపడక తప్పదనీ, ఇది కూడా ముఖ్యంగా కౌట్స్కీతోనే అనీ, ఎందుకంటే ఆయన రెండో ఇంటర్నేషన్‌కి 1889–1914 మధ్య 25 సంవత్సరాల పాటు ప్రధాన మార్క్సిస్టు సిద్ధాంతవేత్తగా ఉన్నాడనీ చెపుతూ, తన వివాదాన్ని ఈ కింది విధంగా వివరించాడు.

కౌట్స్కీ ఇచ్చిన సామ్రాజ్యవాద నిర్వచనం ఇది. 'సామ్రాజ్యవాదం అనేది బాగా అభివృద్ధి చెందిన పారిశ్రామిక పెట్టుబడిదారీ వ్యవస్థ ఫలితం. ప్రతి పారిశ్రామిక పెట్టుబడిదారీ దేశమూ అంతకంతకూ విస్తారమైన వ్యవసాయక ప్రాంతాల్ని, ఆ ప్రాంతాల్లో ఏ జాతులు నివసిస్తున్నాయనే ప్రశ్నతో సంబంధం లేకుండా, తన అదుపులోకి తెచ్చుకోవడానికిగానీ, లేక స్వాధీన పరుచుకోవడానికిగానీ చేసే ప్రయత్నమే సామ్రాజ్యవాదం'.

పైనిచ్చిన కౌట్స్కీ నిర్వచనం పనికి మాలిందని విమర్శిస్తాడు లెనిన్. ఎందుకంటే, అది జాతీయ సమస్యలను ఒక దాన్నీ విడదీస్తున్నదనీ, అది నిర్విమర్శగా, తప్పుగా ఈ సమస్యను ఇతర జాతులను స్వాధీనపరుచుకునే దేశాలలోని పారిశ్రామిక పెట్టుబడితో మాత్రమే సంబంధాన్ని కలిగిస్తోందనీ, అదే విధంగా నిర్విమర్శగా, తప్పుగా వ్యవసాయిక ప్రాంతాల స్వాధీనాన్ని ప్రముఖ స్థానంలోకి తోస్తున్నదనీ అంటాడాయన.

కౌట్స్కీ నిర్వచనంలోని రాజకీయ భాగం సారాంశం 'సామ్రాజ్యవాదం అంటే ఇతర ప్రాంతాల్ని స్వాధీన పరుచుకోవడానికి చేసే ప్రయత్నం' అనేది సరైందేగానీ, అసమగ్రం అంటాడు లెనిన్. అంతేగాక, సామ్రాజ్యవాదం విలక్షణ గుణం పారిశ్రామిక పెట్టుబడి కాదు, ఫైనాన్స్ పెట్టుబడి! (ఉదా : ఫ్రాన్స్‌లో 1880ల నుండి పరదేశ స్వాధీనం తీవ్రం కావడానికి కారణం ఫైనాన్స్ పెట్టుబడి అసాధారణ వేగంతో అభివృద్ధి చెందడం, పారిశ్రామిక పెట్టుబడి బలహీన పడడం). ఇక సామ్రాజ్యవాదం ఇతర దేశాల్లోని వ్యవసాయిక ప్రాంతాల్నేగాక, పారిశ్రామిక ప్రాంతాల్ని కూడా స్వాధీనం చేసుకోవడానికి ప్రయత్నించాయి. (ఉదా: 'బెల్జియం'ను జర్మనీ, 'లోయరినన్'ను ఫ్రాన్స్ కబళింపజూస్తున్నాయి)

ఇక కౌట్స్కీ నిర్వచనం తప్పు మాత్రమే గాక, మార్క్సిస్టు సిద్ధాంతంలోనూ, ఆచరణలోనూ విభేదించే ఒక భావ వ్యవస్థకు పునాదిగా ఉంది. కౌట్స్కీ సామ్రాజ్యవాద రాజకీయాల్ని దాని ఆర్థిక వ్యవహారాల నుండి వేరుచేసి, పరదేశ స్వాధీనాలను ఫైనాన్స్ పెట్టుబడి కోరుకున్న విధంగా, ఈ విధానానికి మరో బూర్జువా విధానం ఉందనీ, ఈ ఫైనాన్స్ పెట్టుబడి పునాది మీదనే ఆ బూర్జువా విధానం సాధ్యమవుతుందనీ అన్నాడు. ఆర్థికరంగంలో గుత్త సంస్థలు – గుత్తాధిపత్యేతర, దౌర్జన్యేతర, ఆక్రమణేతర విధానాలతో రాజకీయ రంగంలో కలిసి ఉండగలవని దాని అర్థం. ఫైనాన్స్ పెట్టుబడి యుగంలో ప్రపంచ భౌగోళిక విభజన పూర్తి అయిందని, దానికి ఆధారం పెద్ద పెట్టుబడిదారీ దేశాల మధ్య గల పోటీ అని మనకు తెలుసు. అలాంటి ప్రపంచ భౌగోళిక విభజన సామ్రాజ్యేతర విధానంలో కలిసి ఉండగలదని కౌట్స్కీ మాటలకు

అర్థం. దీని ఫలితం పెట్టుబడిదారీ వ్యవస్థ ప్రస్తుత దశలోని ప్రగాఢ అంతర్వైరుధ్యాల్ని తగ్గించడం, మరుగు పరచడం ఫలితం మార్క్సిజానికి బదులు బూర్జువా సంస్కరణ వాదం!

కౌట్స్కీ ఇంకా ఇలా అంటాడు: 'కేవలం ఆర్థిక దృక్పథం నుండి చూస్తే పెట్టుబడిదారీ వ్యవస్థలో మరో కొత్త దశ రావడం అసంభవం కాదు. కార్టెల్ విధానం విదేశాంగ విధానానికి విస్తరించే దశ 'అధి సామ్రాజ్యవాద దశ' అంటే అతీత సామ్రాజ్యవాద దశ, మొత్తం ప్రపంచంలోని సామ్రాజ్య వాదాల మధ్య పోరాటాలు కాక, వాటి సమ్మేళన దశ, పెట్టుబడిదారీ వ్యవస్థలో యుద్ధాలు అంతమయ్యే దశ, ఇంకా సరిగ్గా చెప్పాలంటే 'అంతర్జాతీయంగా సమైక్య ఫైనాన్స్ పెట్టుబడి ప్రపంచాన్ని సంయుక్తంగా దోచుకునే దశ'.

ఈ కౌట్స్కీ వాదంలో మార్క్సిజంతో విభేదించే అంశాల గురించి తర్వాత పరిశీలిద్దాం. ప్రస్తుతం ఈ వాదంలో గల ఆర్థిక అంశాల్ని చూస్తే – 'అధి సామ్రాజ్యవాదం' సంభవమా, లేక అధి అవివేకమా ? దీని అర్థం ఏమిటంటే అభివృద్ధి గుత్త సంస్థల వైపు పురోగమిస్తోంది కనుక ఏకైక ప్రపంచ గుత్త సంస్థ వైపు, ఏకైక ప్రపంచ ట్రస్టు వైపు – అని విశదం చేశాడు లెనిన్ కౌట్స్కీ వాదం గల అసలైన విషయాన్ని.

పై కౌట్స్కీ వాదానికి లెనిన్ సమాధానం చెపుతూ, అధి సామ్రాజ్యం గురించి కౌట్స్కీ చెప్పేదంతా శుద్ధ అవివేక ఫలితమని, సామ్రాజ్యవాదాన్ని సమర్థించే వాళ్లకు, అనుకూలమైన భావాల్ని ప్రోత్సహిస్తూ, ప్రపంచ ఆర్థిక వ్యవస్థలోని అసమానతల్నీ, వైరుధ్యాల్నీ ఫైనాన్స్ పెట్టుబడి బలహీన పరుస్తుందని కౌట్స్కీ భావమని, అయితే నిజానికి అది వాటిని బలపరుస్తుందనీ లెనిన్ విశదం చేశారు. తన వాదానికి మద్దతుగా 'ఆర్. కౌల్వర్' అనే ఆర్థిక రచయిత 'ప్రపంచ ఆర్థిక వ్యవహారాలకు ప్రవేశిక' అనే గ్రంథంలో చెప్పిన వివరాలను ఉదాహరించాడాయన.

పైన చెప్పిన 'ఆర్. కౌల్వర్' తన గ్రంథంలో 1920 శతాబ్దాల మధ్య ప్రపంచ ఆర్థిక వ్యవస్థలోని అంతర్గత సంబంధాలకు ఒక నిర్దిష్ట రూపం ఇవ్వగల, కేవలం ఆర్థిక వివరాల్ని క్రోడీకరించాడు. కౌల్వర్ ప్రపంచాన్ని ఐదు ప్రధాన ఆర్థిక ప్రాంతాలుగా విభజించాడు. 1. మధ్య యూరప్ ( రష్యా, బ్రిటన్‌లు మినహా తక్కిన యూరప్ అంతా) 2. గ్రేట్ బ్రిటన్, 3. రష్యా, 4. తూర్పు ఆసియా 5. అమెరికా. వీటిలో మధ్య యూరప్, బ్రిటన్, అమెరికా. ఈ మూడు ప్రాంతాల్లో బాగా అభివృద్ధి చెందిన పెట్టుబడిదారీ వ్యవస్థ ఉందన్నాడు కౌల్వర్. వీటి మూడు రాజ్యాలు ప్రపంచంలో ప్రాబల్యం వహిస్తున్నాయి. అవి – జర్మనీ, బ్రిటన్, అమెరికా, ఈ మూడు దేశాల మధ్య పోటీ, పోరాటం తీవ్రం అవడం ఎందుకంటే, జర్మనీ విస్తీర్ణం తక్కువ, వలసలు కొద్ది మధ్య యూరప్ ఏక ప్రాంతంగా ఏర్పడడం భవిష్యత్‌కు చెందిన విషయం. భీషణ పోరాటం మధ్య అది పుడుతుంది. ప్రస్తుతం యూరప్ రాజకీయ విశిష్ట లక్షణం రాజకీయ అనైక్యత. ఇందుకు భిన్నంగా బ్రిటిష్, అమెరికన్ ప్రాంతాల్లో రాజకీయ సాంద్రీకరణ ఎక్కువగా అభివృద్ధి చెందింది. కానీ మొదటి దాని అపార వలసలకూ, రెండో దాని తృణప్రాయ వలసలకు అపార భేదం ఉంది. అయినా వలసల్లో పెట్టుబడిదారీ వ్యవస్థ అభివృద్ధి చెందడం ఇప్పుడే ప్రారంభమైంది. ఇక పెట్టుబడిదారీ వ్యవస్థ తక్కువగా అభివృద్ధి చెందిన ప్రాంతాలు రెండు – రష్యా, తూర్పు ఆసియా. ఇందులో మొదటి దాంట్లో జన సాంద్రత తక్కువ, రాజకీయ సాంద్రత ఎక్కువ. రెండో దాంట్లో జన సాంద్రత ఎక్కువ, రాజకీయ సాంద్రత అసలు లేదు. చైనా పంపకం కేవలం ప్రారంభంలో ఉంది. అందుకోసం జపాన్, అమెరికా వగైరాలు తీవ్రంగా పోరాడుకుంటున్నాయి – అంటు కౌల్వర్ వివరించారు.

పై వాస్తవాల్ని వివిధ దేశాలలోని ఆర్థిక, రాజకీయ, అభివృద్ధి రేట్లలోని విపరీత అసమానతల్ని, ఆయా సామ్రాజ్యవాద దేశాల మధ్య జరిగే భీషణ పోరాటాల్ని పట్టించుకోకుండా, కౌట్స్కీ శాంతియుత అది సామ్రాజ్యవాదం గురించి చెప్పే కట్టుకథలెంతవరకు నమ్ముతారు ఎవరైనా? ఇది భయకంపితుడైనవాడు వాస్తవం నుండి దాక్కునే ప్రయత్నం తప్ప వేరు కాదు అంటారు లెనిన్. పై అసమానతల వల్ల ట్రస్టుల సంఖ్య తగ్గడానికి బదులు, ఎక్కువ అవుతాయని, బలాబలాల స్థితి ఒకసారి మారాక, ఇక పెట్టుబడిదారీ వ్యవస్థలో వైరుధ్యాల పరిష్కారానికి బలం తప్ప వేరే మార్గం ఏముందని ఆయన ప్రశ్నించారు. రైల్వే లైన్ల పొడవులో బ్రిటన్ సాధించిన అభివృద్ధికి వ్యతిరేకంగా, ఇనుము, బొగ్గు పరిశ్రమల్లో ఇటీవల జర్మనీ సాధించిన అపార వృద్ధి – ఈ అసమానతలను తొలగించడానికి పెట్టుబడిదారీ వ్యవస్థలో యుద్ధం తప్ప వేరే మార్గం లేదంటాడు లెనిన్.

ఇక సామ్రాజ్యవాదుల పరరక్తోప జీవనం వల్ల, ఆ వ్యవస్థ క్షీణ దశకు, రానున్న విషయాన్ని లెనిన్ తన గ్రంథంలో 8వ ప్రకరణంలో 'పెట్టుబడిదారీ వ్యవస్థ పరరక్తోప జీవనమూ, క్షీణించడమూ' అనే పేరుతో వర్ణించాడు.

సామ్రాజ్యవాదం మరో ముఖ్యమైన పార్శ్వం ఇది. సాధారణంగా సామ్రాజ్యవాదం గురించిన చర్చల్లో ఈ పార్శ్వం గురించి తగినంత చర్చ జరగలేదు. మార్క్సిస్టయిన హిల్ఫర్ డింగ్ కంటే, ఈ అంశంలో ఆందోళన వెలిబుచ్చిన బూర్జువా ఆర్థిక శాస్త్రజ్ఞుడు హాబ్సనే నయమనిపిస్తాడు. కొన్ని దేశాల్లో పెట్టుబడి విస్తారంగా పోగుపడడం వల్ల, వడ్డీజీవుల (రెంటయిర్స్) అనే ఒక వర్గం, ఒక సాంఘిక పొర అసాధారణ పెరిగింది. వీరు ఏ పని చేయకుండా సోమరిపోతు తనమే వృత్తిగా కలిగి ఉంటారని చెప్పాలి. సామ్రాజ్యవాద అత్యంత ముఖ్య ఆధారాల్లో ఒకటి అయిన పెట్టుబడి ఎగుమతి వల్ల ఉత్పత్తి నుండి వడ్డీ జీవుల్ని ఏర్పరచి, సముద్రాంతర దేశాల శ్రమనూ, వలసల శ్రమనూ దోపిడి చేసి బతికే వారిగా, దేశాన్ని మొత్తంగా పరరక్తోపజీవిగా స్థిరపరుస్తుంది.

1893లో విదేశాల్లో ఉన్న బ్రిటన్ పెట్టుబడి మొత్తం ఆ దేశ సంపదలో 15 శాతం కాగా, 1915 నాటికి అది 2 1/2 రెట్లు పెరిగిందని హాగ్సన్ లెక్కేశాడు. ఇదంతా పన్నులు చెల్లించే పౌరులకు భారమే గాక, ఉత్పత్తిదారునికీ, వర్తకునికీ ఉపయోగం లేనిది కాగా, పెట్టుబడి పెట్టే వారికి మాత్రం అమిత లాభదాయకం. (ఇంగ్లిషులో ఇంఫెస్టర్ అనగా వడ్డీజీవి) అలాగే 1899లో 80 కోట్ల పౌండ్ల టర్నోవరు మీద బ్రిటన్‌కు వర్తకం ద్వారా ఆదాయం 2 1/2 శాతం చొప్పున 180 లక్షల పౌండ్లురాగా, పెట్టుబడి పెట్టిన వడ్డీజీవుల ఆదాయం 9 నుండి 10 కోట్లు అనగా ఐదు రెట్లు ఎక్కువ. ఇది సామ్రాజ్యవాదం, సామ్రాజ్యవాదపు పరరక్తోప జీవన సారం అంటారు లెనిన్.

సరిగ్గా ఈ కారణం వల్లనే సామ్రాజ్యవాదం గురించి చర్చించే ఆర్థిక సాహిత్యంలో వడ్డీజీవి రాజ్యం (రెంటర్‌స్టాంట్) అనే మాట వాడుకలోకి వస్తోంది. ప్రపంచమంతా కొద్ది వడ్డీజీవి రాజ్యాలుగా, అత్యధికంగా రుణగ్రస్త రాజ్యాలుగా విభజితమైపోయింది. ఒక రచయిత హాలెండ్‌ను, 'ఆదర్శ వడ్డీ జీవి రాజ్యం'గా పేర్కొని, గ్రేట్ బ్రిటన్, ఫ్రాన్సులు కూడా అలాంటివే అవుతున్నాయన్నాడు. 'షూల్జె – గే వెర్నిట్జ్' అనే ఆర్థిక శాస్త్రవేత్త 'బ్రిటిష్ ఇంపీరియలిజం' అనే తన గ్రంథంలో, గ్రేట్ బ్రిటన్ క్రమంగా పారిశ్రామిక రాజ్యం నుండి రుణదాత రాజ్యంగా మారిపోతోందని, దాని పారిశ్రామిక ఉత్పత్తి, సరుకు ఎగుమతిలో పెరుగుదల ఉన్నప్పటికీ, దాని మొత్తం జాతీయ ఆర్థిక వ్యవస్థలో వడ్డీలు, డివిడెండ్లు, సెక్యూరిటీలు వగైరాల నుండి వచ్చే ఆదాయ ప్రాముఖ్యం పెరిగి పోయిందనీ అన్నాడు. తన అభిప్రాయంలో సామ్రాజ్యవాద ఆరోపణకు ఆర్థిక ప్రాతిపదిక సరిగా ఇదే అంటాడతడు. అమ్మే వారికీ, కొనే వారికీ గల సంబంధం కంటే, రుణదాతకూ రుణగ్రస్తునికీ మధ్య ఉండే సంబంధం ఇంకా దృఢంగా ఉంటుందని చెప్పాడు. అలాగే మరో రచయితా 'దిబాంక్' పత్రిక ప్రచురణకర్త అయిన లాన్స్‌బర్గ్ 'జర్మనీ – ఒక వడ్డీ జీవిరాజ్యం' అనే వ్యాసంలో వడ్డీ జీవులుగా మారుతున్న ఫ్రెంచి ప్రజల్ని జర్మన్లు అసహ్యించుకుంటున్నారు గానీ, బూర్జువాలకు

సంబంధించినంత వరకూ జర్మనీ పరిస్థితి కూడా ఫ్రాన్స్‌లాగే అంతకంతకు తయారైందని రాశాడు.

హాబ్సన్ దృష్టిలో పాత సామ్రాజ్యాలను బలహీన పరచిన కారణాలు రెండు. అవి – 1. ఆర్థిక పరరక్తోప జీవనం 2. అధీన ప్రజలతో సైన్యాల నిర్మాణం. మొదటి దాని ద్వారా పాలక రాజ్యం తన పాలక వర్గాన్ని సంపన్నం చేసుకోవడానికి, కింది వర్గాలను లంచంతో శాంతపరచడానికి తన రాష్ట్రాల్నీ, వలసల్నీ అధీన ప్రాంతాల్నీ ఉపయోగించింది. ఇక రెండో కారణం గురించి. ఈ విషయంలో గ్రేట్ బ్రిటన్ అన్నింటి కంటే దూరం పోయిందనీ, భారత సామ్రాజ్యాన్ని జయించడంలో భారతీయులే యుద్ధంలో అధిక భాగం చేశారని, అలాగే ఆఫ్రికన్ వలసలకు సంబంధించి కూడా స్థానికులే చేశారని చెప్పాడు. ఇక చైనా విభజన జరిగితే, పశ్చిమ యూరప్‌లోని మెజారిటీ ప్రాంతానికి, ఇప్పటికే దక్షిణ ఇంగ్లండుకి, ఇటలీ, స్విట్జర్లాండ్‌లలోని విలాస ప్రాంతాల్లోని నివాస గృహాలకు ఉండే స్వరూప స్వభావాలు వస్తాయని హాబ్సన్ చెప్పాడు. దూర ప్రాచ్యం నుండి డివిడెండ్లు, పెన్షన్లూ వచ్చే ధనిక ప్రభువుల చిన్న చిన్న బృందాలు అక్కడ ఉంటారు. వాళ్లకు సేవలు చేయడానికి వృత్తి నిపుణులు వర్తకుల తోటి కాస్త పెద్ద బృందం, గృహ పరిచారకులూ వగైరా పెద్ద సైన్యం ఉంటుంది. ముఖ్య పరిశ్రమలన్నీ అదృశ్యమై ఉండగా, ముఖ్య ఆహార పదార్థాలు పారిశ్రామిక వస్తువులూ ఆసియా నుండీ, ఆఫ్రికా నుండీ కప్పంగా వస్తాయి. పశ్చిమ రాజ్యాలు ఇంకా పెద్ద కూటమిగా, గొప్ప రాజ్యాల యూరొపియన్ ఫెడరేషన్‌గా ఏర్పడే అవకాశం ఉంది. ఈ ఫెడరేషన్ ప్రపంచ నాగరికతను ముందుకు తీసుకుపోవడానికి బదులు, పాశ్చాత్య పరరక్తోప జీవనం అనే బ్రహ్మాండమైన ప్రమాదాన్ని ప్రవేశపెట్టవచ్చు అంటాడు హాబ్సన్.

హాబ్సన్ చెప్పింది నూటికి నూరు పాళ్లు నిజమని చెపుతూ లెనిన్, హాబ్సన్ మరో మాట కూడా చెప్పి ఉండాల్సిందని అంటాడు. అదేమిటంటే 'కార్మిక వర్గ ఉద్యమంలో కూడా అత్యధిక దేశాల్లో ప్రస్తుతానికి విజేతలైన అవకాశవాదులు క్రమబద్ధంగా, ఏకాగ్రచిత్తంతో ఇదే దిశలో కృషి చేస్తున్నారు' అని, సామ్రాజ్యవాదం అంటే ప్రపంచ పంపకమూ, చైనాతో పాటు ఇతర దేశాల్ని దోచుకోవడమూ, కార్మిక వర్గంలోని పై పొరకు లంచం ఇవ్వడానికి ఆర్థిక అవకాశం సృష్టించింది. తద్వారా అవకాశవాదాన్ని పోషించి, రూపుదిద్ది బలపరుస్తుంది. అందువల్ల సామ్రాజ్యవాదాన్ని సాధారణంగా, అవకాశ వాదాన్ని ప్రత్యేకంగా ప్రతిఘటించే శక్తుల్ని మనం కనుదప్పి పోకూడదు అంటారు లెనిన్.

బ్రిటన్‌లో అంతకంతకూ ఎక్కువ భూమి వ్యవసాయం నుండి తొలగించబడి, క్రీడలు, ధనికుల వినోదానికే వినియోగించబడుతోంది. గుర్రపు పందాలకూ, గుంటనక్కల వేటకూ బ్రిటన్‌లో ఏటా 140 లక్షల పౌండ్లు ఖర్చు పెడుతున్నారు. ఇంగ్లండులో వడ్డీ జీవులు సుమారు 10 లక్షల మంది ఉన్నారు.

సామ్రాజ్యవాద ప్రత్యేక లక్షణాల్లో ఒకటి – సామ్రాజ్యవాద దేశాల నుండి విదేశాలకు వెళ్లే వాళ్ల సంఖ్య తగ్గడమూ, వేతనాలు తక్కువుండి మరీ వెనకబడిన దేశాల నుండి సామ్రాజ్యవాద దేశాలకు వచ్చే వాళ్ల సంఖ్య పెరగడమూ, అలాగే సామ్రాజ్యవాదం కార్మికుల్లో అధిక హక్కులు గల వర్గాన్ని సృష్టించడానికి, వారిని కార్మిక జన సామాన్యం నుండి వేరుపరచడానికి అనుకూలంగా ఉంటుంది. ఇలాంటి పరిస్థితి బ్రిటన్‌లో 19వ శతాబ్ది మధ్యలోనే కనబడింది. ఫలితం బ్రిటిష్ కార్మిక వర్గంలో ఒక భాగం బూర్జువా అయ్యింది. బూర్జువా వర్గానికి అమ్ముడు పోయిన లేదా కనీసం దానిలో డబ్బు తీసుకుంటున్న వాళ్ల నాయకత్వాన్ని కార్మిక వర్గంలో ఒక భాగం అంగీకరించడం.

ప్రపంచ విభజన పూర్తి అయిన ప్రస్తుత సన్నివేశంలో గ్రేట్ బ్రిటన్‌కు గల గుత్తాధిపత్యంలో భాగం కోసం కొన్ని సామ్రాజ్యవాద దేశాలు పోరాటం చేస్తున్నాయి. ఈ పోరాటం 20వ శతాబ్దపు ప్రారంబపు విలక్షణ గుణం. అవకాశం 19వ శతాబ్దపు ఉత్తర్థంలో ఇంగ్లండ్‌లో లాగా ఇప్పుడు ఏ దేశంలోనూ అనేక దశాబ్దాల పాటు కార్మికోద్యమంతో విజయవంతం కాలేదు. కానీ పలు దేశాల్లో అది పక్వమై, కుళ్లిపోయి, సోషల్ జాతీయ దురహంకార రూపంలో బూర్జువా విధానంలో లీనమైంది అని విశ్లేషించారు లెనిన్.

ఇక తొమ్మిదో ప్రకరణమైన 'సామ్రాజ్యవాద పరిశీలన'లో లెనిన్ ఆ వాదం పట్ల సమాజంలోని వివిధ వర్గాల వైఖరిని పరిశీలిస్తాడు.

ఫైనాన్స్ పెట్టుబడి కొద్ది మంది చేతుల్లో అపార పరిమాణంలో సాంద్రీకృతమై, చిన్న చిన్న పెట్టుబడిదారులనూ, ఆఖరికి చిన్న యజమానులను కూడా లోబరుచుకోగా; మరో వైపు ప్రపంచ విభజన కోసం, ఇతర దేశాల మీద ఆధిపత్యం కోసం వివిధ జాతులకు చెందిన ఫైనాన్స్ పెట్టుబడిదార్ల మధ్య పోరాటం అంతకంతకూ తీవ్రమవుతోంది. ఇదంతా కలిసి ఆస్తిపర వర్గాలు పూర్తిగా సామ్రాజ్యవాదం వైపు వెళ్లేట్లు చేస్తాయి. దాంతో సామ్రాజ్యవాద భవిష్యత్తును అన్ని చోట్లా ఉత్సాహంగా సమర్థించడం, ఇది కార్మిక వర్గంలోకి కూడా ప్రవేశించడం జరుగుతుంది. ఇలాంటి పరిణామం వల్లనే జర్మన్ సోషల్ డెమొక్రాట్లను – సోషల్ సామ్రాజ్యవాదులని విమర్శించడం.

ఇక ప్రస్తుత సామ్రాజ్యవాద పరిశీలనలోని మౌలిక ప్రశ్నలేమంటే – సామ్రాజ్యవాద ప్రాతిపదికను సంస్కరించడమా లేక అది ఉత్పన్నం చేసే వైరుధ్యాలను మరింత తీవ్రం, మరింత గాఢం చేసే స్థితికి పురోగమించడమా, లేక ఈ వైరుధ్యాలను పల్చన చేసే స్థితికి తిరోగమించడమా – అని.

ఫైనాన్షల్ ప్రభు మండలి చేసే దౌర్జన్యాలు, నిర్నిబంధ పోటీ తొలగించడం వల్ల జరిగే అనర్థాలు, అలాగే సామ్రాజ్యవాదంలో ఉండే ప్రగతి వ్యతిరేకతా – ఈ నిర్దిష్ట రాజకీయ సమస్యల వలన 20వ శతాబ్దం ప్రారంభం నాటికి దాదాపు అన్ని సామ్రాజ్యవాద దేశాల్లోనూ సామ్రాజ్యవాదం పట్ల పెటీ బూర్జువా ప్రజాతంత్ర వ్యతిరేకత వ్యక్తమైంది. అయితే కౌట్స్కీ గానీ, అలాంటి ఇతరులుగానీ ఈ వ్యతిరేకతను మార్క్సిజానికి అనుకూలంగా తిప్పుకోవడానికి బదులు, మార్క్సిజాన్నే వదిలేసి వెళ్లిపోవడానికి కారణం, వారి ఆ సంస్కరణ వాదాన్ని ఎదుర్కొనే శ్రద్ధగానీ, శక్తిగానీ లేక పోవడం, ఫలితంగా వారూ ఆ బూర్జువా సంస్కరణ వాదంలో కలిసిపోయారు.

తన సామ్రాజ్యవాద పరిశీలన హాబ్సన్‌గానీ, ఇంకా లాన్‌బుర్గ్ లాంటి పలువురు గానీ బూర్జువా అర్థ శాస్త్రజ్ఞులు సామ్రాజ్యవాదాన్ని నిర్నిబంధ పోటీతోనూ, ప్రజాస్వామ్యంతోనూ, పోల్చి తారతమ్యం చూపిస్తరు తప్ప; సామ్రాజ్యవాదానికి ట్రస్టులకూ మధ్య గల, ఆ కారణంగా సామ్రాజ్యవాదానికి పెట్టుబడిదారీ వ్యవస్థకూ పునాదులకూ మధ్యగల సంబంధాన్ని గుర్తించడానికి వెనుదీస్తారు. ఇలాంటి బూర్జువా రచయితల్లో కనిపించే అల్పత్వం మనకు ఆశ్చర్యాన్ని కలిగించదు. పైగా ఇదంతా వారికి ప్రయోజనకరం. కానీ సామ్రాజ్యవాద యుద్ధం జరుగుతున్న ఈ 1914, 15, 16లలో కౌట్స్కీ ఇదే బూర్జువా సంస్కరణవాదం చేపట్టి, శాంతి సమస్యను గురించి అందరికీ (సామ్రాజ్యవాదులు, కుహనా సోషలిస్టులు, సోషల్ శాంతివాదులు) అంగీకారం ఉంది అని చెప్పడంలో, ఇంక అతనిలో మార్క్సిజం ఏ పాటి మిగిలిందను కోవాలి ? సామ్రాజ్యవాదాన్ని పరిశీలించి, దానిలోని వైరుధ్యాన్ని బట్టబయలు చేయడానికి బదులు, వాటిని తక్కువ చేసి తప్పుకునే సంస్కరణవాద 'పవిత్ర అభీష్టం' మాత్రం ఇందులో మనకు కనిపించడం లేదా?

సామ్రాజ్యవాదం మీద ఇంతకు ముందు కౌట్స్కీ చేసిన రాజకీయ విమర్శను చూశాం. ఇప్పుడు ఆర్థిక విమర్శకు ఒక ఉదాహరణ చూద్దాం. 1872 లోనూ, 1912 లోనూ ఈజిప్టుతో జరిగిన విదేశీ వర్తకం లెక్కలు తీసుకున్నాడు కౌట్స్కీ. మొత్తం బ్రిటిష్ విదేశీ వర్తకం కంటే, ఈ వర్తకం నిదానంగా పెరిగింది. దాన్ని బట్టి కౌట్స్కీలాగిన అర్థం ఇది; 'సైనిక ఆక్రమణ (ఈజిప్టును బ్రిటన్) లేకపోతే, కేవలం ఆర్థిక శక్తుల ఫలితంగా ఈజిప్టుతో బ్రిటన్ వర్తకం పెరిగి ఉండేది. పెట్టుబడి విస్తరణకు గల ప్రేరణను సామ్రాజ్యవాద దౌర్జన్య పద్ధతుల

ద్వారా గాక, శాంతియుత ప్రజాతంత్ర పద్ధతుల ద్వారా అత్యుత్తమంగా ప్రోత్సహించవచ్చు'.

కౌట్స్కీ తరచు హిల్ఫెర్‌డింగ్‌ను ఉదాహరిస్తాడు. ఒకసారి ఆయన మాటల్నే తీసుకుని, 'సోషలిస్టు సిద్ధాంతవేత్తలందరూ ఏకగ్రీవంగా ఆమోదించినవి' అని చెప్పాడు 1915లో. అయితే హిల్ఫెర్ ఏమన్నాడో చూడండి: '... ఫైనాన్స్ పెట్టుబడి ఆర్థిక విధానానికి, అనగా సామ్రాజ్యవాదానికి, కార్మిక వర్గం ఇచ్చే జవాబు నిర్నిబంధ వర్తకం కాదు. సోషలిజమే. ఈనాడు కార్మికవర్గ విధాన లక్షణం నిర్నిబంధ పోటీని పునఃస్థాపించాలనే ఆదర్శం కాజాలదు. అది ఈనాడు ప్రగతి వ్యతిరేక ఆదర్శం – పెట్టుబడిదారీ వ్యవస్థను రద్దు చేయడం ద్వారా పోటీని పూర్తిగా తొలగించడమే!'

కౌట్స్కీ పైన చెప్పిన ఉదాహరణలో – సైనిక ఆక్రమణ లేకుంటే, సామ్రాజ్యవాదం లేకుంటే... ఈజిప్టుతో బ్రిటన్‌కు ఇంకా వర్తకం పెరిగి ఉండేది అని కదా! అంటే ఏమిటి? సాధారణ గుత్తాధిపత్యం చేతగాని, ఫైనాన్స్ పెట్టుబడి సంబంధాల చేతగాని, లేక వలసల మీద కొన్ని దేశాలకు గల గుత్త యజమాన్యం చేతగానీ నిర్నిబంధ పోటీ నిర్బంధించబడకుండా ఉంటే, పెట్టుబడిదారీ వ్యవస్థ ఇంకా వేగంగా అభివృద్ధి చెంది ఉండేదనేగా! అయితే కౌట్స్కీ చేసిన ఈ వాదం అర్థంలేనిది. ఏ విధమైన గుత్తాధిపత్యం లేని నిర్నిబంధ పోటీ వల్ల వర్తకం ఇంకా అభివృద్ధి చెంది ఉండేదని ఒప్పుకుందాం. కానీ వర్తకమూ, పెట్టుబడిదారీ వ్యవస్థా ఎంతవేగంగా అభివృద్ధి చెందితే, గుత్తాధిపత్యాన్ని ఉత్పన్నం చేసే ఉత్పత్తి, పెట్టుబడుల సాంద్రీకరణ అంత ఎక్కువగా ఉంటుంది కదా! అంతేకాక, సరిగ్గా ఈ నిర్నిబంధ పోటీ నుండి గుత్తసంస్థలు ఉత్పన్నం అయ్యాయి కదా! గుత్తసంస్థలు ప్రస్తుతం పురోగమనంలో మంద గమనం ఉన్నా, అది నిర్నిబంధ పోటీకి అనుకూలమైన వాదం అవదు. ఒకసారి గుత్తాధిపత్యాన్ని ఉత్పన్నం చేసిన తర్వాత, నిర్నిబంధ పోటీ అనేది ఇక అసంభవమైపోతుంది. కనుక కౌట్స్కీ వాదాన్ని ఎటు తిప్పినా, అందులో ప్రగతి వ్యతిరేకతా, బూర్జువా సంస్కరణవాదం తప్ప ఏమీ కనబడదు. సరిగా ఈ అంశానికి సరిపోయే శాస్త్రీయమైన వర్తక గణాంక లెక్కలను 'లాన్స్‌బుర్గ్' అనే ఆర్థిక శాస్త్రవేత్త ఇచ్చాడు. – ఈ లెక్కలు జర్మనీ ఎగుమతి వర్తకానికి సంబంధించినవి. వాటిని బట్టి 1889, 1908 సంవత్సరాలకు సంబంధించి ఆర్థికంగా జర్మనీ మీద ఆధారపడిన దేశాలకు పెరుగుదల శాతం ఎక్కువగా ఉండగా, ఆర్థికంగా జర్మనీ మీద ఆధారపడని దేశాలకు వర్తకంలో పెరుగుదల శాతం తక్కువగా ఉన్నట్లు రుజువైంది.

కనుక సామ్రాజ్యవాదం మీద కౌట్స్కీ సిద్ధాంత విమర్శకూ, మార్క్సిజానికి ఏమీ సంబంధం లేదు. అవకాశవాదులతోనూ, సోషల్ జాతీయ దురహంకారులతోనూ రాజీకోసం, ఐక్యత కోసం ప్రచారం చేయడానికి ఆ విమర్శ ప్రవేశికగా ఉపయోగపడుతుంది. ఎందుకంటే అది సామ్రాజ్యవాదం లోని ప్రగాఢమైన, మౌలికమైన వైరుధ్యాలను తప్పుకొని, మరుగుపరుస్తోంది అని అంటారు లెనిన్.

ఇక కౌట్స్కీయే సృష్టించిన 'అధి సామ్రాజ్యవాదం' కూడా దీనంత ప్రగతి వ్యతిరేకమే. కౌట్స్కీ చెప్పింది ఇది: 'ప్రస్తుత సామ్రాజ్యవాద విధానాన్ని తొలగించి, దాని స్థానంలో ఒక కొత్త అధిసామ్రాజ్యవాద విధానం – జాతీయ ఫైనాన్స్ పెట్టుబడుల పరస్పర వైరాలను తొలగించి, వాటిస్థానంలో అంతర్జాతీయ ఫైనాన్స్ పెట్టుబడి సంయుక్త ప్రపంచ దోపిడీని నిలిపే విధానం – రాలేదా ? పెట్టుబడిదారీ వ్యవస్థలో ఇలాంటి కొత్తదనాన్ని కనీసం ఊహించవచ్చు. దాన్ని సాధించగలమా? ఈ ప్రశ్నకు సమాధానాన్ని చెప్పడానికి తగినన్ని ఆధారాలు లేవు.

హాబ్సన్ 13 సంవత్సరాల కిందట 'అనోన్య సామాజ్యవాదం' గురించి చెప్పగా, దాన్నే కౌట్స్కీ 'అధి సామ్రాజ్యవాదం' అని లాటిన్ ఉపసర్గను ఒకదానికి బదులు మరొకదాన్ని పెట్టి, అతి తెలివిగా కొత్త నినాదాన్ని సృష్టించడం తప్ప, ఇందులో కొత్తదనం ఏదీ లేదన్నాడు లెనిన్. హాబ్సన్ 'క్రైస్తవ రాజ్యం' అంటూ బ్రిటిష్ మధ్యతరగతి వారినీ, కార్మికుల్నీ ఓదార్చడానికి మత గురువుల ఉన్నత కులాన్ని ఉపయోగించినట్లు చూపిండం సహజం. సామ్రాజ్యవాదం అంత చెడ్డది కాదనీ, శాశ్వత శాంతిని నిస్సంశయం చేయగల 'అన్యోన్య' (లేక 'అధి') సామ్రాజ్యవాదానికి అది సన్నిహితంగా ఉందనీ చెప్పే సిద్ధంతాన్ని మించిన ఓదార్పు ఉండజాలదు కదా! అయితే ఈ కౌట్స్కీ సిద్ధాంతానికిగల ప్రాముఖ్యత ఏమిటంటే, వర్తమాన కాలపు తీవ్ర వైరుధ్యాల, సమస్యల నుండి ప్రజల దృష్టిని పక్కకులాగి, పెట్టుబడిదారీ వ్యవస్థలో శాశ్వత శాంతికి అవకాశాలున్నాయని ప్రజల్ని భ్రమపెట్టి ఓదార్చే ప్రజా వ్యతిరేక పద్ధతి ఇది. ప్రజలను మోసగించడం – ఇది మినహా కౌట్స్కీ చెప్పే మార్క్సిస్టు సిద్ధాంతం ఇందులో ఏమీలేదని తేల్చి చెప్పాడు లెనిన్.

కౌట్స్కీ చెప్పేది ఒట్టి బూటకమని చెప్పడానికి ఒక నిర్వివాద వాస్తవాన్ని చూద్దాం. ఇండియా, ఇండో చైనా, చైనా అనే ఈ మూడు వలస, అర్ధవలస దేశాల్ని శాంతియుతంగా పంచుకోవడానికి సామ్రాజ్యవాద దేశాల్నీ ఒక కూటమిని ఏర్పరచుకున్నాయని అనుకుందాం. ఆ కూటమి 'అంతర్జాతీయ సమైక్య ఫైనాన్స్ పెట్టుబడి' కూటమి అవుతుంది. కౌట్స్కీ అనుకుంటున్నట్లు పెట్టుబడిదారీ వ్యవస్థ చెక్కు చెదరకుండా ఉంటుందనుకున్నప్పటికీ, అలాంటి కూటాలు శాశ్వతంగా ఉండగలవనీ, ఏరూపంలోనూ ఘర్షణా, వైరుధ్యమూ, పోరాటమూ లేకుండా చేయగలవనీ ఊహించడం సాధ్యమా? ఈ ప్రశ్నను స్పష్టమైన రూపంలో వేసుకుంటే చాలు, 'అసాధ్యం' అనే సమాధానం తప్ప మరోటి ఉండడానికి వీల్లేదని తెలుస్తుంది. ఎందుకంటే, పెట్టుబడిదారీ వ్యవస్థలో పలుకుబడి గల ప్రాంతాలనూ, ప్రయోజనాలనూ వగైరాలను పంచుకోవడానికి భాగస్తుల ఆర్థిక, ఫైనాన్సల్, సైనిక బలానికి సంబంధించిన లెక్కలు తప్ప, మరో ప్రతిపాదిక ఊహించలేం. పంపకంలో పాల్గొనే భాగస్వాముల బలం సమాన స్థాయిలో మారదు అంటాడు లెనిన్. కనుక అల్పబుద్ధులైన ఇంగ్లిష్ మత గురువుల శుష్క భ్రమలలోనూ, జర్మన్ మార్క్సిస్టు కౌట్స్కీ భ్రమలలోనూ కాకా, పెట్టుబడిదారీ వ్యవస్థ వాస్తవ పరిస్థితులలో, 'అనోన్య సామ్రాజ్యవాద' లేక 'అధి సామ్రాజ్యవాద' కూటాలు, అవి ఏ రూపం ధరించినా, అనివార్యంగా యుద్ధం మధ్య కాలంలోని 'యుద్ధ వివరణ ఒప్పందం' తప్ప మరేమీ కావని తేల్చి చెప్పాడు లెనిన్.

వలసలలో జరిగే రాజకీయ ఘర్షణలు ఆర్థిక రంగంలో ఉద్భవిస్తాయని 1905లో 'రీసర్' అనే బ్యాంకర్ కార్యకర్త చెప్పాడు. ఇటలీలో పనిచేసే ఫ్రెంచ్ ఫైనాన్స్ పెట్టుబడి ఏవిధంగా ఆ రెండు దేశాల రాజకీయ కూటమికి దారితీసేదీ, అలాగే పర్షియా కోసం జర్మనీ, బ్రిటన్‌ల మధ్య వైరుధ్యం ఎలా వృద్ధి చెందేదీ, చైనా రుణాలకోసం యూరప్ పెట్టుబడిదారుల మధ్య ఏవిధంగా వైరుధ్యం వృద్ధి చెందుతోందీ చెపుతూ రీసర్ ఈ మాటలన్నాడు.

సామ్రాజ్యవాదంలోని అత్యంత ప్రగాఢ వైరుధ్యాలను మరుగు పరచడం సామ్రాజ్యవాదానికి అలంకారమవుతుంది. ఇలాంటి లక్షణం కౌట్స్కీలో ఉంది. సామ్రాజ్యవాదం వల్ల స్వాతంత్రం కోసంగాక, ఆధిపత్యం కోసం కృషి మొదలవుతుంది. సామ్రాజ్యవాదానికే, జాతీయ పీడన తీవ్రం కావడానికీ మధ్యగల సంబంధాన్ని హిల్ఫర్‌డింగ్ సరిగ్గా గుర్తించాడు. కొత్తగా ద్వారాలు తెరవబడిన దేశాలలోకి దిగుమతి అయ్యే పెట్టుబడి వైరుధ్యాలను తీవ్రం చేస్తుంది. జాతీయ చైతన్యానికి జాగృతులవుతున్న ప్రజల నిత్య ప్రవర్ధమాన ప్రతిఘటనను ఆక్రమణదార్లకు వ్యతిరేకంగా రెచ్చగొడుతుంది. పెట్టుబడిదారీ వ్యవస్థే క్రమంగా పీడిత జాతులకు విమోచన సాధనాలు, వనరులూ సమకూరుస్తుంది. పెట్టుబడి నిత్యం తన సైనిక బలాలను పెంచుకోవడం ద్వారా మాత్రమే తన ఆధిక్యాన్ని నిలుపుకోగలదు. ఐతే, పైనచెప్పిన హిల్ఫర్‌డింగ్ మాటలకు మరికొన్ని మాటల్ని కలుపుకోవాలని అనుకున్నాడు లెనిన్ – 'కొత్తగా ద్వారాలు తెరవబడిన దేశాల్లోనే కాదు, పాత దేశాల్లో కూడా ఇది జరుగుతుంది' అని.

ఇక ఈ గ్రంథంలో చిట్ట చివరి 10వ ప్రకరణంగా 'చరిత్రలో

సామ్రాజ్యవాదపు స్థానం' గురించి చెబుతూ లెనిన్, మొదట ఈ యుగానికి గల నాలుగు ప్రధాన వ్యతిరేకరణల్ని వివరించాడు. అవి:

1) చాలా ఉన్నత దశలో ఉత్పత్తి సాంద్రీకరణ నుండి గుత్తాధిపత్యం ఉద్భవించింది. ఈ గుత్త పెట్టుబడిదారీ సంఘాలైనా ట్రస్టులూ వగైరాల నిర్మాణంవైపు మొదటి అడుగులు వేసిన దేశాలు అమెరికా, జర్మనీలు. నిర్నిబంధ పోటీగల బ్రిటన్ ఆ తర్వాతే ఇలాంటి మౌలిక ఘటనను వ్యక్తం చేసింది.

2) గుత్త సంస్థలు బొగ్గు, ఇనుము లాంటి ముడిసరుకు నిధుల్ని వశపరుచుకోవడానికి దారితీసి, బడాపెట్టుబడి శక్తిని అపారంగా పెంచి, గుత్త సంస్థలకూ, గుత్తేతర సంస్థలకూ మధ్య వైరుధ్యాన్ని తీవ్రం చేస్తుంది.

3) గుత్యాధిపత్యం బ్యాంకుల నుంచి ఉద్భవించింది. చిన్నదలారీ సంస్థల నుండి ఫైనాన్స్ పెట్టుబడి గుత్తాధిపతులుగా బ్యాంకులు అభివృద్ధి చెంది, ప్రతి పెట్టుబడిదారీ దేశంలో కొద్ది పెద్ద బ్యాంకులు పారిశ్రామిక బ్యాంకు పెట్టుబడుల మధ్య వ్యక్తిగత లంకె సాధించి, మొత్తం దేశాల పెట్టుబడులలో అధిక భాగం ఉండే వందల కోట్ల డబ్బుమీది అజమాయిసీ తమ చేతుల్లో సాంద్రీకరించుకున్నాయి.

4) గుత్తాధిపత్యం వలస విధానం నుండి పెరిగింది. వలస విధానపు పాత ప్రేరకాలకు ఫైనాన్స్ పెట్టుబడి మరొకటి కలిపింది. ముడి సరుకుల నిధులు, పెట్టుబడి ఎగుమతి, పలుకుబడి ప్రాంతాలకు, కన్సెషన్లు, గుత్త లాభాలకోసం, మొత్తంమీద ఆర్థిక భూ భాగం కోసం పోరాటం, వలసలు తక్కువ స్థాయిలో, 1876లో లాగా ఉన్నప్పుడు వలస విధానం వేరే పద్ధతుల ద్వారా భూ భాగాలను స్వేచ్ఛగా లాక్కోవడం ద్వారా అభివృద్ధి అయింది. వలసలు ఎక్కువ స్థాయిలో ఉన్నప్పుడు, 1900 నాటికి, ప్రపంచమంతా పంపకమైనప్పుడు వలసల గుత్తా యాజమాన్యం యుగం తత్పర్యవసానంగా ప్రపంచ పున పంపకం కోసం మరీ తీవ్రమైన పోరాటయుగం ప్రవేశించింది.

గుత్త సంస్థలు, ప్రభుమండలి పెత్తనం కోసం పాటుపడడం, కొద్దిపాటి ధనిక, శక్తివంతమైన జాతులు చిన్న, బలహీన జాతుల్ని దోచుకోవడం అధికమవ్వడం–ఇవన్నీ సామ్రాజ్యవాదం ఎలాంటి విలక్షణ గుణాన్ని ఉత్పన్నం చేశాయంటే, సామ్రాజ్యవాదాన్ని పరరక్తోప జీవన పెట్టుబడి దారీ వ్యవస్థగా, లేదా క్షిణమాన పెట్టుబడిదారీ వ్యవస్థగా మార్చాయి. అంతకంతకూ ఎక్కువగా బూర్జువా వర్గం పెట్టుబడి ఎగుమతుల ఆధాయం మీద జీవించే కూపన్లు చించడం ద్వారా జీవించే వడ్డీజీవుల రాజ్యం సృష్టి ప్రముఖంగా బయటికొస్తోంది. అయితే ఈ క్షీణధోరణి పెట్టుబడిదారీ వ్యవస్థ వృద్ధిని తగ్గిస్తుందనుకోవడం పొరపాటు. సామ్రాజ్యవాద యుగంలో ఒక్కోసారి కొన్ని పరిశ్రమలూ, బూర్జువా వర్గంలోని కొన్ని పొరలూ, కొన్ని దేశాలూ ఎక్కువగానో, తక్కువగానో వేర్వేరు ధోరణుల్ని వ్యక్తం చేస్తాయి. మొత్తంమీద పెట్టుబడిదారీ వ్యవస్థ వేగంగా పెరుగుతోంది. అయితే ఈ పెరుగుదల అసమంగా ఉండి, అత్యంత ధనిక దేశాల్లో (బ్రిటన్) క్షీణతను వ్యక్తం చేస్తోంది.

బ్యాంకుల పురోగమన వేగం గురించి రాసిన బ్యాంకర్ డా. రీసర్ ఈ వేగం దారిలోని బాటసారులనే కాక, బండిలోని వారిని కూడా ప్రమాదకరమని చెప్పాడంటే పరిస్థితి అర్థం చేసుకోవచ్చు. అసాధరణ వేగంతో పెరిగిన ఫైనాన్స్ పెట్టుబడి మరింతగా, శాంతియుత పద్ధతుల ద్వారానేకాక, వలసల నుంచి గుంజుకోవడం ద్వారా కూడా అని అతడు చెప్పాడు. ఇటీవలి కాలంలో అమెరికా పురోగమనం జర్మనీని మించిపోతూ పరరక్తోప జీవన లక్షణాల్ని మరింత పెంచుకుంటోంది. ఈ పరరక్తోప జీవనం విషయంలో అమెరికా, జర్మనీలు, అలాగే రాచరికవాద జపాన్ వీటన్నిటిదీ ఒకేదారి అంటాడు లెనిన్.

ఈ గుత్త లాభాల వల్ల పెట్టుబడిదారులు, కార్మికుల్లో కొన్ని విభాగాలకు లంచం ఇచ్చి, వారిని ఇతర పరిశ్రమలకు, లేదా ఇతర దేశాలకు వ్యతిరేకంగా, ఆ దేశంలోని బూర్జువాలకు అనుకూలంగా తిప్పుకోవడం సాధ్యమవుతుంది. ప్రపంచ పంపకం వల్ల సామ్రాజ్యాల మధ్య వైరుధ్యం పెరిగిపోయి, ఈ ప్రేరణను ఎక్కువ చేస్తుంది. అందువల్ల సామ్రాజ్యవాదానికీ, అవకాశ వాదానికీ మధ్య సంబంధం సృష్టించబడింది. సామ్రాజ్యవాద అభివృద్ధి లక్షణాలు ముందుగా బయట పడిన బ్రిటన్‌లో ఈ బంధం మొట్టమొదట స్పష్టంగా వ్యక్తమయింది. ఇలాంటి వాస్తవాలను 'మార్తోవ్' (రష్యన్ మెన్షివిస్టు) లాంటి రచయితలు తక్కువచేసి చూపడానికి సిద్ధంగా ఉన్నారు. వారు కౌట్స్కీలాగా 'అధికారిక అవకాశవాదానికి' దిగజారి ఇలా వాదిస్తున్నారు. 'అవకాశవాదం పెరుగుదలకి దారితీసింది ప్రగతిశీల పెట్టుబడిదారీ వ్యవస్థ అయివుంటే, లేదా అవకాశవాదానికి మొగ్గు చూపించేది అత్యుత్తమ జీతాలు గల కార్మికులు అయివుంటే, పెట్టుబడిదారీ వ్యవస్థ శత్రువుల పని నిరర్థకమవుతుంది'. ఇలాంటి ఆశావాదం గురించి మనకు ఎలాంటి భ్రమలుండకూడదని లెనిన్ చెప్పాడు. ఇది అవకాశవాదం విషయంలో ఆశావాదం అంటాడాయన. అవకాశవాదం అభివృద్ధి అసాధరణ వేగంగా ఆరోగ్యవంతమైన శరీరంమీద బాధకరమై పుండు వేగంగా పెరిగినట్లు ఉంటుందంటాడు లెనిన్. అలా పెరగడంవల్ల అది వేగంగా పగిలి పోతుంది. లేదా శరీరం నుండి దాన్ని త్వరగా తీసేయ బడుతుంది అంటాడాయన.

సామ్రాజ్యవాదపు ఆర్థిక సారంమీద ఈ గ్రంథంలో చెప్పిన దాన్నిబట్టి దానిని మనం 'పరివర్తనలోకి పెట్టుబడిదారీ వ్యవస్థ'గా, లేదా మరణోన్ముఖ మైన పెట్టుబడిదారీ వ్యవస్థగా నిర్వచించాలని లెనిన్ అన్నాడు. అయితే బూర్జువా ఆర్థిక వేత్తలు ఈ నిర్వచనాన్ని అంగీకరించారు. ఒకవంక వారు బ్యాంకుల అసాధరణ వేగం గురించి భయపడీ, అవి 'అంతకంతకూ సొంత వ్యాపార నియంత్రణ మీరి పెరుగుతున్నాయి' అని చెబుతూనే, మరోవంక 'ఉత్పత్తి సాంఘీకరణ' గురించి మార్క్సిస్టుల జోస్యం నిజం కాలేదని విమర్శిస్తారంటూ లెనిన్ ఈ విషయంలో ఈ కింది విశ్లేషణ అందించాడు. ఒక పెద్ద వ్యాపార సంస్థ బ్రహ్మాండమైన పరిమాణం అందుకున్నప్పుడు, సామూహిక సమాచారాన్ని కచ్చితంగా లెక్కకట్టి, దాని ఆధారం మీద కోట్లాది మంది ప్రజలకు అవసరమైన దానిలో అత్యధిక శాతం ముడిసరుకుల సరఫరాను పథకం ప్రకారం ఏర్పాటు చేసి, వాటిని అనుకూలమైన ఉత్పత్తి స్థలాలకు వెలాదిమైళ్ల దూరం కూడా క్రమపద్ధతిగా పంపించి, రకరకాల చరమ వస్తువుల్ని కోటానుకోట్ల మంది వినియోగదారులకు ఒకే ఒక పథకం ద్వారా పంపిణీ చేసినప్పుడు, అప్పుడు అర్థమవుతుంది ఉత్పత్తి సాంఘీకీకరణ జరిగిందని అంటాడు లెనిన్. సొంత ఆర్థిక, ఆస్తి సంబంధాలు అనే పైపెంకు ఇప్పుడిక దానిలోపలి వస్తువుకు తగినట్లు లేదని, అనివార్యంగా క్షీణించక తప్పదని, దాని తొలగింపును కృత్రిమంగా ఆలస్యం చేస్తే, ఆ పెంకు దీర్ఘకాలం క్షీణస్థితిలో నిలిచి ఉండవచ్చును గానీ, అనివార్యంగా తొలగించ బడుతుందనీ అంటూ లెనిన్ ప్రపంచ భవిష్యత్తు చిత్రపటాన్ని మనముందుంచాడు.

చివరగా రైల్వేల్ని నిర్మించడంలో పెట్టుబడిదారులకు గల అసలు ఉద్దేశం గురించి ఈ గ్రంథానికి లెనిన్ రాసిన ముందు మాటలతో ఈ వ్యాసాన్ని ముగిద్దాం. 'రైల్వేల నిర్మాణం ప్రజాస్వామ్యాన్నీ, నాగరికతనూ, సంస్కృతినీ పెంపొందించే కృషిగా కనిపిస్తుంది. పెట్టుబడిదారులకు బానిస చాకిరీ చేయడాన్ని గొప్ప ఆకర్షణీయంగా చిత్రించడం కోసం జీతాలు తీసుకునే ప్రొఫెసర్లు, పెటీ బూర్జువా అల్పబుద్ధులూ దాన్ని అలాగే భావిస్తారు. కానీ వాస్తవంలో ప్రపంచంలో సగం జనాభా గల వలసలు అర్థవలసలు ప్రజల్నీ, అలాగే నాగరిక దేశాలలోని పెట్టుబడిదారుల బానిసల్ని పెట్టుబడిదారీలతో వెయ్యి ముడులతో బంధించి పీడించే పరికరమే రైల్వేల నిర్మాణం' అంటూ పెట్టుబడిదారుల అసలు బండారాన్ని బయటపెట్టాడు లెనిన్.

*(అయిపోయింది)*

*(రచయిత రిటైర్డ్ లెక్చరర్)*

వీ

(...4వ పేజీ తరువాయి)

చెప్పారు. దాన్ని నిర్లక్ష్యం చేయడం ద్వారా ఆ దేశానికి ఎంత నష్టం జరిగిందో వివరించారు. అలాగే మరికానా మారణకాండ విషయమై, పోలీసుల దుర్మార్గాన్ని ఖండించని తానున్న కమ్యూనిస్టు పార్టీని విమర్శించారు. ప్రపంచ వ్యాప్తంగా కమ్యూనిస్టు పార్టీలని పేరు పెట్టుకున్నవన్నీ సరైన దృక్పథంతో లేవనీ, వాటి పట్లకూడా జాగ్రత్తగా ఉండాలని సూచించారు. తెహల్కా కుదుపుపై సత్యసాగర్ వ్యాసంలో 'తెహల్కా సంపాదకుడు తమ మధ్య ఏదో అనుకోకుండా జరిగిన ప్రమాదమన్నట్టుగా (ఈ పద ప్రయోగం బాగుంది) మిగిలిన భారత ప్రచార మాధ్యమాలన్నీ పదాడంబరపు సంపాదకీయాలు రాస్తున్నాయి. వాటికి ఆ నైతిక హక్కు ఉందా?' అంటూ చురక అంటించారు. 'స్త్రీ జాతినే మాంసంగా చూపడంలో టైమ్స్ ఆఫ్ ఇండియా అగ్రభాగంలో ఉంది', '..సైన్యం, క్రికెట్, రాజకీయ నాయకుల గురించి రాసే దమ్ములు ఏ ఒక్కరికీ లేవు' 'ప్రధాన స్రవంతి మాధ్యమాలకు సిగ్గు, నిజాయితీ ఉన్నట్లయితే తమ స్వంత సంస్థల్లోని ఎందరో తేజ్‌పాల్‌లను బయటికి పంపాలి' ఇలా చాలా ఘాటుగా విమర్శించారు. ఇవన్నీ జరిగే పనులు కావు కాబట్టి, మనం చేయవలసినపని వార్తా పత్రికలకు, టి.వి. వార్తలకు అంటి పెట్టుకోవడం మాని, వాస్తవ ప్రపంచంలో మానవ సంబంధాలు ఎలా ఉన్నాయో చూడాలని సలహా ఇచ్చారు. ఇంకా టెలివిజన్ చర్చల్లో పాల్గొంటున్న వామపక్ష, ఇతర మేధావులు దాన్ని మానాలని కోరారు. అది కొంత మంది ప్రజల్లో ఒక భ్రమ కల్పిస్తోందన్నారు. సంపాదకీయంలో దోపిడీ పాలక వర్గాలు ప్రజలను మరింత కాలం భ్రమల్లో ఉంచడంలో భాగంగానే ఆమ్ ఆద్మీ పార్టీ లాంటి ప్రయోగాలు చేస్తున్నాయని బాగా వివరించారు. దేశ సమస్యలను పరిష్కరించే శక్తిగానీ, కోరికగానీ రాజకీయ పక్షాలలో దేనికీ లేదనీ స్పష్టం చేశారు.

**రాజశేఖర్,** ప్రొద్దుటూరు.

**'మేం** మళ్ళీ వస్తాం' పుస్తకం చదివాను. దాని మీద రంగనాయకమ్మ సమీక్షా వ్యాసం చదివాను. తరువాత, తోలేటి జగన్మోహనరావు వివరణ కూడా చదివాక ఈ లేఖ రాస్తున్నాను. రంగనాయకమ్మ ప్రధానంగా అడిగిన ప్రశ్నలు:

1) వ్యక్తి పూజ గురించి: మావో, వ్యక్తి పూజకు లోబడి పోయాడని విమర్శించిన రచయిత, స్టాలిన్ వ్యక్తి పూజ విషయంలో సమర్థన ఏమిటి? వ్యక్తి పూజ అనేది మంచిది కాదు – అనే అభిప్రాయమే ఉంటే, అది స్టాలిన్‌కు మాత్రం వర్తించదా? ఒకరికి తప్పయింది, ఇంకొకరికి ఒప్పు ఎలా అవుతుంది? 'రంగనాయకమ్మ విమర్శకు సమాధానం ఇవ్వను' అనడమే సమాధానమా?

2) 'ఉత్పత్తి శక్తుల పెరుగుదలకు ఆకాశమే హద్దు' అంటున్నారు తోలేటి. ఉత్పత్తి శక్తులను అనూహ్యంగా పెంచుకుంటూపోతే అది సమస్యగా మారదా? ఉత్పత్తి కార్యంలో శ్రమ చేసే వ్యక్తుల ఆరోగ్యమూ, ఆ ఉత్పత్తుల్ని వాడుకునేటప్పుడు ప్రమాదాలు రాకుండా ఉండడమూ – అనే పరిమితులకు లోబడే ఉత్పత్తి శక్తుల పెరుగుదల ఉండాలి. ఉదాహరణకి, ఎపార్ట్‌మెంట్లు ఎత్తు గానీ, రైళ్ళ వేగం గానీ, రసాయనాల మీద ఆధారపడే మందుల విషయంలో గానీ – ఏది చూసినా, మనుషుల భద్రతకు లోబడి ఉండాలి.

3) మరో ప్రధానమైన ప్రశ్న, 'నెగేషన్ ఆఫ్ నెగేషన్' సూత్రం గురించి. ప్రతీదీ మార్పుకు లోనవుతుంది – అనేది. రష్యా చైనాల్లో సోషలిజం పోవడానికి కారణం ఎవరూ వివరించలేదనీ, తనే చెబుతాననీ అన్నారు. ఆయన చెప్పిన దేమిటంటే, సోషలిజం పోయి పెట్టుబడిదారీ విధానం వస్తుందని. అది పోయి మళ్ళీ సోషలిజం వస్తుందని చెప్పినా, అది పోయి మళ్ళీ పెట్టుబడిదారీ విధానం వస్తుందని చెప్పారు. అవి రెండూ ఇటూ అటూ మారుతూ ఉంటాయని చెప్పారు. కష్టపడి పోరాటాలు చేసి, త్యాగాలు చేసి సోషలిజం తెచ్చుకున్నాక, అది పోయి పెట్టుబడిదారీ విధానమే వస్తూ ఉంటే ఈ త్యాగాలకి అర్థం ఏమిటి? పోయేదానికోసం పోరాటాలెందుకు? రంగనాయకమ్మ అడిగిన ముఖ్యమైన ప్రశ్న ఇదే నెగేషన్ సూత్రం గురించి. తోలేటి వివరణలో ఆ ప్రశ్నకు సమాధానం లేనేలేదు. అసలు ఈ విషయాన్ని తోలేటి ఎత్తకుండా వదిలేశారు. వీ

**వి.వెంకటరావు,** విజయనగరం

## వీక్షణం రచయితల సమావేశం 2014

**ప్రాం**తీయ, దేశీయ, అంతర్దేశీయ పరిణామాలపై అవగాహనలను, తెలుగు సమాజం తనతో తాను జరుపుతున్న సంభాషణను అక్షరబద్ధం చేస్తున్న రాజకీయార్థిక, సామాజిక మాసపత్రిక వీక్షణం ప్రతి సంవత్సరం తన రచయితల మధ్య సంభాషణకు కూడ వేదిక కల్పిస్తున్నది. వీక్షణం ఎనిమిది సంవత్సరాల కింద ఈ వార్షిక రచయితల సమావేశం ప్రారంభించింది. వీక్షణం రచయితలు, పాఠకులు, అభిమానులు, సిబ్బంది కలిసి కూచుని వీక్షణంలో అచ్చవుతున్న రచనల గురించీ, అచ్చు కావలసిన అంశాల గురించీ చర్చించుకోవడానికి, పత్రిక వెలువడుతున్న తీరు గురించి అభిప్రాయాలు, సలహాలు, సూచనలు పంచుకోవడానికి, గతాన్ని సమీక్షించుకుని భవిష్యత్తుకు మార్గాలు వేసుకోవడానికి ఈ సమావేశాలు జరుగుతున్నాయి. ఈ వరుసలో ఏడవ సమావేశంగా ఈ సంవత్సరానికి గాను వీక్షణం రచయితల సమావేశం మార్చ్ 9, 2014 ఆదివారం జరుగుతుంది.

ఇప్పటికే వీక్షణంలో రచనలు చేసి ఉన్నవారు, వీక్షణంలో రచనలు చేయదలచుకున్నవారు, వీక్షణం పాఠకులు, వీక్షణం అభిమానులు, మొత్తంగా తెలుగు సమాజ జీవితం గురించి, ప్రజల గురించి ఆలోచించే ప్రతి ఒక్కరూ ఈ సమావేశానికి ఆహ్వానితులే.

**తేదీ: మార్చ్ 9 ఆదివారం ఉదయం 10 నుంచి భోజన విరామం దాకా**

**స్థలం: మార్చ్ సంచికలో ప్రకటిస్తాం**

రండి మన ఆలోచనలు కలబోసుకుందాం.
ప్రజాపక్ష ఆలోచనా వేదికగా వీక్షణం మరింత మెరుగ్గా
వెలువడేందుకు మన వంతు సహాయం చేద్దాం.

## పాఠకులకు విజ్ఞప్తి!
## వీక్షణం విడిప్రతి వెల, సంవత్సర చందాల రేట్లు పెంచక తప్పడం లేదు

**వీ**క్షణం రాజకీయార్థిక, సామాజిక మాసపత్రిక విడిప్రతి వెల, చందారేట్లు జనవరి 2011 సంచిక నుంచి మూడు సంవత్సరాల పాటు ఏ మార్పూ లేకుండా ఉన్నాయి. ప్రతి నెలా న్యూస్ ప్రింట్ ఖరీదు, ముద్రణా వ్యయం, నిర్వహణా వ్యయం ఎంతగా పెరిగిపోతున్నా, ప్రతి సంచిక విడిప్రతి ఉత్పత్తి వ్యయంలో సగమే వెనక్కి వస్తున్నా, ప్రతినెలా పెద్ద ఎత్తున లోటుతో, ఆర్థిక ఇబ్బందులతో నడుస్తున్నా, ఆ భారాన్ని పాఠకుల మీద వేయకుండా ఉండడానికి ప్రయత్నిస్తూ వచ్చాం. ఇక తప్పనిసరి పరిస్థితులలో ఏప్రిల్ 2014 సంచిక నుంచి వీక్షణం విడిప్రతి వెల, చందా రేట్లు పెంచక తప్పడం లేదు. మారిన రేట్ల ప్రకారం విడిప్రతి వెల రు. 20, సంవత్సర చందా రు. 200, మూడు సంవత్సరాలకు రు. 540, ఐదు సంవత్సరాలకు రు. 900, పది సంవత్సరాలకు రు. 1700 ఉంటుంది. వీక్షణంను ఆదరిస్తున్న పాఠకులు ఈ పరిస్థితిని అర్థం చేసుకుని ఎప్పటిలాగే సహకరిస్తారని ఆశిస్తున్నాం. కొత్త విడిప్రతి వెల, చందా రేట్లు 1 ఏప్రిల్ 2014 నుంచి అమలు లోకి వస్తాయి. అప్పటివరకూ చందాలు చెల్లించేవారికి పాత రేట్లే వర్తిస్తాయి.

**వీక్షణం మీ పత్రిక**

**వీక్షణం ప్రజల పత్రిక**

**వీక్షణంను నాలుగు కాలాల పాటు నిలబెట్టుకునే బాధ్యత ప్రజలదే**

## ఢిల్లీ ముఖ్యమంత్రిగా కేజ్రీవాల్

ఆమ్ ఆద్మీ పార్టీ కాంగ్రెస్ పార్టీ మద్దతుతో ఢిల్లీలో ప్రభుత్వాన్ని ఏర్పాటు చేసింది. ఆమ్ ఆద్మీ పార్టీ కన్వీనర్ అరవింద్ కేజ్రీవాల్ ఢిల్లీలోని రాంలీలా మైదానంలో డిసెంబర్ 28న ముఖ్యమంత్రిగా ప్రమాణ స్వీకారం చేశారు. ఢిల్లీ లెఫ్టినెంట్ గవర్నర్ నజీబ్ జంగ్ కేజ్రీవాల్‌తోపాటు మనీశ్ సిసోడియా, గిరీశ్ సోనీ, రాఖీ బిర్లా, సత్యేంద్ర జైన్, సౌరబ్ భరద్వాజ్, సోమ్‌నాథ్ భార్తీలను మంత్రులుగా ప్రమాణ స్వీకారం చేయించారు. అరవింద్ కేజ్రీవాల్ ఢిల్లీకి ఏడవ ముంఖ్యమంత్రి.

## నానావతి కమిషన్ గడువు పొడిగింపు

2002లో జరిగిన గోద్రా అల్లర్లపై దర్యాప్తు జరుపుతున్న నానావతి కమిషన్ గడువును గుజరాత్ ప్రభుత్వం మరో ఆరు నెలలు పొడగిస్తున్నట్లు డిసెంబర్ 31న ప్రకటించింది. ఘటన జరిగిన పన్నెండేళ్ల కాలంలో ఇది 21వ సారి పొడగింపు. ఈ కమిషన్‌లో మాజీ జస్టిస్ నానావతి, అక్షయ్ మెహతా ఉన్నారు. 2002 ఫిబ్రవరి 27న సబర్మతి ఎక్స్‌ప్రెస్‌లోని ఎస్6 కోచ్‌ను ముందుగానే కుట్రపన్ని నిప్పు పెట్టారని 2008లో జస్టిస్ కెజి షా నేతృత్వంలోని విచారణ కమిషన్ తేల్చింది.

## గనుల దోపిడీకి సర్కారు సహకారం

ఒడిశాలో జరిగిన గనుల తవ్వకాల విషయంలో ప్రభుత్వం ప్రేక్షక పాత్ర పోషించిందని జస్టిస్ ఎం.బి.షా కమిషన్ జనవరి 3న వెల్లడించింది. 2008 నుంచి 2011 వరకూ రాష్ట్రంలో ఇనుము, మాంగనీస్ ముడి ఖనిజం కోసం లీజుదార్లు అన్ని రకాల చట్టాలను, నియమ నిబంధనలను ఉల్లంఘించి తవ్వకాలు జరిపారని కమిషన్ పేర్కొంది. ఈ అక్రమాలపై నమోదైన కేసుల దర్యాప్తుల్లో పోలీసులు ఎటువంటి ప్రగతి సాధించలేదని స్పష్టం చేసింది. ఎఫ్ఐఆర్‌లు దాఖలైన కంపెనీలపై ఉన్న అన్ని కేసులపై సిబిఐ దర్యాప్తు చేపట్టాలని కమిషన్ సిఫార్సు చేసింది. ఈ కంపెనీల నుంచి రు. 59,203 కోట్ల మొత్తాన్ని రాబట్టాలని రాష్ట్ర ప్రభుత్వానికి షా కమిషన్ తెలిపింది.

## ఎచ్ఆర్‌సికి జస్టిస్ గంగూలీ రాజీనామా

లైంగిక వేధింపులు ఎదుర్కొంటున్న సుప్రీంకోర్టు మాజీ జడ్జ్ ఎకె గంగూలీ పశ్చిమ బెంగాల్ మానవ హక్కుల కమిషన్ చైర్మన్ పదవికి రాజీనామా చేశారు. తన రాజీనామాను జనవరి 6న బెంగాల్ గవర్నర్ ఎం.కె. నారాయణన్‌ను కలిసి అందజేశారు. న్యాయ విద్యార్థినిని 2012 డిసెంబర్‌లో లైంగికంగా వేధించారనే ఆరోపణపై జస్టిస్ గంగూలిపై కేసు నమోదు చేయాలని న్యాయవాది ఉదయ్ గుప్తా సుప్రీంకోర్టులో పిల్ వేశారు.

## డెహ్రాడూన్ ఎక్స్‌ప్రెస్‌లో మంటలు

మహారాష్ట్రలోని థానే జిల్లా థాను-ఘోల్‌వడ్ రైల్వే స్టేషన్ల మధ్య జనవరి 8న బాంద్రా-డెహ్రాడూన్ ఎక్స్‌ప్రెస్ రైల్లో తెల్లవారు జామున స్లీపర్ కోచ్‌లో మంటలు వచ్చాయి. ఆ మంటలు బోగీ నెంబర్ ఎస్-2, ఎస్-3, ఎస్-4లకు వ్యాపించాయి. ఈ ప్రమాదంలో 9 మంది మరణించగా మరో పదిమందికి పైగా తీవ్రంగా గాయపడ్డారని పశ్చిమ రైల్వే పౌర సంబంధాల అధికారి శరత్‌చంద్ర తెలిపారు.

## ఆమ్ ఆద్మీ పార్టీ కార్యాలయంపై దాడి

ఢిల్లీలోని ఘజియాబాద్‌లో ఉన్న ఆమ్ ఆద్మీ పార్టీ(ఆప్) ప్రధాన కార్యాలయంపై హిందూ రక్షా దళ్ కార్యకర్తలు జనవరి 8న దాడి చేశారు. కశ్మీర్‌లో సైన్యం కొనసాగింపుపై రెఫరెండమ్ నిర్వహించాలని ఆ పార్టీ నేత ప్రశాంత్ భూషణ్ చేసిన వ్యాఖ్యలకు నిరసనగా హిందూ రక్షా దళ్ కార్యకర్తలు ఇటుకలు, రాళ్లతో ఆప్ కార్యాలయంపై దాడి చేశారు. కశ్మీర్‌పై ఆ పార్టీ వైఖరికి నిరసనగా మేము ఆందోళన చేశామని హిందూ రక్షా దళ్ జాతీయ కన్వీనర్ పింకీ చౌదరి వ్యాఖ్యానించారు.

## మహారాష్ట్రలో టోల్ గేట్‌లపై దాడులు

మహారాష్ట్రలోని కోల్హాపూర్‌లోని పలు టోల్‌గేట్‌లపై శివసేన కార్యకర్తలు దాడులు చేశారు. జనవరి 12న నాలుగు టోల్‌గేట్‌లపై దాడి చేసి ధ్వంసం చేశారు. గత కొంతకాలంగా శివసేన టోల్‌గేట్‌లలో సరైన సదుపాయాలు కల్పించడం లేదనీ, ప్రజలకు సేవలు అందించడంలో విఫలమయ్యారనీ నిరసిస్తూ ఈ దాడులకు పాల్పడ్డామన్నారు.

## అత్యాచార తీర్పునిచ్చిన ఖాప్ పంచాయతీ

పశ్చిమ బెంగాల్‌లోని లాభ్‌పూర్‌లో జనవరి 21న గిరిజన యువతి వేరే కులానికి చెందిన అబ్బాయిని ప్రేమించినందుకు పెద్దలు పంచాయతీ పెట్టారు. ఆమె నేరం చేసిందనీ ఖాప్ పంచాయతీ తీర్పు చెపుతూ శిక్షగా రు. 50 వేలు చెల్లించాలని లేని పక్షంలో ఆమెపై ఆ గ్రామస్తులు అత్యాచారం చేయాలని గ్రామ పెద్ద తీర్పునిచ్చారు. కట్టలేనని చెప్పడంతో గిరిజన యువతి (20) పై తీర్పు ఇచ్చిన వ్యక్తితో సహా 13 మంది సామూహిక అత్యాచారానికి పాల్పడ్డారు.

## వేదాంతను అడ్డుకున్న గిరిజనులు

ఒడిశాలోని నియంగిరి కొండల్లో బాక్సైట్ తవ్వకాలకు వ్యతిరేకంగా వేదాంత కంపెనీపై అక్కడి ఆదివాసులు దశాబ్దకాలంపాటు పోరాడి విజయం సాధించారు. 2003లో వేదాంత కంపెనీ ప్రభుత్వం నుంచి బాక్సైట్ తవ్వకాలకు అనుమతి పొందింది. దీన్ని వ్యతిరేకిస్తూ పోరాటాలు చేస్తున్న ప్రజలకు మద్ధతుగా తవ్వకాలను ఆపాలని అనేక అంతర్జాతీయ స్వచ్ఛంద సంస్థలు, దేశంలోని హక్కుల సంఘాలు సుప్రీంకోర్టులో పిటిషన్ వేశాయి. 2013 ఏప్రిల్‌లో సుప్రీం కోర్టు ఈ ప్రాంతం చుట్టూ ఉన్న గ్రామాల్లో ఎన్విరాన్‌మెంటల్ రెఫరెండమ్ నిర్వహించాలని కేంద్రాన్ని ఆదేశించింది. ఈ రెఫరెండంలో స్థానికులంతా మాకు ఈ గనులు వద్దని తేల్చిచెప్పడంతో ఈ ప్రాంతంలో శాశ్వతంగా గనుల తవ్వకానికి అనుమతి నిరాకరిస్తున్నట్లు కేంద్ర ప్రభుత్వం ప్రకటించింది.

## నిర్దోషులుగా విడుదలవుతున్న నిందితులు

క్రిమినల్ కేసుల దర్యాప్తులో నిందితులు నిర్దోషులుగా విడుదలైతే దానిని దర్యాప్తు వైఫల్యంగానే పరిగణించాలని సుప్రీంకోర్టు వెల్లడించింది. ఇలాంటి కేసులో దర్యాప్తు అధికారులను బాధ్యులుగా చేసి శిక్షించాలని రాష్ట్ర ప్రభుత్వాలకు సూచించింది. దర్యాప్తు లోపాల కారణంగా నిందితులు నిర్దోషులుగా విడుదలవుతున్న కేసులు పెరుగుతుండడం ఆందోళన కరమంది. నిందితులకు శిక్షపడేలా, అమాయకులను అన్యాయంగా కేసుల్లో ఇరికించకుండా దర్యాప్తు అధికారులకు శిక్షణ నిచ్చేందుకు ఆరు నెలల్లోగా యంత్రాంగాన్ని ఏర్పాటు చేయాలని అన్ని రాష్ట్రాలను సుప్రీం కోర్టు ఆదేశించింది. వీ

## రష్యాలో బాంబు దాడులు

డిసెంబర్ ఆఖరులో రష్యాలోని ఓల్గోగ్రాడ్ నగరం వరుసగా రెండు రోజులు బాంబు దాడులతో దద్దరిల్లింది. సిటీ సెంట్రల్ స్టేషన్‌లో జరిగిన ఆత్మాహుతి దాడిలో పదిహేడు మంది చనిపోయారు. రెండో రోజు ఒక ట్రాలీబస్‌లో జరిగిన ఆత్మాహుతి దాడిలో పద్నాలుగు మంది చనిపోయారు. రష్యాలోని కల్లోలిత ప్రాంతం ఉత్తర కాకాసస్‌లోని సోచి నగరంలో 2014 శీతాకాలపు ఒలింపిక్ గేమ్స్‌ను లక్ష్యంగా చేసుకుని దాడులు జరుగుతున్నాయని పరిశీలకులు భావిస్తున్నారు. దీంతో రష్యాలోని అన్ని రైల్వేస్టేషన్లు, విమానాశ్రయాలలో భద్రతను పెంచారు.

## బంగ్లాదేశ్‌లో పార్లమెంట్ ఎన్నికలు

బంగ్లాదేశ్ పార్లమెంట్‌కు జరిగిన ఎన్నికల్లో ప్రధానమంత్రి షేక్ హసీనా నేతృత్వంలోని అవామీ లీగ్ పార్టీ ఘన విజయం సాధించింది. జనవరి 5న పార్లమెంట్‌లోని మొత్తం 300 స్థానాలకు ఎన్నికలు జరిగాయి. అవామీ లీగ్ పార్టీ 232 స్థానాల్లో విజయం సాధించింది. అవామీ లీగ్ మిత్రపక్షమైన జతియా పార్టీ 33 స్థానాలు గెలుచుకుంది. అధికార కూటమిలోని వర్కర్స్ పార్టీ, జతియా, సమాజ తాంత్రిక్ దళ్, జతియా పార్టీ (మంజు) పార్టీలు 12 స్థానాలు గెలుచుకున్నాయి. స్వతంత్రులు 13 చోట్ల తమ సత్తా చాటారు. ప్రభుత్వం ఏకపక్షంగా ఎన్నికలు జరుపుతోందంటూ వాటిని బహిష్కరించిన ప్రతిపక్షాలు దేశవ్యాప్తంగా తీవ్ర ప్రతిఘటనలు చేశాయి. ఎన్నికల సందర్భంగా జరిగిన హింసాత్మక సంఘటల్లో 21 మంది మరణించారు.

## పాకిస్థాన్‌లో తాలిబన్ల దాడులు

పాకిస్థాన్‌లో సైనిక వాహనంపై జరిగిన దాడిలో ఇరవై మంది సైనికులు మరణించారు. బన్ను నుంచి వజీరిస్థాన్‌కు వెళుతున్న సైనికుల వాహనంపై పాకిస్థానీ తాలిబన్లు శక్తిమంతమైన పేలుడు పదార్థాలతో వాహనాన్ని పేల్చారు. దీంతో ప్రాణ నష్టం తీవ్రంగా జరిగింది. పాకిస్థాన్ ప్రధాని నవాజ్ షరీఫ్ స్విట్జర్లాండ్ పర్యటనను రద్దు చేసుకోవాలని డిమాండ్ చేస్తూ తాలిబన్లు ఈ దాడికి పాల్పడ్డారు. మరో సంఘటనలో రావల్పిండిలో సైనిక ప్రధాన కార్యాలయంపై కూడా తాలిబన్లు దాడి చేశారు. మానవ బాంబు పేలుడులో ఆరుగురు సైనికులతో సహా పదమూడు మంది చనిపోయారు.

## చిలీ ప్రభుత్వంలో కమ్యూనిస్టు పార్టీ

చిలీ అధ్యక్ష ఎన్నికల్లో విజయం సాధించిన న్యూ మెజారిటీ సంకీర్ణ కూటమిలోకి కమ్యూనిస్టు పార్టీ అంగీకారాన్ని తెలిపింది. సంకీర్ణ కూటమి తన కార్యక్రమంలో మార్పులు చేసేందుకు అంగీకరించడం పట్ల కమ్యూనిస్టు పార్టీ స్వాగతించింది. మార్చ్ 11న న్యూ మెజారిటీ సంకీర్ణ కూటమి నాయకురాలు మిచెల్లీ బాచలెట్ అధికారాన్ని స్వీకరిస్తారు. పార్లమెంట్ ఉభయ సభల్లో 120 స్థానాలున్న డిప్యూటీ సభలో న్యూ మెజారిటీ కూటమి 67, 38 స్థానాలున్న సెనెట్‌లో 21 స్థానాలు సాధించి సంపూర్ణ మెజారిటీ సాధించింది. కమ్యూనిస్టు పార్టీ డిప్యూటీలో ఆరు సీట్లు గెలుచుకుంది. ఎన్నికల సమీక్ష, నూతన పరిస్థితుల్లో పార్టీ తీసుకోవాల్సిన వైఖరిని ఖరారు చేసేందుకు ప్లీనరీ సమావేశం జరిగింది. రానున్న రోజుల్లో అన్ని రంగాల్లో పార్టీ విస్తరించేందుకు, పార్లమెంట్, ప్రభుత్వంలో నిర్వహించాల్సిన పాత్ర, రాజకీయ – సైద్ధాంతిక పోరాటానికి అవసరమైన చర్యలను ఖరారు చేసేందుకు మూడు నెలల పాటు పార్టీ అంతర్గతంగా చర్చలు జరిపి మార్చ్‌లో జరిగే సమావేశంలో ఖరారు చేయాలని ప్లీనరి నిర్ణయించింది.

## కొలంబియాలో శాంతి చర్చలు

గత నాలుగు దశాబ్దాలుగా విముక్తి కోసం సాయుధ పోరాటం చేస్తున్న కొలంబియా విప్లవ సాయుధ శక్తులు – ప్రజా సైన్యం (ఎఫ్ఎఆర్‌సి-ఇపి) నెలరోజుల పాటు ఏకపక్ష కాల్పుల విరమణను ప్రకటించింది. ఈ సంస్థ మార్క్సిజం – లెనినిజం సిద్ధాంతాలతో 1964 నుంచి సాయుధ పోరాటం జరుపుతోంది. తొలుత కొలంబియన్ కమ్యూనిస్టు పార్టీ సాయుధ విభాగంగా ప్రారంభమైనప్పటికీ సోవియట్ యూనియన్ పతనం తరువాత పార్టీతో సంబంధం లేకుండా స్వతంత్ర వైఖరిని అవలంబిస్తోంది. క్రిస్మస్, నూతన సంవత్సరాదిని ప్రశాంతంగా జరుపుకొనేందుకు వీలుగా ఈ నిర్ణయం తీసుకున్నట్లు ప్రకటించింది. ఏడాది కాలంగా రాజధాని హవానా కేంద్రంగా కొలంబియా ప్రభుత్వం – గెరిల్లాల మధ్య చర్చలు జరుగుతున్నాయి.

## అమెరికా దౌత్యవేత్త వెలి

అమెరికాలోని భారత దౌత్యవేత్తల దేవయానిపై వీసా నిబంధనల ఉల్లంఘన కేసు రెండు దేశాల మధ్య దౌత్యపరమైన ఘర్షణ వాతావరణం నెలకొంది. వీసా నిబంధనల ఉల్లంఘన కేసులో దేవయానిపై అమెరికా గ్రాండ్ జ్యూరీ అభియోగాలు నమోదు చేసింది. అయితే దేవయానికి దౌత్యపరమైన రక్షణ లభించడంతో దేశం విడిచి వెళ్లాలని ఆమెను అమెరికా ఆదేశించింది. దీంతో దేవయాని జనవరి 10న భారత్ చేరుకుంది. అమెరికా చర్యపై భారత్ తీవ్రంగా స్పందించింది. భారత్‌లోని సీనియర్ దౌత్యాధికారి ఒకరిని బహిష్కరించింది. అలాగే 48 గంటల్లోగా దేశం విడిచి వెళ్లిపోవాలని ఆదేశించింది. అమెరికాలోని దేవయాని పనిమనిషి సంగీతా రిచర్డ్స్ భారత్ నుంచి అమెరికా వెళ్లడానికి సహకరించినందుకే ఆయనపై ఈ చర్య తీసుకున్నట్లు పేర్కొంది.

## అమెరికా రహస్య యుద్ధం

అమెరికా ఎలైట్ దళాలు 134 దేశాల్లో రహస్య యుద్ధాలు చేస్తున్నాయనీ, అవి ఆసియా నుండి ఆఫ్రికా వరకూ విస్తరించి ఉన్నాయనీ అమెరికా వాషింగ్టన్ పోస్ట్‌కు చెందిన జర్నలిస్టులు కారెన్ డి యంగ్, గ్రెగ్ జాఫే తెలిపారు. 2001 సెప్టెంబర్ 11 దాడి తరువాత అమెరికా ప్రత్యేక ఆపరేషన్ దళాలు ఇబ్బడిముబ్బడిగా పెరిగాయనీ, అవి అర్ధరాత్రులు దాడులు చేయడం, మనుషులను ఎత్తుకెళ్లి చంపడం లాంటి చర్యలకు పాల్పడుతుంటాయనీ అన్నారు. 2010లో 75 ఉన్న దేశాల సంఖ్య 2011లో 120కి చేరిందనీ, ఇది ఈ రోజు 120 కంటే చాలా మించిపోయిందనీ పేర్కొన్నారు.

## 85 మంది దగ్గరే సగం సంపద

ప్రపంచపు అత్యంత ధనికులైన 85 మంది వద్ద ఉన్న సంపద అట్టడుగునున్న సగభాగం జనాభా సంపదతో సమానమని ప్రపంచ అభివృద్ధి కోసం కృషి చేస్తున్న సంస్థ ఆక్స్‌ఫామ్ 'వర్కింగ్ ఫర్ ది ఫ్యూ' పేరిట విడుదల చేసిన నివేదికలో తేలింది. కేవలం ఎనభై ఐదు మంది వద్దే ట్రిలియన్ డాలర్ల సొమ్ము పోగుపడిందనీ, ప్రపంచ వ్యాప్తంగా భారీగా పెరుగుతున్న అసమానతలను సూచిస్తోందనీ పేర్కొంది. ఇది చాలా ఆందోళనకరమైన విషయమనీ చెప్పింది.

వీ

# అసహజ మరణాల సూచి

సంకలనం : వై.రామచంద్రం, ఎ.మల్లేశ్

మరణం ఎప్పుడయినా విషాద సూచకమే. మృతుల బంధువులకూ, మిత్రులకూ విచారకరమే కాని అందులోనూ మరణించిన మనిషి నిండు జీవితం గడిపి వయోభారంతోనే మరణిస్తే దాన్ని సహజ మరణంగా అంగీకరించి ఊరట పడవచ్చు. సగటు ఆయు ప్రమాణంలో సగం కూడా అనుభవించక ముందే మరణిస్తున్నారు. ఈ అసహజ మరణాలకు లెక్కలేనన్ని ఆర్థిక, సామాజిక, రాజకీయ కారణాలున్నాయి. మన పక్కనే మనతోనే ఉండే మనుషులు అర్ధాంతరంగా అసహజంగా అకాలంగా అదృశ్యమైపోతున్నారు. ఇటువంటి అసహజ మరణాలు ఇటీవలి కాలంలో విపరీతంగా పెరిగిపోతున్నాయి. ఇవి సామాజిక సంక్షోభానికి, సమాజం దిగజారుదుకు ఒక చిహ్నం. మన రాష్ట్రంలో సాలీనా ఈ రకంగా చనిపోతున్న వారి సంఖ్య వేలల్లోనే ఉంటుందని అంచనా. నిజానికి అసహజ మరణాలన్నీ అసహజ మరణాలుగా నమోదు కావడం లేదు గనుక ఈ సంఖ్య వాస్తవంలో ఒక భాగం మాత్రమే కావచ్చు. పత్రికలలో అచ్చయిన ఇటువంటి ఘటనలన్నిటినీ ఒక్కచోట నమోదు చేయాలని భావిస్తున్నాం. ఈ శీర్షిక ప్రతి నెల ఉంటుంది. అయితే రాష్ట్రంలో ప్రతి గ్రామంలో జరుగుతున్న సంఘటనలన్నీ ఇక్కడ రిపోర్ట్ కాకపోవచ్చు. కొన్నయినా మనల్ని ఆలోచింపజేస్తే, మనం మనచుట్టూ ఉన్న మనుషులకోసం ఇంకాస్త బాధ్యతగాను, జాగ్రత్తగాను వ్యవహరిస్తూ మొత్తంగా పరిష్కారాలవైపు వెళ్లడానికి ఏమయినా తోడ్పడితే ఈ శీర్షిక విజయవంతమైనట్లే.

**(1 డిసెంబర్ నుండి 31 డిసెంబర్ 2013 వరకు 11 జిల్లాలలో అసహజ మరణాల పాలైన వారి సంఖ్య – 960)**

| జిల్లా | ఆకలి | ఆత్మహత్యలు | | | | చికిత్స అందక, అనారోగ్యం | | | గుర్తు తెలియని | | హత్యలు | | ప్రమాదాలు | | | | పోలీసు కాల్పుల్లో | | పోలీసులు, సైన్యం | మిస్సింగ్/ లాకప్ మరణాలు | ప్రకృతి వైపరీత్యాలు |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | | వ్యవసాయ రంగం | చేనేత రంగం | ఇతరాలు | | | | | | | | | పనిచేసే స్థలంలో | కరెంట్ | రహదారి | ఇతరాలు | ఉద్యమ కారులు | ఇతరులు | | | |
| | | | | స్త్రీ | పు. | స్త్రీ | పు. | పి. | స్త్రీ | పు. | స్త్రీ | పు. | | | | | | | | | |
| (1) | (2) | (3) | (4) | (5) | (6) | (7) | (8) | (9) | (10) | (11) | (12) | (13) | (14) | (15) | (16) | (17) | (18) | (19) | (20) | (21) | (22) |
| ఆదిలాబాద్ | – | 3 | – | 20 | 16 | 5 | 5 | 4 | 3 | 1 | 2 | 1 | 2 | 24 | 31 | – | – | – | – | – | – |
| మహబూబ్‌నగర్ | – | 6 | 4 | 17 | 14 | 5 | – | – | – | 5 | 8 | 17 | 25 | 9 | 52 | 11 | – | – | – | – | – |
| హైదరాబాద్ | – | – | – | 15 | 12 | – | – | – | 1 | 3 | 6 | 10 | – | – | 26 | 19 | – | – | – | – | – |
| మెదక్ | – | 9 | – | 6 | 10 | 2 | 2 | 4 | 4 | 2 | 7 | 2 | 2 | 7 | 36 | 29 | – | – | – | – | – |
| వరంగల్ | వివరాలు అందలేదు | | | | | | | | | | | | | | | | | | | | |
| అనంతపురం | – | 4 | – | 9 | 4 | 2 | 2 | 1 | 2 | – | 3 | 7 | 2 | 16 | 3 | – | – | – | – | – | – |
| ఖమ్మం | – | 1 | – | 7 | 16 | 7 | 14 | 5 | – | 2 | 1 | 4 | 1 | 3 | 24 | 8 | – | – | – | – | 2 |
| నిజామాబాద్ | – | – | – | 6 | 4 | 2 | – | 2 | – | 2 | 4 | 3 | 3 | 4 | 19 | 14 | – | – | – | – | – |
| విజయనగరం | – | – | – | 2 | 3 | 3 | 2 | 1 | 1 | 5 | 1 | 2 | 2 | 1 | 16 | 8 | – | – | – | – | – |
| శ్రీకాకుళం | – | – | – | 2 | 1 | 2 | 7 | 2 | – | 1 | – | 2 | 4 | 1 | 14 | 5 | – | – | – | – | – |
| చిత్తూరు | – | – | – | 11 | 13 | – | – | – | – | – | 12 | 5 | 3 | 5 | 29 | 12 | – | – | – | – | – |
| విశాఖపట్నం | – | – | – | 5 | 16 | – | – | – | 3 | – | – | 1 | 3 | – | 20 | 7 | 1 | – | – | 9 | – |
| **మొత్తం** | **–** | **23** | **4** | **100** | **109** | **28** | **32** | **19** | **14** | **21** | **44** | **54** | **47** | **70** | **270** | **113** | **1** | **–** | **–** | **9** | **2** |

VEEKSHANAM Telugu Monthly Journal of Political Economy and Society - 151 - February 2014 ● **ISSN 2231-6892**
● RNI Regn.No.APTEL/2003/11482 ● Published on 27/01/2014 ● Postal Regn. No. L II/RNP/HD/1100/2014-16




# భారతదేశంలో ఆంధ్రప్రదేశ్‌కు అగ్రస్థానం!

**సుపరిపాలనలో "స్టేట్ ఆఫ్ ది స్టేట్స్"గా దేశంలోని అన్ని రాష్ట్రాలకంటే ఉత్తమమైన రాష్ట్రంగా ఇండియా టుడే గ్రూపు ఎంపిక చేసింది!**



ఇండియా టుడే గ్రూపు నిర్వహించిన "స్టేట్ ఆఫ్ ది స్టేట్స్" సర్వేలో ఆంధ్రప్రదేశ్ "పరిపాలనలో ఉత్తమ రాష్ట్రం"గా ఎంపిక చేయబడింది. ఇది మనకెంతో గర్వకారణం. పరిపాలన, విద్య, వ్యవసాయ, ఆరోగ్య, మౌలిక వసతులు, పెట్టుబడులు, వినియోగదారుల మార్కెట్లు, స్థూల ఆర్థిక వ్యవస్థల ప్రాతిపదికన ఎంపిక చేయబడింది. క్రితం సంవత్సరం ఈ పురస్కారం గుజరాత్‌కి లభించింది.

గౌ॥ ముఖ్యమంత్రి కిరణ్‌కుమార్ రెడ్డి 3 సంవత్సరాలుగా అందిస్తున్న సుపరిపాలన, తెలుగువారి అభివృద్ధికీ, సంక్షేమానికీ చేస్తున్న కృషికి గుర్తింపుగా ఈ పురస్కారం లభించింది. దేశంలోనే మొదటిసారిగా ఎస్సీ, ఎస్టీ ఉపప్రణాళికలకు చట్టబద్ధత కల్పించారు. ఆడపిల్లల భవిష్యత్తుకు భద్రతనిస్తూ బంగారు తల్లి చట్టం - 2013ను తీసుకొచ్చారు. అంతేకాదు అభివృద్ధి ఫలాలు ప్రజలకు అందజేస్తూ ఇందిరమ్మ అమృత హస్తం, ఇందిరమ్మ ఇళ్లు, మెస్ ఛార్జీల పెంపు, మహిళలకు వడ్డీలేని రుణాలు వంటి అనేక సంక్షేమ పథకాలను అమలుచేశారు. రైతన్నల ప్రయోజనాలను కాపాడుతున్నారు; అందరికీ విద్య, ఆరోగ్య సంరక్షణల కొరకు వినూత్నమైన పథకాలను తెచ్చారు; యువతకు ప్రభుత్వ, ప్రైవేటు రంగాలలో ఉపాధి, ఉద్యోగ అవకాశాలు కల్పించారు; ప్రభుత్వ ఉద్యోగులు, పింఛనుదారుల సంక్షేమానికి కూడా కృషి చేస్తున్నారు; 'మీ సేవ'తో వెబ్ ద్వారా పౌరసేవలను వేగవంతంగా, పారదర్శకంగా అందిస్తూ రాష్ట్రాన్ని ఈ-గవర్నెన్స్‌లో కూడా ముందంజలో ఉంచారు!



**శ్రీమతి డి. కె. అరుణ**
సమాచార, పౌర సంబంధాల శాఖామాత్యులు

















జారీ చేసినవారు: సమాచార, పౌరసంబంధాల శాఖ, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం

R.O. No. 628/Sou/Advt. I / 2013-14

Edited, printed, published and owned by N. Venugopal Rao, Printed at Deccan Press for Charitha Impressions, Azamabad, Hyderabad - 500 020
and Published at 3-6-394, Mythri Residency, Street No. 3, Himayatnagar, Hyderabad 500 029. Editor : N. Venugopal Rao